# శ్రీ శివలీలామృతము



రచయిత

ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తి

ఆవిష్కరణము :
విరోధికృత్ జ్యేష్ఠము
1971 - జూన్
ప్రతులు :

ద్వితీయ ముద్రణము
1972 - అక్టోబరు
ప్రతులు :
౫౦౦



ముద్రణము :
వేంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్,
ఆలమూరు.

అమూల్యము

ప్రతులకు :
ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తి
చింతలూరు S. O.
తూర్పు గోదావరి జిల్లా.



శ్లో॥ సానంద మానందవనే వసంత । మానందకందం హతపాపబృందమ్

వారాణసీనాథ మనాథనాథం । శ్రీవిశ్వనాథం శరణం ప్రపద్యే॥

ఈ నా కృతిశ్రీదళము

కా శీ వి శ్వే శ్వ ర స మ ర్పి త ము.

ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తి.

# శ్రీ శృంగేరీ శారదాపీఠ జగద్గురు శ్రీ చరణుల
# ఆశీః పత్రిము

"శివలీలామృతము" అను పేరుగల ఆంధ్రగ్రంథమును మేము చూచినాము.

ఈ గ్రంథమునందలి భాష మిక్కిలి సరళముగను సరసముగను ఉన్నది. దీనిని చదువదొడగినవారలకు అంతము చదువు వరకును మనస్సులు తృప్తి చెందవు. ఇది ఈశ్వరునియందు భక్తిని కలిగించి పెంపొందించును.

ఇందుపరమశివుని కథలు మిక్కిలి హృదయంగమములుగ నున్నవి. తత్పరిశీలనమువలన ధర్మమునందు శ్రద్ధ నశ్వరము లగు విషయములందు వైముఖ్యము మనస్సునకు స్థైర్యము భగవంతునియందు దృఢమైన భక్తియు కలుగు నని మా దృఢవిశ్వాసము. దీని యవలోకనమువలన జనులు అనేక సంగ్రాహ్యావిషయములను తెలిసికొనగలరు.

ఉత్తమమైన ఈ గ్రంథమును రచించిన తమరు మహాదేవుని కృపచేత చిరకాలము వర్ధిల్లుదురుగాక యనియు ఈ గ్రంథము భక్తజన పాణిపల్లవముల నలంకరించుగాక యనియు ఆశీర్వదించుచున్నాము.

శృంగేరి<br>27-6-1971

ఇతి నారాయణస్మరణమ్<br>"విద్యాతీర్థః"

అత్యంత వాత్సల్యముతో నా యీ కృతిని బరిశీలించి
ఆశీఃపత్రిము నను గ్రహించిన
శ్రీశ్రీశ్రీ శృంగేరీశారదాపీఠ జగద్గురు శ్రీచరణుల
చరణారవిందములకు
సాష్టాంగప్రణామములు.

దివాకర్ల వెంకటసూర్యనారాయణమూ

# ఉపోద్ఘాతము

డాక్టర్. దివాకర్ల వేంకటావధానిగారు ఎం.ఏ. (ఆనర్సు)పి.హెచ్.డి.
ఆంధ్రశాఖాధ్యక్షులు. ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు

వైద్యరాజులే కాక విద్వద్రాజులు నైన శ్రీద్వివాష్యం వెంకట సూర్యనారాయణమూర్తిగారు కొలఁది కాలము క్రిందనే పరమార్థ ప్రసంగ మను పరమోత్కృష్టమైన యొక గ్రంథమును రచించి యమూల్యముగా దాని నర్హులైనవారికిఁ బంచిపెట్టియున్నారు. సార్థక నామధేయ మైన యా గ్రంథమును బఠింపఁగనే శ్రీ వెంకటసూర్యనారాయణమూర్తిగారి పారమార్థిక ప్రవృత్తితోపాటు పాండితీస్ఫూర్తియుఁ బ్రత్యక్షమై నన్నా నందపరవశుని గావించినవి. మానవుల శారీరకజాడ్యముల నౌషధప్రదానముచేతను, ఆధ్యాత్మికజాడ్యముల నుపనిషచ్ఛాస్త్రపురాణానుగుణములైన యుపదేశములచేతను బోఁద్రోలి జగమును నిరామయమును నిస్తాపమును గావింప బద్ధకంకణులైన వారి నిరంతరమైన కృషికి దీనజనవత్సలుఁడైన పరమేశ్వరుఁ డుచితరీతి దోహద మొనరించుఁగాక ।

సర్వభూతాంతర్గతము నిత్యము నిరవద్యము నైన పరబ్రహ్మమే సృష్టి స్థితి లయము లను కార్యములను నిర్వహించుటకై సత్త్వ రజ స్తమో గుణప్రధానములైన మూఁడు మూర్తుల ధరించెను. ఆ ముప్పురు ననన్యసామాన్యులును అతిలోక శక్తిసంపన్నులు నై యవిహతము స్త్రీపుంసయోగోద్భవము నైన లోకముల స్థితిని సాగించు చున్నారు. ఆ మూర్తిత్రయమున హెచ్చు తగ్గు లెన్నుట యవివేకమూలకము. వారి

యాకారాచార గుణప్రవృత్త్యాదులను బురాణములు విస్పష్టముగా వర్ణించి వారికి వైయక్తికమైన వైలక్షణ్యమును గల్పించియున్నవి. వారు భిన్న గుణనామరూపు లయ్యును యథార్థమున కభిన్నులే. "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే" యన్నట్లు "శివాయ బ్రహ్మరూపాయ శివరూపాయ బ్రహ్మణే" యనికూడ ననవచ్చును. విశాలదృష్టి గల వివేకులు మూర్తిత్రిత్వమున నేకత్వము భావించి యఖండమైన యానందము ననుభవింతురు.

బ్రహ్మనామము వినఁగనే మనకు నాలుగుమోములు, సరస్వతీదేవి, హంసవాహనము, వేదములు మున్నగు వానితోఁ గూడిన యొక దృశ్యము గోచరించును. విష్ణునామము విన్నంతనే క్షీరసముద్రస్థిత శేషతల్పము, లక్ష్మీదేవి, శంఖచక్రాదులు, వైనతేయుఁడు, దశావతారములు స్ఫురించును. అట్లే శివనామము వినఁగనే జటాజూటము, పాపపేరులు వృషభవాహనము, పార్వతిదేవి, విభూతి రుద్రాక్షలు, కుమార విఘ్ననాథులు, గంగాదేవి మున్నగువానితోఁ గూడిన దృశ్యము సాక్షాత్కరించును. ఆయాదైవములను గూర్చి పురాణములు కావించిన విశదములైన వర్ణనములే యందులకుఁ గారణము. అవి భారతీయుల హృదయము లందు ముద్రించిన రూపము లెంతస్ఫుటము లైనవో యంత స్థిరములైనవి.

లోకము భిన్నరుచికమైనది. ఆ రుచిభేదమును బట్టి మానవులు కొందఱు విష్ణువును, కొందఱు శివుని భక్తితో నారాధించుచుందురు. బ్రహ్మదేవు నారాధించువారు తక్కువ. అందుకుఁ గొన్ని కారణము లున్నవి. దుష్టశిక్షణ శిష్టరక్షణములకై శివకేశవులు పెక్కవతారములు తాల్చిరి. ఆ యా యవతారము లందు వారాచరించిన కృత్యములే వారి లీలలు. ఆ లీల లద్భుతరస మయములుగా నుండును. అవి యనంత

ములు. ఎంతగా వర్ణితము లైనను అవి మిగిలియే యుండును. భాగవత విష్ణుపురాణాదులయందు విష్ణులీలలు సరసమనోహరముగా వర్ణింపఁ బడి నవి. అట్లే శివపురాణ పద్మపురాణాదులందు శివలీలలు హృద్యముగా విశదీకరింపఁబడి యున్నవి. అనవరతాస్వాద్యమాన మయ్యు వెగటు కొల్పని పదార్థ మమృతము. శివ విష్ణు లీలలు కూడ నట్టివే. అందుచే వానికిని అమృతమునకును ఔపమ్యము కుదిరినది. శ్రీ వెంకట సూర్యనారాయణమూర్తిగారు శివలీల లనెడి యమృతముతో నింపి శివలీలామృత మనెడి యీ యక్షయభాండము నాంధ్రుల కందిచ్చుచున్నారు. వా రపర ధన్వంతరులు కదా!

శివకేశవాదులు నిర్గుణబ్రహ్మముయొక్క సగుణమూర్తులు. భగవద్గీతలోఁ జెప్పఁబడిన ట్లవ్యక్త బ్రహ్మారాధనమున క్లేశ మెక్కువ. సాధారణుల కది యసాధ్యము. అందుచే భక్తిప్రేరితులై వారు సగుణారాధనమే కావింతురు. వారి భక్తికి నామరూపసహితులైన శివకేశవాదులు లక్ష్యములు. భక్తిమార్గమున మోక్షగమ్యము చేరఁగల్గిన మహానుభావు లెందఱో యున్నారు. "మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ" యను భగవత్పాదుల సూక్తి సర్వవిదితము. భక్తిభావము కలవారే భగవల్లీ లామృతాస్వాదనమున కధికారులు. అది లేనివారికి భగవల్లీల లర్థరహితములు నపహాస్యతాపాత్రములు నైన యనాచారములుగా భాసించును. భాగవతమువలెనే శివపురాణమును నవవిధములైన భక్తులను వివరించినది. కలియుగమున భక్తి ప్రత్యక్షఫలద మని యది చెప్పుచున్నది. భగవదారాధనమునకుఁ బ్రేరకమైనది భక్తి. అందుచే గ్రంథారంభము, భక్తిప్రాశస్త్య ముగ్గడింపఁబడినది.

ఈ గ్రంథమున శివునికి సంబంధించిన కథ లన్నియుఁ జెప్పఁబడినవి. దీనిని శివలీలాసంబంధి విజ్ఞానకోశ మని చెప్పవచ్చును. లింగో

ధృవమునకును శివరాత్రికిని గల సంబంధము మొదట వివరింపఁబడినది. ఈ సందర్భముననే బ్రహ్మకుఁ బూజార్హత లేకపోవుటకును, మొగలి శివపూజాపుష్పములనుండి వెలి యగుటకును హేతు వుగ్గడింపఁబడినది. ఉపమన్యువు, దాశార్హుఁడు అర్జునుఁడు మున్నగువారి కథలు పంచాక్షరీ మాహాత్మ్యమును జక్కఁగా వ్యక్తము చేయుచున్నవి. విభూతిరుద్రాక్ష ధారణము శైవులకు ముఖ్యమైనది. శివనామము, విభూతి, రుద్రాక్ష యనునవి గంగా యమునా సరస్వతీ సదృశము లనియు, దదుచ్చారణ, ధారణముల వలనఁ ద్రివేణీస్నానఫలము చేకూరు ననియుఁ బెద్దలు చెప్పుదురు. సుధర్మతారకుల వృత్తాంతము రుద్రాక్షధారణ మాహాత్మ్యమున కైదంపర్యముగా వివరించుచున్నది. పద్మపురాణోక్తమైన యిక్ష్వాకుని కథ శివారాధన వైశిష్ట్యమునకు నిదర్శనము. అట్లే నారదుఁడు అనసూయ, కుబేరుఁడు (గుణనిధి) మున్నగువారి కథలు కూడ శివారాధన ప్రాశస్త్యము నుగ్గడించుచు నింపు నింపుచున్నవి.

ఈ గ్రంథమున ద్వాదశ జ్యోతిర్లింగముల వృత్తాంతమును శివుని యవతారముల వృత్తాంతమును విశదీకరింపఁబడినవి. లోకమున విష్ణునవతారములవలె శివుని యవతారము లంత ప్రసిద్ధములైనవి కావు. మహేశ్వరావతారము లను పేరుగల యధ్యాయమున గ్రంథకర్తగారు శివపురాణోక్తములైన యీ యవతారముల గాథ వివరించియున్నారు. శివుఁడు లోకావనమునకై గజాసుర త్రిపురాసు రాదుల సంహరించిన కథలు కూడ నిందు సరససుందరముగాఁ జెప్పఁబడినవి. శివుని కుమారులైన గణేశ్వర కుమారస్వాముల వృత్తాంతములను సైత మిందుఁజేర్చుట యౌచిత్యభాసురముగా నున్నది. వ్యాసుఁడు కాశిని బాసిన వృత్తాంతము కాశీఖండ భీమఖండములు రెండింటియందును గలదు. గ్రంథకర్తగా రా కథను దక్షారామ భీమేశ్వరుఁ డను నధ్యాయమున వివరించియున్నారు. ఈ గ్రంథమున భీమఖండ (దక్షారామ) మాహాత్మ్యమువలెనే కోటిఫలీక్షేత్ర మాహా

త్మ్యమును చెప్పఁబడినది. కోటిఫలీక్షేత్రము మాతృగమన దోషాపహారి యని బ్రహ్మపురాణోక్త మైన దుర్మేధాసుమిత్రుల వృత్తాంతమువలన విదిత మగుచున్నది.

ఈ గ్రంథములోని వృత్తాంతము లన్నిటిలో దీర్ఘ మైనదియు నతి రమణీయ మైనదియుఁ బార్వతీపరిణయవృత్తాంతము. అది యిందు శివ పద్మ పురాణానుగుణముగాఁ జెప్పఁబడినది. కవికులగురు వైన కాళిదా సీ వృత్తాంతమును కుమారసంభవమున మనోహరముగా వర్ణించి దాని కత్యంతప్రచారము కల్గించియున్నాఁడు. ఆతని రచనకును నై పురాణములే మూలములై యుండును. కాని యాతఁ డందలి కొన్ని సన్నివేశముల నేకారణముచేతనో విడిచివై చినాఁడు. అట్టివానిలో నింద్రుని ప్రేరణ మున శివుఁడు వృద్ధబ్రాహ్మణ వేషముతో హిమవంతుని కడ కేగి శివుని యందలి దుర్లక్షణములను వర్ణించి చెప్పుట, అది వినిన మేనక తన కూఁతు శివుని కీయరాదని నిశ్చయించుకొనుట, అరుంధతీవసిష్ఠులు మేనకా హిమవంతులకు సదుపదేశము కావించి మరలఁ గన్యాదానమునం దుత్సుకు లను గావించుట, ఈ సందర్భమున వసిష్ఠుఁడు పద్మాపిప్పలాదుల వృత్తాంత మెఱింగించుట, విశ్వకర్మ సర్వదేవతాప్రతిరూపచిత్రములతో కల్యాణ మండపమును నిర్మించుట. మేనక విరూపాక్షునిఁ గాంచి మూర్ఛితయై యా సంబంధమున కంగీకరింపక కూఁతును దూషించుట, శివుఁడు తరు వాతఁ దన దివ్యమంగళ స్వరూపమును జూపించుట మున్నగునవి ముఖ్యము లైనవి. ఈ సన్నివేశము లన్నియుఁ గథను గ్లిష్టతరమును, సహజమును గావించుటేకాక పాఠకులకుఁ గథాశ్రవణమున నపార మైన కుతూహలమును గలిగించుచున్నవి. పార్వతీపరమేశ్వరుల వివాహము సందర్భమున భారతీయ వైదికవివాహమునకు సంబంధించిన లౌకిక వైదిక విధు లన్నియు విశదముగా వర్ణింపఁబడినవి. ఈ వృత్తాంతమును రచించుటలో గ్రంథకర్తగారు ప్రదర్శించిన నేర్పత్యంత శ్లాఘాపాత్ర ముగా నున్నది.

శివుఁ డభిషేకప్రియుఁడు. శతరుద్రీయ మంత్రపారాయణ పూర్వ కముగా శివుని కభిషేక మొనర్చుట వలన ననంతమైన పుణ్య మావ హిల్లును. రుద్రము జపించిన రోగులు రోగమువలనను, పాపులు పాపము వలనను విముక్తు లగుదురు. రుద్రాధ్యాయముతో శివుని కభిషేకము కావించి యా జలమును బైఁజల్లుకొనువారు మృత్యువును గూడ జయిం తురు. స్కాందపురాణాంతర్గత బహ్మోత్తరఖండమునఁ జెప్పఁబడినచంద్ర సేనుఁ డను కాశ్మీరరాజుతనయుని యుపాఖ్యాన మిందుకు నిదర్శనము. శతరుద్రీయప్రాభవ మను నధ్యాయమున నా మంత్రమువాహాత్మ్య ముగ్గడింపఁబడినది. బ్రాహ్మణులకు వేదాధ్యయనము కావించుట ముఖ్య ధర్మము. వేదము నంతను బఠించుట కశక్తు లగుచో వా రందలిచతుర్థా ష్టకమును గాని, యదియు నశక్య మైనచోఁ గేవల మొక్క-శతరుద్రీయ మును గాని, యదియు సాధ్యము కానిచో "నమస్సోమాయ చే" త్యాది మంత్రమునుగాని, యదియుఁ గుదురని పక్షమున "నమశ్శివాయ" యను పంచాక్షరిని గాని పఠించిన సర్వకామార్థ సిద్ధిని బడయుదురు. వేదపఠనమున నీప్సితార్థముల నన్నిటిని సాధింపవచ్చు నను నార్యోక్తిలో నసత్య మిసు మంతయులేదు.

గ్రంథాంతరమున శివతత్త్వ ముక్తి స్వరూపములు వివరింపఁబడి నవి. ప్రణవము పరమాత్మస్వరూపము. ప్రాణరూప మగుటచేతనే దాని కన్వర్థ మైన యా నామ మేర్పడినది. శివుఁడే యాత్మ. ఆత్మయే ప్రణవము. ప్రణవమే జగత్తు. కుమారస్వామి వామదేవుని కెఱిఁ గించిన ప్రణవమహత్త్వపూర్వక మైన శివాద్వైతతత్త్వము జిజ్ఞా సువు లెల్ల నెఱుంగఁదగినట్టిది. చతుర్విధ పురుషార్థములలో నుత్కృష్ట మైనది మోక్షము. తదన్వేషణప్రవృత్తులే మానవత్వమునకు సార్థక్యము నావహింపను. మోక్షము జ్ఞానలభ్యము. జ్ఞానము భగవదనుగ్రహ సంపా ద్యము. భగవదనుగ్రహము భక్తిసాధ్యము. అందుచే మోక్షసాధనమున

భక్తి కుత్తమస్థాన మున్నది. "భజనం సుకరం మత" మని చెప్పఁబడుట జ్ఞానమార్గము నవలంబింపఁజాలని సాధారణులకుఁ గూడ నాపరమపురుషార్థము లభ్యమే యని సూచించుటకే. మోక్షము చతుర్విధము. అద్వయుఁడు, అవ్యయుఁడు, భక్తజన పరాధీనుఁడు నైన పరమేశ్వరుఁడు ప్రీతుఁడైనచో నైదవ దయిన కైవల్యమోక్షమును గూడ ననుగ్రహించును. పురుషార్థములలోఁ దుదిదైన ముక్తితో గ్రంథమును ముగించుట యుచితముగా నున్నది. అది సర్వమానవ వాంఛనీయము దాని కావల నిం కేమియు లేదు.

శ్రీ వెంకటసూర్యనారాయణమూర్తిగారీ గ్రంథమునఁ బ్రదర్శించిన కథాకథన కౌశల మద్వితీయముగా నున్నది. కథల యందలి ప్రధానాంశముల నొత్తి చెప్పుచు, నెడ నెడ రమ్యము లైన సంభాషణలు రచించుచు వారు పరిచితములైన పురాణకథలనే యుత్కంఠాప్రేరకముగాఁ జెప్పియున్నారు. వారు కావించిన వర్ణనలు హృద్యములై కథాగమనమున కడ్డు తగులకుండ దానికి వన్నె చేకూర్చుచున్నవి. పార్వతీపరిణయము నందలి వర్ణన లిందుకు దృష్టాంతములు. ఆధునికకాలమునఁ బలువురు రమ్యము లైన కథానికలు రచించుచున్నారు. వీనిని రచించు నేర్పు పాశ్చాత్యులనుండి మనకు సంక్రమించిన దని కొందఱు విమర్శకుల తలంపు. కాని మన పూర్వవాఙ్మయమును బరిశీలించినచో నందు వర్ణనోపదేశ కథాసన్నివేశ మనోజ్ఞము లైన చిన్నకథ లెన్నో గోచరించును. అవి ప్రాయికముగాఁ బురాణాంతర్గతములై యుండుటచే ధర్మనీతితత్త్వప్రధానములును అతిలోక సన్నివేశ సంయుతములు నై కానిపించును. అట్టివానినించుక దేశ కాల పాత్రానుగుణముగా మలచుకొనినచో నవి యాధునిక కథల కెందును దీసిపోకుండుట యే కాక తాత్త్వికసౌరభ సువాసితములై యుండుటచే వానికంటె మేలురములుగాఁ గూడ గోచరించును. ఈ గ్రంథమునందలి పెక్కుకథ లట్టివే. వానిని సర్వసుబోధములుగను,

హృదయంగమములుగను రచించుటలో శ్రీ వెంకటసూర్యనారాయణమూర్తి గారు చూపిన కౌశల మెంతయుఁ బ్రశంసనీయమై యలరారుచున్నది.

ఈ గ్రంథమును బఠించునప్పుడు గ్రంథకర్తగారు కావించిన బహు గ్రంథ పరిశీలన మాశ్చర్యము కల్పించును సంస్కృతాంధ్రము లందు వారికిఁ గల పాండిత్య మపార మైనట్టిది. శైవకథా సముపేతము లైన పురాణాదుల నన్నిటిని బఠించి వా రందుఁ గల యుత్తమములు నుపదేశాత్మకములు నైన కథల నెన్నిటినో యిందు సంగ్రహించినారు. ఆయా పురాణముల నుండి వా రొసంగిన ప్రమాణములు వారు చెప్పిన విషయమునకు గౌరవమును జేకూర్చుచున్నవి. సంస్కృతశ్లోకముల నుద్ధరించునప్పుడు వాని సారాంశమును దెలుగునఁ గూడ నొసంగి సంస్కృతానభిజ్ఞు లైన పాఠకులకు వా రధిక మైన యుపకార మొనర్చియున్నారు. వారికిఁగల తత్త్వశాస్త్ర పరిచయము కథలం దన్నింట గోచరించుచు గ్రంథమున కనల్ప మైన ప్రాశస్త్యము నావహించుచున్నది. పురాణాదు లందలి శ్లోకములను బద్యములను దగిన స్థలములయం దుద్ధరించి వివరించి యుండిన కతమున గ్రంథమున కెనలేని సౌందర్యమే కాక ప్రామాణ్యముకూడ చేకూరినది.

ఇంక శ్రీ వెంకటసూర్యనారాయణమూర్తి గారి శైలిని గూర్చి యొండు రెండు మాటలు చెప్పి దీనిని ముగింతును. వారి వచనరచన సరసము, సరళము. ధారాశుద్ధిశోభితమునై సర్వజన సుబోధముగా నున్నది. వారి వ్యక్తిత్వమునందు వలెనే శైలియందును ఆడంబరరాహిత్యమును పవిత్రతయు ప్రధాన లక్షణములుగా గోచరించును. వారి శైలి నిర్దుష్టమై యెడ నెడ నర్థగంభీరములైన జాతీయములతోఁ గూడి చదివినకొలంది చదువవలయునను నుత్కంఠ రేకెత్తించుచున్నది. శ్రీ వెంకటసూర్యనారాయణమూర్తిగారు సంపన్నులయ్యు సత్త్వగుణసముపేతులు, విజ్ఞాన

వివేక విద్యా సమగ్రు లయ్యు గర్వరహితులు, వ్యాపారపరాయణు లయ్యు వైదికసంప్రదాయానురక్తులు, పరహితాచరణ ధురంధరులు, మృదువచో విరాజితులు, నయ వినయాది సుగుణగణ భూషితులు, ఐహికవిషయ లాలసచే క్రమ క్రమముగా( బరమార్థపరాఙ్ముఖమై పోవుచున్న ప్రజానీక మున కుత్తమ తత్త్వోపదేశ సంభరితము లైన గ్రంథములద్వారా తత్త్వ జిజ్ఞాస రేకెత్తించుటకై వారు చేయు ప్రయత్నము పండితులకే కాక భగవంతునికి( గూడ ప్రీతికరమై యలరారుచున్నది. వా రింకను దత్త్వ సౌరభోపేతములైన పవిత్రగ్రంథములను రచించి యాంధ్రలోకమున కుపకృతిని, ఆంధ్రవాణి కభినవాలంకృతి తతిని కలిగింతు రనియు( దత్కార్యనిర్వహణమునకు( గావలసిన యవకాశమును భగవంతు(డు వారికి( బ్రసాదించు(గాక యనియు వేడుచున్నాను.

హైదరాబాదు
12-4.1971

దివాకర్ల వేంకటావధాని

# పండితాభిప్రాయములు

"వ్యాకరణాలంకార" "కళాప్రపూర్ణ"
శ్రీయుత పేరి వెంకటేశ్వరశాస్త్రిగారు
సంస్కృతకళాశాలాధ్యక్షులు (Retd)
ఆకిరిపల్లి

ఆంధ్రజనత యొనర్చిన పుణ్యపరిపాకముచే పరమార్థ ప్రసంగము రచించిన బ్రహ్మశ్రీ ద్విభాష్యం వెంకట సూర్యనారాయణమూర్తిగారిచే రచియింపఁబడిన "శ్రీశివలీలామృతము" అను గ్రంథమును నేమ పలు తావులఁ జదివించి వింటిని. ఇందు ప్రసిద్ధ పురాణములలోనుండి శివ తత్త్వము, పంచాక్షరీ మహిమ, విభూతి రుద్రాక్షధారణ మహిమ, వాని వాని నామములకు హేతువు మొదలగు నూతనవిషయములు సామాన్యులకుఁ బండితులకుఁ గూడఁ దెలియఁదగిన వెన్నోకలవు. వాని కన్నిటికిని ప్రసిద్ధ పురాణాదులనుండి ప్రమాణాదులు చూపఁబడినవి. అందువలన ఆస్తికు లందఱికిని అందులో ముఖ్యముగా శివతత్త్వము తెలియఁగోరు వారికిని ఈ గ్రంథము మిక్కిలి యుపయోగకరమని దృఢమైన భావము నాకుఁ గలిగినది. వీరు శ్రీమంతు లయ్యును నింతటి ఆస్తిక్యబుద్ధి కలిగి శ్రమించి ఇంత యుత్కృష్టమైనగ్రంథమును వ్రాసినందులకు నాకెంతయు నానందము కలిగినది. వారికిని వారి కుటుంబమునకును ఆరోగ్యమును ఇతోధికైశ్వర్యమును బ్రసాదింతురుగాక యని పార్వతీపరమేశ్వరులను బ్రార్థించుచున్నాను. ఇందుండు కథలలో నన్నియు విశేషాంశములను వివరించున వున్నవని వినుటయే కాదు ప్రమాణవాక్యము లుండుటచేత నాకుఁ దృప్తికలిగినది. వీ రింకను నిట్టి ఉత్తమగ్రంథములు రచించి ఆస్తికత్వమును నిల్పుదు రని యాశింతును. "పరోపకారాయ సతాం విభూతయః" వీరి విజ్ఞానము లోకోపకారక మైనది.

ఆకిరిపల్లి
28-4-71

పేరి వెంకటేశ్వరశాస్త్రి

కవికంఠీరవ, కవిమూర్ధన్య
పౌరాణికకవిచంద్ర, విద్వత్కవివర
బ్రాహ్మభూషణ, రాజవైద్య
శ్రీయుత కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు

తుల్యారామేశ్వరము
కాకినాడ తాలూకా
తూర్పుగోదావరిజిల్లా
ది 1-4-1971

శ్రీమద్ద్విభాష్యం వేంకటేశ్వ రాయుర్వేద భిషగ్వరపుత్రుడును, సద్భక్తిసంపన్నుడును నగు శ్రీవెంకట సూర్యనారాయణమూర్తి నామధేయునిచే నితఃపూర్వము "పరమార్థప్రసంగ" మను వైష్ణవ పౌరాణిక గ్రంథమును, నధునాతనమున "శ్రీశివలీలామృత" మను శైవ పౌరాణిక గ్రంథమును విరచితములై ప్రకటితము లైనవి. ఈ హరిహరగ్రంథ ద్వయము సువిచారణీయము. సకలమానవ పఠనీయము.

వేదచతుష్టయమున నపారముగ సకామ నిష్కామ సత్కర్మములును, తదంతమున మోక్షప్రదమగు బ్రహ్మజ్ఞానమును నున్నవి. సాంసారిక దుఃఖ మనుభవించు మానవుల బాధానివృత్తికై వ్యాసమహర్షి సకామ సత్కర్మాచరణార్థము విష్ణుపురాణములను, నిష్కామ సుకర్మాచరణార్థము శివపురాణములను విపులగతి విరచించి తత్పాఠకుల క్రమగతి సకామ నిష్కామ సత్కర్మరతుల గావించి, వారల చంచలాత్మకమగు మనస్సును నిశ్చలాత్మక మగు బుద్ధిగ మార్పు గావించి, విచారణశక్తి గల్పించి "విచారా జ్జాయతే జ్ఞాన" మను వాక్యానుసరణము వారలకు విశేషజ్ఞానమును దానివలన జీవన్ముక్తియు బ్రసాదించుటకై బ్రహ్మసూత్రముల గూడ విరచించి వైదికముఖ్యభావము స్థిరీకరించియుండెను.

ఏతద్గ్రంథరచయితయగు చి॥ వెంకట సూర్యనారాయణమూర్తియు వేదచతుష్టయ వ్యాసమహర్షుల సద్భావముల నాంధ్రులకు బ్రకటీకరించి యా పాఠకుల నెల్ల క్రమక్రమగతి సకామ నిష్కామ సుకర్మరతులగావించి తజ్జనిత బుద్ధివిచారణముచే జ్ఞానము నార్జింపజేసి, ముక్తుల గావింపవలచి

ప్రస్తుతము సకామ నిష్కామ సుకర్మాకరములగు హరిహరభక్తి విషయముల గ్రంథయుగళి బ్రచురించియున్నాడు. ఇటుపిమ్మట నీ గ్రంథకర్త యాంధ్రభాషలోననే విశేషముగ బ్రహ్మజ్ఞాన విధానము గూడ ప్రకటీకరించి నైజావిమగ్రంథపఠనముచే క్రమగతి సకామ నిష్కామకర్మరులకు జ్ఞానోదయమును భావిగ్రంథమున ప్రసాదించి వారల జీవన్ముక్తుల గావించుగాత.

"చంచలాత్మకం మనః" "నిశ్చలాత్మకా బుద్ధిః" "విచారాజ్జాయతే జ్ఞానమ్" "జ్ఞానా దేవతు కైవల్యమ్" అను మహావాక్యముల ననుసరించి విచారింపగ నీ గ్రంథకర్తృపుస్తకములచే పాఠకుడు నైజ చంచలాత్మక మానసము నిశ్చలాత్మకబుద్ధిగ మారగ విచారణము సల్పి జ్ఞాన మార్జించి దాని వలన మోక్ష మందగలడు.

ఈషణత్రయబాధితు లగు వార లెల్లరును చి॥ వెంకటసూర్యనారాయణమూర్తి విరచిత గ్రంథముల నిశ్చలమనస్కులై పఠించి క్రమగతి జ్ఞాన మార్జించుకొని తరింతురుగాక!

కాకరపర్తి కృష్ణశాస్త్రి

"సరస్వతీపుత్ర. మహాకవి."
శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు

కడప
21–4–71

బ్రహ్మశ్రీ ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తిగారు దయతో పంపిన, "శివలీలామృత" మనెడు గ్రంథమును సమగ్రముగ చూచితిని. అనేక పురాణములనుండి అనేక విషయముల నెత్తి ఒకచోట క్రోడీకరించుట చిన్నపరిశ్రమ కాదు. వారి వచనము చక్కని శైలిలో సాగినది. పుస్తకము మొదలు పెట్టిన వెంటనే, కడపటివరకు చదివించుట గద్యమున కుండవలసిన ప్రధాన లక్షణము. ఆ గుణ మిందులో నున్నది, ఇట్టి గొప్ప పరిశ్రమకు వారిని మనస్ఫూర్తిగా నే నభినందించుచున్నాను. శేషగిరీశుడు, శ్రీనివాసుడు, వీరి కాయురారోగ్యముల నిచ్చి నిరంతరము రక్షించుగాక! యని ప్రార్థించుచున్నాను.

పుట్టపర్తి నారాయణాచార్యులు.

## . "సాహిత్యవిద్యాప్రవీణ" "ఉభయభాషాప్రవీణ"
## "విమర్శక శిరోమణి"
## శ్రీయుత వోలేటి వేంకటసుబ్బరాయశాస్త్రిగారు, ఎం. ఏ.

"పరమార్థపరిసంగ" రచనతో పరిణతప్రజ్ఞాశాలురై రచయిత్ లోకమున ఖ్యాతి నార్జించిన శ్రీయుత ద్విభాష్యం వెంకటసూర్యనారాయణ మూర్తిగారి యింకొక అమూల్య రచన ఇంత శీఘ్రకాలములో నీరీతిగ జూడఁగల్గుట యాంధ్రుల పురాకృతసుకృత ఫల మనుటకు సందియము లేదు. వివిధ విషయములను దీసికొని ప్రతివిషయము పఠితల హృదయ ములకు హత్తుకొనునట్లును శ్రోతలకుఁ గర్ణరసాయన మగునట్లును రచిం చిన ఆ గ్రంథమునకుఁ బిమ్మట నింకెట్టి గ్రంథము వచ్చినను నంత ప్రతిష్ఠావహము కాలే దని సంశయించు నాబోఁటి వానికిఁ గనువిప్పుగ నవతరించినది శ్రీశివలీలామృతము.

పురాణసాగర గర్భమునుండి యనేక రత్నముల నేఱి సానఁబెట్టి హారముగా గ్రుచ్చి ముమ్ముందుగా నాంధ్రి నలంకరించిన రచయిత – క్షీర సముద్రమథన మొనర్చి పలుశ్రమల కోర్చి సుధను బడసిన విబుధు పోల్కి, బహుగ్రంథ పరిశోధన మథనమున శ్రమించి యమూల్య రత్న ములతోపాటుగా నమృతమునే సంపాదింపఁగలిగినారు. వానిని ఆస్తికప్రజా సామాన్యమునకుఁబంచి లోకోపకృతి నొనర్చినారు. వా రపర ధన్వంత రులు గదా! శారీరక రోగశాంతికి వలయు నౌషధముల నందించుటయే కాదు! మానసిక తాపశాంతికిఁ దగు నమృతమునే ప్రసాదించుట వారి యాధ్యాత్మికశక్తికి ప్రబలోదాహరణము. "స్వయంతీర్ణః పరాన్ తార యేత్" అను సూక్తికి లక్ష్యభూతులైన వీరి గ్రంథములోని విశిష్టతను వర్ణించుటకుఁ గాదు కాని, పఠించి యనుభవించిన యానందమయ విశే

షాంశములను వెల్లడింపకుండ నుండలేకుండుటచేత నేనో స్థాలీపులాక ముగాఁ దెల్పిన యీ విషయము లింతమాత్రమే కలవని పాఠకులు భ్రమ పడకుందురుగాక ।

"ఈ అక్షయప్రకృతి పరమేశ్వరునిది. తపస్సు నియమముగా నాచ రించినఁ బరమేశ్వరునిఁ దెలిసికొనఁగల్గుదురు. సుఖదుఃఖములకు లోను గాక ద్వంద్వాతీతుఁడై పరమాత్మను ధ్యానతపస్సులచేత నారాధించినచో భ్రమరకీటన్యాయమున తా నాత్మయై ముక్తి నందగలఁడు ఈశ్వరుఁడు లోకానుగ్రహమునకై ఏకార్యమునైనఁ జేయును. నామ రూప రహితుఁ డయ్యు మానవకోటి నుద్ధరింపఁజేయుటకే లింగరూపుఁ డైనాఁడు. ఆ లింగమును భక్తితోఁ బూజించినవాఁడు సర్వపాపవిముక్తుఁడై స్వర్గా ద్యుత్తమలోకములను మోక్షమును బొందును. న సర్వజ్ఞం వినా పుంసా మాదిసర్గః ప్రసిద్ధ్యతి వైద్యం వినా నిరానందాః క్లిశ్యంతే రోగిణో యథా"

"కలౌకలుషితే కాలే......గురుశిష్యక్రమే గతే కేనోపాయేన ముచ్యంతే భక్తాస్తవ మహేశ్వర" అను పార్వతి యావేగము శాంతింపఁ జేయుటకే పరమేశ్వరుఁడు విపులముగ విషయవివరణ మొనర్చినాఁడు. నవవిధభక్తులును భుక్తిముక్తుల నొసంగునవి. నా కతిప్రీతిపాత్రములై మీకు జ్ఞానోదయకారణము లైనవి. త్రిలోకములలో భక్తివంటి సుగమ మార్గ మింకొకటి లేదు. భక్తికి నేను వశుఁడను. కలిలో నన్ను వశమొన రించుకొనుట కింతకన్న నుపాయము లేదు. "శివభక్త్యా మహాప్రాజ్ఞ భుక్తిం ముక్తిం చ విందతి". శివనామస్మరణ మాత్రమువనే మోక్షమును బొందును, విజ్ఞుఁ డాకారణముననే శివునియందు భక్తినిఁ బెంపొందించు కొనవలెను. పంచాక్షరమంత్రమును బఠింపుచు నన్నపానాదికముల స్పృశించినచో నవి మంత్రపూతములై సౌఖ్యము నొసఁగును. తృప్తిగా

భోగములు కావలెనన్న నీశ్వరానుగ్రహముండవలెను "భవప్రసాదజం సర్వం నాన్యదేవ ప్రసాదజం. తస్మా న్మంతాంతరాం స్త్యక్త్వా పంచాక్షర పరో భవ తస్మిన్ జిహ్వాంతరగతే న కించి దిహ దుర్లభమ్. యా ప్రీతిః ఆత్మనః పుత్రే యా కళత్రే ధనేపి వా. సా ప్రీతిః శివ చింతాయాం కో న ముచ్యేత బంధనాత్" శివనిందఁ జేయుచుండఁగా విన రాదు. విన్నచో శరీరత్యాగము చేయవలెను." మున్నగు నుత్తమాంశము లను బొందుపఱచి భస్మము సుఖప్రసవజనకము. రుద్రాక్షధారణము ముక్తిప్రదము నను విషయమును స్పష్టపఱచినారు. ఒకటేమిటి. ఈ గ్రంథములో లేని శివతత్త్వసంబంధ విషయ మితరత్ర లేదనవచ్చును. భస్మ. రుద్రాక్ష. సాముద్రిక వంటి పదము లెందుకు వ్యవహారములోనికి వచ్చినవో సవ్యుత్పత్తికముగా వివరించుటచేతనిది శివవిజ్ఞానసర్వస్వ మనక తప్పదు. ఇందలిగాథలన్నియు సహజసుందరభావయుతములు. ఈ గ్రంథ విశిష్టతను దెల్పుటకు గ్రంథోపక్రమ సంహారములే సాక్షీభూతములు. భక్తిసోపానముతో నారంభమై శివతత్త్వముక్తులతో ముగింపఁబడినది. కావున మానవుఁడు నిరంతర భక్తిభావబంధురుఁడై భవబంధములఁ దొలఁగించుకొని ముక్తుఁడు కావలెను.

పురాణప్రపంచములోని పద్ధతిగా నిందు ముం దుపాసనాఖండమును బిమ్మట విలాసఖండము నుండుట మిక్కిలి మనోజ్ఞము. వీరికృషి శ్లాఘాపాత్రము. జనిర్థి సార్థకమొనరించుకొను ధన్యతములలో గణింపఁ దగిన స్థానము నాక్రమించిన శ్రీ వెంకటసూర్యనారాయణమూర్తిగారికిఁ బరమేశ్వరుఁ డితోధిక విభవాను లొసంగుచు నింకను సదుపదేశగ్రంథముల రచించున ట్లనుగ్రహించుఁగాత ! శివం భూయాత్ !

కాకినాడ,
30-4-1971

వోలేటి వేంకట సుబ్బరాయశాస్త్రి

"విద్వాన్" సరస్వతీకంఠాభరణ"
శ్రీయుత వేదుల సూర్యనారాయణశర్మ గారు
శ్రీవాణీనిలయము, - త ణు కు.

మీ పరమార్థ ప్రసంగమును లోగడనే చదివితిని. దానిని పురాణముగా మా యింటఁ జదివించి మా వారానందము నెందఱికో పంచిపెట్టిరి. ఇఁక నేఁడు మీ శివలీలామృతము నాస్వదించి యానందించితిని. ఎవరికి వా రనుభవించి యానందింప వలసినదే కాని దాని కభిప్రాయములతోఁ బనిలేదనిపించినది నాకు. అయినను నా యనుభవము నొకింత మాత్రము తెలుపుకొనుచున్నాను.

ఎన్నో పుస్తకములు చదువనక్కఱలేకుండ నిగూఢ శివతత్త్వము మీ యొక్క పుస్తకము వలననే గ్రహింపవచ్చును. అచ్చటచ్చట ఇతర గ్రంథము లందలి ముఖ్యములైన శ్లోకములు, పద్యములు చేర్చి యన్నిటి ప్రాశస్త్యమును మీయొక్క గ్రంథమునకు రాఁబట్టుకొనఁగలుగుట మెచ్చఁదగినది. శివతత్త్వమును నిరూపించు పట్టులందు మీ రెన్నుకొనిన ఘట్టములు సహజముగా రసవంతములు. మీ తీయని శైలి నాని యవి మఱింత రుచిమంతము లైనవి. విషయము లోకోత్తరము, శైలి రమ్యము, గ్రంథముఁ గూర్చి యింతకన్న చెప్పవలసినది లేదు

ఇఁక అన్నిటికన్న మిన్నగా మీ పరమార్థ ప్రవణత నెన్నఁదగును. జీవితము అర్థమయము చేసికొనువారే కాని పరమార్థమయమును జేసికొన వలెనని తహతహపాటు గలవారు మీవంటివారు లేరు. పైగా మీతరణము నకై మీరు సంపాదించుకొన్న పరమార్థము మూటగట్టి యుచితముగా

వితరణముఁ గావించుట మిక్కిలి సముచితముగా నున్నది ఈ విషయమున మిమ్ము వేయిముఖముల నుతించినను ఎక్కువగాదు.

పరమశివుఁడు మీ హృదయమున నిలిచియుండి యెన్నియో విశ్వశ్రేయఃకరము లగు గ్రంథములను వెలువరింపఁజేసి మిమ్ము చిరస్థాయు లనుగాఁ జేయుఁగాక.

తణుకు
4 - 5 - 71.

వేదుల సూర్యనారాయణశర్మ

# శ్రీ శివలీలామృత

### గ్రంథావిష్కరణ సభలో అధ్యక్షపీఠము నుండి అందించిన

# రుద్రాక్షమాలిక

వ్రాయఁగవచ్చు గ్రంథనికరమ్ము; కరమ్ము మనోహరమ్ముగా
వేయఁగవచ్చు ముద్రణము ; విశ్రుతికెక్కఁగవచ్చు; నొక్కఁడే
చేయఁగలేము నేఁడు కృత శీతమయూఖకళాభిషేకధా
రాయత సంతతార్ద్రితశిరఃపరమేశ్వరభక్తి యొక్కఁడే
చేయఁగలేము; స్నానజపసేవనవైదికపుణ్యకర్మ ని
ష్ఠాయుతభావనాగ్రసుదృఢస్థితశాంభవతేజ మొక్కఁడే
మోయఁగలేము; మంచుమలముద్దులపెండ్లికుమారునిండుపెన్
దీయనిలేఁతనవ్వువిరితేనియతుంపరజల్లు నొక్కఁడే
డాయఁగలేము; మేలిమికడాని వెలుంగులు మించు మించులన్
బాయని గుండెలోఁతునకుఁ బట్టిన యమ్మధుచక్రి మొక్కఁడే
తీయఁగలే; మజాండమను దేవళమున్ వెలిఁగింప జ్యోతిరు
ద్భాయత నాక్రమించుకొని సర్వము తానయి యుండు కాశికా
శ్రీయుత విశ్వనాథ శివలింగము స్ఫాటికమూర్తి నెంచి చే
దోయిని వంచి "యుద్ధరణి"తో నొక బొట్టు వియత్తరంగిణీ
తోయము పోయలేము; పరితోనినదచ్ఛతరుద్రియశ్రుతి
వ్యాయత దివ్యనాదవిభవశ్రవణమ్ము నిమేషకాలమున్
గాయఁగలేము; వార్తనుమనస్సులు కూడలిఁజేసి కార్తికీ

స్ఫాయదతంద్రసాంద్రసితచంద్రిక గంధపుబూఁత మేనివాఁ
డై యెసలారు వేల్పునకు నాదట బిల్వదళంబు నొక్కఁడే
వేయఁగలేము; పాపపదవీవిపినైకమహాధనంజయ
ప్రాయముగా నెఱింగి రుదురాక గళంబునఁబట్టి యొక్కఁడే
మోయఁగలేము; తాపములు మూఁటికి ఘస్మరమైన భస్మమున్
బూయఁగనేర; మిట్టితఱిఁ బూర్వజనుస్సుకృతానువాసనా
మేయఫలంబుగా నెడఁద మేల్కొనఁ బర్వతవర్ధనీమనో
నాయకు, సోమజూటుఁ, దొలినాఁటిగృహస్థుఁ, గుబేరునేస్తమున్
దీయని తెన్గుపల్కున గ్రథించిన సత్కృతికర్త సూర్యనా
రాయణమూర్తిపండితగృహస్థత కబ్బె శివప్రసాదముల్.

విరోధికృత్ :
కార్తికకృష్ణ
త్రయోదశి
సోమవారము

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
రాజమహేంద్రవరము.

# శ్రీశివలీలామృత కావ్యప్రశంస

*

శా. శ్రీమద్వైభవపుష్టితో నిజతనూరీతుల్ ప్రకాశింప మా
యామేయంబగు సంస్కృతిన్ విడఁగలే కాయాసముం బొందువా
రీమై నీ శివలీలలం జదువుచో హిందూసదాచారదీ
క్షామాన్యం బమృతమ్ము మాయనొగిఁ బ్రక్షాళించి రక్షింపదే?

మ. అకలంకమ్మగు భక్తితత్పరమతిన్ ధ్యానించి సూర్యుండు పూ
నిక నేతచ్ఛివలీలలో నమృతమున్ నిండించెఁ బౌరాణిక
ప్రకృతిన్ విస్తరణంబొనర్చెడి కథాభాగమ్ములన్ జేర్చి, త
త్సుకృతం బీకృతిరూపునన్ జగతి నిల్చున్ శాశ్వతాకారమై.

మ. పురుషార్థంబులు నాలుగింట సములై పోవంగ నేవారు ను
ర్వరనీనాఁడు ప్రయత్నముల్ గొన కధర్మవ్యాప్తి నర్థమ్ముగొం
దురు- స్వేచ్ఛాపటుకామనావశగులై దుఃఖింత్రు మోక్షాశ చే
కురమిన్; వారలపాలి కల్పతరుశక్తుల్ దీన భాసిల్లెడిన్.

మ. శివలీలామృతపానమత్తజనులౌ శ్రీమంతులెల్లన్ బురా
భవసంస్కారవశంబునన్ ధనికులై వర్తించుటల్, దానవై
భవసంపాదితకీర్తులై నెగడుటల్ భావ్యమ్మెకానీ! యిటుల్
గవితాసంస్కృతి గ్రంథకర్తలగుటల్ గన్పట్టి దిప్పట్టునన్.

మ. అది యీనాఁటిమహావిశేషము ద్విభాష్యం సూర్యనారాయణుం
డెదలోదాఁచిన సత్కథానిచయ మాయీ గ్రంథరూపమ్మునం
బొదలెన్ దీనిఁ బఠించువారి హృదయమ్ముల్ సంతతానందసం
పద నార్జించి తరింపఁగల్గు టొకయబ్రంబే? సమస్తావనిన్.

కడియం. }
15-11-1971. } చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి



"కవిసార్వభౌమ" "స్వరాజ్యకవి"
శ్రీ వడ్డాది సీతారామాంజనేయకవిగారు

శ్రీ ర స్తు.
ఓం నమః కామేశ్వర్యై
అ భి న ం ద న ము

గీ. శ్రీ ద్విభాష్యము వంశవార్నిధి శశాంక !
యనఘ వేంకటసూర్యనారాయణాంక !
కృతియుగమ్మును నీవు నిర్మించినావు
రుచిరశైలిని మధురమౌ వచనరచన.

గీ. సుప్రసిద్ధకృతి పరమార్థప్రసంగ
మంతకంటె మిన్న శివలీలామృతమ్ము
నుత్తమాశయపూర్ణ సంపత్తు, లవి భ
వాబ్ధిపోతముల్ సూర్యనారాయణార్య !

మ. మనదేశమ్మున విద్య లంగడిని నమ్మన్ బేరము న్నెన్నఁడున్
ఘనమౌ ప్రాక్తన సంప్రదాయమును జక్కన్ నీవు పాలించుచున్
దెనుఁగుం దల్లి కొసంగినావు ముద ముత్కృష్టాశయోపేతమై
యనయం బొప్పమదిన్ ద్విభాష్యకులరత్నా ! సూర్యనారాయణా !

మ. సిరులున్, జ్ఞానముఁ గల్గినందుకు సదా శ్రీభారతీపూజ హృ
త్సరసీజమ్మునఁ జేయుచున్ ప్రతిఫలాశాపాశ నిర్ముక్తతన్
సరళామోదముఁ గాంచుచుంటివి ద్విభాష్యం సూర్యనారాయణా !
యరు దీ భాగ్యముసుమ్ము యన్యులకు ధన్యాత్ముండ వీ వెంతయున్.

మ. శివసాహిత్య మహత్త్వ మెంతటిదొ వాచింపంగ శక్యమ్మొకో?
శివలీలామృతపాన హృష్టమతులౌ శ్రీనాథ ముఖ్యామరుల్
శివద శ్రీశివతత్త్వపూర్ణు: లహహా! శ్రీమచ్ఛివాద్వైతమే
శివసాయుజ్య మహా:ప్రద; మ్మదియె మాచిత్తాశికిం పౌనవున్.

మ. శివలీలామృతపూర్ణ భారతమహాక్షేత్రమ్మునం దాదియౌ
శివతత్త్వమ్మును మించునట్టిదెది? మిశ్రీభూత సిద్ధాంతముల్
వివిధమ్ముల్ శివసంప్రదాయ మహిమన్ లీనమ్ములై యుండవే?
శివతత్త్వం బమృతంబె యౌ; నుపనిషత్సింధుప్రజాతం బదే.

విద్వద్విధేయుఁడు,
కవిసార్వభౌమ, స్వరాజ్యకవి
వడ్డాది సీతారామాంజనేయకవి.

తణుకు.
1-4-1971.

రచయిత తల్లిదండ్రులు.



ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారు. సూరమాంబిక.

మ. శివమాహాత్మ్య మహత్త్వ మెంతటిదొ వాచింపంగ శక్యమ్మొకో?
శివలీలామృతపాన హృష్టమతులౌ శ్రీనాథ ముఖ్యామరుల్
శివద శ్రీశివతత్త్వపూర్ణు: లహహా! శ్రీమచ్ఛివాద్వైతమే
శివసాయుజ్య మహా:ప్రద: మ్మదియె మాచిత్తాళి కింపౌ నవున్.

మ. శివలీలామృతపూర్ణ భారతమహాక్షేత్రమ్మునం దాదియౌ
శివతత్త్వమ్మును మించునట్టి దెది? మిశ్రీభూత సిద్ధాంతముల్
వివిధమ్ముల్ శివసంప్రదాయ మహిమన్ లీనమ్ములై యుండవే?
శివతత్త్వం బమృతంబె యౌ: నుపనిషత్సంప్రజాతం బదే.

విద్వద్విధేయుఁడు,
కవిసార్వభౌమ, స్వరాజ్యకవి
వడ్డాది సీతారామాంజనేయకవి.

తణుకు.
1-4-1971.

రచయిత తల్లిదండ్రులు.



ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారు. సూరమాంబిక.

శ్రీ ధన్వంతరయే నమః

# విన్నతి

శ్రీ పరమేశ్వర సృష్టిలోని సమస్త జీవరాశులలోను మానవజన్మ ముత్కృష్టమైనది. అది లభించినందులకు సత్కర్మల నొనరించి దానిని సార్థక మొనరించుకొనవలయును. మహోన్నతము, పునరావృత్తిరహితము, శాశ్వతము నగు మోక్షము నందుటకుఁ దగిన సాధనము లొనరించుకొనుటయే మానవ ప్రధానకర్తవ్యము. అదియే పరమ పురుషార్థము. తత్ప్రాప్తికిఁ బ్రధానముగ మానవుఁ డాస్తికభావమును గలిగి యుండవలెను. అది లేనిచో నథోగతి నందుట తప్ప గత్యంతరము లేదు.

పరలోక మున్నదో లేదో యనెడి సంశయ మున్నపు డున్నదనియే ధ్రువపఱచుకొనవలెను. ఆస్తికుఁడై సత్క్రియల నాచరించినచోఁ బరలోక మొకవేళ లేకపోయినను వానికి హాని లేదు. లే దని నాస్తికుఁడై యసత్కర్మ లాచరించినవాఁడు పరలోక మున్నచో హతుఁ డగును. అపుడు పశ్చాత్తాపము నందినను నధమగతి తప్పదు.

శ్లో॥ సందిగ్ధే తు పరే లోకే హితమే వాచరే ద్బుధః
నాస్తిచే న్నాస్తి నో హాని రస్తిచే న్నాస్తికో హతః ॥

ముక్తి నొందుటకుఁ దగిన యుపాధియగు మానవజన్మ కలిగినపుడు సద్వినియోగ మొనరించుకొనక సంసారబంధమునఁ జిక్కుకొనినవాఁడు చింతామణి లభించఁగా దానిని గాజుముక్కవెలకు విక్రయించుకొనినవాఁ డగును. బహుపుణ్యఫలమును వెచ్చించి సంపాదించిన దేహము పోక లేక్కగాఁ బని తనవశమందున్నపుడే భవసాగరమునుండి పారము చేరుకొనుటకు యత్నించవలయును. అట్టి దూరదృష్టి లేని మానవుఁ డు శ్రమగతుల



ర చ యి త :

ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తి

శ్రీ ధన్వంతరయే నమః

# వినతి

శ్రీ పరమేశ్వర సృష్టిలోని సమస్త జీవరాశులలోను మానవజన్మ ముత్కృష్ట మైనది. అది లభించినందులకు సత్కర్మల నొనరించి దానిని సార్థక మొనరించుకొనవలయును. మహోన్నతము, పునరావృత్తిరహితము, శాశ్వతము నగు మోక్షము నందుటకుఁ దగిన సాధనము లొనరించుకొనుటయే మానవ ప్రధానకర్తవ్యము. అదియే పరమ పురుషార్థము. తత్ప్రాప్తికిఁ బ్రధానముగ మానవుఁ డాస్తికభావమును గలిగి యుండవలెను. అది లేనిచో నధోగతి నందుట తప్ప గత్యంతరము లేదు.

పరలోక మున్నదో లేదో యనెడి సంశయ మున్నపు డున్నదనియే ధ్రువపఱచుకొనవలెను. ఆస్తికుఁడై సత్క్రియల నాచరించినచోఁ బరలోక మొకవేళ లేకపోయినను వానికి హాని లేదు. లే దని నాస్తికుఁడై యసత్కర్మ లాచరించినవాఁడు పరలోక మున్నచో హతుఁ డగును. అపుడు పశ్చాత్తాపము నందినను నధమగతి తప్పదు.

శ్లో॥ సందిగ్ధే తు పరే లోకే హితమే వాచరే ద్బుధః
నాస్తిచే న్నాస్తి నో హాని రస్తి చే న్నాస్తికో హతః ॥

ముక్తి నొందుటకుఁ దగిన యుపాధియగు మానవజన్మ కలిగినపుడు సద్వినియోగ మొనరించుకొనక సంసార బంధమునఁ జిక్కుకొనినవాఁడు చింతామణి లభించఁగా దానిని గాజుముక్కవెలకు విక్రయించుకొనినవాఁ డగును. బహుపుణ్యఫలమును వెచ్చించి సంపాదించిన దేహ మను నౌక చక్కగాఁ బని కుపకరించునపుడే భవసాగరమునుండి పారము చేరుకొనుటకు యత్నింపవలయును. అట్టి దూరదృష్టి లేని మానవుఁ డుత్తమగతుల

నందఁజూడఁడు సరిగదా సంసారబంధములోఁ జిక్కుకొని తుదిని విహ రించును. అందువలననే

శ్లో॥ వర్షార్థ మష్టౌ ప్రియతేత మాసాన్
నిశార్థ మర్థం దివసే యతేత
వార్ధక్యహేతో ర్వయసా నవేన
పరత్రహేతో రిహ జన్మనా చ॥

వర్షకాలమునకుఁ గావలసిన వస్తుసామగ్రి తక్కిన యెనిమిది మాసముల లోను సమకూర్చుకొనవలెను. రాత్రికిఁ గావలసిన వానినిఁ బగటియందును వార్థకమున కవసర మగు వానిని యౌవన మందును సేకరించి యుంచు కొనవలెను. అటులే పరలోకసౌఖ్యమునకుఁ గావలసిన వాని నిహలోకము ననే యాచరించుకొనవలెను. అట్టి యాచరణములలో శివార్చనము ముఖ్యము.

శ్లో॥ సర్వేషాం చైవ సేవ్యోఽసౌ శంకరః సర్వదుఃఖహా
శివః స్వల్పేన కాలేన సంప్రసీదతి భక్తితః
సుప్రసన్నో మహేశో హి భక్తేభ్యః సకలప్రదః
భుక్తిం ముక్తి మిహాముత్ర యచ్ఛతీతి సునిశ్చితమ్
తస్మా త్సేవ్యః సదా శంభుః భుక్తి ముక్తి ఫలేప్సుభిః
పురుషః శంకరః సాక్షాద్దుష్టహన్తా సతాం గతిః ॥
(శివపురాణమ్.)

సకల దుఃఖములను దొలఁగించు శంకరుఁడు సర్వసేవ్యుఁడు. భక్తినిబట్టి స్వల్పకాలముననే శివుఁడు ప్రసన్నుఁడగును. మహేశ్వరుఁ డనుగ్రహించినచో భక్తులకు సకలము నొసంగును. ఇహపరములందు భుక్తి ముక్తుల నొసంగుట నిశ్చితాంశము. కాన నీ లోకమున భుక్తియుఁ

బరలోకమున ముక్తియుఁ గోరువారు తప్పక సర్వదా శంభుని నారాధింప వలయును. దుష్టశిక్షకుఁడు, శిష్టరక్షకుఁడు నగు శంకరుఁడు సాక్షాత్తు పరమపురుషుఁడు. సత్పురుషులకు గతి శంకరుఁడే.

వయోభేదము లేకుండఁ బిన్నలైనను బెద్దలైనను నిశ్చలభక్తితోఁ బరమేశ్వరుని సేవించిన శీఘ్రకాలములోఁ దరింపనగును. అట్టివా రనేకులు సర్వకాలముల నుందురు. భక్తవశంకరుఁ డగు శంకరు ననేకవిధములుగా నర్చించుకొనవచ్చును. శివారాధనమునకు భస్మధారణము, రుద్రాక్షధారణము, పంచాక్షరీజపము మున్నగునవి ముఖ్యాంశములు. ఏయేద్రవ్యములు శివ పూజార్హములో, అభిషేకమున కేవి ప్రధానములో, అభిషేక మేవిధాన మునఁ జేయుట శ్రేష్ఠమో, అటులు సేవించి ధన్యులైనవా రెవరో, పార్థివ లింగార్చన మెంత గణ్యమో, ద్వాదశజ్యోతిర్లింగము లెంత విశిష్టములో, మహేశావతారలీల లెంత యమృతప్రాయములో, శివక్షేత్ర మహాత్మ్యము లెట్టివో, మున్నగు విషయములు భక్తిభావముతో నిందు యథాశక్తిగాఁ బొందుపరుపఁబడినవి.

శివలీలలను వర్ణించుటకు ద్విసహస్రజిహ్వుఁ డగు నాదిశేషునకుఁ గూడఁ దరముకాదు. అట్టి మహత్తరలీలల నల్పుఁడ నగు నేను దెల్పఁ బూనుట పరిహాసాస్పద మయ్యును, నక్షరరూపమున నీశ్వర సేవ యథాశక్తిగా నాచరింప నభిలషించి పరమేశ్వరానుగ్రహమున నిటుల వెలువరింపఁగలిగితిని. కాశీవిశ్వేశ్వర సన్నిధిని, నీకృతిని సమర్పించు కొనఁ

గలుగుటయు నాతని దయావిశేషమే। విజ్ఞులిందలి గుణములను స్వీక రించి దోషములను బరిహరింపఁ గోరుదును.

సందర్భానుసారముగ నుపయుక్తము లగు కొన్ని తెలుఁగు పద్యములు శ్రీయుత ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు రచించిన ఆంధ్ర శివపురాణము నుండియు, శ్రీయుత పిశుపాటి చిదంబరశాస్త్రిగారు రచించిన ఆంధ్రపద్మపురాణమునుండియు నుదాహరింపఁబడినవి. అందుల కనుమతి నొసంగిన శ్రీయుత ముదిగొండ మార్కండేయగారికి, శ్రీయుత పిశుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నా కృతజ్ఞతావందనములు.

ఉపోద్ఘాతముతో నీకృతి నలంకరించిన పూజ్యులు డా॥ దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. (ఆనర్సు) పి. హెచ్. డి. గారికి నా నమోవాకములు. అభిప్రాయముల నొసంగి యాశీర్వదించిన "ప్రౌఢకవిచంద్ర" "బ్రహ్మభూషణ" బ్రహ్మశ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారికి, "సరస్వతీపుత్ర" "మహాకవి" శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులుగారికి, "వ్యాకరణాలంకార" "కళాప్రపూర్ణ" శ్రీయుత పేరి వెంకటేశ్వరశాస్త్రిగారికి, "సాహిత్య విద్యోభయ భాషాప్రవీణ" "విమర్శక శిరోమణి "శ్రీయుత వోలేటి వేంకటసుబ్బరాయశాస్త్రిగారికి, "సరస్వతీ కంఠాభరణ" "విద్వాన్" శ్రీయుత వేదుల సూర్యనారాయణశర్మగారికి, "కవిసార్వభౌమ" "స్వారాజ్యకవి" శ్రీయుత వడ్డాది సీతారామాంజనేయకవిగారికి నమస్కృతులు.

మానవులెల్లరు భక్తిభావబంధురులై శివారాధన మొనరించి తరించవలె నను నాకాంక్షయే పరమలక్ష్యము

శ్లో॥ ఆత్మా త్వం గిరిజా మతిః సహచరాః ప్రాణాః శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వా గిరో
యద్యత్ కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్॥

(శంకరాచార్య)

చింతలూరు 21-4-1971 } ఇట్లు బుధవిధేయుఁడు
ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తి.

# ద్వితీయ ముద్రణ

# విజ్ఞప్తి

"శ్రీ శివలీలామృత" మమూల్యమయ్యును శివభక్తి తత్పరులకు, సాహితీసంస్కృతులకుఁ గొందఱకు మాత్రమే యందఁజేయఁబడినను బ్రతులన్నియుఁ జెల్లి యల్పకాలములోనే ద్వితీయ ముద్రణమునకు వచ్చినది. ఇందుల కాంధ్రప్రజల భక్తి తాత్పర్యము, సాహిత్యాభిరుచి హేతువులు.

ఆవిష్కరణోత్సవసభ కధ్యక్షులుగా నుండి జేగీయమానముగా నూతనరీతులలో సభానిర్వహణ మొనరించి తమ సుమధురకవితారీతికిఁ బ్రతీకగా, మహాకవిరచన కుదాహరణముగా నొక "రుద్రాక్షమాలిక" ననుగ్రహించి సభలోని యందటి డెందములతోపాటు నాహృదయమున దివ్యకవితామృతమును జిలికిన "మహాకవి" శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి పుష్పాంజలి. తత్సభకు దయచేసి మహోపన్యాసములతోఁ గావ్యపరిశీలన మొనరించిన విద్వద్వంద్యులు "విద్వత్కవిశేఖర" శ్రీవెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారికి, "బ్రహ్మభూషణ" శ్రీ కాకర్తి కృష్ణశాస్త్రిగారికి, "విమర్శకశిరోమణి" శ్రీ వోలేటి వేంకటసుబ్బరాయశాస్త్రిగారికి, "పండిత" శ్రీ పాలంకి గంగాధరశాస్త్రిగారికి, ప్రణామాంజలులు. పలువురు విఖ్యాత పండిత, విమర్శక, కవులు అభిప్రాయములఁ బంపి నాకృతి నాదరించిరి. వానిలోఁ గొన్నిటిని మాత్రమే కొంత కొంతగానిందుఁ బ్రకటించితిని. స్థలాభావముచే నన్నింటిని బ్రకటింపలేదనియు నన్యథాతలంప వలదనియు మనవి.

గ్రంథమును జదివి యెందఱో యెంతయో తృప్తిపడితిమని యనేక విధముల వారిభక్తి చిత్తములను సారస్వతాభిమానమును వెల్ల డించు చున్నారు. వారల కందఱకు వందనములు.

ప్రముఖ పత్రికలు పమీక్షించి దీనిని గౌరవించినవి. తదధినేతలకుఁ గృతజ్ఞుఁడను.

అత్యల్పకాలములోఁ బ్రజాదరణము నెంతగానో పొంది పునర్ము ద్రణమునకు వచ్చిన నా రచనమును నేనును జరితార్థులము.

శ్రీ శివలీలామృతము నెంతఁ బ్రాసినను దనివి తీఱదు. ఆ పరము శివుని యనంతలీలా విలాసమయూఖములలో నిది యొక రేఖామాత్రము.

చింతలూరు.) ఇట్లు
పరీధావి సం॥ సుజన విధేయుఁడు
విజయదశమి ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తి.



# శ్రీ శివలీలామృతము

## విషయానుక్రమణిక

# ప్రార్థనము

శ్లో॥ అగజాననపద్మార్కం
గజానన మహర్నిశమ్
అనేకదం తం భక్తానా
మేకదంత ముపాస్మహే॥

శ్లో॥ నమామి ధన్వంతరి మాదిదేవమ్
సురాసురై ర్వందిత పాదపద్మమ్
లోకే జరా రుగ్భయ మృత్యునాశమ్
దాతార మీశం వివిధౌషధీనామ్॥

శ్లో॥ నమ శ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్టవపు ర్ధరాభ్యాం
నగేంద్రకన్యా వృషకేతనాభ్యాం
నమో నమ శ్శంకరపార్వతీభ్యాం॥

శ్లో॥ వామే భాష్యం కరసరసిజే, దక్షిణే జ్ఞానముద్రాం
బిభ్రాణోఽంతస్స్మిత శశికళాకాంత శాంతాననశ్రీః
యశ్ఛాత్త్రేభ్యో వితరతి గురుస్స్వాత్మతత్త్వావబోధం
శంభోర్మూర్తిం త్రిభువనగురుం శంకరాచార్య మీడే॥

శ్లో॥ గురవే సర్వలోకానాం
భిషజే భవరోగిణామ్
నిధయే సర్వవిద్యానాం
దక్షిణామూర్తయే నమః॥

శుభమస్తు                                                    అవిఘ్నమస్తు

శ్రీ ధన్వంతరయే నమః

# శ్రీ శివలీలామృతము

శ్లో॥ వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ॥

## భక్తిసోపానము

శ్రీకరుఁ డగు పరమేశ్వరుని సృష్టిలోని చరాచర ప్రాణికోటిలో మేటి యైనది మనుజజన్మ. ఈ మానుషత్వము కొన్ని వేల స్థావర జంగమ జన్మములెత్తిన పిదపఁ గాని లభ్యపడదు. అట్టి యలభ్య మానవత్వము కలిగినప్పుడే ముక్తి సాధనముల నొనరించుకొన వలెను. "ఇదం శరీరం పరమార్థ సాధనమ్." మఱియొక పుట్టువులో నీ సాధనావకాశము లేదు. గత మనుజజన్మల లోని సంస్కారసంపదచేతనే యట్టి సాధనాభిలాషయుఁ దర్వాత జన్మమున నుదయించును. మానవజన్మ వచ్చెనుగదా! యెపుడో చూచుకొంద మనుకొనుటకు వీలులేదు. అది నీటిబుడగ. ఎక్కడనో యెప్పుడో యెట్టులో విచ్చిపోవును. "అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః నిత్యం సన్నిహితో మృత్యుః". మరణము

మానవధర్మము. ఆ మరణము నేఁడో రేపో కొన్నియేండ్లకో తప్పనిదికదా యని యెఱిఁగి మనుజుఁడు భోగలాలసుఁడు కాకుండ భగవత్సేవఁ గావించుకొన వలయును.

శ్లో॥ ఉత్పత్తిం చ వినాశం చ భూతానా మాగతిం గతిమ్
వేత్తి విద్యా మవిద్యాం చ షడ్విధో భగ ఉచ్యతే॥

భూతముల యుత్పత్తి-వినాశము, భూతముల యాగమనము-గమనము, విద్య-అవిద్య, అను నాఱును గలిసిన భగమని పేరు. ఈ యాఱును గలవాఁడే భగవంతుఁడు.

"అప్రార్థితాని దుఃఖాని యథైవాయాంతి దేహినః సుఖాని చ తథా మన్యేదైన్య మత్రాతిరిచ్యతే." సుఖదుఃఖములు ప్రారబ్ధవశమున వచ్చునవి. ఆ సుఖము, దృష్టము శ్రుతము నని రెండు విధములు.

శ్లో॥ శ్రుతం చ దృష్టవ ద్దుష్టం స్ప ర్థాసూ యాత్యయ వ్యయైః
బహ్వంతరాయ కామత్వా త్కృషివ చ్చా పి నిష్ఫలమ్ ॥
(శ్రీ మద్భాగవతము)

ఇహమున మధురపదార్థ భక్షణము, ఆభరణాదిక ధారణము, దివ్యసౌధ నివాసాదికములు కల వని చూచుట దృష్టము. పరలోకములో నా యా సౌఖ్యము లున్నవని వినుటయే శ్రుతము. ఈ సుఖమునకు స్పర్థ, అసూయ, అత్యయము, వ్యయము నను నాలుగు దోషము లున్నవి. తనకంటె నధిక సౌఖ్యము నింకొకఁ డనుభవించుచుండినఁ దాను స్పర్థ నందును. పరుల గుణమైభవాది

కములఁ జూచి యసూయపడును. సుఖము నాశనమగుట అత్య యము. సుఖము తగ్గిపోవుటయే వ్యయము. అందువలన స్వర్గ సౌఖ్యము కూడ నిష్ఫలమయ్యెను.

శ్లో॥ తావత్ ప్రమోదతే స్వర్గే యావత్ పుణ్యం సమాప్యతే
క్షీణపుణ్యః పత త్యర్వా గనిచ్ఛ న్కాలచాలితః॥
మద్భాగవతము)

స్వర్గములో రంభాది భోగము, విమాన సంచారము, యధే చ్ఛావిహారము లభించుచుండును గాని యవి శాశ్వతములు కావు. తా నాచరించిన సుకృత మున్నంతవఱకే యా యనుభవము. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" తిరిగి భూమికి రావలసినదే. వచ్చి సుఖదుఃఖానుభవము నొందుచు బండిచక్రమువలెఁ బరిభ్ర మించునే కాని స్థిరపడఁ జాలఁడు.

శ్లో॥ సుఖస్య దుఃఖస్య న కోపి దాతా పరో దదా తీతి కుబుద్ధి రేషా
అహంకరో మీతి వృథాభిమానః స్వకర్మసూత్ర గ్రథితో హి జంతుః॥
(శ్రీ మద్భాగవతము)

శ్లో॥ ఉప ర్యుపరి మనోరథజాలం విద్వా నపికామయతే యతతే
పుత్ర మిత్ర కళత్రాదిషు నిర్వేదం నైతికామకామీ విద్యా
సంప త్కుల ధన యౌవన గర్వపర్వతాధిరూఢో మూఢః
పశ్చా దంధే తమసి పత త్యవశో అంధ మంధయివ కుర్వన్॥

శ్లో॥ దినయామిన్యౌ సాయం ప్రాతః శిశిర వసంతౌ పున రాయాతః
కాలః క్రీడతి గచ్ఛ త్యాయుః తదపి న ముంచ త్యాశావాయుః॥

మానవతకు భోగపరత యధికము. భోగము లశాశ్వతము లని తెలిసియుఁ దెలియనివాఁడై యదే మాధుర్యమనుకొని సాంసారిక భోగ బంధ బంధితుఁడై కాలవ్యయ మొనరించుచు మనుజుఁడు పుట్టుచుఁ జచ్చుచుండునేకాని పారము నందలేఁడు. మానవత మమకారమయము. సతిపై సుతులపై సంపదపై సకల సాంసారిక ప్రయోజనములపై స్నేహమును బెంచుకొని తాను బద్ధుఁ డగును. తాను బెంచుకొన్న స్నేహముతోఁ దానానంద మందుచున్నా నని సుఖించుచున్నా నని భ్రమించునే కాని వాస్తవమునఁ దాను బీడితుఁడే యగును. స్నేహమునకు నూనె యని కూడ నర్థమున్నది. స్నేహార్థము గానుగలోఁ బడి తిల లెట్లు పీడింపఁబడుచున్నవో యట్లులే స్వజనాదిక స్నేహార్థమై మానవుఁడు కూడఁ బీడితుఁ డగుచున్నాఁడు.

శ్లో॥ దారాః పుత్రాః పరమ సుహృదః బాంధవాః కింకరా వా
స్వప్నావస్థా స్వపి చ విరహం యే మయా న క్షమంతే
అత్యాసన్నే తపనతనయ స్యాజ్ఞయా దూతవర్గే
తే ష్వే కోపి స్మరహర న మే గంతు మన్వస్తి జంతుః॥

సతీసుతులు, స్నేహితులు, బాంధవులు, భృత్యులు స్వప్నమునఁ గూడఁ దమ యజమానుని విరహమును సహింపలే మని చెప్పుదురు గాని ఆ యజమానుని ప్రాణము పోవునపుడు వారిలో నే యొకఁడు నాతనివెంట వెడలఁడుగదా! "అర్థా గృహే నివర్తంతే శ్మశానే మిత్రబాంధవాః, సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంత మనుగచ్ఛతి." కావున మానవుఁడు మిక్కిలి దుర్లభమై

కోరిన పురుషార్థముల నందించునదై బహుజన్మల యనంతరము గలుగునదై సుఖదుఃఖములను సమముగా భావించు మానవత్వమును బొందినపుడు తనదేహ ముండఁగనే కామవిషయములకు యత్నింపక ముక్తికే యత్నింపవలెను.

శ్లో॥ లబ్ధ్వాసుదుర్లభ మిదం బహు సంభ వాంతే
మానుష్య మర్థద మనిత్య మపీహ ధీరః
తూర్ణం యతేత నపతే దనుమృత్యు యావ
న్ని శ్శ్రేయసాయ విషయః ఖలు సర్వతస్స్యాత్॥
(శ్రీమద్భాగవతము)

శ్లో॥ జా యాత్మ జార్థ పశు భృత్య గృ హా ప్తవర్గాన్
పుష్ణాతి య త్ప్రియ చికీర్షతయా వితన్వన్
స్వాంతే సకృ చ్ఛ్రమ వరుద్ధ ధన స్స దేహ
స్సృష్ట్వాస్య బీజ మవసీదతి వృక్షధర్మా॥
(శ్రీమద్భాగవతము)

మానవుఁ డీ దేహమునకుఁ బ్రీతి నొనరింపఁ దలంచియే భార్యా పుత్ర పశు భృత్య ధనాప్త వర్గములఁ గల్పించుకొని పోషించుచున్నాఁడు. ఎట్టులో కష్టపడి ధన మార్జించి మూటఁగట్టి తన యాయువు చెల్లిపోఁగా దేహమును, నాప్తులను, ధనమును వీడి పోవుచున్నాఁడు. దేహమే పోవుచున్నది కాని దుఃఖము పోవుటలేదు. వృక్షము నశింపుచు రెండవ వృక్షమునకు బీజమును నిల్పుచున్నట్లు మనుజుఁడును మఱియొక దేహమునకు బీజమగు కర్మము నొనరించుకొనియే యీ దేహమును విడుచును. గతజన్మ

కృతము నీ జన్మమునకుఁ దెచ్చుకొని యీ జన్మకృతముతోఁ దృణజలూక న్యాయముగ ముందుజన్మ నెత్తుచున్నాఁడు. కావున మానవశరీరము గలిగినపుడే మమకారము వలని పీడ నందక మానవత్వ ప్రయోజనము లైన పురుషార్థచతుష్కములో మొదటి దగు ధర్మముతోడి యర్థకామముల నాచరించి నాలవదగు మోక్షమును సాధింపవలెను. అపుడే యశాశ్వత మానవుఁడు శాశ్వతత్వమును సముపార్జించి జన్మసాఫల్యము నందును. నటి- సంగీతము, వాద్యము, సుతి, లయ మొదలగువానికి వశయై నటింపుచున్నను శిరము మీఁది కుంభము నేవిధముగా రక్షించుకొనునో అటులే యొకదానివెంట నొకటిగా వచ్చు విషయముల ననుభవింపుచున్నను ధీరుఁడు చంద్రశేఖరపదార విందముల విడువఁబోఁడు. మానవజన్మ మొక వృక్షము. దానికి ధర్మము మూలము, వృక్షమూలమున జలసేచ నాదిక దోహదక్రియ లొనరించుటవలన నది పెరిఁగి పుష్పించి ఫలించునట్లు ధర్మసాధనము లైన సత్కర్మాచరణ దేవతాసమర్చనము లొనరించిన మోక్షఫలము లభించును.

పగలు గడచినది. రాత్రి వచ్చినది. అదియు గతించి మఱలఁ బగలు వచ్చినది. ఇది యెడతెగని పయనము. రాత్రిందివ యానములో నాయుర్దాయ మంతరించుచున్నది. శరీరము శీర్ణ మగుచున్నది. నీడవలె మృత్యువు వెన్నాడుచున్నది. ఎప్పుడో యెక్కడనో యెట్టులో కబళించివేయును. అందుచేతనే మానవుఁడు తనలోఁ జైతన్య మున్నపుడే, శక్తి యున్నపుడే యవయవము లన్నియుఁ దన యధీనములో నుండఁగనే తరణోపాయముల

నాచరించుకొన వలెను. బ్రితికినంతకాలము తనతో నుండి, తనవా రనుకొని వారికొఱకై తాను శ్రమించిన భార్యాపుత్రాదు లెవ్వరును దాను మరణించిన పిదపఁ దనవెంట రారు. తా నార్జించిన ధనధాన్యాదులు రావు. ఆ యార్జన మంతయు వ్యర్థమే. మరణానంతర ప్రయాణములో దారిబత్తెము కావలెను. ఆ బత్తెమునకుఁ గావలసినది ధనపుమూట కాదు. పుణ్యంపు మూట. అట్టి పాథేయమున్నవాఁడే పరమున సుఖించి ముక్తుఁడగును. ఎంతటి ధర్మమునైన నాచరించుటకుఁ గర్మభూమియగు భారతావనిలో నవకాశమున్నది. ఎంత సుకృతాచరణ మొనరించునో దానికిఁ దగినంత యమర సౌఖ్యము నందును. ఆ సుకృతసంపాదక మార్గములలోఁ బ్రధాన మైనది శివారాధన. దాని కత్యంతావశ్యక మైనది భక్తి. శివ సాయుజ్య మొసంగు శంకరుఁ డాభక్తికే వశుఁడు.

శ్లో॥ కలౌ ప్రత్యక్ష ఫలదా భక్తిః సర్వయుగే ష్వపి
తత్ప్రభావా దహం నిత్యం తద్వశో నాత్ర సంశయః॥

(శివపురాణసతీఖండము)

అనియు నా భక్తినవవిధము లనియుఁ బరమేశ్వరుఁడు వివరించెను.

శ్లో॥ శ్రవణం కీర్తనం చైవ స్మరణం సేవనం తథా
దాస్యం తథాఽర్చనం దేవి! వందనం మమ సర్వదా
సఖ్య మాత్మార్పణం చేతి నవాంగాని విదు ర్బుధాః
ఉపాంగాని శివే తస్యా బహూని కథితాని వై॥

(శివపురాణము)

"శ్రవణము, కీర్తనము, స్మరణము, సేవనము, దాస్యము,

అర్చనము, వందనము, సఖ్యము, ఆత్మనివేదనము-అనునవి నవ మార్గములు. వీని కుపాంగము లనేకము లున్నవి.

నియమవంతుఁడై స్థిరాసనుఁడై నా కథామృతమును శ్రవణపాన మొనరించుచుండుటయే శ్రవణము. నా యవతార లీలాదికముల మానసాకాశమున దర్శించుచు నా కథ నాసక్తితో నుచ్చరించుచుండుటయే కీర్తనము. సర్వవ్యాపకుఁడ నగు నన్ను సర్వదా సర్వత్ర కనుఁగొనుచు నిర్భయముగ నన్ను మనసా స్మరించు చుండుటయే స్మరణము. అరుణోదయమునుండి నిద్రించు వేళ వఱకు వాక్పాణి పాదముల నన్ను సేవించుచుండుటయే సేవనము. సర్వేంద్రియములచే సేవ్యానుకూలముగ నిరంతరము నన్ను సేవించుటయే దాస్యము. యథాశక్తిగ షోడశోపచారపూజలచేఁ బాద్యాదిక సమర్పణ మొనరించుటే యర్చనము. త్రికరణ శుద్ధిగా మంత్రోచ్చారణ ధ్యానము లొనర్చుచు నష్టాంగములచే నవనిని స్పృశించుచు నాకు నమస్కరించుటయే వందనము. మంగళామంగళము లన్నియుఁ దన శ్రేయమునకే చేయుదు నని నాయందుఁ దన భారమంతయుఁ బెట్టుట సఖ్యము. నా ప్రీతికై తన దేహాదికసర్వస్వము లనిత్యము లను భావముతో సమర్పించి తన దంతయు నీశ్వరార్పణ మని యెంచుటయే యాత్మార్పణము. ఈ నవవిధ భక్తులును భుక్తి ముక్తుల నొసంగునవి. నా కతి ప్రీతిపాత్రములై మీకు జ్ఞానోదయకారణము లైనవి.

బిల్వపత్రాదికములచే నాకు సర్వాంగపూజ సభక్తికముగా

నొనర్చుట యత్యుత్తమము. అట్లెవ్వఁడు పూజించునో వానికి జ్ఞాన వైరాగ్య మాత యగు ముక్తి దాసురాలై యుండును. ఈ నవవిధభక్తులును నీవలె నా కత్యంత ప్రేమపాత్రములు. వీనిని గలిగియున్నవారే నా కాప్తులు. త్రిలోకములలోను భక్తి వంటి సుగమమార్గ మింకొకటిలేదు. భక్తి చతుర్యుగములందును విశిష్ట మయ్యును గలియుగమున మిక్కిలి ప్రశస్త మైనది. ప్రత్యక్ష ఫలప్రదము. దానికి నేను వశుఁడను. కలిలో నన్ను వశ మొనరించుకొనుట కింతకన్న నుపాయము లే" దని పరమేశ్వరుఁడు సతీదేవికిఁ జెప్పినట్లు శివపురాణ ప్రమాణము. కాన మానవుఁడు భక్తిభావబంధురుఁడై శివారాధన మొనరించి తరించవలెను.

శ్లో॥ శివనామైవ సంసార మహారోగై క శామకమ్
నా న్య త్సంసార రోగస్య శామకం దృశ్యతే మయా
బ్రహ్మహత్యా సహస్రాణి పురా కృత్వా తు పుల్కశః
శివేతినామ విమలం శ్రుత్వా మోక్షం గతః పురా
తస్మా ద్వివర్ధయే ద్భక్తి మీశ్వరే సతతం బుధః
శివభక్త్యా మహాప్రాజ్ఞ భుక్తిం ముక్తిం చ విందతి॥

(శివపురాణము.)

సంసారరోగమును శమింపఁ జేయునది శివనామ మొక్కటే; అన్య మేదియుఁ గన్పడుటలేదు. పూర్వ మొక పుల్కశుఁడు వేలకొలఁది బ్రహ్మహత్యలఁ గావించియు శివ నామశ్రవణ మాత్రముననే మోక్షమును బొందెను. విజ్ఞుఁ డాకార

ణముననే శివునియందు భక్తినిఁ బెంపొందించుకొన వలయును. శివభక్తివలన నిహమున భుక్తియుఁ బరమున ముక్తియు నొందుదురు.

పరమేశ్వరుఁ డనంతుఁడు, విశ్వపతి, జగత్సృష్ట, త్రిగుణాతీతుఁడు, సర్వవ్యాపకుఁడు, నిరంజనుఁడు, నిర్గుణుఁడు, పశుపాశ విమోచకుఁడు, కాలాతీతుఁడు, పరిపూర్ణుఁడును. అతని వలననే సృష్టి స్థితి లయములు జరుగుచున్నవి. సర్వకార్యములకుఁ బరమేశ్వరుఁడే కర్త. అంధుఁడు పరులసహాయము లేనిదే యెక్కడకును వెడలలేనట్లు జీవుఁడు పరమేశ్వరానుగ్రహము లేనిదే యే కార్యము నిర్వహింపలేఁడు. పశువులను (జీవులను) నడిపించు వాఁడు గాన నాతనికిఁ బశుపతి యను నామము గలిగెను.

శ్లో॥ బ్రహ్మాద్యాః స్థావరాంతా శ్చ దేవదేవస్య శూలినః
పశవః పరికీర్త్యంతే సంసార వశవ ర్తినః
తేషాం పతిత్వా ద్దేవేశః శివః పశుపతిః స్మృతః ॥

(శివపురాణము)

బ్రహ్మాది స్థావరపర్యంత జీవులు, సంసారవశులై వర్తింపుచుఁ బశువు లనిపించుకొనుచున్నారు. వారికిఁ బ్రభువైన కారణమున శివునకుఁ బశుపతి యనిపేరు.

శ్లో॥ విషయా ఇతి కథ్యంతే పాశా జీవనిబంధనాః
బ్రహ్మాది స్తంబ పర్యన్తాన్ పశూన్ బద్ధ్వా మహేశ్వరః
పాశై రేతైః పతి ర్దేవః కార్యం కారయతి స్వకమ్
తస్యాజ్ఞయా మహేశస్య ప్రకృతిః పురుషోచితమ్

బుద్ధిం ప్రసూతే సా బుద్ధి రహంకార మహంకృతిః
ఇంద్రియాణి దశైకం చ తన్మాత్రా పంచకం తథా
శాసనా ద్దేవదేవస్య శివస్య శివదాయినః
తన్మాత్రాణ్యపి తస్యైవ శాసనేన మహీయసా
మహాభూతా న్యశేషాణి భావయం త్యనుపూర్వశః
బ్రహ్మాదీనాం తృణాన్తానాం దేహినాం దేహసంగతిమ్
మహాభూతా న్యశేషాణి జనయంతి శివాజ్ఞయా
అధ్యవస్యతి వై బుద్ధి రహంకారో ఽభిమన్యతే॥

(శివపురాణము)

జీవులకు బంధహేతువు లన్నియుఁ బాశములు. బ్రహ్మాది తృణపర్యంత జీవులను బాశబద్ధులఁ గావించి కార్యములందుఁ బ్రవర్తింపఁ జేయుచున్నాఁడు పరమేశ్వరుఁడు. ఈ యక్షయ ప్రకృతి పరమేశ్వరునిది. ఏజీవున కేకర్మ యున్నదో యా కర్మకుఁ దగిన బుద్ధిని బ్రకృతి శివాజ్ఞచేఁ బుట్టించుచున్నది. ఆ బుద్ధివలన నహంకారమును నహంకృతి వలన దశేంద్రియములును, మనస్సును, శబ్ద,స్పర్శ, రూప, రస, గంధములును జనించి శివ దాయి యగు శివుని శాసనమునందుఁ బ్రవర్తించుచున్నవి. అందుచే నే జీవు నే విధముగా వర్తింపఁజేయవలయునో యా విధముగా వర్తింపఁ జేయుచున్నాఁడు. బ్రహ్మాది తృణపర్యంతాశేష మహా భూతములను దేని నెట్లు ప్రవర్తింపఁజేయవలెనో యట్లు దేహ సంగులను జేయుచున్నాఁడు. శివాజ్ఞవలననే యాభూతకోటి జనించుచున్నది. దేహధారులైన జీవులు దేహాభిమానులై దేహము నే నను భ్రాంతిలో మునుఁగుచున్నారు.

శ్లో॥ పుణ్యానురూపం భూతేభ్యః పురుష స్యామశాసనాత్
కరోతి సంపదః శశ్వత్ జ్ఞానం చాపి సుమేధసామ్
నిగ్రహం చాప్యసాధూనా మీశానః శివశాసనాత్
ధత్తేతు ధరణీం మూర్ధ్నా శేషః శివనియోగతః ॥

(శివపురాణము)

ఎవని పుణ్యమునకుఁ దగినట్లు వానికి సంపదను, సాధువులకు గొప్పజ్ఞానమును నిచ్చుచున్నాఁడు. అసాధువుల నిగ్రహము శివశాసనముననే జరుగుచున్నది. ఆదిశేషుఁడు శివాజ్ఞ చేతనే భూమిని శిరమునఁ దాల్చి మోయుచున్నాఁడు.

శ్లో॥ తిలేషు వా యథా తైలం దధ్నివా సర్పి రర్పితమ్
యథాపః స్రోతసి వ్యాప్తా యథారణ్యాం హుతాశనః ॥

(శివపురాణము)

తిలలందు నూనె, దధియందు నేయి, ప్రవాహమునందు జలము, నరణియం దగ్ని యెట్లు లిమిడియున్నవో యటులే తన యాత్మయందుఁ బరమేశ్వరుఁ డిమిడి యున్నాఁడు.

తపస్సు నియమముగ నాచరించిన నా పరమేశ్వరుని దెలిసికొనఁ గల్గుదురు. ఆ మహేశుఁడు సమస్త బ్రహ్మాండములకు, సకలజీవుల కాధారభూతుఁడు. అతఁ డణువుకన్న నణువుగను, మహత్తుకంటె మహత్తునునై యుండును.

మన శరీరమునందు జీవుఁడు, పరమాత్మ యను నిరువురు కలిసియుందురు. అందు జీవుఁడు తాను జేయు కర్మల

ఫలము ననుభవించుచుండఁగాఁ బరమాత్మసాక్షిభూతుఁడై యుండును. జీవుఁడు సంసారవిషయములందు లీనమై భోగము లనుభవించుచు నొక్కొకతఱి మోహమున దుఃఖితుఁ డగుచుండును. సుఖదుఃఖములకు లోనుగాక ద్వంద్వాతీతుఁడై పరమాత్మను ధ్యానతపస్సులచే నారాధించినచో భ్రమరకీటన్యాయమునఁ దా నాత్మయై ముక్తి నొందఁగలఁడు.

శ్లో॥ ఐశ్వర్య మప్రతిద్వంద్వం సుఖ మాత్యన్తికం బలమ్
తేజః ప్రభావో వీర్యం చ క్షమా కారుణ్య మేవ చ॥
పరిపూర్ణస్య సర్గాద్యై ర్నాత్మనోఽస్తి ప్రయోజనమ్
పరానుగ్రహ ఏవాస్య ఫలం సర్వస్య కర్మణః॥

అతులైశ్వర్యము, నిరంతర సౌఖ్యము, బలము, తేజః ప్రభావము, వీర్యము, క్షమ, కారుణ్యము వీనివలనఁ బరిపూర్ణుఁడైన యాత్మకు సృష్ట్యాదికముల వలనఁ బ్రయోజనము లేదు. పరానుగ్రహమే సకలకర్మలకు ఫల మని యా యీశ్వరుఁడు లోకానుగ్రహమునకై యే కార్యమునైనఁ జేయును.

పరమేశ్వరుఁడు నామ రూప రహితుఁ డయ్యును మానవకోటి నుద్ధరింపఁజేయుటకే లింగరూపుఁ డైనాఁడు. ఆ లింగమును భక్తితోఁ బూజించిన వాఁడు సర్వపాప విముక్తుఁడై స్వర్గాద్యుత్తమలోకములను మోక్షమును బొందును.

శ్లో॥ న సర్వజ్ఞం వినా పుంసా మాదిసర్గః ప్రసిధ్యతి
వైద్యం వినా నిదానందాః క్లిశ్యంతే రోగిణో యథా

తస్మా దనాదిః సర్వజ్ఞః పరిపూర్ణః సదాశివః
అ స్తినాథః పరిత్రాతా పుంసాం సంసార సాగరాత్
ఆదిమధ్యాంత నిర్ము క్తః స్వభావవిమలః ప్రభుః
సర్వజ్ఞః పరిపూర్ణ శ్చ శివో జ్ఞేయః శివాగమే
త స్యాభిధాన మంత్రో౽యం మభిధేయ శ్చ సస్మృతః
అభిధా నాభిధేయత్వా న్మంత్రః సిద్ధః పరః శివః॥

(శివపురాణము)

వైద్యుఁడు లేనిదే రోగి కెటు లానందము లేదో, యటులే సర్వజ్ఞుఁడైన పరమేశ్వరుఁడు వినా లోకమున కానందసిద్ధి లేదు. అనాదిస్వరూపుఁడు, సర్వజ్ఞుఁడు, పరిపూర్ణుఁడు నైన సదాశివుఁడు సంసారసాగరమునుండి మానవు నుద్ధరించును. ఆతఁ డాది మధ్యాంత రహితుఁడు, విమలస్వభావుఁడు, ప్రభువు, సర్వజ్ఞుఁడు పరిపూర్ణుఁడు, మంగళప్రదుఁడు నని శివాగమము చెప్పుచున్నది. వాని నామమే మంత్రము. ఆ నామమునఁ బిలువఁబడు వాఁడే దేవుఁడు. అభిధా నాభిధేయ స్వరూపమైన యా మంత్రమే పరమేశ్వరుఁడని ప్రసిద్ధమైనది.

చ. కనుఁగొనలేదె నీ వఖిల కారణకారణు నిద్ధమూర్తిఁ బా
వన కరుణాధురంధరుని భర్గుని భక్తజనావనోద్యమున్
ఘనతర దుఃఖనాశకుని గంజభవా! శివలింగపూజనం
బున కురు వెందు లే దదియెపో కడచున్ దురితి సర్వశోకముల్.

ఉ. దారను బుత్రులన్ ధనము దార్ఢ్యము నాయువు రాజ్యలక్ష్మి వి
స్తారసుఖంబులన్ యశము స్వర్గము మోక్షము గోరువారలేన్
గూరిమి లింగపూజనముఁ గోరి యొనర్పఁగఁ జెల్లు. నట్టు లె
వ్వారలు సేయకున్న నిఁక వానినిఁ గానఁగలేరు రూఢిగన్.

క. శివభక్తిఁ గొనినవారలు
శివలింగము నెద్ద పూజ చేసెడువారల్
శివునిన్ దలంచువారలు
భవదుఃఖమ్ములను దొలఁ బాయుదు రెందున్.

(ఆంధ్ర శివపురాణము)

శ్లో॥ కలౌ కలుషితే కాలే దుర్జయే దురతిక్రమే
అపుణ్యతమసాఽఽచ్ఛన్నే లోకే ధర్మపరాఙ్ముఖే
క్షీణే వర్ణాశ్రమాచారే సంకటే సముపస్థితే
సర్వాధికారే సందిగ్ధే నిశ్చితే వా విపర్యయే
తదోపదేశే విహతే గురుశిష్యక్రమే గతే
కేనోపాయేన ముచ్యంతే భక్తా స్తవ మహేశ్వర॥

( శివపురాణము )

కలుషితమై దుర్జేయమై దురతిక్రమమైన కలియుగమునఁ బాపాంధకారమునఁ దిరుగుచు ధర్మశూన్యులై వర్ణాశ్రమాచార హీనులై సంకటస్థితిలో నున్న జీవులు సర్వాధికారములు సందిగ్ధములై యక్రమము నిశ్చయ మగుచుండఁగా, గురుశిష్య న్యాయము పోఁగా నీ భక్తు లేతీరునఁ దరింతురో నాకు నెలవిమ్ము పరమేశ్వరా యని పార్వతి కోరఁగా

శ్లో॥ ఆశ్రిత్య పరమాం విద్యాం హృద్యాం పంచాక్షరీం మమ
భక్త్యా చ భావి తాత్మానో ముచ్యంతే కలిజా నరాః
మనో వా క్కాయజై ర్దోషై ర్వక్తుం స్మర్తు మగోచరైః
దూషితానాం కృతఘ్నానాం నిర్దయానాం ఖలాత్మనామ్
లుబ్ధానాం వక్రమనసా మపి మ త్ప్రవణాత్మనామ్
మమ పంచాక్షరీ విద్యా సంసారాభయకారిణీ
మయైవ మసకృ ద్దేవి ప్రతిజ్ఞాతం ధరాతలే
పతితో ఽపి విముచ్యేత మద్భక్తో విద్యయా ఽనయా॥

( శివపురాణము )

పరమమును, హృద్యము నగు నా పంచాక్షరీవిద్యను గ్రహించి భక్తితో జపించిన మానవులు కలిదోషవిముక్తు లగుచున్నారు. ఉచ్చరించుటకుఁ, దలంచుటకు గోచరముగాని మనో వా క్కాయ దోషములతోఁ గూడినవారు, కృతఘ్నులు, నిర్దయులు, కపటస్వభావులు, లుబ్ధులు, వక్రమనస్కులు నైనను నాయందుఁ జిత్తమును నిల్పి సంసారభీతిని దొలఁగించు పంచాక్షరిని జపించువారు తరించుచున్నా రని నే ననేకపర్యాయములు ప్రతిజ్ఞఁ జేసియున్నాను. పతితుఁ డైనను భక్తితో నా మంత్రమును జపించి ముక్తిని బొందుచున్నాఁ డని పరమేశ్వరుఁడు చెప్పెను.

# లింగోద్భవకథ

శ్రీ మహావిష్ణువు యోగనిద్రలో నుండఁగాఁ గమలాసనుఁ డరుదెంచి యాతనిని లేపి నీ వెవఁడ వని ప్రశ్నించెను. అంత నాతఁడు మేల్కాంచి "నాయనా! ఇంతవ్యాకులపడితి వేమి?" యన బ్రహ్మ "బిడ్డా యని నన్ను సంబోధించితి వేమి? నీకుఁ గుమారుఁడనా? నీవు నాకుఁ దండ్రివా? బ్రహ్మాండము లన్నింటిని సృష్టించిన స్రష్టను నేను. నీవు నా సృష్టిలోని వాఁడ" వనఁగా విశ్వంభరుఁడు "సృష్టి. స్థితి, లయ కారణుఁడను నేనే. నేనే జగన్నాథుఁడను, సర్వమయుఁడను, నా యాజ్ఞ ప్రకారమే నీవు సంచరింప వలయును. నీ కిట్టి తలంపు కలుగుటకు నా మాయయే కారణము. నీవు నా మాయామోహితుఁడ వైతివి, కొలఁది కాలములో నీ కీ మాయ తొలఁగునులే" యని వచించెను.

ఇర్వురిలో నధికత్వభేద మంకురించి క్రమముగా నది వృద్ధియై యుద్ధమువఱకు వచ్చినది. అఖర్వ గర్వమునఁ జిర కాలము పోరాడినారు.

ఆ యుద్ధములో వా రిద్దఱి మధ్యఁ బరమేశ్వరుఁడు జ్యోతిర్లింగముగా నావిర్భవించెను, ఆజ్యోతిస్స్వరూప మేమో తెలియ లేదు, "మనలో మనము గొప్పవార మని పోరాడుచుండ మన కన్న మిన్నయైన దొకటి యుద్భవించినది. దీని స్వరూపము

మన కవగత మగుటలేదు. దీని యాద్యంతములు తెలిసికోవల యును. మనము సఖ్యత నొంది పరిశీలింత" మని యుభయులును నిశ్చయించుకొనిరి. కమలాసన కమలనాభు లాద్యంతముల దర్శింప నిశ్చయించుకొనిరి. వాణీవల్లభుఁడు హంసాకారుఁడై యూర్ధ్వదిశకును, రమానాథుఁ డాదివరాహరూపుఁడై యధోలోక ములకును నరిగిరి.

విధాత వెడలుచుండఁగా పైనుండి యొక కేతకీసుమము క్రిందికిఁ బడుచు విధాతృప్రశ్నకు సమాధానముగా "హిరణ్య గర్భా! నీ ప్రయత్నము వ్యర్థము. ఈ లింగాగ్రముఁ దెలిసి కొనుట నీ కసాధ్య" మని వచించెను. అంత ధాత "కేతకీ! నా కొక సహాయమును జేయుము. నే నీ లింగాగ్రమును జూచితి నని చెప్పుదును. అటనుండి వచ్చుచున్న నీ వది సమర్థించవలె" నని కోరఁగా నది సమ్మతించినది. పైనుండి దిగివచ్చి విరించి "నారాయణా! నేను లింగాగ్రము దర్శించి వచ్చితి" ననెను. విష్ణువు తాను గన్గొనలే దనెను. నారాయణుఁడు నమ్మి బ్రహ్మను బూజించెను. అంత మహేశుఁడు ప్రత్యక్షమై "కమలలోచనా! నీ సత్యనిరతికి సంతసించితిని. నన్నుఁ బూజించు తావులలో నిన్నును బూజించునట్లు వర మొసంగుచున్నాను. కమలాసనా! నీ వసత్యవాక్యుఁడ వయినావు. నీ పంచమవదన మీ యనృత మాడి నది గాన దానిని ఖండింతు" నని తన ఫాలనేత్రమునుండి భైరవునిఁ బుట్టించినాఁడు గంగాధరుఁడు. కమలాసనుఁడు క్షమింప వేఁడుకొనఁగా ననుగ్రహించి "యింతటినుండి నీకుఁ

బూజార్హత లేకపోవుఁగాక" యని శపించెను. అంత నాయిర్వు రును మహేశ్వరుని నుతింపఁగా సంతుష్టుఁడై "యీ దివసము మహాశివరాత్రి యని ఖ్యాతి నంది నా కత్యంత ప్రీతిపాత్రమైన దగుఁగాక !" అనెను.

శ్లో॥ దినమేత త్తతః పుణ్యం భవిష్యతి మహ త్తరమ్
శివరాత్రి రితి ఖ్యాతా తిధి రేషా మమ ప్రియా
ఏత త్కాలే తు యః కుర్యా త్పూజాం మ ల్లింగవేరయోః
కుర్యాత్స జగతః కృత్యం స్థితి సర్గాదికం పుమాన్
శివరాత్రి వహోరాత్రం నిరాహారో జితేంద్రియః
అర్చయే ద్వా యథా న్యాయం యథాబల మవంచకః
యత్ఫలం మమ పూజాయాం వర్ష మేకం నిరంతరమ్
తత్ఫలం లభతే సద్యః శివరాత్రౌ మదర్చనాత్
మద్ధర్మవృద్ధికాలోఽ యం చంద్రకాల ఇ వాంబుధేః
ప్రతిష్ఠా ద్యుత్సవో యత్ర మామకో మంగలాయనః॥

( శివపురాణము )

బ్రహ్మవిష్ణువులమధ్య లింగాకారముగ నీశ్వరుఁ డుద్భవించిన యా దినము చాలఁ బవిత్రమైనది. "దీనికి శివరాత్రి యనిపేరు. ఈ తిథి మాఘబహుళ చతుర్దశి. నాకు మిక్కిలి ప్రియమైనది. ఈ పుణ్య కాలమున నా లింగమును నా విగ్రహము నెవ్వఁడు పూజించునో వాఁడు సృష్టి, స్థితి, లయములఁ జేయసమర్థుఁ డగును. ఈ శివరాత్రినాఁడు నిరాహారుఁడై జితేంద్రియుఁడై యథావిధిగా యథాశక్తిగా వంచన లేక నన్నర్చించిన సంవత్సర మంతయు

సేవించిన ఫలము గలుగును, సముద్రునకుఁ జంద్రోదయమువలె నీ దివసమునఁ బూజ నా కుత్సాహ సమ్మోదముల నొసఁగును. ఈనాఁటి ప్రతిష్ఠాదికము లెక్కడనైన మంగళప్రదములే. ఈ దినమున నుపవసించి నన్నుఁ బూజించి జాగరణ మొనరించిన మహాఫలము గలుగు" నని యాదిదేవుఁ డాన తిచ్చెను. అసత్య మాడినందున మొగలికిని బూజార్హత లేకుండు నని శపించెను. మఱల దాని ప్రార్థన నంగీకరించి శాపమును సడలించి, యీశ్వర పూజ కనర్హ మగునట్లును మఱి యన్య దేవతా పూజల కర్హ మగునట్లును దానిని గరుణించెను. ఈశ్వరుఁడు నాఁటినుండి లింగరూపమునే పొందెను.



# పంచాక్షరీ వైభవము.

మానవ తరణోపాయమునకుఁ బంచాక్షరీజపమే ముఖ్య సాధన మని పరమేశ్వరుఁడే పలికినాఁడు గాన భక్తితోఁ బంచాక్షరీమంత్రమును జపించుచుండవలెను.

సీ. బాలేందుమౌళి రూపముఁ జూపు దర్పణం
బరయఁగా శైవ పంచాక్షరంబు
బ్రహ్మహత్యాదిక పాపాటవీ దావ
మరయఁగా శైవపంచాక్షరంబు
కైవల్యపుంజెలి కల దీవియకు నౌక
యరయఁగా శైవపంచాక్షరంబు
ఎల్ల కోర్కులను రంజిల్లఁ దీర్చెడు కల్ప
మరయఁగా శైవపంచాక్షరంబు

గీ. అమరగేయంబు శైవపంచాక్షరంబు
ఆగమధనంబు శైవపంచాక్షరంబు
అఖిల సుఖదము శైవపంచాక్షరంబు
హర్ష నిలయంబు శైవపంచాక్షరంబు.

(ఆంధ్ర శివపురాణము)

శ్లో॥ నమస్కారాది సంయుక్తం శివాయే త్యక్షరత్రయమ్
జిహ్వాగ్రే వర్తతే యస్య సఫలం తస్య జీవితమ్
అంత్యజో వాధమో వాపి మూర్ఖో వా పండితోపి వా
పంచాక్షరజపే నిష్ఠో ముచ్యతే పాపపంజరాత్
ఇత్యుక్తం పరమేశేన దేవ్యా పృష్టేన శూలినా॥

( శివపురాణము )

"నమః" ముందుఁ గలిగి 'శివాయ' యను మూఁడక్షరము లెవ్వని జిహ్వాగ్రమున నుండునో వాని జీవితము సఫలము. అంత్యజుఁడైన నధముఁడైన మూర్ఖుఁడైనఁ బండితుఁడైనఁ బంచాక్షరీజపనిష్ఠుఁడైనవాఁడు పాపపంజరమునుండి విడువఁబడునని శూలియైన శంకరుఁడు శాంకరికిఁ దెల్పినాఁడు.

శ్లో॥ కి మత్ర బహునోక్తేన భక్తాః సర్వేఽధికారిణః
మమ పంచాక్షరే మంత్రే తస్మా చ్ఛ్రేష్ఠతరో హి సః॥
పంచాక్షర ప్రభావేణ లోక వేద మహర్షయః
తిష్ఠంతి శాశ్వతా ధర్మా దేవాః సర్వ మిదం జగత్
ప్రలయే సమనుప్రాప్తే నష్టే స్థావర జంగమే
సర్వం ప్రకృతి మాపన్నం తత్ర సంలయ మేష్యతి॥(శి.పు.)

వేయి చెప్పనేల? నా భక్తులందఱును బంచాక్షరీమంత్రమునకు నధికారులే. ఈ మంత్రము శ్రేష్ఠతర మైనది. దీనియందు సర్వలోకములు, చతుర్వేదములు, మహర్షులు శాశ్వత ధర్మములు, దేవతలు, యావజ్జగమును నున్నవి.

శ్లో॥ ఏకోఽహం సంస్థితో దేవి ! న ద్వితీయోఽస్తి కుత్రచిత్
తథా వేదా శ్చ శాస్త్రాణి సర్వే పంచాక్షరే స్థితాః ॥
( శివపురాణము )

ఓ దేవి ! అంతట నున్నవాఁడను నే నొక్కఁడనే. రెండవ దెక్కఁడను లేదు. అటులే సర్వశాస్త్రములు సమస్త వేదములును పంచాక్షరమం దున్నవి.

శ్లో॥ సైషా పంచాక్షరీ విద్యా సర్వశ్రుతిశిరో గతా
సర్వం జాతస్య సర్వస్య బీజభూతా సనాతనీ
ప్రథమం మన్ముఖోద్గీర్ణా సామ మైవాస్తి వాచికా

తప్త చామీకర ప్రఖ్యా పీనోన్నత పయోధరా
చతుర్భుజా త్రినయనా బాలేందుకృత శేఖరా
పద్మోత్పలకరా సౌమ్యా వరదాభయపాణికా
సర్వలక్షణ సంపన్నా సర్వాభరణ భూషితా
సితపద్మాసనాసీనా నీలకుంచిత మూర్ధజా
అస్యాః పంచవిధా వర్ణాః ప్రస్ఫుర ద్రశ్మిమండలాః
పీతః కృష్ణ స్తథా ధూమ్రః స్వర్ణాభో ర క్త ఏవ చ ॥

(శివపురాణము)

ఈ పంచాక్షరీవిద్య సర్వోపనిషత్తుల యందున్నది. ఇది ప్రతి ప్రాణికి, సర్వమునకు బీజభూత మైనది. సనాతన మైనది. నా ముఖమునుండి తొలుత వెలువడినది. నన్నుఁ జెప్పునది. కరఁగిన కనకమువంటికాంతి గలది. ఉన్నతమైన బలిసిన వక్షో జములు గలది. చతుర్భుజములు త్రినేత్రములు గలది. బాల చంద్రుని శిరమునఁ దాల్చినది. పద్మోత్పలముల వంటి హస్త ములు గలది. సౌమ్య యైనది. వరదాభయహస్తములు గలది. సర్వలక్షణయుక్త యైనది. సర్వాభరణ భూషిత యైనది. శ్వేత పద్మాస నాసీన యైనది, నల్లగ వంకరతిరిగిన శిరోజములు గలది. ఈ విద్యకుఁ బంచవర్ణములు ప్రకాశమానమండలములై యున్నవి. పీతవర్ణము, కృష్ణ వర్ణము, ధూమ్రవర్ణము, స్వర్ణ వర్ణము, రక్తవర్ణము గలిగియున్నదిగాన నీ మంత్రమును బైనఁ జెప్పిన రీతిని ధ్యానించి పఠించవలెను. పంచాక్షర మంత్రమును బఠింపుచు నన్నపానాదికముల స్పృశించినచో నవి మంత్రపూతములై సౌఖ్యము నొసంగును.

# ఉపమన్యు చరితము

పంచాక్షరీజపఫలము నత్యధికముగ నందిన యుపమన్యు వను మునికుమారుని చరిత్రఁ దెలిసికొందము.

వ్యాఘ్రపాదుఁ డను మహర్షి కుమారుఁ డుపమన్యువు. అతఁడు గతజన్మమున మునియై సిద్ధి నొందక మఱల మునికుమారుఁడై జన్మించెను.

ఉపమన్యువు తల్లితో నొకమాఱు మేనమామగారింటికి వెడలఁగా నచ్చట వాని కావుపాలను ద్రావ నిచ్చుచుండిరి. తృప్తిగఁ ద్రావెడివాఁడు. అక్కడఁ గొన్నాళ్లుండిన పిదప నింటికి వచ్చెను. అక్కడి యలవాటున నాతఁ డావుపాలు కావలెనని మారాము చేయఁగాఁ దనయింట నావుపాలు లేక తల్లి బియ్యపుగుండ నీటిలోఁ గలిపి కృత్రిమక్షీరముఁ జేసి యిచ్చినది. అది త్రాగిన బాలునకు మేనమామగారింటిలోని పాలవలె రుచిలేక యట్టివి కావలె నని మిక్కిలి గోలఁజేయఁగాఁ దల్లి "నాయనా ! నేన భాగ్యను. కన్నబిడ్డకుఁ గడుపునిండ నావు పాలైనఁ బోయలేని దురదృష్టవంతురాల" నని యాతనిని గౌఁగిలించుకొని దుఃఖించుచున్నది. పిల్లవాఁడు పాలు పా లని బిగ్గఱగా రోదించుచున్నాఁడు. అంత నాతని నెత్తుకొని కన్నీరు, దుడుచుచు నూరడించుచు "బిడ్డా ! మామయ్యగారింట మొదవు లున్నవి. వారు ధనవంతులు.

మనము ధనహీనులము. మనకు యథార్థక్షీరము లెట్లు లభించునురా! తృప్తిగఁ బాలు కావలె నన్న భోగములు కావలె నన్న నీశ్వరాను గ్రహ ముండవలెను.

శ్లో॥ తటినీ రత్నపూర్ణా స్తాః స్వర్గ పాతాళ గోచరాః
భాగ్యహీనా న పశ్యంతి భక్తిహీనా శ్చ యే శివే
రాజ్యం స్వర్గం చ మోక్షం చ భోజనం క్షీరసంభవం
న లభంతే ప్రియా ణ్యేషాం న తుష్యతి యదా శివః
శివ ప్రసాదజం సర్వం నా న్యదేవ ప్రసాదజం ॥

( శివపురాణము )

స్వర్గ పాతాళములందుఁ బ్రకాశించు రత్నములతో నిండిన నదులు శివభక్తులు గాని భాగ్యహీనులు చూడఁజాలరు. రాజ్యము, స్వర్గము, మోక్షము, క్షీరసంభవమైన భోజనము ప్రియవస్తువులు శివప్రీతిఁ జేయనివారు పొందలేరు. సర్వభోగము లీశ్వరానుగ్ర హము వలననే లభించును. కోరికతో నీశ్వరుని సేవించువా రైశ్వ ర్యవంతు లగుదురు.

శ్లో॥ పూర్వజన్మని య ద్దత్తం శివ ముద్దిశ్య వై సుత
త దేవ లభ్యతే ... .. ... ... ... ......"

( శివపురాణము )

శంకరుని పాదారవిందములకుఁ గ్రిందటి జన్మమున భక్తితో దేని నర్పింతుమో యదియే యీ జన్మమునఁ గలుగును. మాకా యదృష్టము లేకపోయినది. గతజన్మమున మహేశ్వరునిఁ బూజింపలేదు కావుననే మా కైశ్వర్యము కలుగలేదు.

అందుచే నీకు క్షీరము తీయలేకపోతి" నని తల్లి శోకించు చుండఁగా నుపమన్యువు బుద్ధిమంతుఁడు గాన "జననీ ! శోకింప కుము. సర్వేశ్వరు నే కోరికతో సేవించిన నాఫలము నిచ్చునంటివి కాన నేను శివుని సేవించి క్షీరసాగరమును సంపాదింతు" నని చెప్పెను. తల్లియాతని ధైర్యమున కానందించి

ఉ. ఆతనిచేతనే జగము లన్నియు నిట్లు జనించె మించుగా
నాతనిఁ గొల్చుచుండెద రహర్నిశముస్ సుర లప్రమత్తులై
యాతని సుప్రసాదమున నక్షరభాగ్యము లొందుచుందు ర
ల్లాతఁడె వి న్నికన్ మనకు నందజకున్ గల దిక్కు పుత్రికా !

( ఆంధ్రశివపురాణము )

కావున శంకరుని యనుగ్రహము కలుగవలయు ననిన "నమః" పూర్వక "శివాయ" యను పంచాక్షరీమంత్రము జపించ వలయును. సర్వమంత్రముల శక్తి యీ శివమంత్రమున నున్నది. ఇది చాల శ్రేష్ఠమైనది. సర్వరక్షక మైనది. దీనికి "అఘో రాస్త్రము" అని పేరు. ఈ మంత్రమును జపించుచుండుము.

శ్లో॥ తస్మా న్మంత్రాంతరాం స్త్యక్త్వా పంచాక్షరపరో భవ
తస్మిన్ జిహ్వాంతర గతే న కించి దిహ దుర్లభమ్॥

( శివపురాణము )

పరమేశ్వరుఁడు సమస్తదేవతలలో శ్రేష్ఠుఁడు గాన వానిని భక్తితో సేవింపుము. మీ తండ్రి ధరించెడి విరజాభస్మము నీ కిచ్చుచున్నాను. దీనిని ధరించిన నేయాపదలును రావు. అరణ్య మునఁ గ్రూరజంతువుల వలని భయప్రమాదములు రాకుండఁ

గాపాడు" నని తల్లి కుమారు నాశీర్వదించి పంపుచున్నది. ఉప మన్యువు తల్లి యాజ్ఞ శిరసా వహించి పాదాభివందన మాచరించి నిలువఁగా "నీకు సకలదేవతలు శుభమును గలిగింతురుగాక!"యని దీవించెను.

ఉపమన్యువు హిమగిరికి వెడలి యచట నెనిమిది యిటుకలతోఁ జిన్ని యాలయమును గట్టి మృల్లింగము నం దుంచి దానిలో నీశాను నావాహన మొనరించి బిల్వపత్రి పుష్పాదికములచేఁ బూజించుచుండెను. చంద్రశేఖరునియందు లగ్నభావుఁడై పంచాక్షరిని జపించుచు వాయుభక్షణము మాత్రము చేయుచుఁ దప మాచరించుచుండెను. శరీరము శుష్కించుచున్నది.

మరీచిమహర్షిచే శప్తులైన కొందఱు మహర్షులు పిశాచములై యుపమన్యువును జేరి యాతని తపమునకు విఘ్నమొనర్ప యత్నించుచు నాతనిని బాధింపుచుండఁగా బాలుఁడు "నమః పూర్వక శివాయ" యని యుచ్చస్వరమున జపించుచుండఁగాఁ దచ్ఛ్రవణఫలమున వారి పైశాచికత పోయి మును లయినారు. వాని తపోమహిమచేఁ జరాచర ప్రపంచ మంతయు సంతప్తమగుచున్నది. దేవతలు తట్టుకొనలేక మాధవునితో మొఱఁబెట్టుకొనిరి. వారిని గొని వాసుదేవుఁడు కైలాసమున కరిగి కృతాంజలియై కృత్తివాసునితో"ఉమాధవా! ఉపమన్యువు క్షీరార్థియై తపము మహోగ్రముగఁగావించుచున్నాఁడు. తత్తపోగ్నిచే లోకములు తపించిపోవుచున్నవి. సంరక్షింపవలయు" ననఁగా "నే నాతనిని

బరీక్షించి వర మొసంగి వత్తు" నని వారిని వెడలనంపినాఁడు శంకరుఁడు.

త్రినేత్రుఁడు సహస్రనేత్రుఁడై శ్వేతగజము నధిరోహించి యుపమన్యువునొద్ద కరిగి "నీతపమున కానంద మందితిని. ఏమి వరము కావలె" ననఁగా నా బాలుఁడు "పరమేశ్వరుని యం దచంచలభక్తిని" మ్మని కోరెను. "నేను దేవతల కధిపతిని. త్రిలోకనాధుఁడను. శంకరుఁడు నిరాకారుఁడు, నిర్గుణుఁడు, దిగంబరుఁడు, కపాలి, భిక్షుకుఁడును. వానిని సేవించిన నేమి ఫలము? న న్నర్చింపు" మని యనఁగా నుపమన్యువు పంచాక్షరిని జపించుచు తపోవిఘ్న మొనరింప వచ్చియుండు నని భావించి "ఓ శచీపతీ! నీ వీశ్వరనిందఁ గావింప వచ్చినావా? శంకరుఁడన నెవ్వఁడో తెలియక దూషించుచున్నావు. ఆతని తత్వమును మాయమ్మ చెప్పఁగా విన్నాను. బ్రహ్మవిష్ణువులను నిన్నును సృష్టించిన దాయనయే. నే నాతనినే కోరుదును గాని నిన్నుఁ గోరను. శివ నిందఁ జేయుచుండఁగా వినరాదు. విన్నచో శరీరత్యాగము చేయవలెను. నీవు శివనిందఁ జేసితివి కాన నీ భస్మము శివాస్త్రముగాఁ బ్రయోగించి నిన్ను నశింపఁజేసి నేను యోగాగ్నిలో భస్మ మౌదు" నని భస్మమును శివమంత్రపూత మొనరించి వానిపైఁ జల్లఁగా నందీశ్వరుఁ డుపసంహరించెను. ఆతని యచంచల దీక్షకు మెచ్చి పరమేశ్వరుఁడు పార్వతీసహితుఁడై ప్రత్యక్షముకాఁగా నుపమన్యువు పరమానందముతో సాష్టాంగపడి స్తోత్రము నొనరించెను.

చంద్రశేఖరుఁ డాతనికి క్షీరసముద్రము, దధిసాగరము, మధుజలధి, ఘృతాబ్ధి, యపూపపర్వతములఁ బ్రసాదించెను. "నీ బంధువులతో యథేచ్ఛగా వీని ననుభవింపుము. నాయందు నిరంతర భక్తితో నుండి వివిధభోగము లనుభవింపుము. నీవు మా బిడ్డవు. నీ కమరత్వ మిచ్చి గణాధిపత్య మొసంగుచున్నాఁడ" నని యను గ్రహించెను.

క్షీరసాగరుఁ డుపమన్యునకుఁ బ్రత్యక్షమై తానొక పాత్రలో నిమిడి యాతని చేతిలో నెల్లవేళల నుండ నంగీకరించెను. హైమవతి వాని కైశ్వర్యమును జ్ఞానమును బ్రసాదించెను. మహేశ్వరుఁడు "పాశుపత వ్రతయోగము" నిచ్చి జరామరణములు లేకుండ సర్వసమర్థతఁ గలిగి యెల్లపుడు కుమారప్రాయముననే యుండునట్లు వర మిచ్చెను. మునికుమారుని కోరికపై నెడతెగని యీశ్వరభక్తిని శంకరదాస్యమును బ్రసాదించి పరమేశ్వరుఁడు తిరోహితుఁ డయ్యెను. ఉపమన్యువు గృహమునకు వెడలి తల్లికి నమస్కరించి యంతయు విన్నవించెను. వారఖండైశ్వర్యశ్రీ వంతులై సుఖించిరి.

శ్లో॥ యా ప్రీతిః ఆత్మనః పుత్రే యా కళత్రే ధనేపి వా
సా ప్రీతిః శివచింతాయాం కో న ముచ్యేత బంధనాత్॥

తన పుత్రునియందుఁ గళత్ర మందు ధనమందు నెట్టి ప్రీతి గలిగియుండునో అట్టి ప్రీతిని శివధ్యానమునం దుంచినచో నెవఁడు బంధము క్తుఁడు కాలేఁడు ?

# దాశార్హ్ని కథ

పంచాక్షరీమంత్రి మహిమమును స్కాందపురాణ మిట్లు వెల్లడించుచున్నది.

దాశార్హుఁ డను మధురాపుర రాజకుమారునకు కలావతి యను గాశీరాజపుత్రికతో వివాహ మైనది. పునస్సంధానము నాఁటి రేయి గదిలో సతి దూరముగ నిలువఁగా నాతఁడు సకౌతుకముగ దగ్గఱకు రమ్మని కలావతిని బిలిచెను. ఆమె నేను దీక్షలో నున్నాను. అది సమాప్త మగువఱకు నన్ను స్పృశింపరా దనఁగా నాతఁడు వినక యామెను బలాత్కారముగఁ దాఁకఁబోఁగా నా శరీరము కాలిన యినుపగుండువలె నత్యుష్ణముగఁ దాఁకినది. అతఁడు మిక్కిలి యాశ్చర్యపడి శరీర మంతటి యుష్ణత నందుటకుఁ గారణ మడుగఁగా "నా చిన్నతనమున దూర్వాస మహర్షి నాకు శివపంచాక్షరి నుపదేశించెను. దానిని జపించుచుండుట వలన నేను విగత కిల్బిష నైతిని. పవిత్రదేహ నైతిని. మీ శరీరము పాపభూయిష్ఠము, జారత్వ సురాపానాది దోషములఁ జేసియున్న మీకు నా శరీర ముష్ణముగనే యుండు" నన్నదామె. అతఁ డత్యంతాసక్తుఁడై నాకు నా మంత్రోపదేశ మొనరింపు మనఁగా "భార్యను గాన నేను మీ కుపదేశింపరాదు. కులగురు వగు గర్గమహర్షిని గోరుఁ" డనినది. ఆతనివలన నుపదేశ మంది రాకుమారుఁ డింటికివచ్చి జపించుచుండఁగా నాతని

దేహమునుండి కాకులు శతసంఖ్యలో వచ్చిపడి భస్మము కాఁ జొచ్చెను. అందుల కచ్చెరువు పడి గర్గమహర్షి నీ విచిత్రి మే మని పరిశ్నింపఁగా " నీ దేహమునందలి పాతకరాశు లీ కాక రూపమున వచ్చి కాలుచున్న" వని చెప్పెను. అట్లు కొంతకాలము జపింపఁగా నాతఁడు విగతదోషుఁడై పవిత్రుఁ డయ్యెను. అంత నాతఁడు భార్యాశరీరమును స్పృశింపఁ గలిగెను. అందువలన శివ పంచాక్షరి సమస్తాఘముల హరించు నని వెల్లడి యైనది.



# అర్జునుని పాశుపతాస్త్రప్రాప్తి

కౌరవులను జయించు పూనికతో దివ్యాస్త్రప్రాప్తికై ఫల్గునుఁ డింద్రకీలాద్రిపైఁ దపోదీక్షితుఁడై మహేంద్రుని యుపదేశానుసారము శివపంచాక్షరీజప మొనరించుచుండెను. అతని తపోమహోగ్రతను భరింపలేక సురబృందము లేగి శివునిఁ బ్రార్థింప వారి నూరడించి పంపి యర్జును ననుగ్రహించుటకై పరమేశ్వరుఁడు కిరాతవేషమున నింద్రకీలమునకు సతీ పరివార యుతుఁడై వచ్చెను. అంతకు ముందే దుర్యోధనుని ప్రేరణచే మూకుఁ డను రక్కసుఁడు సూకరరూపమున వచ్చి యర్జునుని ముందుకోలాహలమొనరింపుచుండఁ దన తపోవిఘ్న మగుచున్న దని పార్థుఁడు బాణముతో దాని ముఖమునఁ గొట్టెను. అంతలో భిల్లరూపమున నున్న శివుఁ డా సూకర పృష్ఠభాగమునఁ దన శరమును నాటెను. ఇట్లిరువురు నా పర్వతము వలెనున్న సూకరముపై శరప్రయోగము లొనరింప సాగిరి. చివరకు పార్థుని బాణము సూకరపార్శ్వభాగమున గ్రుచ్చుకొనఁగా నది నేలఁబడి మరణించెను. అంతఁ దనబాణమును దీసికొనుటకుఁ బార్థుఁ డా మృత కళేబరము కడ కేఁగఁగా భిల్లసైనికుఁడును వచ్చెను.

సూకరమునకు గ్రుచ్చుకొన్న బాణము తన దని పార్థుఁడనఁగాఁ దమ నాయకుని దని యాటవికుఁ డనెను. పరస్పర విరోధముతో వాగ్వాద మయ్యెను. అంత భిల్లనాయకుఁ దేతెం

చఁగా నర్జునున కీతనితో ఘోరయుద్ధ మయ్యెను. పార్థుఁడు పంచాక్షరిని స్మరించుచు శివపాదముల నాత్మలోఁ దలంచుకొనుచు నా మాయాభిల్లునితోఁ బోరాడఁగాఁ బోరాడఁగాఁ బరమశివుఁ డానందించి భిల్ల వేషము విడిచి నిజరూపముతో నాతనికిఁ బ్రత్యక్ష మయ్యెను. పార్థుఁ డమితానందుఁడై స్తోత్రి మొనరించెను. ఆతని శివభక్తికి, మనోధైర్యమునకు ముద మంది యాతనికిఁ బాశు పతాస్త్ర మనుగ్రహించి దానితో సర్వశత్రునాశ మొనరింపఁ గల వని పలికి తనహస్తముచే నాతనిశిరమును దాఁకి దీవించి పర మేశ్వరుఁ డంతర్హితుఁ డయ్యెను. పంచాక్షరీమంత్ర ప్రభావము వలననే పార్థునకుఁ బాశుపతాస్త్రము ప్రాప్తించినది.



# శివపంచాక్షరస్తోత్రము.

శ్లో॥ నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మై నకారాయ నమః శివాయ ॥

శ్లో॥ మందాకినీసలిల చందన చర్చితాయ
నందీశ్వర ప్రమధనాధ మహేశ్వరాయ
మందారపుష్ప బహుపుష్ప సుపూజితాయ
తస్మై మకారాయ నమః శివాయ ॥

శ్లో॥ శివాయ గౌరీ వదనాబ్జబృంద
సూర్యాయ దక్షాధ్వర నాశకాయ
శ్రీనీలకంఠాయ వృషధ్వజాయ
తస్మై శికారాయ నమః శివాయ ॥

శ్లో॥ వసిష్ఠ కుంభోద్భవ గౌతమార్య
మునీంద్ర దేవార్చిత శేఖరాయ
చంద్రార్క వైశ్వానర లోచనాయ
తస్మై వకారాయ నమః శివాయ ॥

శ్లో॥ యక్షస్వరూపాయ జటాధరాయ
పినాకహస్తాయ సనాతనాయ
దివ్యాయ దేవాయ దిగంబరాయ
తస్మై యకారాయ నమః శివాయ॥

## శివపంచాక్షర స్తోత్రము

శ్లో॥ పంచాక్షర మిదం పుణ్యం
యః పఠే చ్ఛివసన్నిధౌ
శివలోక మవాప్నోతి
శివేన సహమోదతే ॥

(శంకరాచార్య)

శ్లో॥ శివనామ విభూతి శ్చ తథా రుద్రాక్ష ఏవ చ
ఏత త్త్రయం మహాపుణ్యం త్రివేణీసదృశం స్మృతం
ఏత త్త్రయం శరీరే చ యస్య తిష్ఠతి నిత్యశః
తస్యైవ దర్శనం లోకే దుర్లభం పాపహారకమ్
త ద్దర్శనం యథా వేణీ నో భయో రంతరం మనాక్.

(శివపురాణము)

శివనామము, విభూతి, రుద్రాక్ష యీ మూఁడును త్రివేణీ తుల్యము లని చెప్పఁబడినవి. ఈ మూఁడును నిత్య మెవ్వని శరీరమున నుండునో వాని దర్శనమాత్రమున సర్వపాపములు నశించును. శివనామ, రుద్రాక్ష, భస్మధారుల దర్శనమునకును త్రివేణీసంగమ సందర్శనమునకును భేదము లేదు.

శ్లో॥ శైవం నామ యథా గంగా విభూతి ర్యమునా మతా
రుద్రాక్షం విధినా ప్రోక్తా సర్వపాప వినాశినీ
శరీరే చ త్రయం యస్య తత్ఫలం చైకతః స్థితమ్
ఏకతో వేణికాయా శ్చస్నానజం తు ఫలం బుధైః ॥

(శివపురాణము)

శివనామము గంగానది. విభూతి యమునానది, రుద్రాక్ష సర్వపాపహరక్షమ యగు సరస్వతీనది యని బ్రహ్మ చెప్పెను. ఎవ్వని శరీరములో నీ మూఁడు నున్నవో వానిఫలము నొక వైపునను దిృవేణీస్నాన ఫలము నొకవైపున నుంచి తూఁచఁగా సమానము లైనవి. అందుచే బుద్ధిమంతు లీ మూఁటిని నిత్యము ధరింతురు. శివనా మోచ్చారణ మాత్రముచే బ్రహ్మహత్యాది పంచమహాపాతకములును ననేకజన్మార్జితపాపములును నశించి సంసారమునుండి తరణము లభించును.

# విభూతి మాహాత్మ్యము.

శ్లో॥ త్రిపుండ్రం కురుతే యస్తు భస్మనా విధిపూర్వకమ్
మహాపాతకసంఘాతై ర్ముచ్యతే చోపపాతకైః ॥

(శివపురాణము)

విధివిహితముగా నెవ్వఁడు త్రిపుండ్రధారణముఁ జేయునో వాఁడు మహాపాత కోపపాతకములనుండి విడువఁబడును.

శ్లో॥ మధ్య మానామి కాంగుళ్యో ర్మధ్యే తు ప్రతిలోమతః
అంగుష్ఠేన కృతా రేఖా త్రిపుండ్రే త్యభిధీయతే ॥

(స్కాందపురాణము)

కుడిచేతి మధ్యమ, అనామి కాంగుళులచే నెడమవైపు నుండి కుడివైపునకు లలాటమున భస్మమును రేఖలుగాఁ బెట్టుకొని యంగుష్ఠముచేఁ బై రేఖల మధ్యను గుడివైపునుండి యెడమ ప్రక్కకు మూఁడవరేఖగా ధరించుటయే త్రిపుండ్ర మనఁబడును.

"భస్మనా సజలే నైవ ధారయేచ్చ త్రిపుండ్రకమ్" భస్మము నీటితోఁ దడిపియే త్రిపుంఁడ్రకముగా ధరింపవలయును.

భస్మస్నాన మొనరింపఁగా నెన్ని రేణువులు దేహమం దుండునో యన్ని శివలింగములు ధరించినవాఁ డగును. ఉద్ధూళనము త్రిపుంఁడ్రధారణము చేసినసంసారమునుండిముక్తిఁగాంచును.

సీ. ముఖధారణంబున ముఖపాతకంబును
గంఠపాతకమును గంఠధృతిని
బాహుధారణమున బాహుపాతకము హృ
త్పాతకంబును నురోధారణమున
నాభిస్థలీధారణమున శిశ్నాఘంబు
పాయు పాపము పృష్ఠభాగధృతినిఁ
బార్శ్వదేశ ద్వంద్వభాగ ధారణములఁ
బరపురం ధ్ర్యాశ్లేష పాతకమును

గీ. దగ్ధ మొనరించు భస్మంబు దారువులను
నగ్నిఁబలె దాని కొదవె భస్మాహ్వయంబు
భస్మస్నానము సేయుటను సర్వపాపములను
స్మరణమాత్రి దూరీకృత దురిత మగుట.

క. భస్మమునఁ బండుకొనినను
భస్మంబు నలందికొనిన భస్మముఁ దినినన్
భస్మస్నానము చేసిన
భస్మీభూతంబు లగును బాపము లెల్లన్.

గీ. భూతిని ధరించునొ త్రిపుండ్రములుగ నెవఁడు
వాఁడు నిజముగఁ దాల్చినవాఁడు చూవె
హరి హర బ్రహ్మ మూర్తిత్రియమును. మూఁడు
వీతిహోత్రంబులను. మూఁడు విశ్వములను.

క. పావనులు కాని వారును
బావనులై కర్మమునకుఁ బాత్రి లగుదు రు
ర్వీవర భస్మముచేతన్
గావించిన యెడల స్నానకర్మము మర్త్యుల్.

(ఆంధ్రిపద్మపురాణము)

శ్లో॥ భర్జనా త్సర్వపాపానాం స్మరణా చ్ఛ మహేశితుః
భస్మేతి చ సమాఖ్యాతం తస్య ధారణ ము త్తమమ్ ॥

సర్వపాపములను భ ర్జనము (వేయించుట) చేయునది యగుటను, శివనామస్మరణము గలిగించున దగుటను భస్మ మను పేరు గలిగెను. దాని ధారణ ము త్తమము.

భస్మము సుఖప్రసవజనకము. భూతావేశ నివారకమే కాక నానావిధ విషప్రశమన కారకము, నాయుర్వృద్ధికరమును గూడ నగును.

శ్లో॥ యాని తీర్థాని లోకే ఽస్మి న్గంగాద్యాః సరిత శ్చ యాః
స్నాతో భవతి సర్వత్ర లలాటే తు త్రిపుండ్రకమ్॥
( శివపురాణము )

లలాటమున నెవఁడు త్రిపుండ్రముల ధరించునో వాఁ డీలోకములోఁ గల గంగాది నదులలోను దీర్థము లందును స్నాన మొనరించినవాఁ డగును. అరుంధతీదేవి భస్మమును మృత్యుంజయ మంత్రముచే నభిమంత్రించి మృతవిప్రునిపైఁ జల్లఁగా నాతఁడు మఱల జీవించెను.

దూర్వాసునకు బ్రహ్మహత్యాపాతకము గలుగఁగా శివుఁ డనుగ్రహించిన భస్మధారణము వలన నాతఁడు విగతదోషుఁ డయ్యె నని, ఒక మహాగ్నిజ్వాలచే దగ్ధులైన కశ్యపాది మహ ర్షుల బూడిదగుట్టలపై వీరభద్రుఁడు శైవభస్మమును జల్లఁగా వా రెల్ల రు జీవించి రనియుఁ బద్మపురాణము వెల్లడించినది.

# రుద్రాక్ష మాహాత్మ్యము.

శ్లో॥ దివ్యవర్ష సహస్రాణి చక్షు రున్మీలితం మయా
భూమా వక్షిపుటాభ్యాం తు పతితా జలబిందవః
తత్రాశ్రుబిందవో జాతా మహారుద్రాక్ష వృక్షకాః
స్థావరత్వ మనుప్రాప్య భక్తానుగ్రహ కారణాత్
భక్తానాం ధారణాత్పాపం దివారాత్రికృతగ్ హరేత్
తజ్జపా ల్లభ్యతే పుణ్యం నరో రుద్రాక్ష ధారణాత్
ధాత్రీఫల ప్రమాణం య చ్ఛ్రేష్ఠ మేత దుదాహృతం
బదరీఫల మాత్రం తు మధ్యమం ప్రోచ్యతే బుధైః
అధమం చణమాత్రం స్యా త్ప్రక్రియైషా మయోచ్యతే
రుద్రాక్షధారణా త్సద్య స్సర్వపాపైః ప్రముచ్యతే ॥

(రుద్రాక్ష జాబాలోపనిషత్)

రుద్రుఁడు తపోనిష్ఠలో నుండఁగా వాని యిచ్ఛచే నానందాశ్రువులు రాలి నేలపై వృక్షము లైనవి. రుద్రుని యక్షులనుండి జనించిన వృక్ష మగుట రుద్రాక్షమైనది. రుద్రాక్షధారణము సకల పాపహరము, పరమపవిత్రమును.

గీ. దర్శనంబున నఖిల పాతకము లడఁచు
స్పర్శమున స్వర్గలోకంబు సంఘటించు
ధారణంబున ముక్తి చేకూరఁజేయు
వలవి యగునె రుద్రాక్ష మహత్త్వ మెన్న.

గీ. మంత్రజపమును రుద్రాక్షమాల చేతఁ
జేయునెడ లెక్కపెట్టుచు సిద్ధి గలుగు
నిష్ఫలం బగు జపము గణింపకుండఁ
జలుపఁబడెనేని యని బ్రహ్మ తెలిపె మున్ను.

గీ. చల్లుకొనెనేని రుద్రాక్షజల మొకింత
మూర్ధమున సర్వపాప నిర్ముక్తుఁ డగుచుఁ
బడసి యక్షయ పుణ్యంబుఁ బడయరాని
యూర్ధ్వలోక నివాసంబు నొందు వాఁడు.

(ఆంధ్ర పద్మపురాణము)

త్రిపుండ్రధారణముఁ జేసి రుద్రాక్షల ధరించి మృత్యుంజయ జపముఁ జేయువారి దర్శనమాత్రమున రుద్రదర్శనఫలము కలుగును విష్ణువు, బ్రహ్మ, దేవతలు, మహర్షులు రుద్రాక్ష మాలాధరులే.

సీ. మూర్ధంబునను భుజంబులను వక్షంబునఁ
దాల్చి రుద్రాక్షలు ధరణిసురుఁడు
సంచరించునొ యెందు సర్వోత్తమంబైన
తీర్థమై యుండు నా దేశ మెల్ల
వాని దర్శించినవారి పాపము లెల్ల
దగ్ధంబు లైపోవుఁ దత్క్షణంబు
తాలిచి రుద్రాక్షమాలను జేసిన
స్నానంబు జపమును దానములును

గీ. స్తవమును సురార్చనమును బ్రదక్షిణమును
బుణ్యకార్యంబు లన్నియుఁ బొందు శీఘ్ర
సిద్ధి వద్దానఁ దాల్తురు సిద్ధికాము
లైన పుణ్యాత్ము లెల్ల రుద్రాక్షమాల.

రుద్రాక్షమాలచేఁ జేసిన మంత్రజపము పుణ్యప్రదమును గోటిగుణితము నగును. రుద్రాక్ష లేకముఖి మొదలు చతుర్దశముఖి పర్యంతముండును. ఏకముఖి శివస్వరూపము, భుక్తిముక్తిప్రదము, లక్ష్మీనివాస మైనది. దర్శనముచే మహాపాతకములు హరించును. ద్విముఖి సర్వకామ్యప్రదము. త్రిముఖి సకలవిద్యాప్రదాయిని. చతుర్ముఖి బ్రహ్మస్వరూపము. నరసంహారదోష హరము. ఇటుల చతుర్దశముఖిపర్యంతమును రుద్రాక్ష దివ్యఫలప్రద మైనది.



# సుధర్మ తారకుల వృత్తాంతము.

మహా మహిమాన్విత మగు రుద్రాక్షధారణ ఫలమును వివ రించు స్కాందపురాణాఖ్యానము నాలింపుఁడు. ఇయ్యది వినిన మాత్రమునను జదివినమాత్రను మహాపాపములను హరింపఁ జేయునని స్కాందము ప్రమాణీకరించినది.

కాశ్మీరదేశాధిపతి చంద్రసేనుఁడు. అతని కుమారుఁడు సుధర్ముఁ డనువాఁడు బుద్ధిబల దేహబలములు గలవాఁడు. ఈతనికి మంత్రి కుమారుఁడు గుణవంతుఁడు నగు తారకునితో బద్ధసఖ్యము. వా రిర్వురునుస్నిగ్ధసుకుమారులు, సుందరతరశరీరులును. ఉభయులు నాటపాటలలో విద్యావినోదములలోఁ గలిసిమెలిసి తిరుగుచున్నారు. చిన్నతనమునుండియు నా బాలు రిర్వురును సర్వావయవము లందునుభస్మమును బూసికొని స్వర్ణరత్నా ద్యాభరణములఁ బరిత్య జించి రుద్రాక్షమాలికలనే కంకణములుగాఁగేయూరములుగాఁగుండ లములుగా హారములుగా నలంకరించుకొని సంచరింపఁజొచ్చిరి. ఆగర్భశ్రీమంతు లయ్యు నెంద రెంతగాఁ జెప్పినను రత్నకాంచ నాదికములఁ బాషాణ లోష్టములుగా నిరాదరించి రుద్రాక్షధార ణాసక్తులై యుండిరి, ఆ బాలుర ప్రవృత్తి యెల్లరకును విచిత్రముగ నుండెడిది. ఇట్లుండఁగా యాదృచ్ఛికముగా నొకనాఁడు సాక్షాత్ బ్రహ్మయో యనునట్లు పరాశరముని యా రాజగృహమున కేతెం చెను. చంద్రసేనుఁడు విధివిధానముగ [illegible]

జేసి త్రికాలవేది యగు నా దివ్యర్షితో నిట్లు పలుకుచున్నాఁడు. "మహర్షీ! ఈ బాలుఁడు నాసుతుఁడు. వాఁడు మంత్రికుమారుఁడు. ఇర్వురకును పరమ మైత్రి యలవడినది. ఇద్దఱును రత్నకాంచ నాభరణము లందు నిస్స్పృహులు, రుద్రాక్షధారణ మహాభిలాషులు. ఎవ్వరి వలనను బోధింపఁబడినవారు గారు. మిక్కిలి పిన్నలు. మే మెంతగాఁ జెప్పినను రత్నాలంకారములను ధరింపకున్నారు. వీరికీ చిత్తవృత్తి యేల కలిగినదో యించుక యెఱిఁగింపుఁడు".

నృపాలుని మాటలు విని పరాశరుఁడు "రాజా! విస్మయా వహ మగు నీకుమారుల చరిత్రమును వివరింతును వినుము.

నంది గ్రామమున మహానంద యను నొక శృంగారలలితా కృతి, వేశ్య యుండెడిది. మహైశ్వర్యవంతురాలు. ఛత్ర, చామర, యాన, పాదరక్షాదికము లన్నియు స్వర్ణ రత్న సంఘటితములే. చిత్రచీనాంబరములు, పశు, ధాన్య, సౌధ సమృద్ధి, దాస దాసీజన పరివారము, సమస్తాలంకారములు, ధనరత్నరాసులు కలిగివిరాజిల్లు చుండెడిది. రూపజీవికగా స్వేచ్ఛాసంచారమున నున్నది కాని సత్య ధర్మపరాయణయై శివపూజారతయై శివనామజపాసక్తయై శివపాద నమ్రయై బ్రాహ్మణ భక్తయై సంచరించెడిది. ఆ వారవనిత వినోద ముగా నొక మర్కటమును, నొకకుక్కుటమును బెంచుచువానికి రుద్రాక్షమాలలనలంకరించి నాట్యమంటపమునకుఁ దెచ్చి తాళ గీతా దికములచే నా రెంటి నాడించెడిది. రుద్రాక్షమాలికలే కేయూరము లుగను, గర్ణాభరణ కుండలములుగను గట్టఁబడిన యా వానరము

బాలకునివలె నా రూపజీవిక యెదుట నృత్య మొనరింపుచుండఁగా శిఖాగ్రమున రుద్రాక్షమాలికఁ గట్టఁబడిన కోడియుఁ గోతితో సమానముగా నృత్య మొనరించుచుఁ జూపరుల కానందమును మహానందకత్యంత సమ్మదమును గలిగింపుచుండెడిది. చాలకాలము గడచినది.

ఒకనాఁడు శివవ్రతుఁడు, జటి, త్రిపుండ్రరుద్రాక్షమాలాధరుఁడు నగు నొక వైశ్యుఁ డా వేశ్యయింటికి వచ్చెను. స్వచ్ఛమగు భస్మముతోను, మహారత్నసంఘటిత కంకణముతోను దరుణార్కుని వలెఁ బ్రకాశించు నా శివదీక్షాపరు నా గణిక పూజించి మున మందియాతని ముంజేత నున్న కంకణమును దిలకించి యచ్చెరువుపడి "మహాత్మా! దివ్యరత్నమయ మగు నీ కరకంకణము దివ్యస్త్రీ భూష ణోచితముగఁ దోఁచి నా మనస్సు నాకర్షించుచున్నది. నవరత్నాఢ్య మగు నా కరభూషణము నా కొసంగుదురా!" యని సస్పృహయై యర్థించినది. ఆ శైవుఁడు సస్మితముగా సాదరవీక్షణములతో నా వనితను దిలకింపుచు "నీ మనమునఁ గోరిక కల్గినచో రత్నవరదివ్యమగు కంకణమును నీ కిత్తును. దానికిఁ దుల్యమూల్యము నొసంగు" మనఁగా నా వారాంగన పలుకుచున్నది. "మహాప్రియా! వేశ్యలు స్వైరచారిణులు గాని పతివ్రతలు గారు. మా కులాచారధర్మము వ్యభిచారము. రత్నఖచిత కరభూషణమును నా కొసంగినచో దినత్రయ మహోరాత్రములు నీకుఁ బత్నినగుదు" ననఁగా నా శైవుఁడు సమ్మతించి చంద్రసూర్యులే సాక్షులుగా సత్యముగా మూఁడహోరాత్రము లాతనికిఁ బత్నిగా నుందు నని "సహధర్మం చరామి" యని దానిచేఁ

బ్రిమాణమును జేయించుకొని యా రత్నకంకణము నొసంగెను. దానితోపాటు రత్నమయ మగు నొక శివలింగమును గూడ దాని చేత నుంచి "వనితా! యీ శివలింగము నాకుఁ బ్రాణప్రదము. దీనినిగూడ భద్రపఱచుము. దీనికి భంగము గలిగినచో నాకుఁ బ్రాణభంగమే" యని చెప్పెను. అట్లయని దానిని గొని నాట్య రంగస్థలమున భద్రపఱచి యా యంగన లోనికిఁ బోయెను.

నాఁటి రేయి పిటధర్మముగా మృదుతల్పమున మహానంద వైశ్యునితోఁ గ్రీడించి సుఖముగ నిద్రించినది. నడిరేయి నా నాట్యమంటపములో నకస్మాత్తుగా నగ్ని యుదయించి మంటప మంతయు నావరించెను. మంటలు చూచి లేచి వారాంగన చరాలున వచ్చి కోతిని గట్టిన త్రాడు నూడఁదీసెను. దానితోపాటు కోడియు విడువఁబడి యగ్నికణములఁ జిమ్ముకొనుచు భయవిహ్వాలమై దూరముగాఁ బారిపోయెను. ఆ మంటప మంతయు నగ్ని కాహుతియై స్తంభములతోపాటు రత్నమయమగు శివలింగమును బెటిలి శకలము లై పోయెను. దానినిఁ జూచి శైవుఁడును వారవనితయు మిక్కిలి దుఃఖించినారు. ప్రాణమయలింగము దగ్ధ మగుటచేఁ గడు నిర్వేవపడిన వైశ్యుఁడు ప్రాణత్యాగసంసిద్ధుఁ డయ్యెను. దృఢనిశ్చయుఁ డైన యా శివవ్రతుని యానతి ననుసరించి మహానంద తన భృత్యులచేతఁ బురబహిః ప్రదేశమునఁ జితి నేర్పరుపఁజేసినది. ఆ వైశ్యుఁడు శివధ్యాననిశ్చలుఁడై యగ్నికిఁ బ్రదక్షిణించి పురజను లెల్లరును జూచుచుండఁగా ధీరుఁడై యగ్నిలో దుమికెను. వారయువతియు మిక్కిలి పరితపించినది.

దాని కంతలో నొక ధర్మసూక్ష్మము గోచరించినది. బంధుజనుల నందఱను జూచి తన నిశ్చయము నిట్లువెల్లడించినది.

"నేనీ శివదీక్షపరునితో దినత్రియము పత్నిగా నుందు నని ప్రమాణీకరించి రత్నకంకణమును గ్రహించితిని. ఆ మూఁడు దినములు గడవకుండఁగనే నా కర్మవలన నిట్టి దుస్సంఘటన మేర్పడి యీతఁడును మరణించెను. సహధర్మచారిణిగా నుందు నన్న మాటచొప్పున నేను నీతని ననుసరించి తీరవలయును. సత్యము నాచరింపక తప్పదు. సత్యము వలననే మురజిల్లోకప్రభు వులగు దేవతలు సంతసింతురు. "సత్యే సర్వం ప్రతిష్ఠితం" అని వేదము. సత్యవర్తనమే పరమ ధర్మము. సత్యమువలననే స్వర్గ మోక్షములు గలుగుచున్నవి. సత్యముకంటె నన్య మగు నుత్తమ గతి లేదు. కావున సత్యము ననుసరించి నేను నీ శైవునివెంట నగ్నిలోఁ బ్రవేశించి మరణింతును."

ఆమె మనోనిశ్చయమును విని బంధుజను లెంతయో వారింప యత్నించిన నామె వినలేదు. ప్రాణములు విడుచుటకే సిద్ధమైనది. తన సర్వస్వమును విప్రులకు దానము గావించినది. సదాశివుని ధ్యానించినది. అగ్నికి మమ్మాఱు ప్రదక్షిణ మాచ రించి వహ్నిప్రవేశమునకు సిద్ధముగా నున్నంతలో విశ్వాత్మకుఁ డగు మహేశ్వరుఁ డామె నిశ్చలభక్తికి సంతసించి ప్రత్యక్షమై యామె నగ్నిని బడకుండ వారించెను. దేవదేవుఁడు త్రిలోచ నుఁడు చంద్రకలావతంసుఁడు శశాంకసూర్యాగ్నికోటిప్రకాశమా

సుఁడు నగు పరమేశ్వరుని దర్శించి వేశ్య భయము నంది కొయ్యబారినదై నిలిచిపోయెను. వెలవెలఁ బోవుచు భయవిహ్వలయై కంపించుచుఁ గన్నీరు విడుచుచు నమస్కరించు నా రూప జీవికాహస్తమును గ్రహించి శివుఁ డిట్లు నుడివెను.

"వత్సా! మహాభాగా! నీ సత్యధర్మమునకు నిశ్చలశివ భక్తికిఁ బ్రీతి నందితిని. నీ భక్తినిఁ బరీక్షించుట కీశ్వరభక్తుఁడనై వచ్చితిని. నా మాయచేతనే మంటపమున నగ్నిపుట్టినది. నేనే సర్వమును దగ్ధ మొనరింపఁజేసి శివలింగమును గాల్చి యగ్నిలోఁ బ్రాణపరిత్యాగ మొనరించితిని. భోగకాంతలు సాధారణముగ వ్యాజభాషణలు, జనవంచకులు, స్వేచ్ఛావర్తనలు గానుందురు. నీ వటుకాక సత్యవ్రతవై యగ్నిప్రవేశ సంసిద్ధవైతివి. కావున నీకు దేవతలు పొందలేని భోగము లనుగ్రహింతును. చిరకా లాయుర్దాయము, సంతానము, నారోగ్యము మున్నగున వేవి కావలయునో కోరు మిచ్చెద" ననెను.

్రయు "మహేశా! నా కైహిక భోగములందుఁ గాని యాముష్మిక భోగము లందుఁ గాని యభిలాష లేదు. నీ చరణారవింద సమాశ్రియము దక్క నన్యమక్కఱలేదు. నా యీ బంధుమిత్రులు, పరివారజనులు నీయందు లగ్నచిత్తులై నీ దర్శనము నకై వేచియున్నారు. వీరలనందఱను నాతోపాటు నీ పరమపదమును జేర్పుము. పునర్జన్మరాహిత్యము ననుగ్రహింపుము" అనెను. మహేశ్వరుఁ డటులే యనుగ్రహించెను.

నాట్యమంటప దాహకాలమునఁ దప్పించుకొన్న మర్కట కుక్కుటములు పాఱిపోయి యరణ్యములఁ దిరిగి తిరిగి కాల క్రమమున నిధనము నందినవి. ఆ కోఁతియే నీ కుమారుఁడుగను, కోడి మంత్రిపుత్రుఁడుగను, జనియించినవి. గతజన్మమున రుద్రాక్షమాలికా ధారణయోగ్యత వలననే యిట్టి యుత్తమజన్మ ములు వీరికిఁ గలిగినవి. ప్రాక్తనజన్మవాసనా ఫలముననే వారీ జన్మములోఁగూడ రుద్రాక్షల ధరింపుచున్నారు. వీరింకను శివా రాధనము నొనరించి సద్గురువు నాశ్రయించి యుపదేశము నంది శివలోకమును జెందుదురు."

అని పరాశరుఁడు చెప్పి యా నరపాలు నానందపఱచెను.



# శివారాధన

పూర్వ జన్మములలో నీశ్వరారాధన మెవరు కావించి యుందురో వారికే యీ జన్మమునఁ బరమేశ్వ రార్చనాభిలాష కలుగును. ఐశ్వర్యము, యశస్సు, భోగము మున్నగునవి కలిగిన చో నవి గతజన్మములోని శివార్చనా ఫలములే. పుత్రపౌత్రాదులు, భోగభాగ్యములు, సుఖసంపదలు గావలె నన్నవారు శివారాధన మొనరింపవలెను. అతఁడే ముక్తిప్రదాత.

అతనిని శంఖ ద్రోణార్క కరవీ రాది పుష్పములచేతను, దులసీ బిల్వాది దళములతోడను బూజింపవలయును. భూతేశునకు బిల్వదళములన్నఁ బరమప్రీతి.

గీ. పద్మములు బిల్వదళ శతపత్ర శంఖ
సుమము లొక లక్షచేతఁ బశుపతిలింగ
మర్చనము సేయఁ బాపంబు లస్తమించు
భాగ్యములు పట్టు సందియం పడగఁ జనదు.

గీ. లక్ష బిల్వార్చనంబు మహోత్సరథున
కెవఁడు సేయునో యవ్వాని కీప్సితంబు
లన్ని గూర్చి ముక్తి నంత్యమున నిచ్చు
జమ్మిదళముల పూజ మోక్షమ్ము సేయు.

(ఆంధ్ర శివపురాణము)

సీ. ఆరోగ్యమున కెవ్వ రభిలషింతురొ వారు
శివుని బిల్వములఁ బూజింపవలయు
నాయుష్యమున కెవ్వ రభిలషింతురొ వారు
భవు బిల్వముల భజింపంగ వలయు
నైశ్వర్యమున కెవ్వ రభిలషింతురొ వారు
మృడు బిల్వముల యజియింప వలయు
నాధిక్యమున కెవ్వ రభిలషింతురొ వారు
భర్గు బిల్వములఁ బూన్పంగ వలయు

తే. వలయునా ? సంతు వలయు బిల్వదళపూజ
వలయునా ? కీ ర్తి వలయు బిల్వదళపూజ
వలయునా ? విద్య వలయు బిల్వదళపూజ
వలయునా ? ము క్తి వలయు బిల్వదళపూజ.

(శ్రీ మదాంధ్రస్కాందము)

బిల్వార్చనా వైశిష్ట్యము మహాన్యాసములోని యీ క్రింది శ్లోకములలో స్పష్టము.

శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రం చ త్రిధాయుధమ్
త్రిజన్మపాప సంహార మేకబిల్వం శివార్పణమ్॥
త్రిశాఖైః బిల్వపత్రైశ్చ అచ్ఛిద్రైః కోమలైః శుభైః
తవ పూజాం కరిష్యామి ఏకబిల్వం శివార్పణమ్॥
సర్వ త్రైలోక్యకర్తారం సర్వ త్రైలోక్యపాలనమ్
సర్వ త్రైలోక్యహర్తార మేకబిల్వం శివార్పణమ్॥
దశకర్ణం లలాటాక్షం పంచవక్త్రం సదాశివమ్
అశేష పాపసంహార మేకబిల్వం శివార్పణమ్॥

ఘోరపాతక దావాగ్నిం జన్మ కర్మ వివర్జితమ్
కపాలమాలాభరణ మేకబిల్వం శివార్పణమ్॥
మాఘ కృష్ణ చతుర్దశ్యాం పూజార్థం చ జగద్గురోః
దుర్లభం సర్వదేవానా మేకబిల్వం శివార్పణమ్॥
తత్రాపి దుర్లభం మన్యే నభో మా సేందువాసరే
ప్రదోషకాలే పూజాం చ ఏకబిల్వం శివార్పణమ్॥
సాలగ్రామేషు విప్రాణాం తటాక శత కూపయోః
కోటికన్యా మహాదాన మేకబిల్వం శివార్పణమ్॥
దర్శనం బిల్వవృక్షస్య స్పర్శనం పాపనాశనమ్
అఘోరపాప సంహార మేకబిల్వం శివార్పణమ్॥
సాలంకృతా శతా వృత్తా కన్యా కోటిసహస్రకమ్
సామ్రాజ్య పృథ్వీదానం చ ఏకబిల్వం శివార్పణమ్॥
కాశీక్షేత్ర నివాసం చ కాలభైరవ దర్శనమ్
అఘోరపాపసంహార మేకబిల్వం శివార్పణమ్॥

తండులారోపణముచేత లక్ష్మీవృద్ధియగును. తండులములు తొమ్మిది ప్రస్థములపై రెండుపలము లైనచో నొక లక్ష ప్రమాణ మగును. శివలింగమును బూజించి శుభ్ర వస్త్రము నొకదానిని లింగముపై నుంచి లక్షాక్షతతండులంబుల నర్పించి సుగంధ సుమ ధూపదీప నైవేద్యాదికము లొసంగి పన్నిద్దఱు బ్రాహ్మణులకు భోజనము పెట్టి దక్షిణ లిచ్చి యాజ్ఞికునకు యథాశక్తి దక్షిణ నీయవలెను. ఇట్లు చేసిన లక్షతండులార్చన మగును. ఇదే విధాన మున లక్షతిలార్చన మొనరించినచో మహాపాతకనాశన మగును. పదునొకండు పలంబు లైనచో తిలలు లక్ష యగును.

సీ. కుశలఁ బూజించినఁ గూర్చుదీర్ఘాయువు
        నున్మత్త సుమ పూజ యొసఁగు సుతుల
    కర మొందు యశము నగస్త్యసుమార్చన
        నర్కపుష్పార్చ శౌర్యం బొసంగు
    ఇందీవరార్చనం బిచ్చు విక్రమమును
        వైరులఁ గెడపు జపాసుమార్చ
    గన్నేరువిరిపూజ గడఁగి రిపులఁ బాపు
        బంధూకపూజ రాఁబట్టు నగల

గీ. జాతిపుష్పార్చ వాహన సంపద నిడు
    మల్లియలపూజ యొసఁగు రామ యగు సతిని
    మొల్లపూవుల యర్చన భోగ మిచ్చు
    నవిసెపూ పూజ శంభుసఖ్యంబుఁ గూర్చు.

గీ. నువ్వు పువ్వుల యర్చన జవ్వన మిడు
    తుమ్మిపువ్వుల పూజ మోక్షమ్ము నిచ్చు
    నందివర్ధనసుమ పూజ యంద మొసఁగు
    నల కురంటకకుసుమార్చ గలిమిఁ గూర్చు.

(ఆంధ్ర శివపురాణము)



# అభిషేకప్రియః శివః

క. ఘృతధారల నభిషేకము
సుతవృద్ధినిఁ గోరి సేయ శుభ్రాంశుధరుం
డతుల కరుణాత్ముఁడై యిడు
సుతులను దేజోమహితుల శుభగుణయుతులన్.

సీ. దుగ్ధాభిషేకంబు దుఃఖంబుఁ బోఁజిమ్ము
చక్కెరఁజేర్ప విస్తరిలుఁ బ్రజ్ఞ
తైలసేకంబు నిర్మూలించుఁ బగతుర
నత్తరు వర్షింప నమరు భోగ
మావనూనియసేక మరిమర్దనము చేయుఁ
దేనెతో స్నపియింప నీనుఁ గల్మి
ఇక్షురసపుసేక మొసఁగించు మోదంబు
గంగాంబుధార మోక్షంబు నిచ్చు

గీ. నయుతమానంబుగా నిట్టు లభవలింగ
మర్థిమై రుద్రపాఠ పారాయణంబు
లమర నభిషేక మొనరించి యట్లు రుద్ర
సంఖ్యతో బాఁపలకు జగ్ధి సల్పవలయు

(ఆంధ్ర శివపురాణము.)

ఈ యభిషేకములలో ధారాభిషేక ముత్తమ మని స్కాందపురాణ ప్రమాణము.

శ్లో॥ అవిచ్ఛిన్నా తు యా ధారా ముక్తిధా రేతి కీర్తితా
తయా సంస్నాపయే ద్దేవం జపన్ రుద్రం శివాత్మకమ్

ఏకవారం త్రివారం వా పంచ సప్త నవాపి వా
ఏకాదశ మథా వృత్యా చమ కైకాద శాన్వితం
ముక్తిస్నాన మిదం ప్రోక్తం తస్మా న్మోక్షప్రదాయకం॥
(స్కాందపురాణము)

ఎడతెగని ధారగా పోయుటయే ధారాభిషేకము. దానికే ముక్తిధార యని పేరు. అవిచ్ఛిన్న ధారాభిషేకముఁ జేయుచు నమకమును బారాయణ మొనరింపవలెను. అట్లొక పర్యాయము గాని మూఁడుమార్లుగాని యైదుసార్లుగాని సప్తవారములుగాని తొమ్మిదితడవలుగాని రుద్రపారాయణముతో నభిషేకము చేయ వచ్చును. లేదా నమకచమకములను జెప్పుచుఁ బదునొకండు పర్యాయములు ధారాభిషేక మొనరించిన మోక్షము గలుగును. దీనికే ముక్తిస్నాన మనిపేరు.

మానవప్రతిష్ఠిత లింగమునకుఁ బదినేరులతోను, ఋషి ప్రతిష్ఠితమునకు నూఱుసేర్లతోను, స్వయంభువులకు వేయిసేర్ల తోను క్షీరాభిషేకము చేయవలెను. అభిషేకమును గవయవిషా ణముతోఁగాని, దక్షిణావర్తశంఖముతోఁగాని చేయు టుత్తమము.

అభిషే కానంతరము యక్షకర్దమానులేపన మాచరింప వలెను.

శ్లో॥ కస్తూరికాయా ద్వౌ భాగౌ ద్వౌభాగౌ కుంకుమస్య చ
చందనస్య త్రయోభాగా శ్శశిన శ్చైక ఏవ హి
యక్షకర్దమ ఇత్యేష స్సమస్త సురవల్లభః॥

ఇంటిలో నర్చింపఁబడు లింగమునకు పావు సేరుబియ్యము తోను, మానవప్రతిష్ఠితలింగమునకు సేరుబియ్యముతోను, దేవ స్థాపితమునకు మూఁడు సేర్లతోను, మహర్షిప్రతిష్ఠిత లింగమునకు నాల్గుసేర్లతోను, స్వయంభూలింగమునకయిదు సేర్లతోను నన్నము నివేదనముఁ జేయవలెను.

శివాలయములో నున్న వాపీ కూప తటా కాదికముల లోని జలము గంగాజల తుల్యమే.

శివాలయములలోఁ జండీప్రతిష్ఠ కలచోటఁ జండీప్రదక్షిణ మాచరణీయము. దివ్యక్షేత్రములలోఁ జండీప్రదక్షిణ మక్కఱలేదు.

నందీశ్వరుని శృంగముల నొకచేతను, వృషణముల నొక చేతను స్పృశించి యీ క్రింది శ్లోకమును బఠింపుచు శృంగమధ్య ప్రదేశము నుండి శివదర్శనము చేయుచుండు టాచారము.

శ్లో॥ ధర్మ శ్చతుష్పా ద్యజ్ఞ స్త్వం స్వర్ణ శృంగ స్త్రయీ వపుః
గోపతే వాహరూప స్త్వం శూలినః త్వాం నమా మ్యహం.

(స్కాందపురాణము)

ద్వాత్రింశ త్యుపచారములతోఁ గావించు శివపూజన ముత్త మోత్తమము.

శివపూజనమునఁ గపిలాఘృతదీపము గాని కేవలగోఘృత దీపముగాని యుపయోగింపవలెను.

# పార్థివలింగార్చన

ఈశ్వరలింగమును మట్టితోఁజేసి యర్చించుటయే పార్థివ లింగార్చనము. బ్రాహ్మణుఁడై యుండి పార్థివలింగము నెవ్వఁడు పూజింపఁడో వాఁడు యమలోకమున కేఁగును. లింగము పాన వట్టము గలిపి యఖండరూపముగాఁ బార్థివలింగమును నిర్మింప వలెను. రెండును వేఱు వేఱుగాఁ జేసి యతుకరాదు. అట్లు చేయుట ఖండరూప మగును. అఖండ పార్థివలింగార్చనము కలి యుగములో నత్యంత ఫలప్రదము. ఖండలింగార్చనము హాని కరము. పానవట్టము పార్వతీరూపము, లింగ మీశ్వరస్వరూపము. ఉభయు లేకాకారులు గాన నఖండముగఁ బూజింపవలెను.

శ్లో॥ అఖండం తద్ధి కర్తవ్యం నవిఖండం ప్రకారయేత్
విఖండం తు ప్రకుర్వాణో నైవ పూజాఫలం లభేత్॥

(శివపురాణము)

ఒకప్పుడు తన హస్తమందున్న శివలింగమునకుఁ బీఠము లేకపోఁగా హనుమంతుఁడు విచారించి పానవట్టము లేని శివలింగము నకుఁ బూజచేయరాదనియు శివారాధన మొనరింపనిదే శివభక్తుఁడు జీవింపరా దనియుఁ జింతించి మరణోద్యుక్తుఁడై శివసాక్షాత్కృతి నంది తన శివలింగమునకుఁ బానవట్టమును బడసె నని పద్మ పురాణము తెల్పుచున్నది. అఖండ పార్థివలింగార్చన మన్నికోరిక లను నెఱవేర్చును. దేవత లందఱిలో శివుఁ డెట్లు శ్రేష్ఠుఁడో

నదులలో గంగ యెట్లుత్తమమో, పట్టణములలోఁ గాశి యెట్లు విశిష్టమో యటులే లింగములలోఁ బార్థివలింగము శ్రేష్ఠము. పార్థివ లింగమును శ్రద్ధాభక్తులతోఁ గొంతకాలము పూజించినవాఁడు శివలోకమున కేఁగును. భస్మమును, త్రిపుండ్రముల ధరించి. రుద్రాక్షలు ధరించి, బిల్వదళములతో నర్చించవలెను. ఇవి లేకుండఁ బార్థివలింగపూజఁ జేయరాదు.

శ్లో॥ సా జిహ్వా యా శివం స్తౌతి త న్మనో ధ్యాయ తీశ్వరం
తౌ కర్ణౌ త త్కథాలోకౌ తౌ హస్తౌ తస్య పూజకౌ
తే నేత్రే పశ్యతః పూజాం త చ్ఛిరః ప్రణతే శివే
తౌ పాదౌ యౌ శివక్షేత్రం భక్త్యా పర్యటత స్సదా॥

(బ్రహ్మోత్తర ఖండము.)

శివుని స్తోత్ర మొనరించునదే నాలుక. శివధ్యాన మొనరించునదే మనస్సు. శివకథాశ్రవణాభిరతి గలవే చెవులు. ఆతని పూజకొఱ కయినవే హస్తములు. ఈశ్వరపూజను జూచునవే నేత్రములు. ఆతనికి నమస్కరించునదే శిరస్సు. శివక్షేత్రములకు భక్తితో వెడలునవే పాదములు.

## ఇక్ష్వాకుని కథ

శివారాధన విశిష్టతను బద్మపురాణ మీయాఖ్యానమున వెల్లడించుచున్నది.

ఇక్ష్వాకుఁడు వేదవేత్తయు ధనవంతుఁడు నగు విప్రుఁడు. తాను నేర్చిన విద్య నింకొకరికిఁ జెప్పుట గాని దానధర్మము లొనరించుట గాని జీవితకాలములో నెన్నఁడును నెఱుఁగఁడు. మరణానంతర మాతనిని నరకమునకుఁ గొనిపోయి దండధరుని మ్రోల నిలిపిరి యమకింకరులు.

ఆ. అప్పు డతనిఁ జూచి యంతకుఁడు విమూఢ !
జనన మొంది యగ్రజాతియందుఁ
జదువుకొనియు విద్య తుద కంతయును బాడు
చేసికొంటి వకట చేతులార !

క. తెలియనివాఁ డయినయెడన్
దెలియం దనవచ్చుఁ గాక తెలిసియు నీకున్
ఫలమేమి గలిగె నింతకుఁ
దలవ్రాసిన వ్రాఁత నెవఁడు తలఁగన్ ద్రోయున్.

ఆ. ఏల వేయిమాట లికఁ జెప్పెదను విను
నీవు చేసినట్టి నేరములకు
ననుభవింపవలయు యమయాతనలు కోటి
వత్సరములు వాఁగ వాఁడు జదిసి.

గీ. స్వామి తెలిసియు ధర్మముల్ సలుపనైతి
నమ్మకము లేమి వేదశాస్త్రమ్ములందు
నిప్పుడవి చెప్పినవి యెల్లఁ దప్పదనుచుఁ
జిత్తమున కెక్క నమ్మక చెడితి నేను

ఆ. నిష్ఠురంబు లైన నిరయయాతనలను
ననుభవింపఁజాల నక్కటకట
ధర్మరాజ నీవు ధర్మాత్ముఁడవు చెప్పు
గతియె లేదె యింతకంటె నాకు.

(ఆంధ్ర పద్మపురాణము)

అని పితృపతి పాదములపైఁ బడి ప్రార్థింప నాతఁడు "నీ కింకను గొలఁదికాల మాయు వున్నది. నీ జీవితకాల మంతయుఁ బాతకములే యొనర్చితివి గాన నీ శేష కాలములో నైనను సుకృత మాచరించి స్వర్గప్రాప్తి యగునటులు చేసికొను" మని బోధించెను. భూలోకమునకు వెడలు మనెను. వాఁడును వైవస్వతునకు వందన మాచరించి మఱలి వచ్చి తన శరీరములోఁ బ్రవేశించెను. పూర్వస్మృతి యున్నందున జాబాలిమహర్షి యొద్ద కేఁగి సాష్టాంగప్రణామముఁ జేసి వినయముతో "మహాత్మా! నేను మిక్కిలి పాపాత్ముఁడను. కృతాంతపురి కరిగి మఱలి వచ్చితిని. నా కింక కొలఁదియాయువు మాత్ర మున్నది. ఈ కొలఁది కాలములో నా యఘము లన్నియుఁ దొలఁగి యమోఘ సుకృత మబ్బి నిర్వాణపద మందఁగల్గుట కేదేని ధర్మసూక్ష్మ మున్న తెలపీయుఁ" దని యరింపఁగా నా మౌని యిటు లుపదేశించెను.

క. ఒనరించిన శివలింగా
ర్చనమును నొక గడియయైనఁ జాలును దృణరా
నగ్నికణము దహియిం
చిన విధమునఁ గాల్చునది యశేషాఘములన్.

(ఆంధ్ర పద్మపురాణము)

కావున నీశ్వ రారాధనకంటె శీఘ్రశ్రేయము నొసంగు సాధనము లేదు. నీ వాతని నర్చించుకొనుము,

ఇక్ష్వాకుఁడటులే పరమేశ్వరార్చన మొనరించుకొని కొలఁది దివసములకు మృతి నొందఁగా శివదూత లాతనిని గైలాసమునకుఁ గొంపోయినారు. శివుఁ డాతనిని దనగణములలోఁ జేర్చి కొనెను.

శీఘ్రముగఁ దరించుట కుత్తమసాధనము శివారాధనమే ;

శ్లో॥ యేఽర్చయంతి మహాదేవం విజ్ఞేయాస్తే మహేశ్వరాః
జ్ఞానే నాత్మసహాయేన వార్చితో భగవాన్ శివః॥

(శివపురాణము)

దుర్లభ మగు మనుష్యజన్మము నందినందులకు మృత్యుంజయునిఁ బూజఁ జేసినచో జన్మ సార్థక మగును. భక్తపరాయణులై యీశ్వరునిఁ జిత్తమున నుంచుకొని శివనామమును జపించువారలకు దుఃఖము లుండవు. ఇహమున భోగభాగ్యములతో సుఖించి పరమున శాశ్వతసౌఖ్యమును బడయుదురు

సౌభాగ్యము, కాంతి, సత్యస్వభావము, త్యాగము, శౌర్యము, విజయము, యశస్సు మొదలగు న వన్నియు శివార్చనాలభ్యములే. అందువలననే సర్వవ్యాపారములఁ ద్యజించి యేకాగ్రచిత్తముతో సర్వేశ్వరు నర్చించుకొనవలయును.

శ్లో॥ త్వరితం వ్యాధి రప్యేతి తస్మాత్ పూజ్యః పినాకధృక్
యావ న్నయాతి మరణం యావ న్నాక్రమతే జరా
యావ న్నేంద్రియవైకల్యం తావ త్పూజయ శంకరమ్
న శివార్చనతుల్యోఽస్తి ధర్మోఽన్యో భువనత్రయే॥

(శివపురాణము)

శరీరము త్వరలో నశించును. యౌవనమును గతించిపోవును. వ్యాధులు తొందరలో వచ్చును. అందుచేఁ బినాకపాణిని దొందరగాఁ బూజింపవలెను. మరణ మాసన్నము గాకపూర్వమే యింద్రియపటుత్వము తగ్గకుండఁగనే శివపూజఁ జేసికొనవలెను. ముల్లోకములలోను శివార్చనకుఁ దుల్యమైన ధర్మము లేదు.

శ్లో॥ పుణ్యాతిశయ సంయుక్తం సర్వైర్దేవై రనుష్ఠితమ్
బ్రహ్మణా విష్ణునా చైవ రుద్రేణ చ విశేషతః
ఇంద్రాది లోకపాలైశ్చ సూర్యాద్యై ర్నవభిర్గ్రహైః
విశ్వామిత్ర వసిష్ఠాద్యై ర్బ్రహ్మవిద్భి ర్మహర్షిభిః॥

(శివపురాణము)

పుణ్యాతిశయముతోఁ గూడినది, సర్వదేవతలచే ననుష్ఠింపఁబడినది, త్రిమూర్తులచే విశేషముగ నారాధింపఁబడినది,

యిందాద్రిది లోకపాలకులచేతను, సూర్యాది నవగ్రహములచేతను విశ్వామిత్ర వశిష్ఠాది మహర్షులచేతను నాచరింపఁబడినది శివ లింగార్చనము. నంది, భృంగి, దైత్యులు, మహోరగులు, సిద్ధులు యక్షులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, మున్నగువా రెల్లరు శివారాధన మొనర్చి సత్ఫలము లందినవారే. కుబేర కృతా న్తాదు లీశ్వ రార్చనమువలననే దిక్పాలకత్వమును బొందిరి. నార దుఁడును ననసూయయు శివారాధన మొనరించి యుత్తమఫలము నొందినారు.

# నా ర దు ని శి వా రా ధ న ము

నారదుఁడు తుహినాద్రిపై శంకరునిగూర్చి తప మొనరించు చుండఁగా నింద్రపదవిని గాంక్షించియై యుండు నని తలంచి మఘవుఁడు మన్మథుని రావించి యాతని తపోవిఘ్న మొనరింప నాదేశించెను. సపరివారుఁడై వెడలి సుమశరుఁ డెంత యత్నించి నను నారదమహర్షి యీశ్వరానుగ్రహము వలన నచంచలుఁడై యుండెను. కందర్పుఁడు విగతదర్పుఁడై మహేంద్రునితోఁ దన యశక్తతను విన్నవించుకొనెను. స్మర పరాభవముతో నారదుఁడు తన తపము సిద్ధి నొందిన దనియు, గాముని జయిం చిన నా యంతటివాఁడులేఁ డనియు నహంకరించి కైలాసమున కరిగి మహాదేవునితోఁ దన తపము సిద్ధిసందిన దని చెప్పికొనెను. ఆతని మాటలలోని యహంకారమును గుర్తించిన కృత్తివాసుఁడు "బాగు బాగు నారదా! నీ వీ మాటమాత్రము నారాయణునితోఁ జెప్పరాదు సుమా" యని హెచ్చరించెను. ఆ మాటను బెడచెవినిఁ బెట్టి యా మహర్షి బ్రహ్మకడ కరిగి మహానందముతో "నేను మదనునిమద మడంచితి" నని చెప్పఁగా నాతఁడు "కుమారా! శివానుగ్రహమున నీ వచంచలుఁడ వైతివి. అది నీ ప్రజ్ఞగా భావింపకు" మని చెప్పెను. అంతట శ్రీమన్నారాయణుని దరి కరిగి నాఁడు నారదుఁడు. "మునీంద్రా! యెచ్చటనుండి రాక!" యని శ్రీహరి ప్రశ్నింపఁగా నారదుఁడు "నేను గాముని జయించితిని. నా సాటి యెవ్వరును గా" రని గర్వముతో బదులు

చెప్పెను. ఆ గర్వమును దొలఁగింపఁ దలంచి శ్రీహరి యాతనిని మఱింత పొగడి పంపి యాతఁడు వెడలు త్రోవలో నొక మనోహర నగరమును సృజించెను. ఆ నగరమును శీలనిధి యనురాజు పాలించుచున్నాఁడు. అతని పుత్రిక శ్రీమతి. మహాసౌందర్యవతి. ఆమెకు స్వయంవరము జరుగఁబోవుచున్నది. సకలదేశ రాజకుమారులు తమతమ వైభవాడంబరములతో వచ్చుచున్నారు. ఈ వర్తమానము నెఱింగి నారదుఁ డా శీలనిధి యింటి కరుగఁగా నాతఁ డుచితమర్యాద లొనరించి తన పుత్రికచే నాతనికి నమస్కరింపఁజేసి "దేవమునీ! ఈ శ్రీమతి నా సుత. ఈమెకు స్వయంవరము జరుగనున్నది. ఏశుభాకారుఁడు వరుఁడు గానున్నాఁడో తెల్పుఁ" డనినాఁడు. ఆమెను జూచిన నారదమునికిఁ గామోపభోగవాంఛ పెల్లుబికినది. ఆ కన్యను దానే గ్రహింపవలె నను గాఢాభిలాష కలిగిన దా మునికి. లోనఁ దనకోరికను దాఁచి రాజుతో "నీమె మిక్కిలి యదృష్టవంతురాలు. సర్వ శుభలక్షణవతి. ఈమెకుఁ గామవిజేత. శివసన్నిభుఁడు. దేవోత్తముఁడు పతి కాఁగలఁ" డని చెప్పి రాజును వీడ్కొని యా శ్రీమతి తన్ను వరించు టెట్లని యోజించి నారదుఁడు మదనోన్మాదమున విచక్షణాశూన్యుఁడై విష్ణు రూపమును బొందినచో నామె వరించు నని భావించి విష్ణునికడ కరిగి తన యభిలాషము నెఱిఁగించి యాతని రూపమును దన కిమ్మని యర్థించెను. నారాయణుఁడు "నీ శ్రేయమును గోరి యుచితరీతిని నా రూప మొసంగుదు"నని చెప్పి నారదుని శ్రీమతీ స్వయంవరమున కనిపెను. విష్ణువు తనరూపము నొసంగినాఁడు

గాని ముఖము మాత్రము మర్కటవదన మొసంగెను. ఆ సంగతి నారదుఁ డెఱుఁగఁడు.

శ్రీహరి కటాక్షించి తన యాకృతి నొసంగె నని పొంగిన మౌని స్వయంవర సభలోఁ గూర్చుండెను. నారదుఁడుగా సభాసదు లందఱకను గనిపించుచున్నాఁడు కాని యాతనితో వచ్చిన శివ గణములోని యిర్వురకు మాత్రి మాతని వానరముఖ నారాయణ స్వరూపము తెలియు చున్నది. ఈతని మూర్ఖ మోహమునకు మిక్కిలి చింతించినారు వారు. శ్రీమతి స్వయంవరమాలికతో వచ్చి సభలోని రాకుమారుల నందఱను దిలకించినది. ఎవ్వరు నామె కిష్టులు కాలేదు. మర్కటముఖ నారాయణరూప నారదునిఁ జూచినది. మిక్కిలి రోసినది. ఆసభలో నెవ్వరు నామెకు నర్హులు కాలేదు. అంతలో రాజవేషమున వచ్చి శ్రీమహావిష్ణువు కూర్చుండ నాతని యథార్థరూపమును గుర్తించి యాతనిని వరించినది. శ్రీమతితో నారాయణుఁ డదృశ్యుఁ డైనాఁడు. అవమానితుఁ డైన నారదుని శివగణజనులు మిక్కిలి నిందించినారు. "ఎంతటి మదనార్తిలోనుంటివయ్యా మునీ! నీ వానరవదనముఁ జూచిన నెట్లు శ్రీమతి వరించు ననుకొంటి" వని గర్హించినారు. దర్పణమునఁ దన ముఖమును దిలకించి కుపితుఁడై యాశివగణములోని వారిని రాక్షసులు గం డవి శపించి తన కీ యవమాన మంతయు విష్ణు మాయచేఁ గలిగె నవి కోపించి వెంటనే వైకుంఠమున కరిగి పరుషోక్తు లాడుచు "వాసుదేవా! యెట్టివేషముతో నన్ను మోస గించితివో యట్టిరూపముతోనే భూలోకమునఁ బుట్టి సతీ వియోగ

దుఃఖ మనుభవించుటయే కాక వానరసహాకార మర్థించెదవు గాక !" యని శపించెను. వాసుదేవుఁడు "నారదా ! నీవు కందర్ప దర్ప మడంచితి నని ప్రగల్భములు పలుకుచున్నావు. అది యీశ్వరానుగ్రహమే కాని నీధీవిశేషము గాదు. సర్వేశ్వరుని సేవించుకొనుము. ఆతఁడు భక్తవశంకరుఁడు. భక్తితో నాతనిని సేవించి నిశ్చలమనస్కుఁడవు గావలెను.

క. పలు జన్మంబులఁ దపసున్
సలిపిననే కాని భక్తి శంకరునియెడన్
గలుగదు కలిగినయేని స
కలదేవుల సరిగ శివునిఁ గనున ట్లమరున్.

క. విను ముని ! యెందును సామ్యము
గననిదియై చపలగుణము గననిదియై వా
సిని మెఱయు శంభుభక్తి భు
విని సర్వార్థంబు లొసఁగు వేడ్కలు మించన్.

క. నుదుటను బూదియు నఱుతన్
రుదురాకలు నాల్కలో విరూపాక్షుని పే
రొందవినచో నవ్వాఁ డఘ
విదళనము నొనర్పఁగలఁడు విజ్ఞవతంసా!

క. ఆపాదమ స్తకము భ
స్మాపాదన మొందు మెప్పు దఖిలాంగములం
దోపిక రుదురక్కలఁ గొను
శ్రీపంచాక్షరజపంబు పేయుము మౌనీ !

క. శివకథలఁ జెప్పు మెప్పుడు
శివకథలను వినుచుమండు శివభక్తులనున్
శివునిన్ గొలచుచు నుండుము
శివతీర్థంబులకుఁ జనుము క్షేమం బొనరున్."

( ఆంధ్రశివపురాణము )

అని బోధింపఁగా నారాయణునకు నమస్కరించి నారదుఁ డాతనియనుజ్ఞను బడసి కాశీక్షేత్రమునకు వెడలెను.

గీ. చేరి మిన్నేటియం దభిషేక మొంది
విశ్వనాథునిఁ దద్దేవి విష్ణుపతినిఁ
గొలిచి భైరవుఁ బూజించి జలజనయను
మాధవుని భజియించి సంబరము మెఱయ.

శా. శ్రీశైలేశు భజించి భ్రామరిని సంసేవించి శ్రీకాళహ
స్తీశున్ దత్సతిఁ బూజచేసి నటనాధీశున్ దదీయప్రియన్
బ్రాశస్త్యంబుగఁ గొల్చి పాండ్యవిభు దారాయుక్తు నర్చించి రా
మేశున్ బర్వతవర్ధనిన్ బ్రియముమై వీక్షించి సేవించియున్.

గీ. ఏకసహకారవిభుని వాగేశుఁ ద్ర్యంబ
కేశు ఘుశ్మేశు నుజ్జయినీశు బ్రిజవ
నాథు శ్రీభీమశంకరనాథు సోమ
నాథుఁ గేదారనాథుఁ దన్నలినదృశలం.

( ఆంధ్రశివపురాణము )

దర్శించి సేవించుకొనెను. ఈ తీర్థ క్షేత్ర సందర్శన సేవనములవలన నారదుఁడు విగతమోహుఁ డయి సర్వ మీశ్వరాను

గ్రహమని తెలిసికొని నిశ్చలమనస్కుఁడై నాఁటినుండి శివ లీలల గాన మొనరించుచున్నాఁడు. అతఁడు నిత్యము వాయించు మహతి యను వీణ పరమేశ్వరునిచే నొసంగఁబడినదియే.

శ్లో. శివేతి నామ దావాగ్నే ర్మహాపాతక పర్వతాః
భస్మీభవ న్త్యనాయాసా త్సత్యం సత్యం న సంశయః
పాపమూలాని దుఃఖాని వివిధా న్యపి తా న్యతః
శివార్చనై కనశ్యాని నా న్యనశ్యాని సర్వధా
స వైదికః స పుణ్యాత్మా స ధన్యః స బుధో మునే
యః సదా కాయ వాక్చిత్తైః శరణం యాతి శంకరమ్
బ్రహ్మహత్యాది పాపానాం రాశయోఽప్యమితా మునే
శివస్మృత్యా వినశ్యంతి సత్యం సత్యం వదామ్యహమ్
శివనామతరీం ప్రాప్య సంసారాబ్ధిం తరంతి తే
సంసారమూల పాపాని తస్య నశ్యం త్యసంశయమ్
సంసారమూలభూతానాం పాతకానాం మహామునే
శివనామకుఠారేణ వినాశో జాయతే ధ్రువమ్
శివనామామృతం పేయమ్ పాపదావాన లార్దితైః
పాపదావాగ్ని తప్తానాం శాంతి స్తేన వినా నహి
శివేతినామ పీయుష వర్ష ధారా పరిప్లుతాః
సంసారదావ మధ్యేఽపి న శోచంతి న సంశయః॥

( శివపురాణము )

శివనామ మనెడి దావాగ్నిచే మహాపాప పర్వతము లనా యాసముగ భస్మము లగుచున్నవి. సంశయములేదు. సత్యము. పాపమూలకములైన దుఃఖము లన్నియు నొక్క శివార్చనము

చేతనే నాశము లగుచున్నవి. ఇతర సాధనముల వలనఁ దొలఁగవు. మనోవాక్కాయములచే శంకరుని శరణుఁ బొందినవాఁడే వైదికుఁడు, పుణ్యాత్ముఁడు, ధన్యుఁడు, బుధుఁడును, బ్రహ్మహత్యాది మహాఘము లన్నియు శివసంస్మరణముచే నశించుచున్న వని నేను జెప్పుచున్నాను. సత్యము. శివనామ మనెడి నావ నధిరోహించినవారు సంసారసాగరమును దాఁటుచున్నారు. సంసారమూలకములైన పాపము లన్నియు వారికి నశించుచున్నవి. సంసార మూలభూతములైన పాతకము లన్నియు శివనామకుఠారమున నశించుచున్నవి. ధ్రువము. పాపదావానలమునఁ దపించెడివారు శివనామామృత పాన మొనరింపవలెను. వారికితర సాధనములవలన శాంతి లేదు. శివనామామృతవర్షధారలచేఁ దడిసినవారు సంసార దావాగ్నిమధ్యమున నున్నను దుఃఖము నొందరు. సంశయము లేదు. శంకరార్చనచే సమస్త దేవతలును దృప్తి నందుదురు.

గీ. అఖిల లోకైక మూలమౌ హరునిఁ గొలువ
సర్వదేవులఁ గొలిచిన సరణి యమరు
జలము మూలమునం జేర్ప శాఖ లెల్ల
నలరు నవి వాడ మూల మేమట్లు చెడదు.

(ఆంధ్ర శివపురాణము)

కావున నెల్లరును శివలింగపూజఁ జేసికొనవలెను.



# గీర్వాణగర్వహరణము

ఈశ్వరానుగ్రహ మున్నపుడే బ్రహ్మాదిదేవతలు గాని దిక్పాలురు గాని మహర్షులుగాని మానవులు గాని వారి స్వకృత్యముల నిర్వహించుకొనఁ గలుగుదురు. పరమేశ్వరానుగ్రహము లేనిచో నెంత పరాక్రమవంతు లైన నెంత బుద్ధిమంతులైన నెంత బలవంతులైన నొక్కఁడు గైనను ముందునకు వేయఁజాలరు.

సురాసురు లమృతార్థులై సముద్రమథన మొనరించు చుండఁగా హాలాహల ముద్భవించినది. భయార్తులైనవారి యభ్యర్థనము మన్నించి హరుఁడు దానిని గంఠమున నుంచుకొనెను. కల్పనగము, కామధేనువు, నైరావతము, నుచ్చైశ్శ్రవము నుద్భవించినవి. లక్ష్మియుఁ జంద్రుఁడును జన్మించిరి. అమృతమును బుట్టినది. మాధవుఁడు జగన్మోహినియై యా యమృతమును బంచిపెట్టఁగా నది దేవతలకే లభించినది. రాక్షసులకు ముట్టలేదు. ఆ హేతువున దేవాసుర సంగ్రామమై దైవబలముండుటవలన దివౌకసులే జయించిరి. గీర్వాణుల కాజయము గర్వమును గలిగించినది. ఈ జయము తమ బలపరాక్రమలబ్ధ మని వారు భావించిరి. దీనిని గుర్తించిన మహేశ్వరుఁడు యక్షుని రూపమున వారిదగ్గఱ కేఁగెను. వారి ప్రగల్భవచనము లాలకించి మీ రొనర్చిన ఘనకార్య మే మని ప్రశ్నించెను. నిర్జరు లిట్లనిరి.

చ. కడలి మథించి శ్రీరమను గల్పకభూజముఁ గామధేనువున్
బెడఁగగు నశ్వరత్నమును వెల్లని యేనుఁగు మానికంబులున్
గడుఁ గృశమైననెన్నడుము కల్కి చనుంగవలొప్పు చెల్వలన్
గుడుచుటకున్ సుధాఘటము గొంటిమి యీ హరి యేము నున్నతిన్.

చ. పలలము మెక్కునట్టి యల బాలిశు లోర్వక మ మ్మెదిర్చినన్
జలమునఁ బట్టి చంపితిమి చక్కని యుక్కిది లేక రక్కసుల్
పొలిసిరి కొంద రింక వెఱపున్ గొని పాతిరి యౌరగాలయం
బిల నిఁక మ మ్మెదుర్చుటకు నెవ్వరు చాలుదు రన్న నాతఁడున్.

(ఆంధ్ర శివపురాణము)

ఇట్లు పలికెను. "మీరు గొప్ప బలశాలురు, పరాక్రమ శాలురు నన్నమాట! ఏది మీ కొక పరీక్ష నిడుదును. ఈ గడ్డి పరక నెవ్వరు కదలింతురో వారు దైత్యులను జయించిన" ట్లని యొక గడ్డిపరక నచటఁ బడవైచినాఁడు. మహేంద్రుఁడు ముందునకు వచ్చి చేతితోఁ బాఱవైతుననుచుఁ దీయఁబోఁగా నది రాలేదు సరికదా తన శక్తి నంతయు నుపయోగించినను నిరుపయోగమే యెనది. ప్రయత్నించి ప్రయత్నించి క్రోధావిష్టుఁడై వజ్రాయుధముతో నా తృణమును బ్రహరించినను నిష్ఫలమయ్యెను. సునాసీరుఁడు సిగ్గుపడినాఁడు. వైశ్వానరుఁ డరుదెంచి కదల్పలేక కాల్చివేయఁబోయి వ్యర్థప్రయత్నుఁ డయ్యెను. వాయువు వచ్చి కదలింపలేక మహావేగమున వీచియు దానిని జలింపఁ జేయలేకపోయినాఁడు. తక్కినవా రందఱుఁ దమతమబల పరాక్రమము లుపయోగించి యెంత యత్నించిన నా గడ్డిపోఁచను

గదల్పలేరైరి. అంత సురపతి యక్షు నుద్దేశించి "యెవఁడవురా నీ" వని గద్దింపఁగా నా యక్షుఁ డంతర్హితుఁ డైనాఁడు. అందఱు నాకాశమును దిలకించుచుండఁగాఁ బార్వతి కనిపించి నది. ఆమెను జూచి "యెవ్వరవు నీవు తల్లీ! ఇంతకు మున్ను వచ్చిన యక్షుఁ డెవ్వఁ" డని ప్రశ్నింపఁగా "సంసారచక్రము నెవ్వఁడు త్రిప్పుచుండునో, జగముల నెవఁడు సృష్టించునో, యెవఁడు జగన్నాధుఁడో, యెవ్వఁడు లోకము లన్నిటిని నియ మించునో, యాతని నియమించువాఁ డెవ్వనికి లేఁడో యాతఁడే యా యక్షరూపుఁ" డని వివరించి తిరోహిత యయ్యెను. పిదపఁ గొంత దవ్వున నా యక్షుఁడు దర్శన మీయఁగా దివౌకసులు వాని దగ్గఱ కరిగి పశ్చాత్తప్తులై సాష్టాంగపడి యాతని నిట్లునుతించిరి.

చ. ఎఱుఁగక గోతిలోఁ బడితి మీశ్వర! తప్పు సహింపు మిప్పు డం
దఱమదమున్ హరించి వితతం బగు నీదు ననుగ్రహంబు సం
బరమున జెందఁజేసితివి పల్కఁఱు నీ యెదుటన్ బ్రగల్భముల్
బఱపితి మన్ని యోర్వఁదగుఁ బాలకపాలక! సర్వశాసకా!

గీ. సర్వమున కీవె కర్తవు సర్వశక్తు
లకుఁ బ్రవర్తకుఁడవు నివర్తకుఁడ వెందు
నద్వయం బగు పరమాత్మ వయ్య! నీవు
నిన్నుఁ దెలియఁగఁగలమె? మన్నింపు మిఁకను.

(ఆంధ్ర శివపురాణము)

ఆ వాక్యములు విని "నిలింపులార! మీరు గర్వముతో మహా సంగ్రామమున గెల్చితి మనియు, మీతోఁ దుల్యులు లే

రనియు నహంకరించి పలుకుచున్నారు. ఎవ్వరి సహాయసంపద వలన జయించితిరో తెలిసికొంటిరా !" యని పలికి పరమేశుఁడు తిరోహితుఁ డయ్యెను. దేవత లందఱును గర్వము వీడి తమ విజయము మహేశ్వరకరుణాలబ్ధ మని తెలిసికొని ముదమందిరి.



# అ న సూ యా శి వా ర్చ న ము

దక్షిణదేశమునఁ జిత్రికూటపర్వతమునకు సమీపమునఁ "గామద" మను నగ మున్నది. బ్రహ్మమానసపుత్రుఁ డైన యత్రిమహర్షియు నాతని పత్ని యగు ననసూయయు నచటఁ దప మాచరించిరి. ఒకప్పుడు వర్షాభావముచే వృక్షములును సస్యములు నెండిపోయినవి. నిత్యకృత్యములకును జీవరక్షకుఁ ద్రాగుటకును నీరు కఱవైనది. వాయువు లత్యుష్ణముగ వీచుచున్నవి. జనులు హాహాకారము లొనరించుచుఁ బ్రళయ మని భీతిల్లుచున్నారు. అట్టి సమయమున ననసూయ పతినిఁ జేరి ప్రజాపీడ నెఱిఁగించి వారికి జీవనోపాయ మేమని ప్రశ్నించినది. కాని యాయన తపో నిష్ఠలో నుండి యామె మాటలను వినలేదు. ధ్యాన నిమగ్నులైనా రని తలంచి శిష్యులు వెడలిపోయిరి. అనసూయ యచటనేయుండి భర్తృసేవఁ జేయుచున్నది. ఆమె పార్థివలింగమును జేసి సమంత్ర కముగఁ బూజించి స్తోత్రముఁ జేయు చున్నది. తన భర్తను బర మేశ్వరునిగా భావించి భర్తకును బార్థివలింగమునకును బ్రదక్షి ణము లొనరించుచున్నది. ఆమె పాతివ్రత్యశక్తిచే దివ్యతేజ ముతో వెలుఁగుచున్నది. దానవు లాదంపతుల తపమునకు విఘ్న మొనరింప వచ్చి వారిచుట్టును భూమి దావాగ్నివలె మండుచుండు టచే వారిని సమీపింపలేకపోయిరి. అనసూయ త్రికరణశుద్ధిగాఁ ద్రిలోచనుని బూజించుచుఁ బార్థివలింగము నారాధించుచున్నది. అత్రిమహర్షి తపమును, ననసూయా సమర్చనమును దేవతలు

మహర్షులుఁ దెలిసికొని యందఱు నానందముతో వారిని జూచుట కరుదెంచిరి. వారిని సందర్శించి తమలోఁ 'దప మెక్కువయా? శివ పూజ యధికమా' యని విమర్శించి చివరకు శివారాధన మగ్రగణ్య మని నిర్ధారించిరి. ఘోరతప మొనరించుచున్న యత్రిమహర్షిని, భర్తృపూజను భర్గపూజను గావించు ననసూయను బలువిధములఁ గొనియాడి తమతావులకు వెడలిపోయిరి. గంగాదేవియుఁ జూడ వచ్చి యనసూయదీక్షకు మెచ్చి పతివ్రతాశిరోమణియు భక్తాగ్రేసరు రాలు నగు నామెను జూచి యూరక వెడలుట యుక్తముకాదని యెంచి వరమీయభావించియుండెను. అంతలో నత్రిధ్యానమునుండి లేచి "దాహము దాహ" యని యనఁగా ననసూయ కమండలువును దీసికొని నీటికొఱకుఁ బరువెత్తుచున్నది. ఎచ్చటను నీటి జాడయే లేదు. గంగ వనితారూపమున నామెవెంట నడచుచు "నే మమ్మా! యెక్కడకు వెడలుచుంటివి? నీ కేమి కావలయును? భర్తృసేవా నియమవ్రత వగు నీయం దనుగ్రహము కలిగినది. వర మొసం గుదు" ననఁగా "నీ వెవర వమ్మా? ఎటనుండి వచ్చితి" వని ప్రశ్నించిన దనసూయ. "నేను గంగను. పతిభక్తిని నీకడ నేర్చు కోవలయును, నీ యభీష్ట మే" మనఁగా ననసూయ నమస్కరించి నాకుఁ దీర్థ మిమ్మనినది. అటులే యని నీ వింటికి నడువు మని యామె నడచుచుండఁగా గంగ జలరూపిణియై యామెవెంటనే ప్రవహించుచు వచ్చినది. ఆశ్రమముఁ జేరి వెనుకకుఁ జూచి గంగాజలమును గమండలువుతోఁ దీసి "గంగా! నా పతికి దప్పికఁ దీర్చి వచ్చెదను. అంతవఱకు నిక్కడనే యుండు" మని యా

యుదకమును బతి కిచ్చిన దనసూయ. మహర్షి యాచమించి యా యుదకమును ద్రావి "యీ జల మింత స్వాదువుగ నున్న దెక్కడిది? పరిసర మంతయు శుష్కమై జలశూన్యమై యున్నదే. వర్షము లప్పటినుండియు లేవా" యని ప్రశ్నించినాఁడు. వర్షములే లేవని ప్రత్యుత్తర మిచ్చిన దామె. అటులైన నీయుదక మెట్లు వచ్చిన దని యడిగినాఁ డత్రిముని.

అనసూయ తనకు గంగ ప్రసన్నయైన దని చెప్పుదునా మానుదునా? నా పూజ కామె యనుగ్రహించిన దని చెప్పిన నాత్మ స్తుతియగును గదా! ఏమియుఁ జెప్పనిచో భర్తృవాక్యోల్లంఘన దోషము కలుగునేమో? మీ తపమునకు మెచ్చి యనుగ్రహించిన దన్నచో నసత్య మగునుగదా! ఏమని సమాధానింతు నని తర్కించి తర్కించి "నాథా! మీ తపమును శంకరపత్ని గంగ చూడవచ్చి జలము నిచ్చినది" యనెను.

"దేవతలకు మహర్షులకు నసాధ్యమై ముల్లోకములఁ బావన మొనరించు గంగ యిటకు వచ్చుటయా! నాకు నమ్మకము లేదు. ఆమెను జూపిననే విశ్వసింతు" నని యత్రి తెలుపఁగా నన సూయ గంగకడ కరిగి యామె నర్థించి తోడ్తెచ్చినది. గంగాదేవి సౌందర్యవతియై యొక గుంటలో నిలువఁగా నామెకు నమస్క రించి యా జలమున దంపతులు స్నాన మొనరించి స్తోత్ర మొన రించిరి. గంగ "నే నిఁక వెడలుదు" ననఁగా ననసూయ భక్తితో దోసిలి యొగ్గి "గంగా! నాయం దనుగ్రహ మున్నచో నీ విచ

టనే యుండి పోవలయు" నని ప్రార్థించినది. అత్రిమునియు నటులే యర్థించెను. గంగ ప్రసన్నురాలై "పతివ్రతామణీ! నీవు చేసిన పశుపతిపూజలో నొకవర్షము ఫలము నాకు ధారపోయుదువేని నే నిక్కడనే యుందును. నీ శివభక్తికిఁ బతిభక్తికి నచ్చెరు వైనది. నా పాపరాశిని దొలఁగించుకొనుట కిటకు వచ్చితి" నని యామె కోరఁగా ననసూయ భర్తయనుమతి నొంది యేకవత్సర వామదేవారాధనఫల మా గంగకు భక్తితో ధారపోసినది. పార్థివ లింగమునుండి పశుపతి ప్రత్యక్షమై ఋషిపత్నితో "నీ భక్తికి మెచ్చితిని. ఏమివరము కావలెనో కోరు" మనఁగా నా దంపతులు సాష్టాంగవందన మాచరించి "మృత్యుంజయా! మానవశ్రేయము నకై నీ విచటనే యుండవలయు" నని యర్థింపఁగాఁ బరమేశ్వరుఁడు పార్వతీ యుతుఁడై యచటనే యుండిపోయెను. అతఁడే యత్రీశ్వరుఁడు. గంగ యక్షయముగ నా గుంటలోనే నిలిచినది. ఆనీటియొడ్డున ఋషులు యజ్ఞము లొనరింపఁగాఁ దృప్తిపడి దివస్పతి వర్షముల గురియింపఁగా సస్యములు సమృద్ధిగాఁ బండి వి. అందఱును సుఖించిరి.



# బలి పూర్వకథ

పూర్వకాలమున జారత్వ చోరత్వాది దుష్ప్రవర్తనుఁడై జీవితకాలములో నేయొక సుకృతలేశము నాచరింపని మానవుఁ డొకఁడుండు వాఁడు. వేశ్యాలోలుఁడైన యాతఁడు తన యుంపుడుకత్తెకై పుష్పములు, సుగంధ ద్రవ్యములు గొని పోవుచు దారిలోఁ గాలికి రాయి తగిలి బోరగిలఁబడిపోవుచు నా సమయమునఁ గ్రిందఁబడిన యా పుష్పాదు లీశ్వరార్పణ మను కొనినాఁడు. తర్వాత లేచి యింటికి వెడలినాఁడు. కొంతకాలము తర్వాత మరణింపఁగా యమలోకమునకుఁ గొంపోఁబడినాఁడు. యముఁడు చిత్రగుప్తునిఁ బిలిచి "యీ మానవుఁడు జీవితకాలము లోఁ జేసిన వన్నియు నకృత్యములేనా? ఏ లేశమైన సుకృత మున్నదా!" యని యడుగఁగా నాతఁడు "ప్రభూ! వీఁడు చేసిన వన్నియుఁ బాతకములే కాని యొకపర్యాయము వేశ్యకై కొని పోవుచుఁ గాలికి దెబ్బ తగులఁగాఁ గ్రిందఁ బడిపోయిన సుగంధ ద్రవ్యము లీశ్వరార్పణ మన్నాఁడు. ఆ పుణ్యఫలముగా నీతనికి మూఁడు గడియల కాలము మహేంద్ర సింహాసనాసీన యోగ మున్నది" యనెను. ఆపాపి పుణ్యానుభవమును ముందు కోరెను. ఆతని నింద్రాసనమునఁ గూర్చుండఁబెట్టినారు. వెంటనే నారదుఁ డాతనితో "నీ వింద్రాసన మధిష్ఠించితివి. ఇంద్రాణియుఁ బ్రక్క నుండవలయునుసుమా!" యనఁగ నాతఁడు నారదా! నీ విట నుండ వీలులేదు తొలఁగు మని చెప్పి తత్‌క్షణమే యైరావత

గజము నగస్త్యునకును, గల్పనగమును విశ్వామిత్రునకును వైరాగ్యవృత్తుఁడై యీశ్వరార్పణ బుద్ధితో దాన మొనరించెను. చింతామణి, యుచ్చైశ్శ్రవము మొదలగువానిని గూడ మహర్షులకు దానముచేసెను. ఇంతలో మూఁడు గడియల కాల మతిక్రమింపఁగా నాతని నింద్రాసనమునుండి దింపి యమసన్నిధికిఁ గొనిపోయిరి. పాపానుభవమునకై వానిని నరకమున బాధింపుఁడని యముఁ డాజ్ఞాపించుచుండఁగాఁ జిత్రగుప్తుఁడు వచ్చి "యీతఁడు మహాసుకృతుఁ డైనాఁడు. ఇంద్రత్వ సమయమున నగస్త్య విశ్వామిత్రాది మహర్షుల కైరావత కల్పనగాదికములు దానములఁ జేసినాఁడు. అట్టి సత్పాత్రవిశిష్ట దానము గావించినందున వాని మహాపాతకము లన్నియు నశించినవి. పైఁగా సత్పాత్రదాన మహాఫలముగ నొక మహాపురుషునిగా నీతనిని జన్మింపఁ జేయవలసియున్నది" యనెను. అంత నా మానవుఁడు విరోచనుఁడను రాక్షసరాజునకుఁ గుమారుఁడుగా జనియించెను. అతఁడే బలిచక్రవర్తి. అతఁడు గర్భమునఁ బడినది మొదలు దంపతులు వదాన్యులై మహాదానము లనేకము లొనరించినారు. బలి మహాదాతయై శ్రీమహావిష్ణువునకుఁ ద్రిపాద ధరణీదానమునకై తన రాజ్యసర్వస్వము నొసంగుచు నాత్మార్పణము గావించుకొన్న చరితార్థుఁడు. అతఁ డంతటి వదాన్యశేఖరుఁ డగుటకుఁ బరమేశ్వరార్పణబుద్ధితో గతజన్మమున దాన మొనరించుటయే కారణము. ఈశ్వరార్పణ మొకసారి యొనరించిననే యింత సుకృతమున్న నిత్యమును శివారాధన మొనరించిన నెంత విశేషమో తెలుపనలవికాదు.

# కుబేరుని పూర్వజన్మ కథ

నవనిధులకు నాయకుఁడు యక్షనాథుఁడు నగు కుబేరుఁడు పరమేశ్వరుని ప్రాణస్నేహితుఁడు. ఆతని కంత యోగ్యత కలుగుటకుఁ బూర్వజన్మమున నాతఁ డొనరించిన శివారాధనమే కారణము. ఆ వృత్తాంతము స్కాందపురాణ కాశీఖండములో నిట్లున్నది.

కాంపిల్యనగరమున యజ్ఞదత్తుఁ డనెడి బ్రాహ్మణుఁడు కలఁడు. ఆయన వేదవేదాంగ నిష్ణాతుఁడు. యజ్ఞవిద్యా విశారదుఁ డైన సోమయాజి. అగ్నిహోత్రనిరతుఁడు. వేదాధ్యయన సంపన్నుఁడు. రాజమాన్యుఁడును. ఆతని కుమారుఁడు గుణనిధి. అందమున మన్మథుఁడు. ఆతనికి యోగ్యవయస్సు రాఁగా నుపనీతుఁ గావించి యాచార్యునొద్ద విద్యాభ్యాసమున కుంచిరి. కాని వాఁడు విద్యాసక్తుఁడు కాక ద్యూతక్రీడా రతుఁడై నిజ వంశాచారాదికము లన్నియు వీడి కితవులతోఁ గూడి రాత్రింబవళ్లు తిరుగుచున్నాఁడు. బ్రాహ్మణాచారములను, నగ్నిహోత్ర విధానమును సంధ్యా వందనమును విడనాడినాఁడు. గీత వాద్య వినోదములలోఁ దగు లొ్కని పాషండదుర్భాష లాడుచు, ద్యూతకారులతో సామ్యము నొందుచు; నాస్తికులతో స్నేహము, నటులయందు గౌరవము విటు లన్న సంతోషముఁ గలిగి శిష్టకుల దీక్షితుని కుమారుఁ డైన గుణనిధి భ్రష్టుఁడు గాఁ దిరుగుచుండెను. ద్యూతమున ధన

మంతయు నోడి తల్లి బంగారువస్తువుల నన్నింటిని దొంగిలించి యమ్మి ద్యూతమున నొడ్డుచుండెను. అతని దుష్ప్రవర్తనమును విని తల్లి తండ్రికిఁ దెలియనీక పుత్రునిఁ బిల్చి బోధించు చుండును. పనులతొందరలలో రాజకార్యములలో నిమగ్నుఁడైన దీక్షితుఁడు కొడుకు వర్తనమును బరామర్శించెడివాఁడు గాఁడు. ఎప్పుడైనఁ గుమారుఁ డేఁడని భర్తయడుగఁగాఁ దల్లి యిప్పటి వఱకును నాయొద్దనే యుండి యిపుడే చదువుకొనుట కేఁగినాఁ డనును. స్నానము చేసెనా? సంధ్య వార్చెనా? అగ్నిహోత్రముఁ జేసెనా? యని యడుగ నన్నియుఁ జేసె నని తల్లి పుత్రునిమీఁది మమకారమునఁ గల్ల లాడును. లేక లేక కల్గిన యేక పుత్రుఁ డగుటచే నాతని ధూర్తవర్తన మంతయుఁ దండ్రి కెఱుఁగనీక తల్లి దాఁచెడిది. అతని పదునాఱవయేట గృహస్థధర్మముగా వివాహ మొనరించిరి. కాని యాతని దుర్వృత్తి మఱలలేదు. ఒకనాఁడు తల్లి యిట్లు బోధించినది.

గీ. అన్న! మీతండ్రి కోపగాఁ డౌను గాఁడొ?
యీవు వొనరించు దుర్వృత్త మెఱిఁగెనేనిఁ
గల్లతనమున పలుమాఱు గప్పిపుచ్చు
నట్టి నా మీఁదఁ జంపంగ నలుగకున్నె?

సీ. సచ్ఛ్రోత్రియులు ననూచానులు సోమపీ
థులు నైన కులముపెద్దలఁ దలంచి
రాజమాన్యుఁడు సత్యరతుఁడు వినిర్మలా
చారవంతుఁడు నైన జనకుఁ దలఁచి

భాగ్యసంపదఁ బుణ్యపతిదేవతలలోన
నెన్నంగఁ దగియెడు నన్నుఁ దలఁచి
వేద శాస్త్ర పురాణ విద్యా నిరూఢులై
వాసికెక్కిన తోడివారిఁ దలఁచి
గీ. పెద్ద యింటి పెదారమై శివుని కరుణ
నిప్పటిలు నిర్వ దేనేండ్ల నిన్ను దలఁచి
పదియు నా ర్వత్సరంబుల భార్యఁ దలఁచి
గోరతనములు మానురా! కొడుకుఁగుఱ్ఱ!
గీ. అఖిలకల్యాణ గుణ గణాయత్త యత్త
మామ యౌదార్య తేజఃక్షమా మహితుఁడు
మాతులందు యశో మహిమాతులందు
తనయ! యేలయ్య కైకోవు వినయబుద్ధి?
ఉ. విడువక నీవు పట్టణము వీథుల వీథుల వెట్టివాఁడవై
చెడుగులఁ గూడి ధౌర్త్యములు సేయ మహీరమణుం డెఱింగెనే
విడుచును సోమయాజి మను వృత్తులు చేకొను నెల్లభంగులన్
జెడుదుము నీ కతంబుననుఁ జీరయుఁ గూడును లేక పుత్త్రకా!
గీ. పట్టణములోన నీవు దర్పమునఁ జేయు
కొయ్యతనములు వీక్షించి కూర్మితనయ!
నవ్వుదురు నిన్ను మొదల నానావిధముల
నవ్వుదురు దీక్షితుని ననంతరము జనులు.
క. అవినయనిధాన మగు నీ
నవయౌవన శైశవముల నడిమి వయసునం
గవిసెదు వ్యసనోద్రేకం
బవగాఢము దీని మానవయ్య తనూజా!

(శ్రీనాథుని కాశీఖండము)

ఈ మాతృబోధ మాతఁడు చెవిని సోఁకనీక యథాపూర్వ దుర్వ_ర్తనమున నే యుండెను.

ఒకనాఁడు యజ్ఞదత్తుఁడు నగరమునఁ బోవుచు నవరత్న మయమై యజ్ఞావభృథస్నాన పవిత్రమైన తన యంగుళీయక మొక జూదరి వ్రేలి నుండుటఁజూచి యాతని నీ కీ యుంగర మెట్లువచ్చె నని ప్రశ్నించెను. అతఁడు "నీ కొడుకు జూదమున నోడిన ధనమునకై దీని నా కిచ్చెను. నీ యింటిలోని యనే కామూల్యాభరణము లన్నియుఁదాకట్టుపెట్టిజూదరియై నీ సుతుఁడు తిరుగుచున్నాఁడు. యాగదీక్షితులలో నీ వెంతటి ఘనుఁడవో ద్యూతకారులలో నీ తనయుఁ డంతటి ఘనుఁ" డని చెప్పెను. ఆ మాటలు విని లజ్జా క్రోధ పరవశుఁడై యాతఁ డింటికి వచ్చి భార్యపై మండిపడి సత్యము నెఱింగి "ఓసి! యభాగ్యురాల! నీవును నీ యొంటి కొడుకును నా కొంప గుల్లఁజేసి నా గౌరవము మంటఁగలిపితిరి. కుపు_త్రిత్వము కంటె నపు_త్రిత్వంబు మేలు." అని భార్యను గుమారుని విడిచి వేరొక శ్రోత్రియుని పుత్రికను బెండ్లాడి గృహస్థధర్మమున నుండెను. తండ్రి యాగ్రహమును గ్రహించి గుణనిధి యూరు విడిచి పోయినాఁడు. దేశాంతరవాస క్లేశము లనుభవింపుచు నన్నా_ర్తుఁడై యిట్లు విలపించెను.

గీ. ఏమి సేయుదు? నెక్కడి కేఁగువాఁడ!
ధనము నిప్పచ్చరంబు విద్యయు హుళక్కి
పెట్టపోఁగెదు నా చేయి భిక్షసేయ
నెట్టు నేరుచు? దైవంబ యెఱుఁగు నింక!

గీ. ఏ భయంబుల నెచ్చోట నెనయలేదు
నరున కెప్పాట విద్యాధనంబ ధనము
చోర బాధాదికముచేతఁ జూఱవోవు
ధనము ధన మౌనె యెన్నిచందములఁ దలఁప?

గీ. అక్కటకట! దురోదర వ్యసన మెట్లు?
యాయజూక విశిష్టాన్వవాయ మెట్లు?
ఎట్లు చేసినఁ జేసెఁగా కే మనంగ
నేర్చువారము? విధి దయానిస్వహృదయ.

చ. అరుణ గభస్తి బింబ ముదయాద్రిపయిం బొడతేర గిన్నెలోఁ
బెరుగును వంటకంబు వడపిందియలుం గుడువ గఁబెట్టు ని
ర్భర కరుణాధురీణ యగు ప్రాణము ప్రాణము తల్లి యున్న దే
హరహర! యెవ్వ రింకఁ గడుపారఁగఁ బెట్టెద రీప్సితాన్నముల్.
(శ్రీనాధుని కాశీఖండము)

అతఁడు తిరిగితిరిగి యాఁకలిబాధ హెచ్చుకాఁగా నెక్కడను నాహారము లభింపక రాత్రివరకు నిరాహారుఁడై యంతలో నొక శైవభక్తుఁడు నివేదనకుఁ బక్వాన్నమును గొనిపోవుచుండుటఁ జూచినాఁడు. ఆనాఁడు శివరాత్రి. శైవుఁడు నాఁ డుపవాస ముండి రాత్రి జాగరణముఁ జేయుచు నాల్గుజాముల శివపూజఁ గావించి నైవేద్య మొనరించి శివాలయమున నలసి నిద్రింపు చుండెను. శివారాధనకు వచ్చినవా రందఱును గ్రిమముగా నిద్రింపుచుండిరి. ఆహారము మీఁది కాంక్షచే గుణనిధియు నా యాలయమున కరిగి శివారాధన మంతయుఁ జూచుచు వేకువ

వరకు జాగరణ మొనర్చి వా రందఱు నిదిర్రింపఁగాఁదాను లోని కేఁగి యాహారము బాగుగాఁ గన్పించుటకై తన వస్త్రపుఁ బీలిక చింపి వత్తిగాఁజేసి దీపపుఁగుందెలో నుంచి నేతినిఁ బోసి దీపము వెలిఁగించెను. ఆ వెలుఁగులో నన్నపుఁబళ్ళెమును బట్టుకొని యీవలకు వచ్చు తొందరలో నాతని కాలివేర్రిలు తగిలి పరున్న వ్యక్తి లేచి దొంగ దొంగ యని యఱవఁగా నందఱును లేచి యాత నిని వెంటాడిరి. రక్షకభటు లాతనినిఁ బట్టి కొట్టఁగా నా యాలయ పార్రింతమున గుణనిధి మరణించినాఁడు. నాఁడు శివరాతిర్రియగుటచే నన్నము దొరకక యుపవసించినను నుపవాసఫలము-ఆహారము దొంగిలించుటకే చేసినను జాగరణ ఫలము - అన్నపుఁ బళ్లె మానుటకే చేసినను శివసన్నిధానములఁ జేసిన దీపారాధనఫలము లభించి యా గుణనిధి మఱుజన్మమునఁ గళింగదేశాధిపతిగ జన్మించి దమనుఁ డను పేరుతో శివభక్తిఁ గలిగి తనరాజ్యమం దన్ని శివాలయములలోను నిత్యదీపారాధన మొనరింప శాసించెను. తాను శివారాధన తత్పరుఁడై జీవితము గడపి కాలధర్మము నంది తర్వాతఁగుబేరుఁ డయ్యెను. గుణనిధి యంతటి మహోత్కృష్ట జన్మము నంది యీశ్వరునకుఁ బార్రిణస్నేహితుఁ డగుట యీశ్వ రార్చనమహత్త్వము వలననే।



# శివప్రదక్షిణఫలము

శ్లో॥ శివప్రదక్షిణం కుర్యాత్ స్వయ మష్టోత్తరం శతమ్
సహస్ర మయుతం లక్షం కోటి మన్యేన కారయేత్
శివప్రదక్షిణా త్సర్వం పాతకం నశ్యతి క్షణాత్
దుఃఖస్య మూలం వ్యాధి ర్హి వ్యాధే ర్మూలం హి పాతకమ్
ధర్మేణైవ హి పాపానా మపనోదన మీరితమ్
శివోద్దేశకృతో ధర్మః క్షమః పాపవినోదనే
అధ్యక్షం శివధర్మేషు ప్రదక్షిణ మి తీరితం
క్రియయా జపరూపలహిం పణవం తు ప్రదక్షిణమ్॥

శివప్రదక్షిణములు నూటయెనిమిదిగాని వేయిగాని పదివేలుగాని లక్షగాని కోటిగాని స్వయముగాఁ జేయవలెను. ఇతరులచేఁ జేయింపవలెను. శివప్రదక్షిణములవలన తత్క్షణమే సర్వపాపములు శమించును. దుఃఖమూలము వ్యాధి, వ్యాధిమూలము పాపము, పాపము నశించుటకు ధర్మమే చెప్పఁబడినది. పాపనాశనమునకు శివోద్దేశధర్మ మాచరణీయము. శివధర్మములలోఁ బ్రదక్షిణమే ప్రముఖము. ప్రదక్షిణము ప్రణవమంత్ర జపతుల్య మైనది.

పరమేశ్వరుని ప్రదక్షిణముఁ గావించుట మహాపుణ్యప్రదమని యీ స్కాందపురాణాఖ్యానమువలన స్పష్ట మగుచున్నది.

పూర్వము రెండు చిలుకలు ప్రభాసక్షేత్రములోని వైశ్వానరేశ్వరాలయముప్రక్కన గూడుఁ గట్టుకొని నివసించుచున్నవి. అవి గూఁటినుండి వచ్చి యాలయమునకుఁ బ్రదక్షిణముగా నెగిరి పోవుచుండెడివి. బయటికి వెడలినప్పుడును బయటినుండి గూఁటికి వచ్చినపుడును వాని గమనము శివాలయమునకుఁ బ్రదక్షిణ మయ్యెడిది. శివాలయమునకుఁ బ్రదక్షిణ మొనరింపవలె ననిగాని యొనరించుచున్నా మని గాని యవి యెఱుంగవు. ఆ చిలుక దంపతులు శివాలయప్రదక్షిణ మొనరించుటవలన మరణాంతమున లోపాముద్రాగస్త్యులుగా జనియించినవి. ఈ విషయమును దివ్య జ్ఞానముతోఁ దెలిసికొని వైశ్వానరేశ్వరు నా దంపతులు సేవించిరి. ఈశ్వరలింగారాధనము ముక్తి నొసంగునని యగస్త్యుఁ డభి వర్ణించెను.



# శివారాధన ధన్యులు

పరమేశ్వ రారాధనముఁ గావించియే బ్రహ్మ సృష్టిక్రియా నైపుణ్యమును, విష్ణువు లోకపాలనా సామర్థ్యమును బొందిరి. సూర్యచంద్రులు, మహేంద్రాది దిక్పాలకులు, దేవతలు, సిద్ధులు సాధ్యులు, గంధర్వులు, కిన్నరులు. కింపురుష లష్టవసువులు, మహేశ్వర సమర్చనా లబ్ధ వైభవులే ! వశిష్ఠాది సప్తర్షులు— నరుంధతి, లోపాముద్ర, అహల్య మొదలగు పతిదేవతలు— బృహస్పతి, పరాశర, వ్యాస, యాజ్ఞవల్క్య, జైమిని, గర్గ, శ్రీశుక, గౌతమ, శౌనకాదులు - పరశురాముఁడు - గూడ శివారాధన ధన్యులే ! విరోచనుఁడు, బలిచక్రవర్తి, మున్నగు రక్షోనాథులు - గరుత్మంతుఁడు -చతుర్దశ మనువులు - మహేశ్వరసేవఁ జేసి సత్ఫలములఁ గాంచిరి. మాంధాత, హరిశ్చంద్రుఁడు, భగీరథుఁడు, ఖట్వాంగుఁడు, దిలీపుఁడు మొదలగు చక్రవర్తులు శివుని సేవించి యభీష్టసిద్ధి నందిరి. చంద్రాంగదపత్ని యగు సీమంతిని సోమవార వ్రతాచరణముననే సకల సౌభాగ్యములఁ గాంచినది. మహాకాలుఁ డను భిల్లుఁడు విశేష జీవహింసఁ గావించియు శివారాధన నొనరించి యుత్తమగతి నొందెను. విశ్వామిత్రుఁ డుమామహేశ్వర సమర్చనముననే బ్రహ్మర్షి యయ్యెను. శుక్రాచార్యుఁడు వేయి సంవత్సరములు ధూమపానముఁ జేయుచుఁ దపము గావించి మృతసంజీవనీవిద్యను, సూర్యచంద్రమండలోపరిభాగమున గ్రహత్వమును బడసెను. ఆతని వలన దధీచి

మృత్యుంజయమహామంత్రమును బొంది జపించి శంకరానుగ్రహ మున నవధ్యత్వమును వజ్రతుల్యాస్థులను బడసెను. మార్కండే యుఁడు శివారాధన వలననే చిరంజీవియయ్యెను. హిరణ్యకశిపుఁడు పదిలక్షల వత్సరములు శివతప మొనరించి దివ్యవరముల నొందఁ గలిగెను. బాణాసురుఁడు పరమేశ్వరానుగ్రహముచే సహస్రబా హుఁడై యమిత బలము నొంది నృత్య వాద్యములతో నటరాజ మూర్తి నానందపఱచి తనయింట నాతనిని రక్షకునిగఁ జేసికొనెను. అంధకాసురుఁడు భూతేశునితో యుద్ధ మొనరించి యాతని శూలము నకు గ్రుచ్చఁబడి లోకము లన్నిటఁ ద్రిప్పఁబడి శుష్కశరీరుఁడై శంకరస్తోత్రము నొనరించి యాతనిని బ్రసన్నునిఁ గావించుకొని ప్రమథగణాధిపత్యమును బొందెను.

గంగా పులినప్రదేశమునఁ గల రుద్రప్రయాగ సర్వ తీర్థములలో నుత్తమ మైనది. అచట శేషుఁడు మొదలగు నాగ ప్రముఖులు శివునిఁగూర్చి తప మొనరింపఁగా నాతఁడు ప్రత్య క్షమై వరముఁ గోరు కొనుఁ డనఁగాఁ దాము నిరంతరము పర మేశ్వరుని దేహాలంకారములు కావలెనని కోరిరి. నాఁటినుండి పర మేశ్వరుఁడు నాగాభరణుఁ డైనాఁడు. విషసర్పములకుఁ గూడ శివారాధనము వలననే యింతటి యోగ్యత కలిగినది. ఈ దృష్టాంతము స్కాందపురాణ కేదారఖండములోని క్రిందిశ్లోక మునఁ గలదు.

శ్లో॥ రుద్రప్రయాగే తన్వంగి ! సర్వతీర్థోత్తమే శుభే
యత్ర నాగా శ్చ శేషాద్యా స్తప శ్చక్రు ర్మహాత్మనః

ప్రాప్తవ్యాభూషణత్వం తే మహాదేవస్య సుందరి
అద్యాపి తత్ర రంభోరు నాగానా మాలయాః శుభాః ॥

పూర్వము విశ్వరూపుఁడను బ్రాహ్మణుని కుమారుఁడు బాల్య చాపల్యమునఁ దండ్రిగారి పూజా పీఠమునుండి మరకతలింగ మును దీసి యొక ఘృతపాత్రియందుఁ బడవైచెను. ఆ నేతి యం దా శివలింగము రాత్రియంతయు మునిఁగి యుండెను. ఉదయ మునఁ దండ్రి వెదకు కొనుచుండఁగా నా కుమారుఁడు తెచ్చి యిచ్చినాఁడు. అజ్ఞానకృతమే యైనను శివునకు ఘృతకంబళార్చన మొనర్చుట వలన నానర్తదేశములో నా విప్రబాలుఁడు రాజకుమా రుఁడుగా జనించి పూర్వజన్మస్మరణము గలిగి తన రాజ్యములోని శివాలయములన్నింటిలోను శివలింగములు మునుఁగు లాగున ఘృతాభిషేకములఁ జేయించి శంకరుని మెప్పించి శివగణాధిపత్య మును బొందెను.

ఆ భక్తునితోఁ బరమేశ్వరుఁ డపు "డిది మొదలు మాఘ మాసములో నెవ్వఁడు నాకు ఘృతాభిషేకముఁ జేయునో వాఁడు తప్పక నా గణములోఁ జేరు" నని పలికెను.

శ్లో॥ రాజ్యం చిరాయు రితి మే ఘృతకంబలస్య
జాతిస్మరత్వ మధునాపి తథానుభావాన్...॥

(స్కాందపురాణము)

ఘృతకంబళ మాహాత్మ్యముచే రాజ్యము, చిరకాలాయుర్దా యము జాతిస్మరత్వము కలుగును.

కాశీక్షేత్రమున ఘంటుఁడను శివభక్తుఁ డుమామహేశ్వరు నఖండములు నచ్ఛిద్రములు నగు బిల్వదళములతో దినమునకు మూఁడు వేళల వేయివత్సరములు పూజించినాఁడు. ఈశ్వరుఁ డానందించి యాతని కిరువది యెన్మిది కల్పములకాల మాయు వొసంగెను. శంకరునకు బిల్వదళముల వలనఁ గలుగు ప్రీతి మాలతీ మందార శతపత్రములచేఁ గలుగదు.

శ్లో॥ న మాలతీ న మందారః శతపత్రం న మల్లికా
యథా ప్రియాణి శ్రీవృక్షో తథా మదనవిద్విషః॥

(స్కాందపురాణము)

మహాదేవుఁ డా శివభక్తునితో నిటు లనెను.

శ్లో॥ అఖండం బిల్వపత్రేణ మహాతుష్టిః ప్రజాయతే
ఏకేనాపి యథా న్యేషాం తథా న మమ కోటిభిః॥

(స్కాందపురాణము)

బిల్వదళములు చీడపట్టనివి, మూఁడుపత్రములు కలిసి యున్నవి శివపూజార్హములు.

ఒకకోఁతి వసంతఋతువులో నొక వనమందలి శివాలయ మున జరుగుచున్న దమనకోత్సవమును జూచినది. బంగారు తూఁగుటూయలలో శివలింగము నుంచి యూఁపి భక్తు లుత్సవముఁ

జేసి వెడలఁగా నా కోఁతియు జాతిస్వభావమున నా శివలింగమును వేకువవఱకు నుయ్యాలలో నూఁపినది. తెల్లవాఱుజామున నుయ్యాలపై నున్న కోఁతిని జూచి భక్తులు కఱ్ఱతోఁ గొట్టఁగా నది మృతి నంది యీశ్వరున కూయలసేవఁ జేసినందునఁ గాశీ రాజకుమారుఁడుగాఁ బుట్టి కుశధ్వజుఁ డను పేరితో శివభక్తుఁడై పూర్వజన్మస్మృతి కలిగి తనరాజ్యములోని శివాలయములలో దమనకోత్సవములఁ జేయించుచు శివదీక్షాపరుఁడై యేఁబది కల్పము లాయువును బొంది మానవదేహముతో శివగణములోఁ జేరెను.

శ్లో॥ యథా యథా దోలయతి శివం దోలాస్థితం నరః
తథా తథా ఽశుభం యాతి పుణ్య మాయాతి భద్రిక॥

(స్కాందపురాణము)

ఊయలలో నున్న శంకరు నూఁపుచు సేవఁ గావించినచో నూయల ముందునకుఁ బోయినట్లు పాపము లన్నియుఁ బోయి, యది వెనుకకు వచ్చునట్లు శుభములు వచ్చును.

శాండిల్యుఁ డను విప్రుఁడు బాల్యమున నాటలలో మట్టితో శివాలయమును బ్రాకారమును గట్టి యందుఁ బచ్చమట్టితో శివ పంచాయతనమును గలశములను ధ్వజమును నిర్మించెను. కఱ్ఱలతో గోపురములఁ గట్టెను. జాగేశ్వరలింగమును దానిలోఁ బెట్టి వర్షోదకములచే నభిషేకము, పుష్పములతోను బిల్వదళములతోడను బూజనముఁ గావించెడివాఁడు. అందుచే నాతఁడు మఱుజన్మమున

విప్రుఁడై జనియించి పూర్వజ్ఞానముతో శివాలయముఁ గట్టించి శివదీక్ష నంది శివారాధన మొనర్చి గతించి మఱలఁ బ్రతిష్ఠాన పురమున జయదత్తుఁ డను సార్వభౌముఁడుగాఁ బుట్టి పూర్వ జన్మజ్ఞానము కలిగి యనేక శివాలయముల నిర్మించి శివార్చన మొనరించెను. అందులకుఁ బరమేశ్వరుఁడు సంతసించి యఱువది కల్పము లాయుర్దాయమును శివగణత్వమును బ్రసాదించెను.

శ్లో॥ కల్పకోటిం వసేత్స్వర్గే యః కరోతి శివాలయం
యావంతి పరమాణూని శివస్యాయతనే నృప।
భవంతి తావ ద్వర్షాణి కారకః శివసద్మని॥

(స్కాందపురాణము)

శివాలయమును నిర్మించినవాఁడు కోటికల్పములు స్వర్గమున నివసించును. శివాలయములో నెన్ని పరమాణువు లున్నవో యన్నివత్సరములు శివసద్మమున నిర్మాణకర్త వసియించును.

రోమశమహర్షి మహేశ్వరునిఁ గమలములచే నిత్యపూజఁ గావించుచు సహస్రవర్షము లర్చించి యీశ్వరానుగ్రహమునఁ దన శరీరముపై నెన్ని రోమము లున్నవో యన్నికల్పము లాయు వును బొందెను. ఒక కల్పము గడవఁగా నొక రోమము తొలఁగుచుండును. అతఁడు శివానుగ్రహముచే జీవన్ముక్తుఁ డయ్యెను.

ఈ విధముగ నెందఱో శివార్చన మొనరించి ధన్యులైరి. ఆ శివలీలలను సహస్రవదనుఁడగు నాదిశేషుఁడైనను వర్ణింపఁజాలఁడు.

శ్లో॥ న దుర్లభం న దుష్ప్రాపం న చాసాధ్యం మహాత్మనాం
శివభక్తికృతాం పుంసాం త్రైలోక్యా మితి నిశ్చితమ్॥
(స్కాందపురాణము)



# ద్వాదశ జ్యోతిర్లింగములు

ఈశ్వరుని ద్వాదశ జ్యోతిర్లింగములు మహాశక్తిమంతము లైనవి.

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథం చ శ్రీశైలే మల్లికార్జునమ్
ఉజ్జయిన్యాం మహాకాల మోంకారే పరమేశ్వరమ్
కేదారం హిమవత్పృష్ఠే డాకిన్యాం భీమశంకరమ్
వారాణస్యాం చ విశ్వేశం త్ర్యంబకం గౌతమీతటే
వైద్యనాథం చితాభూమౌ నాగేశం దారుకావనే
సేతుబంధే చ రామేశం ఘుశ్మేశం చ శివాలయే
ద్వాదశైతాని నామాని ప్రాతరుత్థాయ యః పఠేత్
సర్వ పాప వినిర్ముక్తః సర్వసిద్ధిఫలం లభేత్
యే నిష్కామతయా తాని పఠిష్యంతి శుభాశయాః
తేషాం చ జననీగర్భే వాసో నైవ భవిష్యతి॥

(శివపురాణము)

సౌరాష్ట్రమందు సోమనాథుఁడు, శ్రీశైలమున మల్లికార్జునుఁడు, నుజ్జయినిలో మహాకాళేశ్వరుఁడు, నోంకారక్షేత్రమునఁ బరమేశ్వరుఁడు, హిమవత్పర్వతమునఁ, గేదారేశ్వరుఁడు, డాకినీ క్షేత్రములో భీమశంకరుఁడు, వారణాసియందు విశ్వేశ్వరుఁడు, గౌతమీతీరమునఁ త్ర్యంబకేశ్వరుఁడు, చితాభూమిలో వైద్యనాథుఁడు, దారుకావనమున నాగేశ్వరుఁడు, సేతుబంధమున రామే

శ్వరుఁడు, శివాలయములో ఘుశ్మేశుఁడును ద్వాదశ జ్యోతిర్లింగ ములు. ప్రాతఃకాలమున వీని నెవరు పఠింతురో వారి సకల దురి తములును నశించి సర్వసిద్ధులును గలుగును. నిష్కాములై యే కాగ్రతతోఁ బఠించినవారు మఱల గర్భవాసము నొందక ముక్తు లగుదురు.

1. సోమనాథేశ్వరుఁడు :— ఈలింగము సౌరాష్ట్ర మున నున్నది. చంద్రునకు మామగారైన దక్షప్రజాపతి శాపము వలన క్షయరోగము రాఁగా, నతఁడు మృత్యుంజయ మంత్రమును దశకోటులు జపించి శంకరునిఁ బూజింపఁగా నాతఁడు ప్రత్యక్ష మై వర మొసంగెను. సోముని కోరికపైఁ బరమేశ్వరుఁ డుమా సహితుఁడై యచ్చట నుండెను. అతఁడే సోమనాథేశ్వరుఁడు. ఈ లింగము నర్చించినచో క్షయ కుష్ఠము మున్నగు వ్యాధులు నశించును.

2. మల్లికార్జునుఁడు :- శ్రీశైలక్షేత్రమున నున్న దీ లింగము. ఈ లింగమును సేవించినవారికి సర్వాభీష్టములు నెఱవేఱును. కుమారస్వామి కాగ్రహము గలిగి పార్వతీపరమే శ్వరులకుఁ జెప్పకుండఁగాఁ గ్రౌంచపర్వతమునకు రాఁగా నుమా శంకరులు కుమారుని విడిచి యుండలేక యిటకే వచ్చియున్నారు.

3. మహాకాలేశ్వరుఁడు :— దూషణుఁ డను దైత్య రాజు వేదధర్మములను బ్రాహ్మణధర్మములను, సర్వధర్మములను

నశింపఁజేయుచు నవంతీనగరమున వేదధర్మపరాయణులు, శివ పూజావిరతులు నగు నలుగుర విప్రులను హింసించుటచే వారు తదేకదీక్షతోఁ బార్థివలింగార్చన మొనరించుచుండిరి. ఆ విప్రులను సంహరించుటకు రక్కసులు రాఁగా నా పార్థివలింగమునుండి శఁకరుఁడు ప్రత్యక్షమై యా దూషణుని ససైన్యముగా సంహరించెను. ఆ విప్రుల కోరికపై మహాదేవుఁడు మహాకాలనామముతో లింగరూపమున నచ్చట నుంఁడెను. ఈ లింగదర్శనముచే సర్వాభీష్టసిద్ధి యగును.

4. ఓంకారేశ్వరుఁడు :— మేరునగముకన్న నాధిక్యముకావలె నని కాంక్షించి వింధ్యపర్వతము శివునిఁగూర్చి యోంకారక్షేత్రమున షణ్మాసములు తపింపఁగా శివుఁడు ప్రత్యక్షమై వరముఁ గోరు మనఁగాఁ దన మనోవాంఛలు సిద్ధింపవలె నని కోరెను. పరుల కపకారము కాని నీ వాంఛిత మీడేఱు నని వర మొసంగి ఋషులవినతిపైఁ బార్థివరూపుఁడుగను నాదస్వరూపుఁడుగను నిలిచి యోంకారేశ్వర నామముతో భక్తి ముక్తుల నొసంగుచుఁ బరమేశ్వరుఁ డుండెను.

5. కేదారేశ్వరుఁడు :- నరనారాయణులు బదరికాశ్రమమునఁ దప మొనర్చుచుఁ బార్థివలింగమును జిరకాలము పూజింపఁగా శంకరుఁడు ప్రత్యక్షమై వారిని వరము కోరుకొనుఁ డనెను. వారు "దేవా! నీ వీ స్వరూపముతోనే మా పూజాదికముల గ్రహింపు" మని కోరిరి. పరమేశ్వరుఁ డంగీకరించి హిమ

వన్నగ సామీప్యమున గేదారక్షేత్రమందు( గేదారేశ్వరు( డను నామముతో జ్యోతిర్లింగముగ నుండెను.

ఈ లింగము నర్చించిన సర్వ కిల్బిషములు హరించి సర్వదుఃఖములు శమించి యభీష్టములు నెఱవేఱును. స్వప్నమున( గూడ దుఃఖములు కలుగవు. ఈ లింగమునకు వలయావరణభూషణ మర్పించినచో శివలోకప్రాప్తి కలుగును. కేదారేశ్వరుని దర్శించి యా తీర్థమందలి యుదకమును ద్రావినచో( బునర్జన్మము లేదు. కేదారేశ్వరుఁడు సర్వకామప్రదుఁడు.

శ్లో॥ తత్రిత్యం వలయం యోవై దదాతి హరవల్లభః
హరరూపాంతికం తచ్చ హరరూపసమన్వితం॥
తథైవ రూపం దృష్ట్వా చ సర్వపాపైః ప్రముచ్యతే
జీవన్ముక్తో భవేత్సోఽపి యో గతో బదరీ వనే॥
దృష్ట్వా రూపం నరస్యైవ తథా నారాయణస్యహి
కేదారేశ్వర శంభోశ్చ ముక్తి భాగీ న సంశయః॥
కేదారేశస్య భక్తా యే మార్గస్థా స్తస్య వై మృతాః
తేఽపి ముక్తా భవం త్యేవ నాత్ర కార్యా విచారణా॥
గత్వా తత్ర ప్రీతియుక్తః కేదారేశం ప్రపూజ్య చ
తత్రిత్య ముదకం పీత్వా పునర్జన్మ న విందతి॥
... ... ... ... ... ...
సర్వకామప్రద శ్శంభుః కేదారాఖ్యో న సంశయః॥

( శివపురాణము )

**6. భీమేశ్వరుఁడు :–** కుంభకర్ణునకు( గర్కటియను భార్యయందు( బుట్టిన దనుజుఁడు భీముఁడు. మహాబలశాలి. గొప్ప

తపము నొనరించి వరము లొందినాఁడు సకల దేవతలను నృపా లురను జయించినాఁడు. అతఁ డొక నరపాలునిఁ జెఱలో బంధిం పఁగా నా రాజు మానసికముగ శివధ్యాన మొనరించుచు శివపూజా పరాయణుఁడై యుండెను. ఆ రాజును భీముఁడు ఖడ్గముతో ఖం డింపఁగా శివుఁడు వెలసి యా భీముని సంహరించినాఁడు. ఆ శివావ తారమే భీమేశ్వరుఁడు - అప్రదేశమే డాకినీక్షేత్రము. లోకో ద్ధరణకై బృందారక మునిబృందములు గోరఁగా నాక్షేత్రములో నతఁడు నిలిచెను.

7. విశ్వేశ్వరుఁడు :- కాశీక్షేత్రమున నున్న లింగ మిది. ఆ క్షేత్రమున మృతినందిన వారికి ముక్తి తథ్యము. బ్రహ్మ, విష్ణు, మహేంద్రాది విబుధు లెల్లపు డీ విశ్వేశ్వర లింగ మును సేవింతురు.

శ్లో॥ య శ్శివః స హి విశ్వేశః శక్తిర్యా సా చ పార్వతీ
మా యేతి కీర్త్యతే సృష్ట్యా మన్నపూ ర్ణేతి పాలనే
సంహృతౌ కాలరా త్రీతి త్రిధా సైకా ప్రకీ ర్త్యతే॥

ఎవఁడు శివుఁడని చెప్పఁబడుచున్నాఁడో వాఁడే విశ్వే శుఁడు. ఆయన శక్తిస్వరూపమే పార్వతి. ఆమె సృష్టిచే మాయ యనియుఁ బరిపాలనమున నన్నపూర్ణ యనియు సంహారమునఁ గాలరాత్రి యనియు మూఁడు విధములఁ గీర్తింపఁబడుచున్నది.

8. త్ర్యంబకేశ్వరుఁడు :- గౌతమీతీరమున నున్న లింగ మిది. గౌతముఁడు త్ర్యంబకక్షేత్రమునఁ దప మొనరింపఁగా

నీశ్వరుఁడు ప్రత్యక్షమై యాతని కోరికవలనఁ త్ర్యంబకేశ్వర నామముతో నచట నుండిపోయెను. నమ నపలముల నొసంగును.

**9. వైద్యనాథుఁడు :—** రావణునిచేఁదేఁబడిన శివ లింగము గోపబాలకునిచేఁ జితాభూమియందు స్థాపింపఁబడినది. ఆతఁడే వైద్యనాథేశ్వరుఁడు.

**10. నాగేశ్వరుఁడు :—** దారుకావనమున దండకుఁ డను దానవుని ఖండించుటకై నాగేశ్వరుఁ డను నామమున శివుఁ డవతరించెను. ఈ లింగము మహాపాపములఁ బోఁగొట్టును.

**11. రామేశ్వరుఁడు :—** సేతుబంధక్షేత్రమున శ్రీరామచంద్రమూర్తిచే స్థాపింపఁబడిన లింగ మిది. దీనిని బూజించిన సమస్తాఘములు నమసి శ్రీకంఠునకు శ్రీరామునకుఁ బ్రీతిపాత్రు లగుదురు. ఈ లింగమును గాశీగంగాజలముచే నభి షేకించినచో నభీష్టములు నెఱవేఱి పిదప మోక్షము లభించును.

**12. ఘుశ్మేశ్వరలింగము :—** దక్షిణభారతమున దేవగిరి యను గిరి యున్నది. దానిపై సుధర్ముఁ డను భూసురుఁ డుండువాఁడు. ఆతఁడు బ్రహ్మనిష్ఠాపరుఁడు, వేదమార్గ వర్త నుఁడు, నిత్యాగ్నిహోత్రి. ధనవంతుఁడు, దాత, శివారాధనా తత్ప రుఁడు. ఆతనిభార్య సుదేహ, మహాపతివ్రత. దేవాతిథిపూజా

నిరతురాలు. ఈ దంపతులకు సంతతి లేదు. సంతానము లేని విచార మా సుధర్మునకు లేదు. అతఁడు జ్ఞానికదా!

శ్లో॥ ఆత్మన స్తారక శ్చాత్మ హ్యాత్మనః పావన శ్చ సః
ఇత్యేవం మానసం ధృత్వా దుఃఖం న కృతవాం స్తదా॥

(శివపురాణము)

ఆత్మోద్ధరణ మొనర్చున దాత్మయే. అదియే యాత్మను బావన మొనర్చు నని మానసమున నిశ్చయించి యప్పుడు దుఃఖము వీడెను.

కాని సుదేహ కనపత్యత మిక్కిలి బాధాకరమైనది. ఆమె పతిని దర్శించి పుత్రోదయమున కేదేని సాధనము బోధింపుఁడని యర్థించినది. గొడ్రాలుగా జీవింపలే నని నిత్యము వేఁడుకొనెడిది. తాత్త్వికుఁడైన సుధర్ముఁ డిట్లు పలుకువాఁడు.

శ్లో॥ ... ... ... ... కిం పుత్ర శ్చ కరిష్యతి
కా మాతా కః పితా పుత్రః కో బంధు శ్చ ప్రియశ్చ కః
సర్వం స్వార్థపరం దేవి త్రిలోక్యాం నాత్ర సంశయః
జానీహి త్వం విశేషేణ బుద్ధ్యా శోకం న వై కురు
తస్మా ద్దేవి త్వయా దుఃఖం త్యజనీయం సునిశ్చితమ్
నిత్యం మహ్యం త్వయా నైవ కథనీయం శుభవ్రతే
ఏవం తాం సన్నివార్యైవ భగవద్ధర్మ తత్పరః
ఆసీ త్పరమసంతుష్టో ద్వన్ద్వదుఃఖం సమత్యజత్॥

(శివపురాణము)

"దేవీ! కుమారుఁ డేమిచేయును? తల్లి యెవతె? తండ్రి యెవ్వఁడు? పుత్రుఁ డెవ్వఁడు? బంధు వెవ్వఁడు? ప్రియుఁ డెవ్వఁడు? ముల్లోకములందు సర్వమును స్వార్థపరమే! బాగుగా నాలోచించి తెలిసికొని విచారము నందకుము. నీ విచారము త్యజింపఁదగినది. నిత్య మీవిషయము చెప్పనక్కఱలేదు." అని తన పత్నిని నివారించి భగవద్ధర్మమునం దాసక్తుఁడగు నా సుధర్ముఁడు మిక్కిలి సంతుష్టుఁడై సుఖదుఃములు. శోకమోహములు, కలిమిలేములు, క్షుత్పిపాసలు, శీతోష్ణములు మున్నగు ద్వంద్వములఁ బరిత్యజించినాఁడు. పరమేశ్వరారాధన మొనర్చుచుఁ బరమార్థదృష్టితో నుండు మని భార్య నూరడించుచుండువాఁడు.

సుదేహ యొకనాఁడు పొరుగింటికి వెడలినది. ఆ యింటి యామెతో నీమెకు వాదము కలిగి యా నిందాలాపములలో సుదేహను బొరుగింటి వనిత "నీవు గొడ్రాలవు. నీకీ గర్వ మెందులకు! ధన మున్న దని మిడిసిపడుదు వెందులకు? నీ వెనుకఁ దినువా రెవ్వ రున్నారు? నీ సొమ్ము పరుల పాలగుటయే కదా! నేను బుత్రవంతురాలను. నాకును నీకును సాటియా!" యని యెత్తిపొడిచినది. సుదేహ దుఃఖముతో నింటికిఁ బోయి భర్తకుఁ దన యవమానమును దెల్పి కుమారుఁడు కావలెనని పట్టుపట్టినది. సుధర్ముఁడు "సతీ? దూషణభూషణములను లక్షింపరాదు. దేహ మశాశ్వతమైనది. నీవు విచారింపకు" మని యెంతగాఁ జెప్పిననామె వినలేదు. తనకు సంతానయోగ్యత లేనిచోఁ దన చెల్లెలిని వివాహమాడి యామెవలనైనఁ బిలలను బడయు మని నిర్బం

ధించినది. ఆమెతోఁ బతి యనుచున్నాఁడు. "మఱల నేను వివాహముఁ జేసికొనుట యనఁగా మహాదుఃఖమును దెచ్చిపెట్టుకొనుట కాదా! దైవధ్యానము, భగవదారాధనముఁ గావించుకొనుచుఁ గాలము గడపు నాకెందుల కీ ధర్మవిఘ్నము? నన్ను దుఃఖసాగరమున ముంచకుము.

నీ చెల్లెలినే పెండ్లాడినను నీ కామెతో సఖ్యత లేకపో వచ్చును. ఆమెకు సంతానము గల్గినచో నీ కసూయ కలుగ వచ్చును. దానివలన నెన్ని యనర్థములో రావచ్చును. అందుచే ననర్థమూల మగు పునర్వివాహము నాకు వల" దని యెంత నచ్చఁజెప్పినను సుదేహ వినలేదు. పుట్టింటికిఁ బోయి తనసోదరి యగు ఘుశ్మను దెచ్చి తనపతి కిచ్చి పెండ్లిచేసినది.

ఘుశ్మ శివపూజానిరత. నిత్యము నేకోత్తరశత పార్థివ లింగముల కర్చనఁ జేసెడిది. పూజానంతరము సమీపమున నున్న కోనేటిలో నా పార్థివలింగములను గలుపుచుండెడిది. అట్లు చేయఁగాఁ గొన్నిదినములకు లక్షలింగముల పూజ పూర్తి యయ్యెను. సర్వకామఫల ప్రదాత యగు శంకరుని దయ కల్గెను. ఘుశ్మకుఁ బుత్రోదయ మయ్యెను. వారికే కాక వారి బంధుమిత్రు లందఱ కానందమై యెల్లరును వచ్చి ఘుశ్మను బ్రశంసించి వెడలుచుండిరి. ఆ ప్రశంసాదికములు సుదేహలో నీర్ష్యను గల్గించినవి. బాలుఁడు పెరిఁగి పెద్దవాఁ డగుచుండఁగా నుపనయన వివాహాదికములు జరిగించి సంతసించుచుండఁగా నామె యసూయ మఱింత హెచ్చుకొఁజొచ్చెను.

పతియు, సోదరియుఁ దనయం దనురాగము గలిగి యున్నను సుదేహ కసూయ మీఁదుమిక్కిలిగాఁ బెరిఁగి దుఃఖించు చున్నది. ఆమె దుఃఖము పోవలెనన్న సోదరిదుఃఖము కనులారఁ దాను జూడవలె ననియు, సోదరి దుఃఖింపవలె నన్న నామె కుమారుఁడు మృతుఁడుకావలె ననియుఁ దలంచి యా కుమారునిఁ జంప సంకల్పించినది. ఆమె నేడిపించినఁ గాని తనకు సంతోషము లే దవి భావించినది సుదేహ. ఈర్ష్య యావహించినచో యుక్తాయుక్తవివేక ముండదు. అ దెంత ఘోరము నైనఁ జేయింపఁ గలదు. సోదరి సంతోషమును జూడలేని సుదేహ యొకనాఁటిరేయి కుమారుఁడును గోడలును నిద్రించుచుండఁగాఁ దానే కత్తితోఁ బొడిచి యాకుమారునిఁ జంపి సమీపమున నున్న కొలనిలోఁ బాఱవైచినది. ఘుశ్మ పార్థివలింగముల గలుపునది యా తటాకమే. ఉదయమున లేచి పర్యక్కపై భర్త లేకపోవుటయు రక్తముతోఁ గూడిన మాంసఖండములు కొన్ని యుండుటయుఁ జూచిన కోడలు గోలుగోలున నేడ్చుచు నత్తమామలకుఁ జెప్పినది. సుదేహ లోన సంతసించియుఁ బైకేడ్చుచున్నది. పుత్ర సంహార దుర్వార్త నాలించియుఁ బార్థివలింగార్చనలో నున్న ఘుశ్మ యించుకయుఁ జలింపలేదు. సుధర్ముఁడును నిత్య కర్మానుష్ఠానమునుండి లేచి రాలేదు. ఏ భగవానుఁడు మాకుఁ బుత్రోత్పత్తిని గలిగించినాఁడో ఆ భగవానుడే మా కుమారుని రక్షింపఁ గలఁడని ధైర్యము వహించి యీశ్వరార్చనా నిమగ్ను లైనా రా పుణ్యదంపతులు. పూజ పూర్తియై పార్థివలింగములను గొల

నిలోఁ గలిపివచ్చినది ఘుశ్మ. తత్క్షణమే తటాకగర్భమునుండి యామె మృతపుత్రుఁడు జీవితుఁడై లేచి వచ్చి తల్లి దండ్రులకు నమస్కరించి శంకరానుగ్రహమున జీవించితి నని తెల్పినాఁడు. ఘుశ్మయు జ్ఞానవంతురా లగుటచే నాతఁడు మరణించె నని విచారించలేదు. మఱల జీవించె నని సంతసించలేదు. జ్యోతిస్స్వరూపుఁడై పరమేశ్వరుఁ డామెకుఁ బ్రత్యక్షమై "ఘుశ్మా! నీ భక్తి ప్రపత్తులకు సంతోషించితిని. నీ కే వరము కావలెనో కోరుము. నీ సోదరి సుదేహ నీ పుత్రునిఁ బరిమార్చి నీటిలో విసరినది. దానిని నా త్రిశూలముచే సంహరింతు" ననఁగా ఘుశ్మ నమస్కరించి "పరమేశ్వరా! ఆమె నా సహోదరి. ఆమెను సంహరింప వలదు రక్షింపు"మన్నది. "వనితా! నీ కపకృతిని గావించిన దుష్టను నష్టపఱుపవలదా! శిక్షించి తీఱవలసినదే" యని గౌరీనాథుఁ డనఁగాఁ "ప్రభూ! మీ దివ్యదర్శన భాగ్యమున నామెపాప మంతయు నశించునుగదా! అపకారి కుపకారము చేయుటయే కదా ధర్మము! నాయం దనుగ్రహ ముంచి యామెను క్షమింపు" మని ఘుశ్మ వేఁడుకొనినది. ఆమె విజ్ఞప్తిపై సుదేహను విడిచి "ఘుశ్మా! నీ గుణసంపదకు మిక్కిలి సంతోష మైనది. నీ యభిలషిత మీడేర్తు"నని శర్వుఁ డనఁగా "మహేశా! లోకోపకృతికై ఘుశ్మేశ్వరనామముతో నీ విందే యుండవలసిన"దని ఘుశ్మ కోరినది. గరళకంఠుఁ డక్కడ వెలసినాఁడు. ఆ కొలనువిండ శివలింగము లుండి యున్నందున దాని దర్శన మాత్రమున సకల పాతకములు నశించును.

ఘుశ్మతోఁ బరమేశ్వరుఁడు "నీ వంశమున నూటొక్క-తరము వఱకు విద్యావంతులు ధనవంతులు నారోగ్యవంతులు భక్తిమంతులు జనించి జీవించి తరింతురు. నీకు సకల శుభములు గలుగు" నని యదృశ్యుఁ డయ్యెను. వారందఱా ఘుశ్మేశలింగమునకు నూటొక్క-ప్రదక్షిణనమస్కా-రము లాచరించి పూజిం ...

ఇంతయుఁ జూచుచున్న సుదేహ సిగ్గుపడి తన యకృత్యమునకుఁ బశ్చాత్తప్తయై ఘుశ్మాసుధర్మల కాళ్లపైఁ బడి క్షమింపఁ గోరినది. తన పాపపరిహారమునకై యనేక శివవ్రతము లొనరించినది. ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటియైన ఘుశ్మేశలింగ దర్శన సమర్చనములచేఁ బాపముక్తులై మానవులు సర్వసుఖములఁ గాంచఁగలరు.

# ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రము

శ్లో॥ సౌరాష్ట్రదేశే విశ దేఽతి రమ్యే
జ్యోతిర్మయం చంద్రకళావతంసమ్
భక్తిప్రదానాయ కృపావతీర్ణమ్
తం సోమనాథం శరణం ప్రపద్యే॥

శ్లో॥ శ్రీశైలసంగే విబుధాతిసంగే
తులాద్రి తుంగేఽతిముదా వసంతమ్
త మర్జునం మల్లికపూర్వ మేకం
నమామి సంసారసముద్ర సేతుమ్॥

శ్లో॥ అవంతికాయాం విహితావతారం
ముక్తిప్రదానాయ చ సజ్జనానామ్
అకాలమృత్యోః పరిరక్షణార్థం
వందే మహాకాల మహామరేశమ్॥

శ్లో॥ కావేరికా నర్మదయోః పవిత్రే
సమాగమే సజ్జన తారణాయ
సదైవ మాంధాతృపురే వసంత
మోంకార మీశం శివ మేక మీడే॥

శ్లో॥ మహాద్రిపార్శ్వే చ తటే రమంతం
సంపూజ్యమానం సతతం మునీంద్రైః
సురాసురై ర్యక్ష మహోరగాద్యైః
కేదార మీశం శివ మేక మీడే॥

శ్లో॥ యో డాకినీ శాకినికా సమాజైః
నిషేవ్యమాణః పిశితాశనైశ్చ
సదైవ భీమాది పదప్రసిద్ధం
తం శంకరం భక్తహితం నమామి॥ ౬

శ్లో॥ సానంద మానందవనే వసంత
మానందకందం హతపాప బృందమ్
వారాణసీనాథ మనాథనాథమ్
శ్రీ విశ్వనాథం శరణం ప్రపద్యే॥ ౭

శ్లో॥ సహ్యాద్రిశీర్షే విమలే వసంతం
గోదావరీతీర పవిత్ర దేశే
య ద్దర్శనా త్పాతక మాశు నాశం
ప్రయాతి తం త్ర్యంబక మీశ మీడే॥ ౮

శ్లో॥ పూర్వోత్తరే ప్రజ్వలికా నిధానే
సదా వసంతం గిరిజా సమేతమ్
సురాసు రారాధిత పాదపద్మం
శ్రీ వైద్యనాథం త మహం నమామి॥ ౯

శ్లో॥ యామ్యే సదంగే నగరేఽతి రమ్యే
విభూషితాంగం వివిధైశ్చ భోగైః
సద్భక్తిముక్తిప్రద మీశ మేకం
శ్రీనాగనాథం శరణం ప్రపద్యే॥ ౧౦

శ్లో॥ సుతామ్రపర్ణీ జలరాశి యోగే
నిబద్ధ్య సేతుం విశిఖై రసం ఖ్యైః
శ్రీరామచంద్రేణ సమర్పితం తం
రామేశ్వరాఖ్యం నియతం నమామి॥ ౧౧

శ్లో॥ ఇలాపురే రమ్యవిశాలకేఽస్మిన్
సముల్లసంతం చ జగద్వరేణ్యం
వందే మహోదారతర స్వభావం
ఘుశ్మేశ్వ రాఖ్యం శరణం ప్రపద్యే॥ ౧౨

శ్లో॥ జ్యోతిర్మయ ద్వాదశ లింగకానాం
శివాత్మనాం ప్రోక్తమిదం క్రమేణ
స్తోత్రం పఠిత్వా మనుజోఽతిభక్త్యా
ఫలం తదాలోకనజం భజేచ్చ॥ ౧౩

(శ్రీశంకరాచార్య కృతము)



## శంకరుని దశావతారములు

శంకరుఁడు పదియవతారముల నెత్తినాఁడు. పది యవతారములలోను బార్వతియుఁ బదిరూపములతో జనియించి యాతనికిఁ బత్నియైనది.

ఈశ్వరుని మహాకాలావతారమునఁ బార్వతి మహాకాళి యైనది. తారకేశ్వరావతారములోఁ దారాదేవి; భువనేశ్వరరూపమున నామె భువనేశ్వరి యైనది. శ్రీవిద్యేశ్వర (షోడశేశ్వర) రూపమున షోడశిగాఁ బుట్టినది. భైరవావతారమున భైరవిగా జనియించినది. ఛిన్నమస్తకావతారమున ఛిన్నమస్తకిగాను, ధూమేశ్వరునకు ధూమావతిగాను, భగళావతారములో భగళాముఖిగాను, మాతంగేశ్వరునకు మాతంగిగాను, గమలావతారములోఁ గమలగాను జన్మించినది. ఈ పార్వతీపరమేశ్వరుల దశావతారములను మిక్కిలి శక్తిమంతము లైనవి, వీరిని సేవించిన భక్తులకుఁ బరమేశ్వరుఁడు భక్తిని ముక్తిని బ్రసాదించును.

పంచభూతలింగములు :— 1. బృథివీలింగము — కంచిలోని యేకామ్రేశ్వరలింగము. 2. ఆపోలింగము — జంబుకేశ్వరుఁడు. 3. తేజోలింగము — అరుణాచలములోనిది. 4. వాయులింగము — కాళహస్తిలోనిది. 5. ఆకాశలింగము — చిదంబరములోనిది.

పంచముఖనామములు :— ఈశ్వరునకు — ఈశాన. తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాత ముఖము లను నైదు ముఖము లున్నవి.

# ఏకాదశరుద్రులు

దానవులు దివౌకసులను బాధించి పాఱఁదోలి స్వర్గము నాక్రమించుకోఁగా దేవతలు తండ్రియగు కశ్యపప్రజాపతికడ కేఁగి తమ యాపదలను విన్నవించుకొనిరి. ప్రజాపతియు వారి కష్టములు తొలఁగు నుపాయము గోచరింపక కాశికేఁగి గంగాస్నాన మొనరించుచు నిత్యకర్మానుష్ఠానపరుఁడై విశ్వేశ్వరుని ధ్యానించు చుండెను. సద్వర్తనులైన సుమనసులకు శ్రేయముఁ గలిగించు టకై ప్రజాపతి తప మారంభించెను. కొలఁది కాలమునకుఁ జంద్రశేఖరుఁడు ప్రత్యక్షమై వరముఁ గోరు మనఁగాఁ గశ్యపుఁ డానందముతో వందన మొనరించి స్తుతించి "మహాదేవా! నా పుత్రిలలో దేవతలు రాక్షసులచేఁ గష్టము లనుభవించుచున్నారు. వారియాపదలు తొలఁగి క్షేమముగ నుండున ట్లనుగ్రహింపు" మని కోరెను. గౌరీమనోహరుఁ డటులే వర మొసంగి యంత ర్ధానుఁ డయ్యెను. పిమ్మటఁ గశ్యపప్రజాపతికి సురభి యను భార్యయందుఁ బరమేశ్వరుఁ డేకాదశ రూపములతో నవతరించెను. కపాలి, పింగళుఁడు, భీముఁడు విరూపాక్షుఁడు, విలోహితుఁడు, శాస్త, అజపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, శంభుఁడు, చండుఁడు, భవుఁడు ననువారలే యేకాదశరుద్రులు. వీరినే కాశ్యపులనియు నందురు. వీరు దేవతలతోఁ గలిసి దానవులతోఁ బోరాడి జయిం చిరి. వీ రెల్లపుడు సురసంరక్షణఁ గావించుచు స్వర్గమున నీశాన్య దిశయం దుందురు.

# సతీ వివాహము

దక్ష ప్రజాపతికి భార్య వీరిణి. ఆ దంపతుల కాదిశక్తి పుత్రియై జన్మించెను. ఆ జననకాలమున సురదుందుభులు మ్రోగి నవి. లోకము లన్నియు మంగాళాన్వితము లైనవి. మహోత్స వము లెన్నియో జరిగినవి. దక్షుఁ డా జగదంబికను స్తుతించెను. విష్ణ్వాది దేవతలెల్లరు నా దేవిని వినుతించినారు. ఆ బాలికకు దక్షుఁ*డుమ యని నామకరణముఁ గావించెను. ఆమెయే సతి. ఆమె యనేక విచిత్ర లీలలఁ గావించుచు వివిధనామములతో విరా జిల్లు చున్నది. బాల్యమునఁ దోటిబాలికలతో నాడుకొనుచు శివగీత ములఁ బాడుచు శంకరుని ప్రతిరూపముల లిఖించుచుండెడిది.

సతి యొకనాఁడు తండ్రికడ నుండఁగాఁ బరమేష్ఠి నారదు నితో వారియొద్దకు రాఁగా దక్షుఁడు సగౌరవముగా నర్ఘ్యపాద్యాదు లచేఁ బూజించి నమస్కరింపఁగా సతియు నతి యొనర్చినది. వా రామెను జూచి "సతీ! నీవు జగదీశ్వరుని పత్ని వగుదు" వని యాశీర్వదించి వెడలిపోయిరి.

సతి, శంకరుఁడు తన నుద్వాహ మాడునో యాడఁడో యనెడి భీతిచేఁ దనయింటనే తప మొనరించుచు నందావ్రత

*శ్లో॥ త దో మేతి నామ చక్రే తస్యా దక్షః తదాజ్ఞయా
ప్రశస్తా యాః సర్వగుణ సత్త్వా దపి ముదాన్వితః॥

(శివపురాణము)

మారంభించి సర్వవేళల నీశ్వరధ్యానము గావించుచుండెను.

ఆమె తపమునకు ముద మంది సతీయుతులై విధాతయు వాసుదేవుఁడును వచ్చి యామెకుఁ బ్రణమిల్లి కైలాసమున కరిగి శర్వుని స్తోత్ర మొనరించిరి. సర్వజ్ఞుఁడు బ్రహ్మాది బృందారకుల రాకకుఁ గారణ మడుగఁగా "దైత్యుల దుర్మార్గవర్తన మమిత మైనది. వారిని సంహరించి లోకకల్యాణము గావించుటకై దక్ష పుత్రి యగు సతిని బరిణయ మాడి మ మ్ముద్ధరింపు" మని వా రర్థించిరి. ఈశానుఁ డంగీకరించెను.

నందావ్రత పరిసమాప్తి యైనంతనే సతికిఁ గైలాసపతి దర్శన మొసఁగి నీ యాప్సితార్థముగ నిన్నుఁ బెండ్లియాడుదు నని వర మొసంగి వెడలిపోయెను.

పిమ్మట సర్వేశ్వరుఁడు స్రష్టను సంస్మరింప నాతఁడు వచ్చి యాజ్ఞ యే మన నాతనిని దక్షునిపాలి కరిగి యాతని పుత్రి కను దన కొసఁగునట్లు చెప్పు మనెను. విధాత దక్షునింటికి రాఁగా నాతఁడు పూజించి సుఖాసనాసీనుఁ గావించినపిదప బ్రహ్మ యిట్లు మడివెను. "ప్రజాపతీ! నీ పుత్రిక తపమునకు వ్రతదీక్షకు మెచ్చి శర్వుఁడు వర మిచ్చెను. ఆమె శంకరుని పత్ని యగుటకే జన్మించినది. నే నందులకే వచ్చితిని. నీవు నీ పుత్రి నాతని కిచ్చి కల్యాణముఁ గావించి లోకకల్యాణ మొనరించి నీవుతరింపు" మనఁగా దక్షప్రజాపతియు భార్యయు సమ్మోద మందినారు.

పితామహుఁడు వెడలి పశుపతితో దక్షుని యంగీకారము నెఱిఁగించెను. సుముహూర్తము నిశ్చయింపఁబడినది. బ్రహ్మ విష్ణు మహేంద్రాది సురలు, నారదాది మహర్షులు వెంట రాఁగా శ్రీకంఠుఁడు దక్ష నింటి కరిగెను. దక్షుఁడు సతీమహేశ్వరుల వివాహము లోకోత్తరముగా వైభవోపేతముగా జరిగించెను. సురబృందములు సతీసదాశివ దంపతుల ననేకవిధముల నుతించిరి.



# సతీ సర్వేశ్వర విహారము

శంకరుఁడు సతీదేవితో నందివాహ నారూఢుఁడై భూలోక విహార మొనరింపుచుండఁగా దండకారణ్య ప్రాంతమున సీతా న్వేషు లైన రామలక్ష్మణులు కనిపించిరి. అంత శివుఁడు వాహ నము దిగి యెదు రేఁగి శ్రీరామునకు భక్తినమ్రుఁడై నమస్క రించెను. వారితోఁ గొంతసేపు ముచ్చటించి వారిని విడిచి మఱల సతీసామీప్యమునకు వచ్చెను. అపుడు సతి శూలిని "నాథా! మీరు జగత్పూజ్యులు సర్వేశ్వరులును గదా! మానవమాత్రుఁ డైన రామునకు వందన మిడినా రేమి?" యని ప్రశ్నించినది. చంద్ర మౌళియు "శ్రీరాముఁడు నారాయణుని పరిపూర్ణావతారముగాన నాకు వందనీయుఁడే. లక్ష్మణుఁ డాదిశేషుని యవతారము. వా రిర్వురు సీతాన్వేషణమున నున్నా" రని బదులుచెప్పెను. అంత నామె "యిది మిగుల విచిత్రము. నారాయణుఁడు నరుఁడుగా జన్మించుటయు భార్యకై వెదకుటయునా! నాకు నమ్మకము లే"దనినది. ఆదిశక్తి యగు నా సతియు శివమాయా మోహిత యగుటచేతనే శంకించినది. "అటులైన నీవే పరీక్షించుకొనుము. యథార్థము నీకే గోచర మగు" నన్నాఁడు శశిశేఖరుఁడు.

సతి వారినిఁ బరీక్షింపనెంచి సీతవేషమును ధరించి రాముఁడు నారాయ ణావతారుఁ డగుచో నా యథార్థరూపమును

గుర్తింపఁగలఁడు. లేదా మోహవశుఁడు కాఁగలఁ డని యనుకొని రాముని దగ్గఱకు నడచినది. ఆమె కన్పడినవెంటనే రాముఁడు నమస్కరించి "యమ్మా! సతీ! సర్వేశ్వరుఁడు లేకుండ నొంటరిగ వచ్చితి వే మమ్మా! వాగర్థములవలె, సూర్య తేజములవలె మీరును విడువకుండ నుండవలసిన వారు గదా! అతఁ డేఁడమ్మా! ఈ మాఱువేష మెందులకుఁ దల్లీ!" యని యడిగెను. ఆ యమృత వాక్యములు విన్న సతి కానందము తోడి యాశ్చర్యము గలిగి పతిని స్మరించుకొని రామునిఁ బరికించి "రామచంద్రా! నా పతి యా వృక్షచ్ఛాయను గూర్చుండెను. నాకుఁ గలిగిన సందేహము నివృత్తిఁ గావించుకొనుటకై నేను వచ్చితిని. మహేశ్వరుఁడు జగద్వంద్యుఁడు గదా? ఆయన నీకు వందన మొనరించుటకుఁ గారణ మేమి?" యని ప్రశ్నించినది. రాముఁ డిట్లు చెప్పెను.

"పూర్వము గంగాధరుఁడు గోశాల నొకటి విశ్వకర్మచే నిర్మింపఁజేసి సకల దేవతాసమక్షమున శ్రీహరినిఁ బిలిచి సింహాసన మునఁ గూర్చుండఁబెట్టి సర్వలోకాధిపతిగ నాతనికిఁ బట్టముఁ గట్టి తానును బ్రహ్మాది సకలదేవతలును నమస్కరించిరి. తాను వరదుఁడు భక్తవత్సలుఁ డయ్యును మహేశ్వరుఁడు గోవిందుని 'నీవు జగత్పూజ్యుఁడవు. జగత్పతివి. నిర్జయుఁడవు. నీ కిచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి మున్నగు శక్తుల నిచ్చుచున్నాను. మాయా శక్తిని గూడ నిచ్చితిని. నీవు నా వాఁడవు. జగత్కార ణుఁడ వౌదువు. అవతారముల ధరించి లోకరక్షణ మొనరింపు'

మని నుతించి లోకోత్తరమైన గోలోకము సృజించి యాతని నచ్చట భోగము లనుభవింపుచు నుండు మని యాన తిచ్చెను. ఆ గోవిందుఁడే శివాజ్ఞచే దైత్యసంహార మొనరింప రాముఁడుగా జనించెను. అందువలననే యాయన నాకు నమస్కరించెను. మాతా! ఆదిదంపతు లగు మీ దర్శనభాగ్యముచే నా పత్ని జాడయుఁ దెలిసి యసురసంహార మొనరించి శుభము నందఁగల నని విశ్వసించుచున్నా" నని యామెకు నమస్కరించినాఁడు.

సతి యచటినుండి పతిసన్నిధి కరిగి వృత్తాంత మంతయు వివరించి భర్తమాటను విశ్వసింపనందులకుఁ దనకుఁ గలిగిన యవమానమునకుఁ గించపడఁగా శూలి యామె నోదార్చి నంది వాహనముపై నిర్వురును గైలాసమున కరిగినారు.



# సతీ దేహ త్యాగము

సతీసర్వేశ్వరులు కైలాసమున సుఖోపవిష్టులై యుండఁగా సకలదేవత లా దంపతులను దర్శింప నేఁగిరి. వారితో దక్షుఁడును బత్నియు వెడలిరి. సతీపరమేశ్వరులు దేవతలతోపాటుగనే దక్షుని, భార్యను గౌరవించిరి. *దేవతలకన్న నధికముగఁ దమ్ముఁ గౌరవింప లేదని కోపించి వెడలి ప్రతీకారముగ దక్షుఁ డొకయజ్ఞము నారంభించి శివునితో విరోధము వహించి తన పుత్రికలను, నల్లుండ్ర నందఱను బిల్చి సతీసర్వేశ్వరుల నాహ్వానింపకుండెను. తండ్రి మఖదీక్షితుఁ డయ్యె నని తెలిసికొని దాక్షాయణి తండ్రి పిలువకున్నను బుట్టింటి కేఁగినది. వచ్చిన యాఁడుపడుచును దల్లి దండ్రులు గాని సోదరీజనులు గాని యాదరింపలేదు. స్వజన నిరాదరణమునఁ గ్రుద్ధురాలై "తండ్రీ! బ్రహ్మాదిదేవతలచే నర్చింపఁబడు మహాదేవు నేల నిరసించితివి? నా తోఁబుట్టువుల నందఱ నాదరించి న న్నేల యనాదరించితి" వనఁగా "నీకన్న, నీపతికన్న వారు శ్రేష్ఠు లగుటచే వారినిఁ బూజించితిని. నీభర్త స్థాణుఁడు, తామసుఁడు, నమంగళుఁడు, వేదబాహ్యుఁడును. అట్టి వాని పత్ని వగుట నీవును గౌరవింపఁదగ" వని తండ్రి యనెను. అంత సతి మండిపడి

---

* దేవాదిభ్యో విశేషేణ న కదాచి దభూత్ స్మృతిః
తస్య తస్యాః పరం భావ మజ్ఞాతు శ్చాపి కేవలమ్
ష తీర్థే త్వేవం విమూఢస్య తస్యాం వైర మజాయత॥ (శివపురాణము)

శ్లో॥ అనాహూత స్త్వయా కస్మా చ్ఛంభుః పరమశోభనః
యేన పూత మిదం విశ్వం సమగ్రం సచరాచరమ్।
యస్య స్మరణమాత్రేణ సర్వం పూతం భవ త్యహో
వినా తేన కృతం సర్వ మపవిత్రం భవిష్యతి॥
శి వేతి ద్వ్యక్షరం యస్య నృణాం నామ గిరేరితం
సకృ త్ప్రసంగా త్సకల మఘ మాశు నిహంతి తత్॥

(శివపురాణము)

పరమశోభనుఁ డైన శంకరు నేల పిలువలేదు? ఆతనివలన నీ విశాల విశ్వ మంతయుఁ బూత మగుచున్నది. ఆతని స్మరణ మాత్రముచే సర్వమును బవిత్ర మగును. ఆతఁడు లేకుండఁ జేసిన సర్వము నపవిత్రమే యగును. 'శివ' యను రెండక్షరములు ప్రసంగవశమున నైన నొకసారి యుచ్చరించినచో మనుజుల పాతక మంతయు వెంటనే నాశన మగును.

శ్లో॥ విద్యాచోరో గురుద్రోహీ దేవేశ్వర విదూషకః
త్రయైతే బహుపాప్మాన స్సర్వే దండ్యా ఇతి శ్రుతిః॥

విద్యాచోరుఁడు, గురుద్రోహి, పరమేశ్వరదూషకుఁడు, మహాపాపులు దండనార్హు లని వేదము చెప్పుచున్నది. దేవేశ్వరుఁ డైన శివుని నిందించి యవమానించిన నీకుఁ గులక్షయ మగు నని శపించి యామె యచటనే శరీరత్యాగ మొనరించెను. సతీదేహత్యాగవార్త విని మహాదేవుఁడు వీరభద్రుని సృజించి దక్షాధ్వర ధ్వంసము నొనరింపఁజేసెను. దక్షాధ్వర సభా మధ్యమున శరీరమును ద్యజించిన సతీదేవి హిమవంతునకుఁ బుత్రికగా జనియించి పార్వతి యైనది.

# పార్వతీ పరిణయము

శ్రీమన్నారాయణుని సన్నిధికి దేవత లందఱు నరిగి లోకకంటకుఁ డైన తారకాసురుఁడు గావించు దుర్నయముల వివరించి యాతని బాధలను భరింపలే మని మమ్మందఱను సంరక్షింపు మని ప్రార్థించినారు. నారాయణుఁ డాలోచించి తారకా సుర సంహారమునకు *సప్తదిన వయస్కుఁడైన పరమేశ్వర నందనుఁ డొక్కఁడే శక్తుఁ డనియు వేఱొకరివలన నా రక్కసుఁడు మరణింపఁ డనియుఁ బరమేశ్వరుఁడు సతీవియోగమున నున్నందున నాతనికిఁ బునర్వివాహము జరుగునట్లు చూడవలె ననియుఁ జెప్పెను. వధు వెవ్వరని సమాలోచించిరి. "ఆదిశక్తి యగు దుర్గాదేవిని దపస్సుచే మెప్పించి యామె భూలోకములో

---

బ్రహ్మోవాచ :

శ్లో॥ అవధ్యః తారకో దైత్యః సర్వై రపి సురాసురైః
యస్య వధ్యః సనాద్యాపి జాత స్త్రిభువనే పుమాన్
మయా స వరదానేన చ్ఛందయిత్వా నివారితః
తపసః సాంప్రతం రాజా త్రైలోక్య దహనాత్మకః
స తు వవ్రే వధం దైత్యః శిశుతః సప్తవాసరాత్
స తు సప్తదినో బాలః శంకరాద్యో భవిష్యతి
తారకస్య విహంతా స భాస్కరాభో భవిష్యతి
సాంప్రతం చాప్యపత్నీకః శంకరో భగవాన్ ప్రభుః
హిమాచలస్య దుహితా యా చ దేవీ భవిష్యతి
తస్యాః సకాశా ద్యః సూను రరణ్యాః పావకో యథా ॥

(పద్మపురాణము)

హిమవత్పర్వత పుత్రికగా జన్మించునట్లు చేయవలెను. మీ రందఱు హిమవంతుని యొద్ద కరిగి యాతని భార్యయగు మేనకచే దుర్గాదేవినిగూర్చి తపమును గావింపఁజేయుఁ" డని శ్రీహరి చెప్పెను.

దేవత లందఱు హిమవంతునిఁ జేరి విషయమును వివరించి మేనకను దపమునకుఁ బంపఁగోరిరి. పరమానందముతోఁ బర్వత రాజు పత్నినిఁ బంపినాఁడు. ఆమె యట్లు కొంతకాలము తప మాచరింపఁగా నాదిశక్తి ప్రత్యక్షమై యభీప్సిత మే మనఁగాఁ దనకు బలవంతులు, గుణవంతులు నగు నూఱుగురు పుత్రుల నను గ్రహించి యామెనే పుత్రికగా జనింప వరముఁ గోరినది మేనక. ఆమె వరము నొసంగినది. అట్లు జనియించిన కుమార శతములో జ్యేష్ఠుఁడే మైనాకుఁడు. మంచిబలశాలి. ఇంద్రుఁ డాతని ఱెక్కలను ఖండింపలేకపోయెను.

క్షీరసాగరమున లక్ష్మి యుద్భవించినట్లు జగదంబిక మేనకాదేవి గర్భమున జన్మించెను. ఆ సమయమున విష్ణ్వాది దేవత లందఱు నరుదెంచి స్తోత్ర మొనరించిరి.

గీ. కాళి । కామేశ్వరి। శివ। కామసుంద
రి। లలిత । ఆర్య చండిక । బాల। యనుచుఁ
బేరులను బెట్టి యెంతయుఁ బ్రియము మెఱయఁ
బిలిచి రా బాలికను నింపుపెంపుఁ గదుర.

క. పర్వతపతియౌ హిమవ
త్పర్వతమున కెలమినిడు నపత్యం బగుటన్
బార్వతి యను పేరును నీ
యుర్విన్ గై సేసె నాపె యుచితవిధముగాన్.

గీ. అఖిల జగదంబయై సముదారకరుణ
జగములన్ గాచుచుండుటఁ జక్క నుమ య
టంచుఁ బేరును దాల్చి యీ యవనియందుఁ
బరఁగె నెల్లర మదులకు మురుపు నిడుచు.

(ఆంధ్ర శివపురాణము)

శ్లో॥ నామాకరోత్పుత్ర్యా యాస్తు కాళీత్యాది సుఖప్రదమ్॥

శ్లో॥ ఉమేతి మాత్రా తపసో నిషిద్ధా కాలికా చ సా
పశ్చాదుమాఖ్యాం సుముఖీ జగామ భువనే మునే॥

(శివపురాణము)

ఆ బాలిక పెరిఁగి పెద్దది యగుచుండెను. ఒకనాఁడు నారదమహర్షి హిమవంతునొద్దకు రాఁగా మేనకాహిమవంతులు తమపుత్రికనుఁ జూపి యామె హస్తమును దిలకించి సాముద్రిక ఫలముఁ దెలుపవలసినదిగాఁ గోరిరి. సకౌతుకముగా నారదుఁ డామెచేతిలోని రేఖలు పరిశీలించి "యిందలి రేఖ లన్నియు మిక్కిలి యోగ్యములై యీామె భవిష్యజ్జీవిత ముజ్జ్వల మగునది యని ప్రకటించుచున్నవి. కాని యొక్క విలక్షణరేఖ యున్నం దునఁ దత్ఫలముగా నీమె పతి దిగంబరుఁడు, కామరహితుఁడు,

మానములేనివాఁడు, తల్లిదండ్రులులేనివాఁడు, యోగి, యమంగళ వేషధరుఁడు నగును." అని చెప్పఁగాఁ దలిదండ్రు లెంతయుఁ జింతించిరి కాని చాటునుండి వినుచున్న పార్వతి మిక్కిలి సంత సించినది. అట్టిలక్షణములు గల పరమేశ్వరుఁడే తనకు భర్త యగు నని యానందించినది.

హిమవంతుఁడు "నారదమహర్షీ! మీ యాశీర్వచన మమోఘము. యోగ్యుఁడగు భర్త లభించున ట్లీమె నా దింపుఁ" డని యర్థించెను.

"నగరాజా! ఈ లక్షణము లన్నియుఁ బరమేశ్వరుని యొక మంగళప్రదములే. శుభంకరుఁడు, సంపద్దాత, పరమేశ్వరుఁడే. ఆ మహేశ్వరుఁడు తపస్సుచేఁ గాని స్వాధీనుఁడు కాఁడు. కావున నీ పుత్రికచేఁ గొంతకాలము తప మొనరింపఁజేయుము. తత్ఫల ముగా నాతఁడు నీ యల్లుఁ డగు" నని తెలిపి నారదుఁడు వెడలి పోయెను. నాఁటి రాత్రి బ్రాహ్మముహూర్తమునఁ బార్వతి కొక స్వప్నము వచ్చెను. అందుఁ దపశ్శాలి యొకఁడు గన్పట్టి యీశ్వ రానుగ్రహమునకై తపము చేయు మని యామెకుఁ దెలిపెను. ఆ రేయినే హిమవంతునకు నొక కల వచ్చి యందు నారదుఁడు చెప్పిన లక్షణములు గలవాఁ డొకఁడు తమ పర్వతము మీఁదికిఁ దపస్సునకై వచ్చినట్లు, నా తపస్వికిఁ దమకుమారినిఁ బరిచర్యకై తీసికొనివెడలి బహుప్రియాసపడి యాతని నొప్పించి యప్పగించి వచ్చినట్లును దోఁచెను.

ఈ రెండు స్వప్నములను సమన్వయించుకొని యనన్య కాలములో మంచిఫలము గలుగనున్న దని యా కొండఱేఁడు మురిసిపోయెను. అంత కొలఁదికాలముననే పరమేశ్వరుఁడు తప మొనరింప నా హిమవన్నగముననే యరుదెంచినాఁడు.

హిమాద్రి గంగాజన్మస్థలము. పరమపవిత్ర మైనది. దేవత లెందఱో తప మాచరించిన పుణ్యస్థలము. అందుచే మహేశుఁడు వేంచేసినాఁడు. ఆతనినిఁ జూచి సంతుష్టుఁడై పర్వతపతి "మహేశా! నా భాగ్యవశమునను దైవవశమునను నాపైఁ దప మొనరింప మీ రరుదెంచినారు. ఇది నా పూర్వజన్మ సుకృతము. మీరు నా యింటికి వచ్చుట నా కిందప్రపదవి నిచ్చుట! నా జన్మము ధన్యము. మీ రిచట నిర్విఘ్నముగాఁ దప మాచరింపుఁడు. మీ సేవఁ జేయుచు దాసుఁడనై యుందు" నని విన్నవించెను. తన పరివార మెవ్వరి నా తపోభూమికి వెడలవల దని వారి తపశ్చర్య కెట్టి విఘ్నమును గలుగకుండఁ జూడవలెనని యాజ్ఞాపించెను. పరమేశ్వరుఁ డందుల కంగీకరించి తప మొనరించుకొను చుండెను.

శైలపతి, పార్వతిని వెంట నిడుకొని పువ్వులును బండును దీసికొని పరమేశ్వరసాన్నిధ్యమున కరుదెంచి యామెచే నా పూలను బండ్లను సమర్పింపఁజేసి వందన మొనరింపఁజేసి "స్వామీ! ఈ నా పుత్రిక తమ సేవఁ జేయు నభిలాషతో వచ్చి నది. మా యం దనుగ్రహ ముంచి యీమె పరిచర్యను బరిగ్ర

హింపు”డని దోసిలి వట్టి వినమ్రుఁడై ప్రార్థించెను. ఒక్కపరి శివుఁడు కనులు విప్పి కన్యను గాంచి మఱల ధ్యానములో మునిఁగెను. మఱల హిమవంతుఁడు సభక్తికముగా నర్థింపఁ గన్నులఁ దెఱచి యిట్లు పలుకుచున్నాఁడు శూలి.

స్త్రీ యనిన మాయామయి యని కదా శాస్త్రములు చెప్పు చున్నవి. నీ దుహిత రూపహిత, తపోవిఘ్నకారిణి కావచ్చుఁ గదా! కాక నా కామె సేవ యనావశ్యకము. నా కెట్టి ప్రయోజ నము నుండఁబోదు. నా సన్నిధికి నీవు రావచ్చును బోవచ్చును గాని యామెను దీసికొని రావలదు. విషయవాంఛా హేతుభూతు రాలు, వైరాగ్యసంపద్విరోధిని స్త్రీ.

ఆ మాటలపై గిరిరాజు “సర్వేశా! సామాన్య యోగుల వలెఁ బలుకుచున్న మీరు మాయాతీతులు, ప్రకృతిభిన్నులు, నిర్లిప్తులు, జితేంద్రియులు, నిర్వికారులును గాన మీకు విషయ వాంఛ లెన్నఁడును గలుగవు. నా మనవి నాదరించి పుత్రికాదాస్య మునకు సమ్మతించి మమ్ముఁ దరింపఁజేయఁ బ్రార్థింతు” నని మిక్కిలి వినయముతో విన్నవించెను. శూలియు నత్యంత ప్రప త్తితో నర్పింప సంతసించి కంఠేకాలుఁ డంగీకరించినాఁడు.

యోగీశ్వర పరిచర్యా పరినిష్ఠితురాలైనది కాళి. క్షణ మైన నేమఱుపాటు లేని శ్రద్ధాసక్తులతో సేవించుచున్నది. పర మేశ్వరుని పదములఁ గడిగి పాదోదకమును ద్రావును. పలురక ముల పువ్వులు తెచ్చి పాదపూజఁ గావించును. అతఁ డుండు

ప్రదేశ మంతయు నలికి ముగ్గులతోఁ బలురీతుల నలంకరించును. మాటిమాటికి నమస్కరించుచుండును. అతని సిరీతిని యౌవనవతి యగు పార్వతి సేవించుచున్నది. ఈశ్వరుని తపము నిశ్చలముగ జరుగుచున్నది. కొలఁది కాలము గడచినది.

దితి కశ్యపుల కుమారుఁడు వజ్రాంగుఁడను రక్కసుఁడు. అతని యర్ధాంగి తత్వసార. ఆ దంపతుల కుమారుఁడు తారకుఁడు. మహాకాయుఁడు. అమిత బలవంతుఁడు. బ్రహ్మను గూర్చి యూర్ధ్వబాహుఁడై యొంటికాలిపై నిలువఁబడి నూఱువత్సరములు. జలపానమే చేయుచు శతవర్షములు, వాయుభక్షణముతో శత సంవత్సరములు పంచాగ్నిమధ్యస్థుఁడై నూఱేండ్లు, తలక్రిందుగా వృక్షమున వ్రేలాడుచు ధూమపానముఁ జేయుచు శతాబ్దములు, జలమధ్యమున నుండి శతవర్షములుగా ఘోరతప మొనరించు చుండెను. అతని యుగ్రతపమును స్వర్గాదిలోకములలో భరింప లేక యింద్రాది సురసంఘము బ్రహ్మను సమీపించి యా విషయ మును విన్నవించి లోకశాంతిని గోరెను. చతురాననుఁడు వారి కభయ మిచ్చి తారకునికి దర్శన మొసఁగి "తారకా! నీ తపోనిష్ఠ కానందమైనది. వర మొసంగుదును గోరు" మన నాతఁడు సాష్టాంగముగ నమస్కరించి "పితామహా! నాకు రెండు వరములు కావలెను. నాకన్న గొప్పవాఁడు పరాక్రమవంతుఁ డింకొకఁ డీ సృష్టిలో నుండరాదు. సేనానిగా నుండు భూతేశనందనుని శరఘా తమున మాత్రమే నాకు మరణము రావలెను". అని కోరెను. పద్మజుఁ డటులే యొసంగి యంతర్హితుఁ డయ్యెను.

తారకుఁడు స్వీయ రాజధాని యగు శోణితపురమున కేఁగి నాఁడు. ఆతని తపఃపరాక్రమ సంపన్నతలను మన్నించి యసురు లందఱుఁ దమకుఁ బ్రభువుగాఁ బట్టాభిషేక మొనరించిరి. శుక్రా చార్యుఁడు గురువు. తారకప్రభువు వరగర్వమునఁ ద్రిలోకములఁ బరిపాలించుచు నమరులఁ బీడించుచు వారినుండి ప్రభావసంప న్నములగు చింతామణి, యైరావతము, కల్పకము, నుచ్చైశ్శ్రవము మున్నగువానిని లాగికొనెను. దిక్పాలురను దఱిమి వారి నిధులు, శ్వేతాశ్వములు స్వాధీనపఱచుకొనెను. భూలోకములో దేవతల నుద్దేశించి యజ్ఞయాగాదు లాచరింపరా దనియుఁ, దనను ద్దేశించియే చేయవలె ననియుఁ, దపస్సు నిషిద్ధ మనియు శాసించెను. దిక్పా లకులుగను, నిందుృఁడుగను రాక్షసులనే నియమించెను. శత విధముల దేవతలను బీడింప సాఁగెను. ఈ బాధలకుఁ దాళలేక త్రిదశు లందఱుఁ బోయి ధాతతో మొఱ పెట్టుకొనిరి. విధాత విని "నిర్జరులారా! నా వరప్రభావముననే వాఁడిట్టి ప్రతిభావంతుఁ డయ్యెను. వాఁడు త్రిమూర్తులచేఁ గూడఁ గూలఁడు. శంకర కుమారుఁ డొక్కఁడే వానికి మరణకారకుఁడు. కావున శంకర నందనోత్పత్తి జరుగవలెను. అందులకై యీశ్వర వివాహ యత్నముఁ జేయవలసి యున్నది. ఆదిదేవుని పత్ని సతీదేవి పూర్వము దేహత్యాగ మొనరించి తిరిగి మేనకాహిమవంతులకుఁ బార్వతి యను పుత్రికగా జనించినది. పార్వతీపరమేశ్వర పరిణయమునకై ప్రయత్నింపుఁ" డని బోధించెను. ఆదితేయు లందఱు సమాలోచించుకొని శివాశివుల యుద్వాహసంధానమునకై మన్మథుని రప్పించిరి. మహేంద్రుఁడు వానితోనుడువుచున్నాఁడు.

"కందర్పా! మహేశుఁడు యోగీశుఁడుగాఁ దపోనిష్ఠలో నున్నాఁడు. పార్వతి యాతనిని సేవించుచున్నది. ఈశ్వరున కామెపై ననురాగము కలుగునటు లొనరింపవలయును. ఇది దేవకార్యము. నీవలన జరుగవలయును. ఇతరు లెవ్వరును సమర్థులు కారు. నీవు నా కాప్తమిత్రుఁడవు గాన నిది స్వవిషయముగాఁ దలంచి త్రిలోక మహోపకారము గావింపుము".

ఇం ద్రాజ్ఞను శిరసావహించి, మీనకేతనుఁడు శివ మాయామోహితుఁడై స్నేహితుఁడైన వసంతుని, సతియగు రతిని దోడ్కొని హిమవన్నగమునకు వెడలెను. తపోనిష్ఠా గరిష్ఠుఁ డైన కృత్తివాసుని దర్శించెను. వసంతుఁడు విజృంభించి ఋతుధర్మమును గల్పించెను. ఆ ప్రాంతవన మండలి తరులు, లతలు చిగిరించి పుష్పించి మనోహరముగ నున్నవి. సుగంధ మారుతము వీచుచున్నది. కోకిలలు కుహూకుహూ నాదములతో మానసోత్తేజము గలిగించుచున్నవి. వసంతశోభా రామణీయకముతోఁ బ్రకృతి విలసిల్లుచున్నది.

శంకరుఁడు కనులు విప్పినాఁడు. వసంతఋతు మనోహర దృశ్యముఁ జూచినాఁడు. అందములు చిందుచుఁ బార్వతిప్రక్కనే కన్పడినది. ఆ సౌందర్యము కొంచె మాతని డెందము మాఁపినది. ఆమె లావణ్యమునకు ముగ్ధుఁడై యంతలో మనస్సును నిగ్రహించుకొని "నా కీ కామవాంఛాసక్తి కలిగిన దేమి? భూతనాథుఁడను సర్వేశ్వరుఁడను జగత్ప్రభుఁడను నైన నేనే యిట్లు

మోహవశుఁడ నైన నిఁక జగమే యవినీతిపా లగును." అని తలంచి మహాదేవుఁడు మనమును మఱలించి ధ్యానమునఁ గూర్చుం డెను. కాని యేకాగ్రత కలుగుటలేదు. ఈ తపోవిఘ్నమునకు వనితా వ్యామోహమునకుఁ గారణ మే మని యోజించుకొనుచు నలువైపులఁ దిలకింపఁగాఁ గొలఁదిదూరమునఁ బంచశరుఁడు సుమశర సంధాన సన్నద్ధుఁడుగా గోచరించినాఁడు. ఉగ్రుఁ డైనాఁడు కపర్ది. "ఓరి మూఢకందర్పా! నీ దర్పము నాపైనే చూప యత్నించుచున్నాఁడవా?" యని ఫాలనేత్రముఁ దెఱచినాఁడు. మహాగ్నిజ్వాలలు బయలువెడలి మదనునిఁ గాల్చి యనంగునిఁ జేసినవి.

ఇంద్రాద్యమృతాంధసు లీ దృశ్యముఁ జూచి విలపింప సాగిరి. రతి మహాదుఃఖ దుఃఖితయై మూర్ఛపడినది. కొంతవడికి లేచి "నా పతి నింద్రాదులు ప్రోత్సహించి యిట కంపిరి. ఇపుడు పతిరహితనుగా నెట్లు జీవింపఁగలను? ఇఁక నా కేది శరణ" మని గోలన నేడ్చుచున్నది. శచీపతి యా రతి నోదార్చుచుఁ "బశుపతిని స్మరించి నీ పతి భస్మమును భద్రపఱచుకొనుము! దయాసముద్రుఁడు గాన మఱల దయతో నీభర్త నాతఁడే బ్రతికింపఁగలఁ" డని నుడివెను. అమరు లందఱు మృత్యుంజయుని యొద్దకు వచ్చి "శరణాగతవత్సలా! శంకరా! దయతో మ మ్మాదరింపుము. స్మరుఁడు స్వార్థపరుఁడై యిట్లు వర్తింపలేదు. తారకదనుజుని దౌష్ట్యమునకుఁ దాళఁజాలని మా యుపకారము నకై మా ప్రోత్సాహమున నిటు లాచరించినాఁడు. రతి. పతి

రహితగాఁ బరితపించుట చూడలేకున్నాము. మాయందనుగ్రహముంచి యామెకుఁ బతిభిక్షఁ బెట్టు" మని బహువిధముల నర్థించిరి. శరణాగత వత్సలుఁడు భక్తవశంకరుఁడు నైన శంకరుని యంతరంగము దయా తరంగిత మైనది.

"నిర్జరులారా! శోకింపకుఁడు. మారుఁడు మున్ను వనజోద్భవునిచే శప్తుఁడైనాఁడు. ఆ శాపఫలమే యీ దేహ దహనము. ఇతఁ డింక ననంగుఁడే.

చ. వినుఁడు నిలింపులార ! పృథివిన్ మధుకైటభవైరి ద్వాపరం
బున వసుదేవసూనుఁ డయి పుట్టుఁ దదంగనయైన రుక్మిణీ
వనజదళాక్షి గర్భమున వారిజసాయకుఁ డాత్మజన్ముఁడై
జననము నొందు నాతనిని శంబరుఁ డంబుధి వైచుఁ జెచ్చెరన్.

గీ. అపుడు రతి శంబరుని పుర మందుఁ జేరి
మెలఁగి మీనోదరంబున మెఱయు బాలు
నెత్తికొనిపోయి పెంపఁ బెం పెక్కి యతఁడు
శంబరునిఁ జంపి యీ రతిసతినిఁ గొనును.

శా హృద్యుండై నిరవద్యుఁడై సకలలోకైకస్ఫుర న్మూర్తియై
పొద్య ద్విక్రమ నిర్జిత ప్రబల శత్రుండై జగన్మోహ నై
శద్య స్వస్థుఁడు నై సమృద్ధ సకలైశ్వర్యుండునై ధీరుఁడై
ప్రద్యుమ్నుం డనుపేర భాసిలు జగత్ప్రఖ్యాతచారిత్రుఁడై.

(ఆంధ్రశివపురాణము)

అని యనుగ్రహించి యచ్చటఁ దపోవిఘ్నమైన దని మఱొక ప్రదేశమున కేఁగి తప మొనరించుకొనుచున్నాఁడు శర్వుఁడు.

ఈశ్వరుని ఫాలనేత్రమునుండి యుత్పన్న మైన యా యగ్ని కాముని భస్మ మొనరించి లోకములను దహింపఁబోవు చుండఁగా మహర్షులు, దేవతలు భీతిల్లి విధాతకడ కేఁగి మొఱ పెట్టుకొనఁగా నాతఁడు శివనామము స్మరించుచు నా యగ్నికడ కేతెంచి దానిని బడబముగా నొనరించెను. ఆ బడబాగ్నిని సాగరము నొద్దకుఁ దీసికొనివచ్చి "నేను మఱల వచ్చుపర్యంతము నీ సాగ రోదకమును పాన మొనరించుచు నిం దుండు" మని దాని కాజ్ఞా పించెను. సముద్రుఁడు స్వస్వరూపముతో వచ్చి పితామహునికి నమస్కరించి స్తోత్రము చేసెను. అంత బ్రహ్మ "బడబాగ్నిని లోకసంరక్షణార్థము నీయం దుంచుకొను" మని కడలితోఁ జెప్పి వెడలిపోయెను. బడబాగ్ని జలనిధిలోఁ బ్రవేశించి యిప్పటికిని జలపాన మొనరించుచునే యున్నది.

మదనదాహమును దిలకించి భయభ్రాంతయైన పర్వతరాజ పుత్రి కంపించుచు నింటికి వెడలినది. కామదహన విషాదగాథ దలిదండ్రులతోఁ జెప్పఁగా వారును భీతిల్లిరి. కాళి శివనామ మెల్లపుడు స్మరించుకొనుచుఁ దన జీవితమును వెంచించుకొనుచు దుఃఖించుచున్నది. అంతట నారదమహర్షి హిమవంతు నింటికి రాఁగా గిరిపతి మునిపతి నర్ఘ్యపాద్యాదులతోఁ బూజించి యాసన

మొసంగి తన పుత్రికా దుఃఖమును విన్నవించెను. అంత ముని పుంగవుఁ డీట్లు చెప్పఁ దొడంగెను.

"మహేశ్వరుఁడు మహాయోగి. ఆతని యనుగ్రహము నొందవలె ననినఁ దపముకంటె నన్యోపాయము లేదు. కాన నీ యాత్మజచేఁ దప మొనరింపఁ జేయుము."

అంత హిమవంతుఁడు "మహర్షీ! నీవు సర్వజ్ఞుఁడవు. తప మొనరించుట కుపదేశముఁ జేయు" మని కోరఁగా నారదుఁడు కాళికిఁ బరమాద్భుత ప్రభావము గల పంచాక్షరీమంత్రము నుపదేశించెను. ఈ మంత్రరాజమును యథావిధిగా జపించినచో శీఘ్రకాలమునఁ బరమేశుఁడు ప్రత్యక్ష మగు నని బోధించి దేవముని దేవలోకమున కరిగెను.

ఇరువురఁ జెలికత్తెలను దీసికొని జనకునిచెంత కరిగి పార్వతి వందన మాచరించి తపమున కనుజ్ఞనీయు మని యర్థింపఁగాఁ దుహినశైలుఁ డానందముతో నంగీకరించెను. తల్లి కడకు వెడలి యనుజ్ఞను గోరఁగా మేనక "అమ్మా! నీవు మిక్కిలి సుకుమారివి. పతికై సతు లడవులకుఁ బోయి తప మొనరించు టెన్నఁడును గని విని యెఱుఁగను. ఇంటనుండియే యాచరింపరాదా!" యనినది. పార్వతి తృప్తిపడక దుఃఖించుచుండఁ గాంచి యెట్టకేలకు సమ్మతించినది. ఉమ సమ్మదముతోఁ దల్లిదండ్రులకుఁ బ్రణమిల్లి నారచీరలఁ గట్టి శివనామస్మరణ మొనరించుచు హిమవత్పర్వతమునకు వెడలి తపముఁ జేయసాగెను. ఆ తావునకే

గౌరీశిఖర మను వ్యవహారము గలిగినది. వేసవిలోఁ బంచాగ్ని మధ్యముననుండి, వర్షాకాలమున వర్షములోఁ దడియుచు, శీతకాల మున హిమమధ్యమున నిలిచి, శీతోష్ణముల సహింపుచు ద్వంద్వా తీతయై తపోనిష్ఠాగరిష్ఠురా లయ్యెను. కొన్ని వత్సరములు ఫల ములఁ దినుచుఁ,గొన్నేఁడులు శుష్కపత్రము లారగించుచుఁ,గొన్ని వర్షములు నిరాహారముగ నుండుచుఁ దప మొనరించుచుండెను. పర్ణభక్షణముఁ గూడ విసర్జించుటచే నామె "నపర్ణ" యని మహర్షులు పిలుచుచుండిరి. ఇటు లీమె మూఁడువేల సంవత్సర ములు తప మొనరించెను. ఆ ప్రాంతముననుు దత్పరిసరము లను బక్షులు, మృగములు సహజ వైరముల మాని స్నేహమున నుండసాగెను. లతలు తరువులు పుష్పించి ఫలించుచుండెను. ఎవ్వరికిని గోపమన్నదే కలుగుటలేదు. ఈశ్వరసాక్షాత్కారముఁ బొందవలె ననెడి దీక్షతోఁ బంచాక్షరీమంత్రజపముతో నిష్ఠురతప మొనరించుచున్నది గౌరి.

బహువత్సరములు జరిగినవి. "ఇంత కాలమునుండి యత్యంత నియమముతోఁ దప మొనరించుచున్నను జంద్రశేఖ రున కింకను నాపై దయ రాలేదు? కారణమేమి?" యని గిరిజ యోజించుకొనుచుండఁగా జననీజనకు లటకు వచ్చి "అమ్మా! నీవు చిరకాలమునుండి శరీరమును శుష్కింపఁజేసికొని మునీశ్వరులు కూడఁ జేయలేని ఘోరతపముఁ జేయుచున్నదానవు. ఇట్లెంత కాల మాచరింతువమ్మా! మృడుఁడు విరాగి, నిర్వికారుఁడు, కామ జేత, స్త్రీవిముఖుఁడుఁ గావున నిన్నుద్వాహ మాడుట కిష్టము

లేదేమో! ఇంకఁ దపమును మాని యింటికి ర" మ్మని చెప్పిరి. సోదరులు, బాంధవులును వచ్చి తపోవిరమణ మొనరింప వలసినదిగా బతిమాలిరి. వారితో నామె యిట్లు పలికినది.

సీ. తండ్రి! భయంబు నొందఁగనేల నీ విట్లు
కావించి తపమును గార్యసిద్ధి
వడసెద నదె జన్మఫలము నిరర్థక
తనువుతో నే నుండఁదగునె యింటఁ
జనుము ధైర్యముతోడ నను వీడి మత్తపో
దీక్షయె చేయు మద్రక్షణంబు
సాధింపఁగను దపస్సాధనం బుండంగఁ
బతిహీననై నేను బ్రతుకనేల

గీ. యనుడు హిమవంతుఁడు తదుక్తు లాలకించి
భయముఁ జెంది యుమా! యట్టి పనికిఁ దగదు
తాఁకినను గందిపోవు నీ తనువు తల్లి!
రమ్ము పోదము విధియున్న రాఁడె యతఁడె!

గీ. కాఁదగిన కార్య మెప్పుడును గాక పోదు
కాఁ దగని కార్య మెపుడును గాదు దీని
కేల దుష్కర మగు కార్య మీవు చేయఁ
దడగెదవు విని నా మాట కదలిరమ్మ.

సీ. అనవుడు నాకాశముననుండి యొకవాణి
వినవచ్చెఁ గలుగంగ విస్మయంబు
హిమవదద్రీశ్వర! యీ వుమా యనుటచే
తన నుమాహ్వయము నీ తనయ చెందు

జగదేకమాత కాఁదగు భాగ్య మీమెకుఁ
గలదు త్యజింపంగ వలదు తపము
నని యూరకుంటయు నాలించి యామాట
హిమవంతుఁ డనలేక యేదియేని

గీ. యమ్మ నీ వొనరించు తపమ్ము సిద్ధి
శీఘ్రముగ నొందు ననుచు నాశీర్వదించి
యచట నామెను విడిచి తా నరిగె నాత్మ
భవనమున కతిసంరుద్ధబాష్పుఁ డగుచు.

(ఆంధ్ర పద్మపురాణము)

తల్లిదండ్రులు వెడలినపిదపఁ బార్వతి శివుని ధ్యానించి మఱలఁ దపోదీక్ష నారంభించెను. దీక్ష క్రమముగఁ దీవ్ర మగుచున్నది. ముల్లోకములు హాహాకారము లొనరించుచున్నవి. దేవతలు వెడలి బ్రహ్మతో మొఱపెట్టుకోఁగా వారితోఁ గలిసి యాతఁడు విష్ణువుకడకు వెడలి విన్నవింప వా రందఱితోడను నారాయణుఁడు, వృషభవాహనునిఁ బ్రార్థింపుఁ డని యుపదేశించెను. బ్రహ్మ విష్ణు మహేంద్రులు దేవతానీకమును వెంట నిడికొని మహేశ్వరుని దర్శింపఁ బయనమై వెడలుచు మార్గములో నపర్ణ తప మాచరించు గిరిశిఖరమును గని యామె తపోదీక్షకు మిక్కిలి యచ్చెరువు నంది, వందన మొనరించి యభినందించిరి. అటనుండి చంద్రచూడుని సన్నిధిఁ జేరి యిట్లు స్తోత్ర మొనర్చిరి.

శ్లో॥ నమో రుద్రాయ దేవాయ మదనాంతకరాయ చ
స్తుత్యాయ భూరిభాసాయ త్రినేత్రాయ నమో నమః

శివివిష్టాయ భీమాయ భీమాక్షాయ నమో నమః
మహాదేవాయ ప్రభవే త్రివిష్టపతయే నమః
త్వం నాథః సర్వ లోకానాం పితా మాతా త్వ మీశ్వరః
శంభు రీశః శంకరోఽసి దయాలు స్త్వం విశేషతః
త్వం ధాతా సర్వజగతాం జ్ఞాతు మర్హసి నః ప్రభో !
త్వాం వినా కః సమర్థోఽస్తి దుఃఖనాశే మహేశ్వర ॥

( శివపురాణము )

నారాయణాదిదేవత లందఱు మహాదేవునికిఁ దమ రాక విన్నవింప నందీశ్వరునిఁ గోరిరి. నంది యీశ్వరుని దర్శించి "ప్రభూ ! బ్రహ్మ, విష్ణు, మహేంద్రాది సుపర్వులు కార్యార్థులై యేతెంచి నీకొఱకు వేచియున్నారు. భక్తవత్సలుఁడ వగు నీవు వారి నాదరింపు" మని విన్నవించెను. యోగనిష్ఠనుండి మెల్లగఁ జూచి వారి రాకకుఁ గారణము నడిగినాఁడు స్థాణుఁడు. నారాయణుఁడు "సర్వేశా ! మహోత్కృష్ట మగు దేవకార్యమునకై వచ్చినారము. తారకాసురునివలని బాధ నీ యాదితేయులు భరింపలేకున్నారు. వాని సంహారము మీ కుమారునివలన జరుగవలసి యున్నది. ఆర్యాదేవి మిమ్ముఁ బతిగాఁ గోరి ఘోరతపముఁ జేయుచున్నది. ఆమె తపోగ్ని ముల్లోకములఁ దహతహ లాడించుచున్నది. ప్రసవశరుఁడు తమపై శరసంధాన మొనరించుటయు నీ ప్రయోజనాపేక్షచేతనే కాని స్వార్థబుద్ధిచేఁ గాదు. వీరిపై వాత్సల్య ముంచి మనోజుని జీవింపఁజేసి, పార్వతీ పాణిగ్రహణ మొనరించి, వీరి కష్టములు గట్టెక్కింపు" మనెను.

శశిఖండమౌళి బదులు పల్కెను. "దేవతలారా! కంద ర్పునివలన లోకము లన్నియు నీతిదూరములై భ్రష్టము లగు చున్నవి. వాని దర్ప మనల్ప మగుటచేతనే భస్మ మొనరించితిని. వాఁ డెందఱనో ఋషులను సుమనసులను భంగపఱచినాఁడు. సహస్రాక్షా! నీకును వీని దెబ్బ తగిలినది. జ్ఞప్తిలేదా? చతురా ననా! నీ వలన వరము నొంది దాని పరీక్షకై నీపైననే ప్రయో గించిన కృతఘ్నుఁడు వీఁడు. మఱచితివా? నీ శాపము నెఱవేర్చు టకును లోకక్షేమమునకును నీ కామునిఁ గాల్చితిని. కామముచేఁ గ్రోధము, క్రోధము వలన మోహము, మోహమువలన లోభము, లోభముచే మదమాత్సర్యములు కలుగుచుండును. స్వర్గపురీవాసు లారా! మీరు కామ క్రోధాది దూరులై వైరాగ్యము నొంది తపముఁ జేసి తరింపుఁడు, వెడలుఁ" డని మఱల ధ్యానములోఁ గూర్చుండెను సదాశివుఁడు. ఏమియుఁ దోఁచక దేవతలు నంది నర్థించి యుపాయముఁ గోరిరి. "మహేశ్వరుఁ డెవరు చెప్పినను వినఁడు. భక్తసులభుఁడు గాన నిశ్చలభక్తితో నాతనిని ధ్యానింపుఁ" డని నంది యనెను. వా రంద ఱట్లు ధ్యానింప భూతపతి కనులు తెఱచెను. కమలలోచనుఁడు మఱల విజ్ఞాపన మొనరిం చెను. విబుధులు పలువిధముల వేఁడికొనిరి. అంతఁ గైలాస నాథుఁడు "త్రిదశులారా! నన్ను వివాహముఁ జేసికొను మను చున్నారు. పెండ్లి యనునది పెద్ద సంకెల. వైరాగ్య మోక్షముః కాటంక మైనది. స్త్రీసాంగత్యము దుష్టము. లోహపాశమునుండి వెలువడవచ్చును గాని, సతీమోహ పాశమునుండి ముక్తులమః కాలేము. విషయాసక్తునకు మోక్షము దుర్లభము. విషయసుఖము

తేనెపూసిన విషగుటిక. పతితుఁ డగుటకు ముఖ్యకారణము. దానికి నేను విముఖుఁడను. అయినను భక్తులైన మీ సంరక్షణమునకై యెట్టికార్య మైనను జేయుదును. మీ కొఱకే కదా హాలాహలపాన మొనరించితిని. నాకుఁ బెండ్లాడవలెనని కాని సంతతిఁ బడయ వలె నని కాని యిచ్ఛ లేదు. మీకోరిక ననుసరించి లోకకళ్యాణార్థము మేనకాత్మజను బరిగ్రహించి యాత్మజునిఁ బడయుదును. నిశ్చింతతో మీ తావులకుఁ బొవుఁ" డని వచించెను. వా రేఁగిరి.

శంకరుఁడు సమాధిలో నుండియే తపోనిష్ఠలో నున్న పార్వతిని దివ్యదృష్టిచేఁ జూచి యానందించి యామె నను గ్రహింపఁ దలంచి సప్తమహర్షులను స్మరింపఁగా వారు వచ్చి నమస్కరించి స్తుతు లొనరించి యాజ్ఞాబద్ధుల మనఁగా వారితో ని ట్లనెను. "మహర్షులారా! గౌరీశిఖరమునఁ బర్వత రాజ నందిని నాయందు లగ్నమనస్కయై దుష్కరతప మొన రించుచున్నది. మీ రామెకడకుఁ జని నిగూఢ వచనములతో నామె చిత్తస్థైర్యమును బరీక్షించి రావలయును."

మహర్షులు వెంటనే గౌరీశిఖరమున కేఁగి తపోమూర్తిగా నున్న శివాదేవినిఁ జూచి నమస్కరించిరి. ఆమె మహర్షులకు నమస్కరించి పూజించినది. మహర్షు "లమ్మా! నీ వతి సుకు మారివి. అత్యంత దుస్తర తప మాచరించుటకుఁ గత మేమి?" యని ప్రశ్నింప నా తపస్విని "మునిపుంగవులారా! నా తపము నకుఁ గారణ మేమో వివరింతును వినుఁడు. అందరాని ఫలము

నాశించితి నని మీరు నవ్వినఁ నవ్వుదురుగాక. మీబోఁటిపెద్దలతోఁ జెప్పకుండ నుండరాదు. నా హృదయ మొక పెద్ద తలంపుఁ దలంచి దృఢముగ నున్నది. ఇది నారదోపదేశము. హరుఁడు నా మనోహరుఁడు కావలయు ననెడి కోరికతోఁ దపమున నున్నాను. ఱెక్కలురాని పక్షిపిల్ల గగనమున కెగురఁజూచు చున్నట్లు నా మనము పరమేశ్వరుని సన్నిధి కెగుర యత్నించు చున్నది. నా మనోరథము నా మహేశ్వరుఁ డీడేర్చుఁగాక ః

సీ. అనఘాత్మలార ః మీ రఖిలజ్ఞులరు మీకుఁ
దెలియంగరాని దేనియును లేదు
కాని నామీఁదను గల యనుగ్రహముచే
నడిగితి రది నాకుఁ గడు శుభంబు
దుస్తరంబైన పాథోనిధి నుడుపంబు
చే దాఁట యత్నంబు చేయుచుంటి
నాకాశ మంటు వింధ్యాచలశృంగంబు
కరముచే స్పృశియింపఁ గడఁగుచుంటి.

గీ. నిందుమౌళిని భర్తగా నొందఁగోరి
చేయుచుండిన దాన నీచాయఁ దపము
తథ్యము వచింతు వాంఛితార్థంబు నాకు
నింతకంటెను లేదు వేఱేది యేని."

(ఆంధ్రపద్మపురాణము)

అని తన మనోనిశ్చయమును వెల్లడించినది. మహర్షు లామె తలఁపు విని "అమ్మా గిరిజా ః కృత్తివాసుఁ డెట్టివాఁడో,

నారదుఁ డెటువంటివాఁడో నీ వెఱుఁగవుగాక మే మెఱుఁగమా!
నారదుఁడు వంచకుఁడు, కపటి, పరులకు బాధ గలుగునట్లుచేయు
చుండును. ఎప్పుడు నెచ్చటను స్థిరముగ నుండఁడు. తంత్రములఁ
బెట్టువాఁడు. అట్టివాఁడు నీకు గురుఁడా? అతఁ డెవ్వరిని బాగు
చేసెను!

మున్ను దక్షప్రజాపతి, ప్రజాపతియాజ్ఞానుసారము పత్ని
వలన నయుతసుతులను గని వారిని దప మొనరించి ప్రజాసృష్టిఁ
జేయుఁ డని యాజ్ఞాపించెను. వారు వనమునకుఁ బోయి తప
మొనరించుచుండ నారదుఁడు వచ్చి వారితో "సృష్టిఁజేయవలె
నన్న మీరు గార్హస్థ్యము నొందవలెను. సంసారము మహాసాగ
రము. అందు శాశ్వత సౌఖ్యము శూన్యము. అందు మునిఁగిపోక
జ్ఞానమార్గము నలవఱచుకొని తరింపుఁ డని బోధింప వారు మఱల
నింటికి రాక జ్ఞానులై ముక్తి నొందిరి. దక్షప్రజాపతి కీ విష
యము తెలిసి క్రుద్ధుఁడై మఱల సహస్ర కుమారులను సృష్టించి
తపమున కనుపఁగా వారికిని జ్ఞానోపదేశ మొనరింప వారును
ముక్తులైనారు. సర్వులను విరాగులను జేయుటయే యాతని
ప్రవృత్తి. చిత్రకేతుఁ డను విద్యాధరున కాతని యుపదేశమువల
ననే యిల్లు గుల్లయైనది. తనను నమ్మినవారిని దనవలెఁ జేయు
వాఁడు నారదుఁడు. కొంగ చేఁప కన్పడువఱకు సాధువుగనే
యుండును. అదికంటఁ బడినచో నసాధు వగును. నారదుఁ
డట్టివాఁడే! వాని మాటలను విశ్వసింపరాదు. తను సంయోగాత్మ
సమ్మదములచే సుఖము రెండు విధములఁ గలుగును.

గీ. అట్టి సౌఖ్యంబు నొంద నీ కౌశ యున్న
హరునిఁ జేపట్టఁ బూనుట యనుచితంబు
చిన్నదానవు తెలియక చిక్కు వడితి
పెద్ద లెవరును లే రైరి బుద్ధిచెప్ప.

ఆ. ఇందుమౌళి యనఁగ నెంతవాఁడో యటంచుఁ
దలఁచి నీవు మొదటఁ దెలివి లేమి
నతనిఁ జేకొనంగ నాశించితివి కాని
నీ ప్రయాస మెల్ల నిష్ఫలంబ.

చ. అతఁడు శ్మశానవాసి విషమాక్షుఁడు కామనిహంత భస్మరూ
షితుఁడు దిగంబరుండు విషసేవి నటుం డహిభూషణుండు కు
త్సితుఁడు కపాలి భిక్షుకుఁడు జీర్ణవయస్కుఁడు భూతభర్త వ
ర్జిత శుభలక్షణుండు వితరీతగుణుండు బహూక్తు లేటికిన్.

గీ. అంతె కాకుండ నతఁడుగ్రుఁ డస్థిధారి
సవనవిధ్వంసి పశుపతి భువనహర్త
నీలకంఠుఁడు స్థాణువు శూలి కృత్తి
వాసుఁడు కపర్ది వృద్ధోక్షవాహనుండు.

క. తలిదండ్రులు లే రతనికిఁ
గులగోత్రవిహీనుఁ డతఁడు కోమలి వానిం
దలఁచికొనరాదు శ్రేయః
ఫలకాంక్ష సహితులైన పావన చిత్తుల్.

క. శశిముఖి ! యెప్పుదు నీ కా
పశుపతి సంబంధ మేల పవలు రేఁచన్
గృశియింపఁ జేసికొనియెద
వశనము లేకుండ సురుచిరావయవములన్.

ఉ. భాసురగాత్రి! స్వర్ణమయ భాజన భోజనముం బొనర్చున
భ్యాసము గల్గుదానవు కపాలములోఁ దిన నెట్లు నేర్తు వు
ల్లాసముననన్ శిరోగృహములన్ విహరించెడి నీవు కాటిలో
వాసము నెట్లు చేయుదువు వాని కరగ్రహణం బొనర్చినన్.

సీ. అభిజాత్యము చూచి యాశింతు వనుకొన్న
జాతిహైన్యమె దానిఁ జాటిచెప్పుఁ
గై కొందు వన్న లక్షణములు వీక్షించి
దెసమొలయే వానిఁ దేటపఱచుఁ
బ్రాపింతు వన్న రూపంబు నాలోకించి
ప్రకటించు విషమనేత్రములె దాని
నైశ్వర్యమును గాంచి యభిలషించెద వన్న
భైక్షవృత్తియె దాని బయటఁబెట్టు

గీ. నేవియును లేకపోయినఁ బోవుఁగాక
యొక్కఁయు క్తవయ స్సున్న నొప్పవచ్చు
ననినఁ బ్రాచీనుఁ డగుట లే దయ్యె నదియు
నతని నేమని కోరితి వంబుజాక్షి!

ఉ. సొమ్ములు నీవు కోరునెడ సుందరి నీ మెడలోన సర్పహా
రమ్ములు వైచు నాతఁడు పరాకున నీవెపుడైన మంచిగం
దమ్మును మేనఁ బూసిన నతండు భవత్తను వెల్ల నిండ భ
స్మమ్మును బూయు నీవు గన సౌమ్యత నాతఁడు చూపు నుగ్రతన్.

గీ. రాజముఖి యాతఁ డొక మతిభ్రష్టుఁ డతని
బొందు నీ వేల కోరెదు పూర్వ మబ్ధిఁ
దఱచ్చి సుర లెల్ల నమృతంబుఁ దాగుచుండ
నందులోఁ బుట్టిన విషంబు నతఁడు త్రావె.

క. వనజదళాయతలోచన
కనకాంబరములు ధరించు కటి తటి నజినం
బును దాల్ప నెట్లు నేర్చెద
వనభిజ్ఞతచేతఁ బతిగ నతనిం గొనినన్.

ఉ. ఎన్నఁడుగూడ లోప మొక యించుకయేనియు లేక నీవు మృ
ష్టాన్నము లారగించిన మహాప్రభు పుత్రి వతండుపెట్టు భి
క్షాన్నము నెట్లు తిందువొ లతాంగి విషాదము గల్గె మాకు మా
కన్నె నొకండు నీ వొకటిఁ గాఁ దలపోయని కారణంబునన్.

గీ. కుటిలగామిని యొక్కతె కోమలాంగి
యతని తల కెక్కి యున్నది యాపె నీకు
సవతి యగు రేపు తద్బాధ సైపలేక
గాసిచెందెద వాతనిఁ గట్టుకొన్న.

క. కామహరుఁ డైన వానిం
గామించెడి కాంత వీ వొక ర్తవ జగతిన్
భామలు విన్నను నవ్వరె
కోమలి సుమమాలఁ దగునె క్రోఁతికిఁ జుట్టన్.

గీ. కల వనేక గుణంబు లింకను వచింప
నర్హములు గానియట్టివి యతనియందుఁ
దాఁకినను గందిపోవు నీ తనువు నేల
చిచ్చులోఁ బాఱవైవఁ జూచెదవు బాల ।

అజన్మభోగియై యఖిలలోకములచే
సమ్మానితుం డైన శౌరి లేఁడె ।
యజ్ఞభోక్తల కెల్ల నధినాథుఁడై స్వర్గ
సామ్రాజ్య మేలు వాసవుఁడు లేఁడె

ప్రాణభూతుం డయి ప్రాణికోటుల నెల్ల
నోమెడి గంధవాహుండు లేఁడె
యఖిల దేవతలకు హవ్యప్రదాత యై
స్తుతిఁ గొన్న వీతిహోత్రుండు లేఁడె
గీ. యక్ష కిన్నర గుహ్య కాధ్యక్షుఁ డగుచు
దక్షిణమున శోభిలెడి రాజరాజు లేఁడె
వారిలోపల నొకని నెవ్వాని నైనఁ
గోరుకొని సుఖియింపుము కోమలాంగి!

గీ. అంబుజాననః ఫలశూన్య మైన తరువుఁ
బట్టుకొని ప్రాఁకులాడిన ఫలము గలదె
యేల యడియాసలను జిక్కి బేల వగుచు
గాసిఁజెందెద వా బిచ్చగానికొఱకు.

(ఆంధ్రపద్మపురాణము)

ఇఁక మా మాట లాలించి తపము విరమించి యింటి కరుగుము."

మహర్షుల బోధనము విని పార్వతి బదులుపల్కుచున్నది. "ఎప్పటినుండియో శంకరుని నా మనమున నిడికొని తపముఁ జేయుచు నిప్పుడు వేఱొకరిని గోరుకొనలేను. నా జనకుఁడు శైలము. నాహృదయము గూడ శైలమే. నా నిశ్చయమునకుఁ దిరుగులేదు. నాకు నారదుఁడే గురుఁడు. ఆతనినే నమ్మితిని. ఎంచుకొన్న గురువును ద్యజించిన గురుద్రోహి మగును. గురుద్రోహ మెన్నఁడును జేయను. నామనము నీశ్వరునిచెంతకే కాని

యన్యులవైపు మఱలింపను. నా సంకల్పమునకు వికల్పమును గల్పించి తపోవిఘ్న మొనరింపఁ దలంచుచున్నారు. అది వ్యర్థ యత్నము. గురువాక్యమునకుఁ దిరుగులేదు. మీకుఁ దోఁచినట్లు చెప్పితిరి కాని నాకు మీ మాటలపై విశ్వాసము లేదు.

క. శివుఁ గుఱిచి నిర్గుణుం డని
యవినయుఁ డని పేద యని మహాత్ములు మీరల్
గవిసి వచించితి రిట్టుల
శివతత్త్వముఁ దెలియఁగా విశేషము జగతిన్.

క. మఱచితిరో తొలిచదువుల
వెఱచితిరో యెవరికేని వెకలుల కిలలోఁ
గఱచితిరో పెఱతోవల
నఱచితిరో నాదు మనము నారయఁగ నిటుల్.

క. ఈశ్వరుఁ డని సకలామ్నా
యేశ్వరుఁ డని హరి విరించ నేంద్రాది నిలిం
పేశ్వరుఁ డని కల్పాంతా
వశ్వరుఁ డని శివుని శ్రుతు లనవ్ వినరొక్కొ.

మ. త్రిగుణాతీతుఁడు నిర్వికారుఁడు జగద్ధేతుండు భక్తావనా
ర్థగృహీతాకృతి వేదవేద్యుఁ డమర ధ్యానార్హ చారిత్రుఁ డ
జ్ఞ గత ప్రోద్ధత భావదుర్లభుఁడు విజ్ఞానాస్పదుం డీశ్వరుం
డగు మీ చెప్పినయట్లు కాదు వినుఁడీ యాక్షేపముల్ మానుఁడీ.

గీ. సకల జగతీశ్వరుం డయ్యు జగతిఁ దనదు
పెంపుఁ జూపింపఁ దలఁపఁడు వెగ్గలంపు
భవ్య వైరాగ్యభావంబుఁ బాదుకొలుపుఁ
బరమశివు నారయుం డిట్లు బ్రహ్మఋషులు.

(ఆంధ్రశివపురాణము)

సీ. గగనంబు వేని యాకారంబొ వాయువు
వేని దేహమొ వహ్ని వేని రూపొ
సలిల మెవ్వని మేనొ యిల వేని కాయంబొ
యెవని నేత్రంబులొ రవియు శశియు
సకల సురాసుర సంఘంబు పూజ గా
వించు లింగము వేని విగ్రహంబొ
హరి విరించీంద్రాది సురలెల్ల నెవ్వని
వలనఁ జెందిరొ ప్రభావంబు భవము

గీ. సర్గ రక్షణ లయములు సంభవింప
నెవని యిచ్ఛ నిదానంబొ యెవఁడు పరుఁడొ
వాఁడె కామహరుం డన వాఁడె భూత
నాథుఁ డనఁగఁ బ్రాచీనుఁడు నాఁగ వాఁడె.

సీ. జడలు గట్టిన మూర్ధజములు దాల్చిన నేమి
యమృతాంశుమౌళియై యలరుచుండు
నారగించిననేమి హాలాహలంబును
మృత్యుంజయుం డయి మెలయుచుండుఁ
గట్టుకొన్ననునేమి కరిచర్మవసనంబు
పరమేశ్వరుం డయి పరఁగుచుండు
నాట్యంబు గావించిననునేమి బ్రహ్మాది
పూజిత చరణుఁడై పొలుచుచుండు

గీ. భిక్షుకుండైన నేమి యధోక్ష జాది
సకల బృందారకశ్రేణి శాసకుండు
విషమనేత్రుం డయిన నేమి విపినచారి
మునివధూజన చిత్త సమ్మోహనుండు.

గీ. వృషభ వాహనుఁడైనను నేమి కొఱఁత
కలదు వానికిఁ దత్పాద కమల సేవ
సలుప నిత్యంబువచ్చుచుఁ జనుచునుండు
నభ్రనాగంబు నెక్కెడి యమరపతియె.

ఉ. బూది ధరించు నంచు జడబుద్ధులు దూఱిన నేమి వాని బ్ర
హ్మాది సుపర్వు లెల్లరును నాతని తాండవవేళ రాలు నా
బూదిని దాల్ప వచ్చునను బోవుచు నుందురు నిత్యమున్ మహా
హ్లాదముతోడ భూరి కుశలంబులు దాన లభించుచుండుటన్.

చ. పశుపతి యంచు నాతని నభాగ్యులు నవ్విన నేమిలోటు త
ద్వశమున ముజ్జగంబులును వర్తిలుచుండుఁ దదాజ్ఞ లేనిచో
శశియును సూర్యుఁడున్ గదలఁ జాలనె నిల్చునె పంచభూతముల్
పశ్రమము నొందకుండునె ప్రపంచము లన్నియు నొక్కవేళ్రిమ్మడిన్.

(ఆంధ్ర పద్మపురాణము)

శ్లో॥ సదాశివో ఒగుణః ప్రోక్తస్తత్ర కారణ ముచ్యతే
శివో బ్రహ్మ వికారః స భక్తహేతో ర్ధృతాకృతిః
ప్రభుతాం లౌకికీం నైవ సందర్శయితు మిచ్ఛతి
అతః పరమహంసానాం ధార్యతే సుప్రియాగతిః
అవధూత స్వరూపేణ పరానందేన శంభునా
భూషణాది రుచిర్మాయా లిప్తానాం బ్రహ్మణో న చ
స ప్రభు ర్నిర్గుణో ఒజో నిర్మాయో ఒలక్ష్యగతి ర్విరాట్

ధర్మజాత్యాదిభిః శంబు ర్నానుగృహ్ణాతి వై ద్విజాః
గురో రనుగ్రహే ణైవ శివం జానామి తత్త్వతః
చే చ్ఛివః సహి మే విప్రా వివాహం న కరిష్యతి
అవివాహా సదా హం స్యాం సత్యం సత్యం వదా మ్యహమ్.

(శివపురాణము)

సదాశివుఁడు నిర్గుణుఁడు. భక్తులకొఱ కాకృతి ధరించిన బ్రహ్మస్వరూపుఁడు వికారుఁడును. లోకసంబంధ మగు ప్రభుత్వముఁ జూపుట కిచ్ఛగింపఁడు గానఁ బరమహంసల కభిమత మగు నవధూతస్వరూపము ధరించుచున్నాఁడు. మాయాలిప్తుల కలంకార ప్రీతిగాని బ్రహ్మస్వరూపునకులేదు. అతఁడు ప్రభువు, నిర్గుణుఁడు, పుట్టుకలేనివాఁడు, మాయారహితుఁడు, తెలియఁబడని గతి కల విరాట్స్వరూపుఁడు. ధర్మాత్ములు జాతిశ్రేష్ఠులు నను భావముతో ననుగ్రహింపఁబోఁడు. గురువుల యనుగ్రహముచేతనే శివతత్త్వము నెఱుఁగఁ జాలితిని. శివునితో నాకుఁ బాణిగ్రహణము జరుగనినాఁ డవివాహితగా నుందును. ఇదియే సత్యము.

మీర లెన్ని నుడివినను, సూర్యుఁడు గతులు తప్పినను మేరుపర్వతము కదలినను నగ్నియందు వేఁడిమి తగ్గినను బంచభూతముల శక్తు లుడిగినను నా నిశ్చయమునకుఁ దిరుగులేదు. ఈ జన్మమున నిది నెఱవేఱనిచో ముందుజన్మమునఁ గూడ నిటు లీశ్వరారాధనఁ జేసి నా కార్యము నెఱవేర్చు కొందును. ఈరీతి నెన్ని జన్మములైన నతనికొఱకే వినియోగింతును. ఇది ముమ్మాటికిని సత్య" మని చెప్పి వారికి నమస్కరించిన

దా శైలజ. ఆమె దృఢనిశ్చయమునకు మిక్కిలి సంతసించి యామెకు వందన మాచరించి మహర్షులు శివసన్నిధానమున కరిగి యామె నిశ్చయమును దెల్పి యీశ్వరాజ్ఞను బొంది తమ తావులకు వెడలిపోయిరి.

ఇఁక స్వయముగఁ బరీక్షింపనెంచి వృద్ధబ్రాహ్మణ వేష ధారియై గిరిజాసామీప్యమునకు వెడలెను బరమేశ్వరుఁడు. ఈ బ్రాహ్మణునిఁ గాంచి యామె నమస్కరిఁచి యతిథిపూజ గావించి నది. "బ్రాహ్మణోత్తమా! తమ రాకకుఁ గారణ మే" మని ప్రశ్నించినది. "నే నొక పండితుఁడను, దపశ్శాలిని. పరోపకార మొనరించుచుందును. నీ వెవ్వతెవు? నీ తల్లిదండ్రు లెవ్వరు? భర్తయెవ్వరు? ఇట్లు ఘోరతప మొనరించుటకుఁ గారణ మేమి? భర్తగాని యనాదరించుటవలనఁ గాదుకదా! నీవు లక్ష్మీసరస్వతు లలో నొకరితవా?" యని యడిగినాఁ డా బ్రాహ్మణుఁడు.

"నేను దుహినశైలకుమారిని. పార్వతీ నామధేయు రాలను. క్రిందటి పుట్టువున దక్షప్రజాపతిపుత్రి నగు సతీదేవిని. ఆ జన్మమున నీశ్వరసేవ లభించినది గాని యంతలో విఘ్నమై నది. ఇపుడుకూడ శశిఖండమౌళిని గూర్చియే తప మొనరించు చున్నదానను. ఆ సర్వేశ్వరుని యనుగ్రహ మింకను గలుగలేదు. అందుచే నగ్నిలోఁ బడి దేహత్యాగ మొనరింతును. అతఁడు నన్నుఁ బరిగ్రహించుపర్యంత మెన్నిజన్మములలో నైన నటు లే కావింతు" నని పలుకుచు నా లతాంగి విప్రుఁ డెంత వారించి నను లెక్కింపక యగ్నిలో దుమికినది. కాని వైశ్వానరుఁడు

చల్లఁబడినాఁడు. అంత నామె యాకాశమార్గమున స్వర్గమునకు వెడలఁబోవుచుండఁగా నా మహీసురవేషుఁ డిట్లు భాషించెను.

"నీ నిష్ఠురతపమునకు సంతోష మైనది. నేను బరోపకార తత్పరుఁడను. రహస్యమే యైనను నీ తపమునకు హేతువును దెల్పుము. సఖ్యం సాప్తపదీనం కదా! ఇపుడు మనము స్నేహితులము. కావున మిత్రునిగాఁ దలంచి నీ యాంతర్య మును వెల్లడింపుము."

అటుపై నామె నియోగమున నొక చెలికత్తె వచ్చి "స్వామీ యీమె బాలేందుశేఖరుని వల్లభునిగాఁ గోరి యీ తప మొనరించుచున్నది. బహువత్సరములు గడచినవి. ఈమె నాటిన మొక్కలెదిగి చెట్లై పూచి కాయుచున్నవి. కాని యామె మనోరథవల్లరికిఁ బూఁతలేదు కాయలేదు. కారణము దురూహ" మని నివేదించినది.

"నేను వచ్చి చెంతనే యుండఁగాఁ దానే వచ్చి చెప్ప రాదా" యనినాఁడు భూమిసురుఁడు. అంత నా బాల వచ్చి చెలికత్తె వచనములు సత్యము లనియుఁ, దాను త్రికరణశుద్ధిగాఁ ద్రినేత్రుని వివాహమాడు సంకల్పముతోఁ దప మొనరించు చున్నా ననియు విన్నవింప నాతఁడు "వధూమణీ! నా ప్రశ్నకు సమాధాన మిచ్చితి వానంద మైనది. నే నిఁక వెడలుదు" నని పోఁబోఁగా "భూసురప్రవరా! వీనులవిం దైన వాక్యమేదేని చెప్పి పోరాదా" యని కోరిన దప్పరారోహ!

"కొన్నివేలవర్షములు తపించి యాస్థాణునా ప్రాణనాధునిఁగా నెన్నుకొంటివి ; అతఁడు దిగంబరుఁడు ; భూతనాధుఁడు ; అమంగళుఁడు ; నాగాభరణుఁడు ; గజచర్మధరుఁడు ; విషపాయి ; అస్థిమాలాధరుఁడు ; అతఁడా నీకుఁ బ్రియుఁడు ; సూర్యకాంతినిఁ గాదని మిణుఁగుఱుపుర్వు నాశ్రయించినట్లు, మంచి గంధమును వదలి దుర్గంధపంకముఁ బూసికొన్నట్లు నున్నది నీ యత్నము. నీ యైశ్వర్య సౌందర్యముల కాతఁ డనర్హుఁడు సుమా!" అనినాఁడు భూదేవుఁడు.

ఆ మాటలు వినిన చండిక మండిపడి "నీవు పండితుఁడవు ధీమంతుఁడవు నని తలంచితిని గాని యింత జడబుద్ధి వను కొననైతిని. బ్రాహ్మణుఁడవై శివనిందఁ జేయుదువా ; శివశివ ; శివదూషణ మెఱుఁగుదువు గాని శివతత్త్వ మెఱుఁగవు.

ఉ. మోసముతోడ నాదు తపమున్ జెఱుపన్ జనుదెంచినట్టి నీ
వేసము దెల్లమాయె నిఁక వెంగలిపల్కులు పల్కఁబోకు నీ
వా సకలేశ్వరున్ దెలియునంతటి వాఁడవె విన్ము చెప్పెదన్
వాసిగ శైవతత్త్వము సెబా సని విజ్ఞులు మెచ్చునట్లుగన్.

గీ. నిర్గుణంబగు బ్రహ్మంబు నియత మిట్లు
కారణాంతరమున గుణకలన మొందె
నట్టి పరమాత్మ కెట్టుల నుట్టిపడును
జాతిగరిమం బిఁకను సువిచారదూర ;

సీ. నిశ్వాసమున మొదల్ నిగమముల్ పుట్టించి
హరినిఁ బుట్టించి యయ్యవి యొసంగె
సృష్టిశక్తి నొసంగి సృజనాధికారంబుఁ
గమలజన్మున కిచ్చెఁ గరుణ యెసఁగ
స్వర్గరాజ్యముతోడ సర్వలోకాధిప
త్యము నిచ్చె నా పురందరున కెలమి
నవనిధానములు కిన్నరనాథున కొసంగి
భక్తజనాగ్రియపట్ట మిచ్చె
గీ. ఇట్టి శివునకు విద్యయు హృద్యతర వి
వేకమును బ్రాభవంబును విభవ బుద్ధి
లే దనుచుఁ జెప్పు నీదగు వాదమునకు
మొఱకు లారసి మెత్తు రిప్పుడమిలోన.

సీ. ఎవ్వనివాకిట నెలమిఁ గాఁపుర్షముండు
సిద్ధ్యష్టకంబు వాసిన్ జెలంగి
ఎవని శిరోంఘ్రుల నీక్షింపలేరైరి
పద్మజన్ముండు నప్పద్మనయనుఁ
డెవ్వని పూజనం బింపుమై నొనరింప
సర్వార్థసిద్ధులు సంతరించు
నెవ్వని నొల్లని హీనుండు సప్తజ
న్మదరిద్రతన్ జెందు మదము డింద
గీ. నెవని గాత్రంబునందు రహించు ప్రేత
భూతి లేశంబు గీర్వాణముఖ్యు లెపుడు
తలలఁ దాల్పగ నాశింత్రు దండినిష్ఠ
నట్టి వరమేళుఁ దెలియ నీ కళవి యగునె.

గీ నీ వవినయ ట్లొకప్పుడు నీలగళుఁడు
దా నమంగళచేష్టుఁడై తనరియున్నఁ
దవిలి తన నామధేయంబు దలఁచువారి
కెల్ల సౌఖ్యంబులను నిచ్చు హెచ్చుగాను.

గీ. ఐన నొకమాట వినుము శఠాత్మ! శివుఁడు
లేమితో భోగముల నొందలేక యుండె
నా? యటులగాక వైరాగ్య మాత్మ నొంది
భోగముల మానెనా? తలంపుము మనమున.

ఆ. ఇల్లు వెండికొండ విల్లు బంగరుకొండ
రతనములకు నిధి శరధి యెఱుంగు
సిరికి తేఁడు మేల్మి సిరుల కంతకు తేఁడు
కొలుతు రెవని వాని దెలియలేవు.

సీ. గంగామహానదీకాండంబు మెచ్చునే
జలదారి యడు నొందు నైరిభంబు
అమల మాణిక్యచయముల హర్షించునే
నత్తగుల్లల నోటనమలు కొంగ
కమల మరంద సారమున కాసించునే
బురదను గ్రోలు దర్దురమదెందు
అచ్ఛ ముక్తాఫల హారంబు వదయునే
జొన్నకంకుల కేఁగుచున్న కాకి
గీ. అఖిల దేవాధినాథుఁడై నిఖిల వేద
సన్నుతుం డగు శివుని భాస్వరచరిత్ర
మరసి మెచ్చఁగఁ జాలెదే యజ్ఞహృదయ!
పొమ్ము నీతోడ నా కిఁకఁ బోరు వలదు.

ఉ. భూతసహాయుఁ డంటి వీఁక బొల్పుగ విన్ము మహేంద్రముఖ్యులా
భూతశరణ్యుఁ గొల్వఁ జన భూతము లేపున వేల్పుపెద్దలన్
నీత మెఱుంగఁగా గదల నెత్తుల మొత్తుచునుండునప్పు నీ
వా తగువారిదౌ గరువ మారసి యెట్లు గణించెదో కదే:

(ఆంధ్రశివపురాణము)

ఈ శివతత్త్వముఁ దెలిసికొనుట బాహ్యదృష్టిగల మీ బోఁటి యజ్ఞుల కలవిగాదు. ఈశ్వరనిందఁ జేసినవాని కీజన్మ మునఁ జేసిన సుకృతము నశించును. అట్టివానిఁ బూజించిన నాకును గిల్బిష మంటును. వానినిఁ జూచినచో సచేలస్నాన మాచరించినఁ గాని పాపనివృత్తికాదు. శ్రీమన్నారాయణుఁడు పరమేష్ఠియుఁ గూడఁ బరమేశ్వరతుల్యులు గారు. అట్టిచోఁ గాలా ధీను లయిన నిందాద్రిదులు లెక్కయా! ఈశ్వరుఁడు సర్వేశ్వరుఁడు పరాత్పరుఁడు" నని యుపన్యసించినది.

ఆమె నిశ్చల శివభక్తికి శివున కపరిమితానంద మైనది. ఆమె నిఁక నానందింపఁ జేయవలె నని యెంచి నిజరూపమున దర్శన మొసంగినాఁడు. నీ తపోదీక్షకు, నిశ్చల సంకల్పమునకు మెచ్చుకొంటిని. నీ యభీష్టము నొసంగుదును దెల్పుమనఁగా నంబిక లజ్జవడి నమస్కరించి మనమున నిట్లు ముదమందినది.

"ఆహా! ఏమి నాభాగ్యము! నేఁటికి జగత్ప్రభునకు నాపై దయ గలిగినది. నా తపము ఫలించినది జన్మముసార్థకమైనది. కైలాసనాథుఁడు నా మనోనాథుఁ డగుఁగాత!" యనుకొన్నది.

అంతులేని యానంద మనుభవించుచు బద్ధాంజలియై స్తుతించుటకు నోట మాటరాక డగ్గుత్తికతో "ప్రభూ" యని నిలువఁబడిపోవ, దయాంతరంగుఁడైన ఖట్వాంగధరుఁడు రాగరసము నొలికించుచుఁ "గోమలీ! నీ హృదయము తెలిసినదిలే. తప్పక నిన్నుఁ బెండ్లాడుదును. ఇపుడే నా వెంటఁ గైలాసమునకు ర" మ్మన నామె సంతోషముతోడి సిగ్గు నంది స్వామీ! నా తలిదండ్రుల నడిగి నన్నుఁ బరిగ్రహింపరాదా!

శా. కన్యాదానము చేసి తత్పుల మిలన్ గాంచున్ గిరీంద్రుండు లో
కన్యాయం బిది గాన నాదు మనవిన్ గాఢానుకంపాత్మతో
నన్యం బెంచక యాదరింపుము మదీయంబౌ తపం బ ద్దసా
మాన్యఖ్యాతి వహించి మించుఁ బుడమిన్ మారాఽలేపాపహా!

గీ. జన్మజన్మము లందును సతిని నీకు
భక్తను మహాత్మ! వేగ విబ్బరపు కృపను
నేను గోరిన యట్టులనే కడంగి
తీర్పు నా వాంఛితంబును నేర్పు మెఱయ

(ఆంధ్ర శివపురాణము)

అని సాభిలాషనమ్రముగా నర్థించినది. అర్ధేందుశేఖరుఁ డట్టులే యని యంతర్ధానుఁ డైనాఁడు.

ఈప్సిత మీడేఱిన గిరిజ యానందముతో శివనామస్మరణ మొనర్చుచు నింటికి వచ్చుచుండఁగా నీ వర్తమాన మెఱిఁగి మేనకా హిమవంతులు, బంధుమిత్రపరివార సహితులై యెదురు

వచ్చి మంగళనాద, వేదోచ్చారణ, పుణ్యగీతాలాపములతో నామెను వెంటఁబెట్టు కొనివచ్చిరి. నగరమంతయుఁ బన్నీటఁ దడిపి, వీథులలోఁ గదళీస్తంభముల నిలిపి మనోహరాలంకారము లొనరించిరి పురప్రజలు. ముత్తైదువలు మంగళహారతులిచ్చిరి. నగర ప్రవేశ మొనరించి నగజాత నగరవృద్ధులకు నమోవాకము లర్పించినది. వారెల్ల రాశీర్వదించిరి. తల్లిదండ్రు లామె నాలింగనముఁజేసికొని "తల్లీ! నీ మూలమున మా వంగడ మంతయు వన్నెఁ గాంచిన దమ్మా! మే మెంత ధన్యులము!" అని మురిసిపోయిరి. ఆ సంతోష సమయమునఁ గొండఱేఁడు పురోహితులకు, విప్రులకు ననేక బహూకృతులను దాన ధర్మములను గావించి బంధుసత్కారములతో వినోదకాలక్షేపములతో మహోత్సవముగావించినాఁడు. ఒకనాఁడొక భిల్లుఁడు డమరుకము మోగించుచు, నృత్యము గావించుచు హిమవంతుని గుమ్మము కడఁ దన గాన నాట్య కౌశలములఁ బ్రదర్శింపసాఁగెను. సంగీత నృత్యముల కధినాధుఁ డైన పరమేశ్వరుఁ డనిపించుచుండెను. నగరాజు భార్యాపుత్రమిత్రాదులతో నా కళాకౌశలమును వీక్షించి ముగ్ధుఁడై మెచ్చి బంగరుపళ్లెరమునిండ రత్నములఁ బోసి వాని కిప్పింపఁబోఁగా నా భిల్లుఁడు వల్లకా దని, నీ పుత్రికను నా కిచ్చి నన్ను నీ యల్లునిఁ జేసికొ మ్మని కోరెను. వారు నిరాకరింపఁగా నంతలో నదృశ్యుఁ డైనాఁడు. ఆ పిమ్మట వారు యోజించుకొని "అయ్యో! ఈ భిల్లుఁడు శంకరుఁడే యైయుండును. శివమాయా మోహితులమై తెలిసికొనలేకపోయితి" మని విచారించినారు.

అప్పటినుండి వారికిఁ బరమేశ్వరునియందు భక్తి యధిక మైనది. మన కొమరిత నా చంద్రచూడునకుఁ గన్యాదాన మొనరించి మోక్షమునొందఁగల మని యాసించిరి. వారును సదాశివనామమును స్మరించుకొనుచుఁ బరమేశ్వరలీలలు వర్ణించుకొనుచు, మాటి మాటికి వందనములఁ జేయుచుఁ బరమేశ్వరుఁ డని తెలియక తిరస్కరించితి మని శివాపరాధమొనర్చితి మని ఖేదపడుచుండిరి.

కైలాసపతియందు హిమశైలపతికి మిక్కిలి భక్తిశ్రద్ధ లతిశయించినవి. ఇది చూచుసరికి వేయికన్నులవేల్పునకుఁ గన్ను కుట్టినది. శివునకు సుతనిచ్చి హిమవంతుఁడు ముక్తి నొందు నేమో! హిమగిరి శూన్యమగుచో రత్నగర్భ యగు వసుంధర వసుశూన్యయగును గదా! అట్లు కారాదు. అందుచే రత్నగర్భుఁ డగు హిమవంతుని ముక్తునిఁ గానీయరా దని సునాసీరుని నిశ్చ యము. దేవగురుఁడగు బృహస్పతినిఁ జేరి నమస్కరించి తన నిశ్చయమును దెల్పి తుహినగిరి మోక్షము నందకుండఁజేయుట కాతనికిఁ గిల్బిషము లంటవలె ననియు నందులకై శివనింద నాతని యెదుటఁ గావించుటకు మీరు పోవలె ననియు బృహస్ప తిని గోరెను. వాచస్పతి యా వాక్యముల వినలేకపోయినాఁడు. "మహేంద్రా! శివనిందఁ జేయుఁ డను నీ యాజ్ఞావాక్యమును నా చెవులతో వినుటయే కాక నా నోటితో మహేశ్వరనిందఁ గావిం చుటకూడనా! శివాపరాధ మొనరించి యధోగతుఁడఁగాలేను. శివ! శివ! నన్నీ యకార్యమునకు నియోగింపవలదు. ఇట్టి పనికి గురుఁడ నైన నేనె దొరికినాఁడనా! శైవమహిమ మెఱిఁగియుండి

యెవ్వఁడు శివనిందఁజేయ సాహసించును? దుశ్చ్యవనా! నీ కిట్టి దుర్బుద్ధి పుట్టిన దేమయ్యా! ఇంత స్వార్థపరతయా! అసూయా పరుఁడవుగా నైతివిగదా! ఆతఁడు నిర్వాణ యత్న మొనరించు కొన్న నీ కేమి పుట్టిమునిఁగిపోవును? ఆతని యనన్య శైవభక్తికి ముద మందక యాతనిఁ బెడత్రోవఁ బట్టింపఁ జూచుచున్న నీ యత్నము మిక్కిలి గర్హ్యము! ఆ మహాపరాధము నావలన నెన్నఁడును జరుగదు. ఏదియో దారి నీవే చూచుకొను" మని యీసడించినాఁడు గీష్పతి.

బ్రహ్మనుజేరి దేవనాయకుఁడు కోరినాఁడు. "శివనిందా మహాపాతకమునకు నేనె కా దెవ్వఁడు నొడిగట్టఁడు. ఆపని నా పశుపతినే చేయఁగోరుము. ఆత్మనింద యాతనికిఁ బాప హేతువు కాఁబోదు. అతని నర్థింపు" మని కమలాసనుఁ డుద్బోధించినాఁడు. అమరు లందఱితోఁ గలిసి యమరనాథుఁడు రజతాద్రినాథునిఁ జేరి ప్రణామము లొనరించి స్తుతించెను. త్రినేత్రుఁడు ప్రసన్నుఁడై వరము గోరుఁ డనఁగా "స్వామీ! పర్వత పతి ముక్తినొందకుండ నా దంపతుల యెదుట మీరు శివనిందఁ జేయవలయు నని యర్థించినాఁడు సహస్రనేత్రుఁడు. "ఇదేమి కోరికయ్యా! సరే! ఇచ్చెద నంటిని గదా! అటులే చేయుదు మీరు వేడలుఁ" డని పరమేశ్వరుఁడు పల్కి వారిని సాగనంపెను.

శశిభూషణుఁడు వృద్ధభూసుర వేషము ధరించి, ఛత్రము దండము, స్ఫటికమాల పట్టుకొని హరినామస్మరణముఁ జేయుచు

హిమవంతుని దగ్గఱకు వచ్చెను. గిరిరాజు సపరివారముగా నెదు రేఁగి యర్ఘ్యపాద్యాదులతోఁ బూజించి యా విప్రునిఁ దమ గృహ మునకుఁ దెచ్చెను. అతఁడు వారల నాశీర్వదించెను.

గిరీంద్రుఁడు "భూసురవరా! తా మెవ్వరు? ఎక్కడ నుండి యరుదెంచుచున్నారు? మ మ్మేరీతి ననుగ్రహింప విచ్చేసి నారు?" అని ప్రశ్నించినాఁడు. ఆ విప్రుఁడు పర్వతరాజా! నేను జ్యోతిషికుఁడను. దేశాటన మొనరించుచున్నాను. నీ పుత్రికను కృత్తివాసున కిచ్చి వివాహముఁ జేయ సంకల్పించి నావుగదా! అతఁడు వట్టి దరిద్రుఁడు, కులహీనుఁడు, విభూతిరాయఁడు, భిక్ష కుఁడు, దిగంబరుఁడు, అస్థిమాలాధరుఁడు, అమంగళుఁడు, వయ స్సెంతయో తెలియఁబడనివాఁడు. యోగిస్వరూపుఁడు, ముంగోపి. ఇట్టి విలక్షణునికిఁ బుత్రిక నిచ్చినచో నామె యేమి సుఖపడఁ గలదు! వయస్సా? రూపమా! ధనమా! భోగమా! ఏ మున్నదని యాతనికిఁ గట్టఁబెట్టెదవయ్యా! నీకుఁ దెలియనిచోఁ బెద్ద లెవ్వరి నైన నడిగి తెలిసికొనుము. పెండ్లియన్నచోఁ గులగోత్రములు, వందచందములు, నీడుజోడులు, సిరిసంపదలు, నాచారసంప్రదా యములు మున్నగున వెన్నియో పర్యాలోకించి చేయవలసిన కార్యము. ఇది జీవితకాలసమస్య గావునఁ గడుజాగరూకతతో నాలోచించి చేయవలయును. సమర్థతగల తండ్రి తనపుత్రికను యోగ్య వరున కొసంగనిచో నరక లోకగతుఁ డగు నని శాస్త్ర ములు చెప్పుచున్నవి.

శ్లో॥ వరా యానసురూపాయ పితా కన్యాం దదాతిచేత్
కామా న్మోహా ద్భయా ల్లోభా త్స నష్టో నరకం వ్రజేత్॥

( శివపురాణము )

కావున నీ సతీసుతులతో బాంధవులతో బాగుగా నాలోచించి
తగినవాని కిచ్చి పెండ్లిచేయు" మని యుపన్యసించెను. అటు
పిమ్మట గిరిరాజు నింట భుజించి విప్రవేష మహేశ్వరుఁడు వెడలి
పోయెను.

విప్రుని బోధలు మేనకాదేవికి బాగుగాఁ దల కెక్కినవి.
పరమేశ్వరునియందు భక్తి సడలినది. ఆతఁ డన్న వన్నియు
యథార్థము లని భ్రాంతిపడినది, విషమనేత్రునకుఁ దన పుత్రిక
నీయకూడ దను నిశ్చయమునకు వచ్చినది. నగపతినిఁ జేరి
'నాథా! సౌందర్యవతి, లక్షణవతి యగు నా పార్వతిని విలక్షణుఁడు
విషమనేత్రుఁడు, భూతపతి, కాపాలికుఁడు, దిగంబరుఁడు నగు
వాని కెటు లీయఁగలను? నా కెంతమాత్రమును తని సంబంధ
మంగీకారము కాదు. నన్నుఁ గాదని మీ రిచ్చెదరా నే నాత్మ
హత్యఁ గావించుకొందు" నని నొక్కి చెప్పి కోపగృహములోఁ
జేరినది పర్వతేంద్రపత్ని.

మేనకాదేవి మనోగతముఁ దెలిసికొని యామెకు హితము
నుపదేశింపఁజేయుటకై శర్వుఁడు సప్తమహర్షుల నరుంధతిని
సంస్మరించెను. వా రంద అరుదెంచి లోకేశ్వరునకుఁ బ్రణమిల్లి

స్తుతించి "సర్వేశా! మమ్ము స్మరించితి వన మమ్ముఁ దరింపఁ జేయుటకే కదా! మా పుణ్యము ఫలించినది. జన్మాంధునకు దృష్టి కలిగిన నెంత యానందమో, వంధ్య ప్రసవించిన నెంత సంతోషమో, వామనున కెత్తైన చెట్టుపండు లభించిన నెంత ముదమో, మూఁగవానికి మాటలువచ్చిన నెంత సంబరమో, పేదకుఁ బెన్నిధి దొరకిన నెంతసమ్మోదమో, కుంటివాఁడు గిరి శిఖర మెక్కఁగల్గిన నెంత సంతసమో నీ దర్శనము మా కంత ముదావహము! నీవు సర్వజ్ఞుఁడవు. మేము నీ సేవకులము. విధేయులము, ఆజ్ఞాపింపు" మనిరి.

శ్రీకంఠుఁడు పలుకుచున్నాఁడు. "మహర్షులారా! భక్తుల ననుగ్రహించుటయే నా ప్రతిజ్ఞ. పార్వతి నా భక్తురాలు. ఆమె కోరిక నెఱవేర్పవలెను. ఇంద్రాదు లర్థింపఁగా నగరాజదంపతుల కడ నేను మాఱువేషమున శివనిందఁ గావించితిని. అది యథార్థ మని భ్రాంతిపడి నాకు వారి కుమారి నిచ్చుట కా దంపతులు విముఖు లైనారు. మీరు వారికడ కరిగి వారి యజ్ఞానముఁ దొలఁగునట్లు బోధించి యీ శుభకార్యసంధాన మొనరింపుఁడు".

"మేము ధన్యుల మైతిమి. పరమేశా! యీ స్వల్ప కార్యము నీ వొనరించుకొనలేక కాదు. మా కీ ప్రతిష్ఠఁ గలిగించుటకే మమ్ము నియోగించుచుంటివి. ఇది మా భాగ్యము." అని యరుంధతీయుతులై మహర్షులు శివునకు వందన మొనరించి హిమాద్రి కేఁగిరి.

హిమవద్రాజధాని, స్వర్గరాజధానికంటెను, భోగవతీ నగరమ్మకన్నను మిన్న. దానినిఁ జూచి "యజ్ఞయాగములు, దానధర్మములు చేసి స్వర్గమునకుఁ బోవ నాసింతురే కాని యీ నగరభోగములకన్న నవి యెక్కువ కావు. ఏమి వైభవ" మని మహర్షులు సహర్షులైనారు. రవితేజోభాసమాను లగు వారి యాగమనము గాంచి పర్వతనాథుఁడు వారికి నమస్కరించి పూజించి సుఖాసీనులఁ గావించి, "మహానుభావులారా! మీ రాకచే మా గృహము పావన మయ్యెను. మిమ్ముఁ బూజించుట వలన మా గార్హస్థ్యము సార్థక మైనది. అనేక తీర్థములు మా యింటికేతెంచిన ట్లయినది. మీరు పరిపూర్ణులు. నారాయణస్వరూపులు. మీ యాజ్ఞ శిరసావహించి నెఱవేర్తును సెలవిం"డని యభ్యర్థించినాఁడు. మునులు పలుకుచున్నారు.

"నగరాజా! నీ యింట నున్న పుత్రిక కాళి జగజ్జనని! కైలాసమున నున్న కంఠేకాలుఁడు జగత్పిత! వీరలు శాశ్వతులు! పురాణ దంపతులు. ఇపుడు వా రిర్వురకుఁ బాణిగ్రహణ మొనరించినచో నీవు జగద్గురునకు గురుఁడవై ధన్యుఁడ వగుదువు. పరమేశ్వరుఁడు నీయల్లుఁడు కాఁగలఁడు. నీ వాతనికిఁ గన్యాదాన మొనరించు టనఁగా నీవు దాతవు నాతఁడు ప్రతిగ్రహీతయు నగుట కదా! అట్టి సత్పాత్రికుఁ గన్యాదాన మొనరింపఁగలుగు టెంతటి యదృష్టమో! ఈ భాగ్య మే లోకముననైన నేయొకనికైనఁ గల్గునా? ఆ భాగ్యము నీకే లభింపఁజేసికొనుము".

పర్వతపతి బద్ధాంజలియై "ఈశ్వ రేచ్ఛ వలన మేమును విడివఱలో నటులే నిర్ణయించుకొన్నాము. కాని కొలఁది దిన ముల క్రిందట నొక విష్ణుభక్త విప్రుఁ డరుదెంచి "శివుఁడు విరూపుఁడు, విలక్షణుఁడు, నిర్భాగ్యుఁడు, నిరాశ్రయుఁడు, భస్మరూషితుఁడు, యోగి, వయోవృద్ధుఁడు, పార్వతికిఁ దగని వాఁడు నని యనేక నిందావాక్యము లాడగా నాసతి యవి విని నమ్మి నా సుత నాతని కీయ నని నిశ్చయించి నాపై నాగ్రహించి కోపగృహమునఁ బడి దుఃఖించుచున్నది. ఎంతగాఁ జెప్పినను వినకున్నది. విష్ణుభక్తుని యాలాపములతో నా హృదయమును మారినది. ఇఁక నా మూఁడుకన్నులవానికి మా ముద్దుల బిడ్డ నీయఁజాల" మని విన్నవించెను. ఆ మాట లాలించి వశిష్ఠుఁ డిట్లు బోధించెను.

శ్లో॥ శృణు శైలేశ । మద్వాక్యం సర్వథా తే హితావహమ్
ధర్మావిరుద్ధం సత్యం చ పర త్రేహ ముదావహమ్
వచనం త్రివిధం శైల । లౌకికే వైదికే ఽపి చ
సర్వం జానాతి శాస్త్రజ్ఞో నిర్మలజ్ఞాన చక్షుషా
అసత్య మహితం పశ్చా త్సాంప్రతం శ్రుతిసున్దరమ్
సుబుద్ధి ర్వక్తి శత్రుర్హి హితం నైవం కదాచన
ఆదా వప్రీతిజనకం పరిణామే సుఖావహమ్
దయాలు ర్ధర్మశీలో హి బోధయ త్యేవ బాంధవః
శ్రుతిమాత్రా త్సుధాతుల్యం సర్వకాల సుఖావహమ్
సత్యం సారం హితకరం వచనం శ్రేష్ఠ మీప్సితమ్
ఏవం చ త్రివిధం శైల నీతిశాస్త్రోదితం వచః
కథ్యతాం త్రిషు మధ్యే కిం బ్రువేవాక్యం త్వ దీప్సితమ్॥

నగాధిపా! ధర్మవిరుద్ధము కానిదియు, సత్య మైనదియు, నిహప రానందదాయక మైనదియు, నీ కన్ని విధముల హిత మైనదియు నగు నా వాక్యము వినుము. లౌకికముగఁ గాని వైదికముగఁ గాని వచనములు మూఁడు తెఱఁగులు. శాస్త్రజ్ఞుఁడు నిర్మల జ్ఞానచక్షువుచే సర్వము నెఱుఁగును. వినిన వెంటనే యింపుగా నుండి పిదప నహితమును నసత్యమును నగు వాక్యమును శత్రువే కాని మిత్రుఁ డెన్నఁడును బలుకఁడు. ఇది మొదటిది. తొలుత నహితముగ నుండి క్రమముగ సుఖమొసంగునది రెండవది. దీనిని దయాళుఁడు ధర్మశీలుఁడు నగు వాఁ డొక్కఁడే బోధించును, వాఁడే బాంధవుఁడు. విన్నంతనే యమృతతుల్యమును సర్వదా సుఖకరమును, సత్యమును, సారవంతమును, హితకరము నైన వచనము మూఁడవది. ఇదియే శ్రేష్ఠ మైనది. ఈ త్రివిధవాక్యములును నీతిశాస్త్రమునందుఁ జెప్పఁబడినవి. వీనిలో నీ కేది సమ్మతమో చెప్పుము.

ఇదివఱలో శివునకుఁబుత్రికనీయ సంకల్పించి మఱలమనస్సు మార్చుకొనుటకు శివమాయ కారణ మని భావించి మహర్షులు మేనకకు బోధించి రమ్మని యరుంధతినిఁ బంపిరి. ఆమె మేనక దగ్గఱకు వెడలి "మేనకా! లేవవమ్మా! నే నరుంధతిని. సప్త మహర్షులతోఁ గలిసి వచ్చితి" నని యనఁగా మేనక దిగ్గున లేచి లక్ష్మివలెఁ బ్రకాశించు నాయరుంధతికి సాష్టాంగ మొనరించి "అహా! ఏమి నా భాగ్యము! వశిష్ఠుఁడు సాక్షాద్విష్ణువు! ఆయన పత్నియరుంధతి పతివ్రతాశిరోమణి! ఈ దంపతులు మా యింటికి

వచ్చి రనిన నా యదృష్ట మెంతగొప్పది! నాజన్మసఫల మైన" దని లోన భావించి "అమ్మా! అరుంధతీ! మీ దంపతుల చరణ రజముతో నేఁడు మా గృహము పావన మైనది. మీ యాగ మన కారణమును తెలిపి నన్నాజ్ఞాపించిన వెంటనే నెఱవేర్తును నేను మీ పాదసేవకురాల" నని చెప్పఁగా నరుంధతి "అమ్మా! మేనకా! పరమేశ్వరుఁ డైన శంకరుఁ డెన్నఁడైన నెవ్వరి నైన యాచించెనా? నేఁడు పార్వతి నిమ్మని మిమ్మర్థించు చున్నాఁడు. ఆయన కామరహితుఁ డయ్యును లోకసంరక్షణార్థమై తా నుమ కొసంగిన వరము నెరవేర్చుకొనుట కీ వివాహము నంగీకరించెను గాని కోరిక లుండి కాదు సుమా" యని వివరించి ఋషులసన్నిధికి వచ్చినది. అంత వశిష్ఠమహర్షి శివనామ స్మరణ మొనరించి హిమవంతున కిట్లు బోధించెను.

"నగరాజా! మృత్యుంజయుఁడు హైమవతి తపశ్చర్యకు మెచ్చి యామెను బెల్లాండు నని వరమిచ్చినాఁడు. వారు శాశ్వత దంపతులు. ఇపుడు నీవు నిమిత్తమాత్రుఁడవై కన్యాదాన మొనర్చి తత్ఫలము నందుము. శంకరుఁ డమంగళుఁడు, దరిద్రుఁడు, కులగోత్రవిహీనుఁడు నని నీవు బాహ్యదృష్టిచేఁ దలంచు చున్నావు. అవి యథార్థములు గావు.

శ్లో॥ కో వేద శంకరో దుఃఖీ కుబేరో యస్య కింకరః
భ్రూభంగలీలయా సృష్టిం స్రష్టుం హర్తుం క్షమో హి సః
నిర్గుణః పరమాత్మా చ పరేశః ప్రకృతేః పరః
యస్య చ త్రివిధా మూర్తి ర్విధాతుః సృష్టికర్మణి

సృష్టిస్థిత్యన్త జననీ బ్రహ్మ విష్ణు హ రాభిధా
బ్రహ్మ చ బ్రహ్మలోకస్థో విష్ణుః క్షీరోదవాసకృత్
హరః కైలాసనిలయః సర్వాః శివవిభూతయః
ధత్తే చ త్రివిధా మూర్తీః ప్రకృతిః శివసంభవా
అంశేన లీలయా సృష్టా కలయా బహుధా అపి
ముఖోద్భవా స్వయం వాణీ వాగధిష్ఠాతృ దేవతా
వక్షస్థలోద్భవా లక్ష్మీః సర్వసమ్ప త్స్వరూపిణీ
శివా తేజస్సు దేవానా మావిర్భావం చకార సా
విహత్య దానవా న్సర్వా న్దేవేభ్య శ్చ శ్రియం దదౌ॥

(శివపురాణము)

కుబేరుఁడు కింకరుఁడుగాఁ గల శంకరుఁడు దుఃఖితుఁడని యెవ్వఁడనుకొనును ? అతఁడు భ్రూవిలాస మాత్రముననే సృష్టిని గల్పింప లయింప సమర్థుఁడుగదా ! అతఁడు నిర్గుణుఁడు, పరమాత్ముఁడు, ప్రకృతికంటె భిన్నుఁడైన పరేశుఁడు. అతని మూర్తి బ్రహ్మ విష్ణు హరనామములచేఁ ద్రివిధమై సృష్టి స్థితి నాశములఁ గలిగించుచున్నది. బ్రహ్మలోకస్థుఁడైన బ్రహ్మయు క్షీరసాగర వాసుఁడైన విష్ణుఁడును గైలాసనివాసుఁ డైన హరుఁడును శివవిభూతులే. శివసంభవమైన ప్రకృతి సృష్టింయం దంశచేతను లీలచేతను గళచేతను ద్రివిధ స్త్రీ మూర్తులను ధరించెను.

వాగధిష్ఠానదేవతగా ముఖోద్భవ యైనది వాణి ; సర్వసంపత్స్వరూపిణియై వక్షస్స్థలమునుండి జన్మించినది లక్ష్మి. దేవతా

తేజమునుండి జనన మొందినది శివాదేవి. ఈమె సర్వదానవు లను వధించి దేవతల కైశ్వర్యము నొసంగినది.

శ్లో॥ శివా శివస్య పత్నీ యం శైల ! జన్మని జన్మని
కల్పే కల్పే బుద్ధిరూపా జ్ఞానినాం జననీ పరా॥

శ్లో॥ శివాం శివాయ శైలేన్ద్ర స్వేచ్ఛయా చే న్న దాస్యసి
భవితా త ద్వివాహో ఒత్ర భవితవ్య బలేన చ॥
వరం దదౌ శివాయై సతప స్త్యై తాత శంకరః
న హీశ్వరప్రతిజ్ఞాతం విపరీతాయ కల్పతే॥

నగరాజా ! కల్పకల్పమునందు జ్ఞానులకు బుద్ధిరూప యగు పరాంబిక జన్మజన్మము లందును శివపత్ని యగు నీ శివాదేవియే ! ఈమెను శివునకు స్వేచ్ఛగా నీ వొసంగకున్నను విధిబలముచే వారి వివాహము జరుగునదియే ! తప మొనరించు నపు డీమెకు శంకరుఁడు వర మొసంగియే యున్నాఁడు. ఈశ్వర ప్రతిజ్ఞకుఁ దిరుగులేదుగదా !

నగేంద్రా ! పూర్వ మొక నృపాలుఁడు తన కుమారి నొక భూదేవున కొసఁగి తన రాజ్యమును నైశ్వర్యమును సంరక్షించు కొనెను. అటులే నీవును నీ యాత్మజ నా పరమాత్మున కిచ్చి నీ రాజ్యమును సంపదను గాపాడుకొనుము". అని చెప్పుచున్న యా వశిష్ఠునిఁ బర్వతపతి ప్రశ్నించుచున్నాఁడు. "మహర్షీ ! ఆ రా జెవ్వఁడు ? ఎట్లు సంరక్షించుకొనెను ? సవిస్తరముగాఁ దెల్పుఁడు".

వశిష్ఠుఁ డా యితిహాసమును వివరించుచున్నాఁడు. పదునాల్గవ మన్వంతరమున ననరణ్యుఁ డను నరపాలుఁ డుండువాఁడు. అతఁడు మంగాళారణ్యుని కుమారుఁడు. అనరణ్యుఁడు మహాశివభక్తుఁడు. బలపరాక్రమ సమన్వితుఁడు. సప్తద్వీపములను ధర్మబద్ధముగఁ బాలించుచున్న వాఁడు. యజ్ఞశతము నొనరిఁచెను. దేవత లిందప్రదవి నిచ్చెద మన్నను స్వీకరింపలేదు. అతనికి నూఱుగురు కుమారులును బద్మయను పేరు గల యొక కుమారికయుఁ గలరు. పిప్పలాదుఁ డను ఋషి స్నానమునకేఁగి వచ్చుచు మార్గములో, గంధర్వుఁ డొకఁడు చెలియలతోఁ గూడి శృంగార విహార మొనరించుటఁ, జూచి కామాసక్తుఁడై "నా యౌవన మంతయు వ్యర్థముగాఁ బోవుచున్నదే! వివాహము గావించుకొని సాంసారిక సౌఖ్యము ననుభవింపవలె" నని తలంచెను. ఒకనాఁ డా మౌని పుష్పభద్రానదికి స్నానార్థము వెడలుచు నా రాజకన్య సఖీపరివృతయై విహరించుటఁ జూచి యాపె సౌందర్యమున మోహితుఁడై యుక్తవయస్క యగు నామెను వివాహ మాడఁగోరెను. సఖురాండ్రవలన నా కన్యా వృత్తాంతము నంతయుఁ దెలిసికొనెను. వెంటనే స్నానముఁజేసి యాశ్రమమునకు నడచి యట నిత్యకృత్యముల ముగించుకొని కన్యార్థియై యనరణ్యునిచెంత కరిగెను.

రా జాయన కెదురేఁగి తోడ్తెచ్చి యర్ఘ్యపాద్యాదులతోఁ బూజించి "మునిపుంగవా! మీ రాకచే మా గృహమును మా జన్మమును ధన్య మైనవి. తమ రేతెంచిన కార్య మావతీయుఁ"

డనఁగా మహర్షి "రాజా! నాకుఁ బెండ్లిఁజేసికొను కుతూహల మంకురించినది. నీ పుత్రిక నిచ్చి నా యభిలాషమును నెఱ వేర్పు" మనెను. ఆమాటలు రాజు చెవులకు వజ్రప్రహారముల వలె సోఁకి నిశ్చేష్టుఁ డయ్యెను. ఈ వర్తమానము పత్నికిని గుమారులకును దెలిసి వా రందఱును మిక్కిలి దుఃఖింపుచుండ రాజు తన యంగీకారమును దెల్పకుండుటఁ జూచి మౌని కనలి "నృపతీ! నీ పుత్రిక నిచ్చెదవా? లేక నీ సర్వస్వమును నాశముఁ జేయు మందువా? యని యఱచినాఁడు. రాజదంపతు లేమియుఁ జెప్పఁజాలక మిక్కిలి విచారింపసాఁగిరి. లలితసుకుమారి యగు కుమారిక నా వృద్ధతాపసునకుఁ గట్టఁబెట్టుటయా? మునిపలుకులు వినక సర్వనాశన మగుటయా? యని కుమిలిపోవుచున్నాఁ డనరణ్య నరపాలుఁడు. అంతలో వారి కులగురువు భృగుమహర్షి వచ్చి రాజుచేఁ బూజితుఁడై విషయము నంతయు విని "వత్సా! నీ పుత్రిక నెవ్వరికైన నిచ్చి వివాహముఁ జేయవలసినదే కదా! ఈయన యోగ్యవిప్రుఁడు, తపస్వి, పాత్రుఁడు, స్వయముగఁ గన్యార్థియై వి న్నర్థించినాఁడు. అతని కోరికను దీర్పనినాఁడు నీ రాజ్యసర్వస్వమును నాశమయి తన్మూలముగ సర్వజన కష్ట మేర్పడును. ఒక్క నీ పుత్రిక యభిమతమునకై సర్వప్రజాపీడ నంగీకరింపరాదుకదా! ధర్మబద్ధ మైన యీ వివాహమును జేసి నిన్నును, నీరాజ్యమును, నీ పరివారమును, నీ ప్రజలను సంరక్షించుకొను" మని యుపదేశించెను. గురువచనబద్ధుఁడై నరేంద్రుఁ డట్లయని యా మునికిఁ దన తనూజనిచ్చి వివాహ

మొనర్చెను. వధూయుతుఁడై ఋషి యాశ్రమమున కరిగెను. అనరణ్యుఁడు శోకసంతప్తుఁడై యెట్టకేలకు ధైర్యము నొంది రాజ్యమును గుమారుల కప్పగించి వనమున కేఁగి శంకరునిఁగూర్చి తప మొనరించి దేహాంతమున శివలోకము నందెను.

పిప్పలాద మహర్షి సతీయుతుఁ డయ్యు నతిలంపటుఁడు గాక యాశ్రమమునఁ దప మొనర్చుకొనుచు, స్వకృత్యనిర్వహణ మున కంతరాయములేని భంగిని సంసారము సాగింపుచుండెను. పద్మ రాజకుమారి నన్న యతిశయము లేక వృద్ధపతి యని దిగులువడక పతిని దైవసమునిగా భావించి సేవలఁ గావించుచుఁ బాతివ్రత్యనిరతయై మెలఁగుచుండెను. ఒకనాఁ డామె గంగానదికి స్నానమునకు వెడలుచుండ దారిలో ధర్మదేవత బంగారుతేరి నెక్కి రాజవేషమున వచ్చి యా పద్మతో నిటులు ముచ్చటింపఁ జొచ్చెను.

"ఓ లావణ్యవతీ! అపరలక్ష్మివలె విలసిల్లు నీ కా తాపస వృద్ధుఁడు తగినవాఁడు కాఁడు, నన్నుఁ జూడుము, రాజసింహుఁ డను, నవయౌవనుఁడను, నీ కన్నివిధములఁ దగినవాఁడను. నీకు వలసిన భోగము లన్నిటి ననుభవింపఁ జేయువాఁడను. నీచరణ దాసుఁడుగా వర్తింతును. నామాట విని నన్ను నాధునిగా నంగీ కరింపు" మనుచు దగ్గఱకు రాఁబోగా నా మునిపత్ని యాగ్ర హించి,

శా. దూరం బేఁగుము దూర మేఁగుము శఠా! దుష్టాత్మ! రాజాధమా!
చీఱంజేసెద నిన్ను ముక్కలుగ నా శీలాసిచే నన్యకాం
తార క్తుండవు పాపస క్తుఁడవు నా నాధున్ జగద్వంద్యతే
జోరించో శివిధాను నాడెదవె లొచ్చుల్ పిప్పలాదున్ ఘనున్.

ఆ. ఎంత వే త్త లైన నెంత యు త్తము లైన
నెంత ధీరు లైన నెంత శూరు
లైన నెంత వలఁతు లైనఁ బరస్త్రీలఁ
జెఱుపఁదలఁచువారు చెడుదు రెందు.

(ఆంధ్రశివపురాణము)

నీవు కామాంధుఁడవై బలవంతుఁడను యువకుఁడ నను గర్వమున సంచరించితివి గాన నీకు క్షయము కలుగుఁగాక !" యని శపించినది.

తత్క్షణమే ధర్మదేవత నిజరూపముఁ జూపి గజగజ వణఁకుచు నా పతివ్రతారత్నమునకు వందన మిడి,

ఉ. తల్లి! యనుగ్రహింపఁదగు ధర్ముఁడ నేను నృపుండఁ గాను నీ
యుల్లము నారయంగ నిటు లుద్యమమూని యొఱింగి మెచ్చితిన్
దల్లులఁబోలె నెందు పరదారలఁ గన్గొనువాఁడ నేఁ డటుల్
చెల్లని చెయ్విఁ బూని యిటు శిక్షను జెందితి నర్హరీతిగాన్.

(ఆంధ్రశివపురాణము)

అమ్మా! నేను జ్ఞానులకు గురువులకు గురుఁడను. అన్య వనితను దల్లిగాఁ జూచువాఁడను. పరులవలన నీ మనము

చలింప దని తెలియును. అయినను నిన్నిట్లు పరీక్షింపఁ దలంచుట నాపూర్వకర్మ ఫలము.

శ్లో॥ కృతం మే దమనం సాధ్వి న విరుద్ధం యథోచితమ్
శాస్తిః సముత్పథస్థానా మీశ్వరేణ వినిర్మితా
స్వయం ప్రదాతా సర్వేభ్యః సుఖదుఃఖవరాన్ క్షమః
సంపదం విపదం యోహి నమ స్తస్మై శివాయ హి
శత్రుం మిత్రం సంవిధాతుం ప్రీతిం చ కలహం క్షమః
స్రష్టుం నష్టుం చ యః స్రష్టుం నమ స్తస్మై శివాయ హి
యేన శుక్లీకృతం క్షీరం జలే శైత్యం కృతం పురా
దాహీకృతో హుతాశ శ్చ నమ స్తస్మై శివాయ హి॥

ఓ సాధ్వీ! నాకుఁ దగిన ప్రాయశ్చిత్తమును జేసితివి. ఇది యుచితమే కాని విరుద్ధము కాదు. ఉత్పథగాములకు శిక్ష యీశ్వరునిచే విధింపఁ బడినది. ఈశ్వరుఁడు సమర్థుఁడు గాన సర్వులకు సుఖమును, దుఃఖమును, వరములను, సంపత్తును, విపత్తును నిచ్చుటకుఁ దగియుండును. అట్టి శివునకు నమస్కరింతును. శత్రుని మిత్రునిఁగాఁ జేయుటకుఁ, బ్రీతిని గలహముగాఁ జేయుటకు, సృష్టించుటకు, నశింపఁజేయుటకు సమర్థుఁడైన యీశ్వరునకు నమస్కారము. పాలకుఁ దెలుపును జలమునకు శైత్యమును నగ్నిహోత్రమునకు దాహకశక్తియు నిచ్చినట్టి యీశ్వరునకు నమస్కారము.

పద్మ ధర్మనివాక్యముల విని పశ్చాత్తాపము నొంది "అయ్యో! ధర్మదేవతను మానవవనిత నైన నేను శపించుటయా! ఎంత తప్పు చేసితిని. మూఢనైతిని.

ఉ. నన్నుఁ బరీక్ష సేయఁగ మనంబున నెంచి మహాత్మ ! నీ విటుల్
చిన్నతనంబు వైఖరిని జెందుటచేత నెఱుంగలేక నే
బన్నమునాడి శాపమును బల్కితి స్త్రీజన చాపలంబునన్
బున్నెపు వేల్పు వీ వగడుఁ బొందితిఁ జెందితి ధర్మలోపమున్.

క. నా శాపము వాలివో దా
వేశముతో నంటి నకట వృషభస్వామీ !
నీ శుద్ధతఁ దెలియుదు నా
దేశంతు వ్యవస్థ నిపుడు దెలియుము దానిన్.

(ఆంధ్రశివపురాణము)

శాపవిముక్తి నీయఁజాలను గాని కొంత మార్పు చేయఁ గలను. కృతయుగమున నాలుగుపాదములను త్రేతాయుగమున మూఁడుపాదములను, ద్వాపరయుగమున రెండుపాదములను గలియుగమున నేకపాదమున నీ వుందువుగాక !" యని పలికెను.

ఆమె పాతివ్రత్యమునకు సంతసించి ధర్ముఁడు వరము లొసంగెను. నీ భర్త యౌవన సౌందర్యములు గలవాఁడును, గుబేరునివంటి భాగ్యవంతుఁడును, మార్కండేయునివంటి చిరంజీవియు, బృహస్పతివంటి బుద్ధిమంతుఁడు నగుఁగాక : పదిమంది యోగ్యనందను లుదయింతురుగాక ! మీ రెల్లప్పుడు సకల భాగ్యములతోఁ దులఁదూగుచుందురు గాక !" యని యను గ్రహించి ధర్ముఁ డదృశ్యుఁ డయ్యెను. పద్మయుఁ బర్ణశాల కరిగి జరిగిన దంతయు నాధునికి విన్నవించి సకల భోగభాగ్యము లంది సుఖించెను.

వశిష్ఠోపదేశమును విని పర్వతపతి పర్వతముల నన్నింటిని సమావేశపఱచి వానితో సంప్రతింపఁగా నవి యిట్లన్నవి. "నగరాజా! మన పార్వతి ఆదిదుర్గాదేవి. కిందటి పుట్టువున సతీదేవి. పశుపతినిఁ బరిణయ మాడుటకే పుట్టినది. ఆమె కదే ధ్యేయము. నటరాజామెను స్వీకరింతు నని వర మిచ్చెను. కావున వారు దంపతు లగుట తప్పనిసరి. నీవు నీ చేతులతో జరిగింపకున్నను నది జరుగునదే! కావున నీవు నిస్సంశయముగ సాభిలాషముగ నపర్ణ నా నాగభూషణునకుఁ గన్యాదాన మొనరించి తరింపుము!"

పర్వతముల మాటలను విని పర్వతపతియు, నరుంధతీ బోధనమున మేనకయు నంగీకరించినారు. అరుంధతీయుత మహర్షిసప్తకముతో విందుభోజనములైనవి. అటుపై శైలజను సర్వాలంకార భూషిత నొనరించి యరుంధతికి మహర్షులకు నమస్కరింపఁజేసినాఁడు హిమవంతుఁడు. వారంద ఱామెను "శీఘ్రమేవ కల్యాణసిద్ధి ర" స్తని యాశీర్వదించి గిరినాథు నిట్లు కొనియాడిరి.

శ్లో॥ శంకరో భిక్షుక స్తేఽద్య స్వయం దాతా భవాన్ గిరే!
భైక్ష్యం చ పార్వతీదేవీ కి మతః పర ముత్తమమ్
హిమవన్ శిఖరాణా న్తే యుద్ధేతోః సదృశీ గతిః
ధన్య స్త్వం సర్వశైలానా మధిపః సర్వతో వరః॥

(శివపురాణము)

గీ. శంకరుఁడు భిక్షుకుఁడు దాత శైలరాజు
భిక్ష పార్వతి యిఁక నొందు పేర్మి కలదె
ధన్యుఁడవు శైలరాజమూర్ధన్య ! నీదు
భాగధేయంబుఁ బేర్కొన వలనుగాదు.

(ఆంధ్రశివపురాణము)

సప్తమహర్షులును వివాహ స్థిరీకరణమునకై నగరాజునకు నిశ్చయతాంబూలము నిచ్చిరి. అరుంధతీదేవి శుభప్రదమగు హరిద్రా కుంకుమముల నందించెను. సుముహూర్తము నిశ్చయింపఁబడినది. మహర్షులు వచ్చి శంభునకు నమస్కరించి వివాహ నిశ్చయమును సుముహూర్త నిర్ణయమును దెలిపి యిఁక సప్త దిన వ్యవధానము మాత్రమున్నదని వివాహసంభారసన్నాహములఁ జేయింపవలె నని వివరించిరి. కైలాసపతి సంతుష్టుఁడై వారితో

ఆ. పెండ్లియనఁగ నేమొ పేరంట మన నేమొ
నాకుఁ బరిచయంబు లేకపోయె
నిందుఁ గడఁగి చెప్పుఁడీ యేమి వలయునో
నిగమవాదులార ! నేర్మి పేర్మి.

అనఁగా మునివరులు సంతోషముతో నిట్లు పల్కిరి.

క. కమలా మాధవులును వా
గ్రమణీ ధాతల శచీ పురందరుల విభూ
సుమనోగణముల నమ్మని
సముదయముల నచ్చరలను నరగఁ బిలువుమీ !

క. వా రెల్ల వచ్చి సర్వము
నేరుపుతో సిద్ధపఱచి నెయ్య మెసంగన్
గూరుతురు పెండ్లి లోకా
ధార! యిటఁ బోయవచ్చెదము సెల విమ్మా!

(ఆంధ్ర శివపురాణము)

మునిగణము శంకరునియొద్ద సెలవుఁ గైకొని శివనామ సంస్మరణఁ జేయుచు నిజాశ్రమములఁ జేరెను. హిమవంతుఁడు తన పురోహితుఁడు, గురువు నగు గర్గమహర్షిని రావించి లగ్న పత్రికను వ్రాయించి, తన పరివారజనులఁ గొందఱి నిచ్చి యా మహర్షిచే, నా పత్రికను సదాశివ సన్నిధానమున కంపెను. గర్గ ముని యా శుభపత్రిక నొసంగఁ జంద్రచూడుఁ డమితానందము నంది యామహర్షినిఁ బర్వతరాజ పరివారమును యథోచితముగ సత్కరించి సంతసపఱచెను. వారు తిరిగి పర్వతరాజనగరి కరిగిరి.

పెండ్లి పను లారంభింపఁజేసినాఁడు హిమవంతుఁడు. నానా దేశములలోని సకల బాంధవులకు, సర్వ మహర్షిపుంగవులకు, మిత్రులకు వివాహాహ్వానములఁ బంపించినాఁడు. లాంఛన వస్తువులను సమస్త సామగ్రిలను మేలిమి బంగారముతోఁ జేయించెను. బియ్యము, శర్కర, యటుకులు, గుడము, మొదలగు వానిని పర్వతములంతరాసులఁ బోయించెను. పాలు, పెరుఁగు, నెయ్యి, తేనె మున్నగువానిని గూపములఁ దీయించి యందుఁ బోయించెను. ఆకాశము నంటు పందిళ్లు వేయించి వివిధ మనోహరాలంకారము లొనరింపఁజేసెను.

ఉ. బంగారు పళ్లెరంబులును బంగరు తామరపాకులన్ మఱిన్
బంగ రరంటియాకులును బంగరు గిన్నెలు పైఁడి దొన్నెలన్
బంగరు పంచపాత్రములు బంగరు చెంబులు పైఁడి బిందెలన్
బంగరు పీటపేటులును బంగరు టుద్ధరణుల్ సమృద్ధిగాన్.

గీ. పైఁడి పన్నీరుబుడ్లును పైఁడి చంద
నంబు గిండ్లును బైఁడి కర్పంబు గిండ్లు
పైఁడి యత్తరు బరణులు పైఁడి యగరు
వత్తు లమరించు పాత్రము ల్వారుసమిఁబ.

మ. మణి హారంబులు వజ్రపుంగడియముల్ మాణిక్యతాటంకముల్
గణనీ యామల తారహారములు ముక్తా రత్నకేయూరముల్
క్వణ దుద్య న్మణినూపురంబులును భాస్వ ద్రత్నకాంచుల్ శిరో
మణులున్ గాంచన యజ్ఞసూత్రములు శుంభ త్పద్మరాగోర్మికల్.

చ. అరిసెలు చక్కిలంబులును నప్పడముల్ వడియంబు లింపుమీ
ర్గరిజెలు లడ్డువంబులును గమ్మని రొట్టె లపూపముల్ చవుల్
పొరయు జిలేబులున్ మణుగుపూవులు సేవెలు నాసవంబులుఁ
బరిపరి యూరుఁ గాయలును బానకముల్ పలుతీరు లొప్పుగాన్.

(ఆంధ్రశివపురాణము)

చేయించినాఁడు శైలరాజు. వివాహ సంభారము లన్నియు సిద్ధ పడినవి. మేనక, బంధువర్గము కలిసి పార్వతినిఁ బెండ్లి కూఁతును జేసిరి. ఆ శుభసమయమునకు సామంతభూధరము లరుదెంచి కానుక లర్పించినవి. మందరము, దర్దరము, క్రౌంచము, గంధ మాదనము, పురుషోత్తమము, నీలము, త్రికూటము, కరవీరము, వింధ్యము దారసుతులతో నరుదెంచి రత్నహేమాదికము లయిన

యనేక బహుమానము లర్పించినవి. కైలాసపర్వతము గూడ వచ్చి కానుక లిచ్చినది. గంగ, యమున, నర్మద, గోదావరి, కావేరి మున్నగు నదులు వనితారూపములతో సర్వాలంకారములఁ దాలిచి యరుదెంచినవి. నగరమంతయు నెత్తైన పందిళ్ళ సూర్య రశ్మిని లోనికిఁ జొరనీక దట్టముగఁ గట్టింపఁ బడినవి. పట్టుబట్టల చాదిసీలు కట్టఁబడినవి. మాణిక్య మంగళతోరణములతో మాలతీ మందార సుమదామములతోఁ గదళీ స్తంభగాంభీర్యములతో నలంకృత మయి నగరము రమణీయముగ నున్నది. వీధు లన్నియుఁ బరిమళగంధములు గలిసిన పన్నీటఁ దడిపి ముత్యములతోఁ ముగ్గులు పెట్టిరి. ఏ వీధిఁ జూచినను శోభాయమానమై కల్యాణ మంటపముగా విలసిల్లుచున్నది.

కల్యాణమహామంటప నిర్మాణమునకై పర్వతరాజు విశ్వకర్మను రావించినాఁడు. పదివేల యోజనముల విస్తీర్ణము గల మంటపము నిర్మింపఁబడినది. విశ్వకర్మ తన యపూర్వ శిల్పకళా వైశారద్యము నుపయోగించి చిత్రవిచిత్ర శిల్పములతో. మనోహర దృశ్యములతో. బ్రహ్మేంద్ర దిక్పాలకాది సభలతో రమ్యాతిరమ్యముగ నత్యంత సహజముగ నిర్మించినాఁడు. సభా కుడ్యములపై విహంగము లెగురుచున్న దృశ్యము నయనానంద కరముగఁ జిత్రిత మైనది. కొన్నితావులలో సింహములు, పులులు, మృగములు, నెమిళ్ళ సజీవములవలెఁ జిత్రింపఁబడినవి. స్త్రీలు నాట్యము లొనరించుచున్నట్లు వ్రాయఁబడినారు. ద్వారసీమను స్ఫటికములతో నందీశ్వరుఁడు నిర్మింపఁబడినాఁడు. ఇవన్నియు

లిఖితచిత్రములు శిల్పములువలెఁ గాక యథార్థరూపములే యని భ్రాంతి గలిగించునట్లు రచించినాఁడు విశ్వకర్మ! కళ్యాణమంటపములోని చిత్ర శిల్ప కళాదృశ్య మొక యపూర్వ కళాఖండము!

ఆమంటపములో లోకపాలకులు, దేవతలు, మహర్షులు, గరుడారూఢ నారాయణుఁడు శిల్పకళారూపములలో నిర్మింపఁబడినారు. పుష్పకవిమానము రత్నాలంకారమండితమై రచితమైనది. సరోవరములు, పుష్పోద్యానములు, నయనోత్సవముఁ గూర్చుచు యథార్థరూపములవలె విరాజిల్లుచున్నవి. రథ గజ తురగ పదాతి చతురంగబలములు తీర్చి దిద్దఁబడియున్నవి. ద్వారపాలకులు ధనుర్బాణ హస్తులై యత్యంతసహజముగ నిర్మింపఁబడిరి. లక్ష్మీవిగ్రహము సాక్షాన్మహాలక్ష్మియే యనిపించుచున్నది. ఇది యది యన నేల! ముల్లోకములలోని ముచ్చట లన్నియు నచ్చముగఁ దొలచిన ట్లాశ్చర్యకరముగఁ జిత్రీకృతము లైనవి. సభాదృశ్యములలో వశిష్ఠాది మహర్షులు, గంధర్వ సిద్ధ యక్ష కిన్నర కింపురుష లాసీను లైనట్లు విధాత బ్రహ్మలోకదృశ్యములో సభాభవనమున వేదపరివృతుఁడై యాసీనుఁ డయినట్లు నిర్మింపఁబడిరి. ఈ కల్యాణ మహామండ పాలంకారమనోజ్ఞత వర్ణింప నలవిగాకున్నది. సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేయఁగల యపరసృష్ట యనిపించుకొన్నాఁ డా విశ్వకర్మ! ఈ నైపుణ్య మంతయు శివానుగ్రహమువలననే యాతనికి లభించినదికదా!

కైలాసమున శంకరుఁడు వివాహసన్నాహము లారంభింపఁ జేసినాఁడు. నారదుని స్మరించి యాతఁడు రాఁగా బ్రహ్మను,

నారాయణునిఁ, దిగ్విదిశులను, మహర్షులను, సకలలోకవాసులను బంధుమిత్రపరివారములతోఁ బెండ్లికిఁ బిలిచిర మ్మని పంపెను. నారదుఁ డేఁగి పెండ్లి పిలుపు పిలిచి వచ్చెను.

సప్తమాతృక లరుదెంచి, మంగళాభిషేక మొనరించి, పాదములకుఁ బసుపు రాసి, పారాణిఁ బెట్టి నుదుటఁ గల్యాణతిలకము దిద్ది యాభరణములఁ బెట్టి మేరుధన్వునిఁ బెండ్లి కుమారునిఁ గావించినారు.

ఆదిదేవుఁడు కిరీటస్థానమున నిందుగ్రనిఁ, దిలకముగ వైశ్వానరుని, గుండలములుగ వాసుకిని, భూషణములుగ మణిభోగి భోగములను, బీతాంబరముగ గజచర్మమును ధరించినాఁడు. పెండ్లి కుమారుఁడైన యా యిందుమౌళి యందము నాదిశేషుఁడుగూడ నా నాఁడు వర్ణింపఁజాలఁ డేమో! ఐశ్వర్య మన్నదీశ్వరభావమే కాన నీశ్వరుని యైశ్వర్యమునకు సాటి యున్నదా?

ఈశ్వర బాంధవులు వచ్చుచున్నారు కైలాసమునకు.

సీ. వైకుంఠముననుండి వనజనేత్రుఁడు సిరి
తో నలంకృతుఁ డయి తోడరి వచ్చె
సత్యలోకమునుండి చతురాననుఁడు పక్క
కల్కితోఁ గై పేసి కదలివచ్చె
అమరాలయమునుండి హరిహయుం డర్ధాంగి
తో జయంతాదులతోడ వచ్చె
పావకాదిక దిక్పాలకులును నిజ
పత్నీజనంబుతో వచ్చి రెలమి

గీ. వరుసగా భాస్క రాది నవగ్రహములు
స ప్తమాతృక లల వశిష్ఠప్రముఖ ఋ
షులు మునులు దివ్య సిద్ధ సాధ్యులును నచ్చ
రలును వచ్చిరి కడు సంబరంబు మెఱయ.

ఆ. విష్ణు వీశ్వరునకు విన్నపం బొనరించె
దేవ! చి త్తగించి యీ వివాహ
మర్థి గృహ్యవిధిగ నాచరింపుము నిన్నె
యనుసరించి యెల్ల రాచరింత్రు.

ఆ. అనిన దేవదేవుఁ డంగీకరింపుడు
బ్రహ్మదేవుఁ డపుడు ప్రౌఢి దనర
మంటపప్రతిష్ఠ మఱియు నాందీముఖం
బులును సల్పె దివ్యమునులఁ గూడి.

(ఆంధ్రశివపురాణము)

పరమేశ్వరుని పెండ్లికి బ్రహ్మపీఠమును బ్రహ్మగా రధిష్ఠించినారు. విఘ్నశాంతికై శంకరునిచే బ్రహ్మ నవగ్రహ పూజ, దేవతార్చనాశాంతులు, మున్నగు మంగళార్చనములఁ జేయించెను.

కైలాసమునుండి మగపెండ్లివారు హిమవదాద్రిజనగరికిఁ దరలి వెడలుచున్నారు. మంగళవాద్యములు మ్రోఁగుచున్నవి. నందీశ్వరాదు లైన కోట్లకొలఁది యీశ్వరభృత్యులు నడచుచున్నారు. ఆ ప్రమథులు కోటిరవితేజోభాసమానులు; జటాజూట ధారులు. రుద్రాక్షభస్మాదికాలంకృతులు, నగు శివగణభృత్య

లసంఖ్యాకముగ బయలుదేఱిరి. వీరు సకల లోకాగతులు. ఈశ్వర గణము వెనుక నష్టదిక్పాలకులు వారి పరివారము కదలుచున్నారు. విష్ణువు గరుడారూఢుఁడై వారి మధ్య నున్నాఁడు. వేద శాస్త్ర పురాణములు మూర్తిమంతములై వెంట రాఁగా వాణీవల్లభుఁడు కదలుచున్నాఁడు. సునాసీరుఁ డైరావతము నెక్కి సపరివారుఁడై పయనించుచున్నాఁడు. మహర్షు లసంఖ్యాకముగ వెడలుచుండిరి. బేతాళ, పిశాచ, శాకినీ, డాకినీ గణములు, గంధర్వ, కిన్నర కింపురుష బృందములు నృత్తగీతాదు లొనరింపుచుఁ బ్రయాణించుచున్నవి. సావిత్రి, గాయత్రి, లక్ష్మి, సకలదేవతావనితలు, మాతృగణములు సాఁగుచున్నారు. ఇంతమంది పెండ్లివారితో ధర్మరూప వృషభము నధిష్ఠించి భక్తవత్సలుఁడైన మహాదేవుఁడు మహావైభవముగా వరుఁడై పెండ్లికిఁ బ్రయాణము జరిగించినాఁడు. పెండ్లివారు హిమగిరి సామీప్యమునకుఁ జేరుకొన్నారు, మహేశ్వరుని యాజ్ఞానుసారముగా దామోదరుఁడు నారదునిఁ బిల్చి పెండ్లివారి రాకను హిమవంతునకుఁ దెలుపు మని పంపెను. నారదుఁడు శైలరాజమందిరమునకు వెడలెను. కల్యాణమంటపము కనిపించినది. అందుఁ దనరూపమును జూచుకొని నారదుఁ డచ్చెరువు పడెను. ఆ మంటపాలంకార దృశ్యములలో నంతట బంగారు పూర్ణకలశములు, రంభాది దేవవేశ్యల నృత్యభంగిమలు, చిత్ర విచిత్ర విగ్రహములు, నింద్రాది సభా సన్నివేశములు చూచి దేవర్షి యాశ్చర్యచకితుఁ డైనాఁడు. తనను దా మఱచినాఁడు, అక్కడ నున్నవి ప్రతిరూపము లనుకొనక యథార్థము లని భ్రాంతిపడినాఁడు.

"అరరే ! నన్ను ముందు వెడలు మని పంపి నాకన్న ముందుగనే హృషీకేశ, మహేంద్రాది బృందారకులు వచ్చి యీ కల్యాణమంటపమున నిలిచినారు. ఇంతలో నెట్లు వచ్చిరి ? నన్ను మోసగించినారా ? నేను భ్రాంతిపడుట లేదుకదా ! యథార్థమౌనా? యని తర్కించుకొని తనకు విశ్వాసము చాలక శైలపతినే ప్రశ్నించినాఁడు. ఆతఁ డిది కల్యాణమంట పాలంకార దృశ్య మనియు నవి విశ్వకర్మచేఁ జిత్రీకరింపఁబడిన ప్రతిరూపశిల్పములు గాని యథార్థములు గా వనియు వివరింపఁగా నా విశ్వకర్మ కమ నీయ కల్పనా శిల్పచాతుర్యమునకు మిగుల నచ్చెరువుపడి శివ స్మరణ మొనరించి స్థిరచిత్తుఁ డైనాఁడు నారదుఁడు.

నారదునివలన పెండ్లివారి రాక నెఱిఁగి యెదురు సన్నా హమునకై నారదునితోపాటు తన కుమారు లైన మైనాకాదులఁ బంపినాఁడు హిమవంతుఁడు.

నారదునితోఁ గలిసి మైనాకాదు లెదురేఁగి శశిఖండమౌళికి నమోవాకము లర్పించి వారి నందఱి నాహ్వానించిరి. నారదుఁడు భయభ్రాంతునివలెఁ గన్పట్టఁగా నచ్యుతుఁ డాతనిని జేరఁబిల్చి "దేవమునీ ! యట్లుంటి వేమి ! అక్కడ వా రేమియు ని న్నవ మానింప లేదు గదా ! పర్వతపతి మనమున మఱల నేదేని మార్పు రాలేదు కదా ! పార్వతి నిచ్చు తలం పున్నదా ! మాఱినదా ! నీ చంద మంతయు వింతగా నున్నదేమయ్యా !" యని యాత్రముతో నడిగెను.

"పురుషోత్తమా! అవమానమో సన్మానమో తెలియదు కాని పెండ్లికి వచ్చుచున్న మన యందఱి ప్రతిరూప విగ్రహములు కల్యాణమంటపమున నిర్మింపఁజేసినాఁడు హిమవంతుఁడు. అందు నేనుగూడ నుంటిని. నేను నేనా? లేక ఆ విగ్రహమే నేనా? యను సందేహము నాకే కల్గినది. క్షణకాలము దిగ్భ్రమ నొందితిని. అటులే బ్రహ్మ విష్ణ్వాదుల, మహర్షుల, విగ్రహములు, ఇంద్రోపేంద్ర బ్రహ్మాది సభలు నచ్చముగ వచ్చినట్లున్నవి. ఇంద్రుఁడు పర్వతముల పక్షములు ఛేదించుచున్నట్లున్నాఁడు. విశ్వకర్మ నిర్మాణ మీ యపూర్వ రామణీయకము. ఇంతకు నిది విరోధమో! వినోదమో! తెలియ" దని వివరించినాఁడు వేల్పుఁదపసి.

పురందరుఁ డీ మాటలు విని బిక్కమొగము పెట్టినాఁడు. "పర్వతముల ఱెక్కలు ఖండించితి నన్న దోషముచే నీ పెండ్లివేళ న న్నవమానించుటకై యీ భూధరపతి యీ పన్నాగము పన్నియుండును, కాన నే నీ వివాహమునకు రాలేను. మీరు వెడలుఁ" డనినాఁడు. "ఇంద్రా! నీవు భయపడవలదు. నేను నీ ప్రక్కనే యుందునుగదా! లోకరక్షకుఁ డైన విషమాక్షుఁడు మన పక్షమున నుండఁగా నీ కీ భయ మేల? వెనుకకుఁ బోవల" దని యుపేంద్రుఁ డాతనికి ధైర్యముఁ జెప్పినాఁడు. ఇంద్రోపేంద్రుల సంభాషణముల వలన నాగభూషణున కనుమానము తోఁచినది. "పాకశాసనా! మీ యిద్దఱి గుసగుస

లేమి ? తుహినశైలుఁడు శైలజ నిచ్చుటకు మఱల వెనుదీసినాఁడా ?" యని ప్రశ్నించెను.

"ఆత్మజ నిచ్చుట కభ్యంతరము చెప్పలేదు గాని యా శైలరాజు విశ్వకర్మచే నొక కల్యాణమహామంటపమును నిర్మింపఁ జేసి యందు మనల నందఱను బొమ్మలుగా నిలువఁబెట్టినాఁడఁట. అది వేడుకకొఱకా ? లేక యవమానించుటకా యని యాలోచించు కొనుచున్నా" మనినాఁడు దేవేంద్రుఁడు.

"పిల్ల నిచ్చుట కభ్యంతరము లేనిచో మిగిలిన వన్నియు నేను జూచుకొందునులే ? మీరు భయంపడకుఁడు. అందు మోస మేమియు నుండఁబోదు. మన కానందము కలిగించుటకే విశ్వకర్మ మన ప్రతిరూపము లంత సహజముగ రచించియుండు" నని విశ్వేశుఁ డనఁగా నందఱును దృప్తిపడిరి.

మైనాకపురస్కృతులై మగపెండ్లివారు హిమవంతునింటికి వెడలిరి. బంధు మిత్ర పరివార సమేతముగఁ బరమేశ్వరుఁడు తనయింటికి వచ్చుచున్నాఁడని, లోకేశ్వరుఁడు తన యల్లుఁ డగుచున్నాఁ డని మురిసిపోయి పురోహితుని వెంట నెదు రేఁగి వారిని దర్శించి నమస్కరించినాఁడు హిమశైలుఁడు.

సీ. దశదిక్కులకుఁ గాంతి దళ్కొత్తఁగాఁ జేయు
దివ్యపత్రీక దీధితులతోడఁ
గలధౌతనగ మిందు, గదలివచ్చినదనాన్
జను బలీవర్ద యానఁబుతోడఁ

జాదుక్కలు వెలుఁగొంద సొగసైన సన్నని
సౌవర్ణ పట్టవస్త్రములతోడ
నెల్ల జగంబుల కెసక మిప్పించు భా
స్వత్తరార్ధేందుభూషణముతోడ
గీ. మేటి రతనాల సొమ్ముల మిసిమితోడ
నమరసుత వేయు సిత చామరములతోడ
మఱుపు చిఱునవ్వుఁదొరయు నెమ్మొగముతోడ
నమరు సర్వేశ్వరునిఁ గని రంద అపుడు.
గీ. ప్రభుని దాపల వలపల ప్రక్కలందు
నాత్మ బలములతోడ నారాయణుండు
పద్మసంభవుఁడును గనుపట్ట వారి
కంజలి యొనర్చి మ్రొక్కె హిమాచలుండు.
క. వెనకన్ ముందఱ నట్లే
మొనకొని యున్నట్టి దేవమునిగణవరులన్
గని యుబ్బి మ్రొక్కు లిడి వం
దనపూర్వక మిటుల శివునిఁ దాఁ బ్రార్థించెన్.
మ. సకలాజాండము లేలునట్టి దొర లీ సర్వామరశ్రేణితో
నాకుఁదా కొండలకాఁపు వీటి కిటులన్ గొ ప్పొప్ప విచ్చేసి వా
ని కుమారిన్ దయఁబెండ్లి యాడఁ దలఁపన్ విశ్వైకచిత్రంబు తా
పక కారుణ్యమయాత్మ మారయ వశంబా సర్వలోకేశ్వరా!
క. నిండారునట్టి దయతో
దండిగ మము నేలికొనఁగఁ దలకొంటివి మా
కొండనఁగనేల? యొకటే
దండం బిదె తప్పు లెల్ల దప్పులఁ ద్రోయన్.
(ఆంధ్రశివపురాణము)

అని స్తుతించి వారికి స్వాగతమును బలికినాఁడు పెండ్లి పెద్ద. మగపెండ్లి వా రందఱు హిమవన్నగరమున విడుదులలోఁ బ్రవేశించి స్నానాదికముల ముగించుకొని ప్రయాణభారములఁ దీర్చుకొనుచున్నారు.

మేనకాదేవి తన యల్లునిఁ జూడవలె నని యువ్విళ్లూరు చున్నది. నారదఋషిని రావించి యల్లునొకసారి చూపింపు మని కోరినది. అతని వెంట నరిగి చంద్రశాలలోఁ గూర్చున్నది.

నారదుఁడు విడిదికిఁ బోయి యీశ్వరునితో మేనక చూడఁ గోరుచున్న దని విన్నవింపఁగా నాతఁ డామె యహంకారముతో నున్నది కావున శివమాయలో భ్రమింపఁజేయవలె నని తలంచి తనకంటె ముందు దేవతల నందఱను హిమవద్రాజభవనమునకు వెడలుఁ డని యాజ్ఞాపించెను. వారు వరుసగా వెడలి భవన సింహద్వారమునుండి లోని కేఁగుచున్నారు. చంద్రశాలలో నున్న పర్వతరాజపత్ని తిలకించుచున్నది. నారదుఁ డామెచెంత నున్నాఁడు. సమస్తాలంకారశోభితుఁడు, సుందర విగ్రహుఁడు, గంధర్వాది పతియు నగు వసువు సపరివారుఁడై లోనికిఁ బోవుచుండఁ జూచి యీతఁడేనా కైలాసపతి యని ప్రశ్నించినది.ఆతఁడు గాఁడనియు శివగణములోని యొకఁ డనియు నారదుఁడు తెలుపఁగా మేనక భృత్యుఁడే యింత సుందరుఁ డైన నా శంకరుఁ డెంత సౌందర్య వంతుఁడో యనుకొనుచున్నది. తదుపరి యక్షాధిపతి మణిగ్రీవుఁడు వచ్చుచుండ నాతని యందమున కానందించి యితఁడేనా యనఁగ

వీఁడు నీ యల్లునకుఁ గింకరుఁడు గాని శంకరుఁడు కాఁ డని నారదుఁడు తెల్పఁగా నాతఁ డిం కెంతటి యందగాఁడో యనుకొనుచున్నది మేనక! ఇటులే యగ్ని యమ నిరృతి వరుణ వాయు కుబేరులు వరుసగా రాఁగా వారును గృత్తివాస కింకరులే యనినాఁడు దేవమౌని. ఆ పిమ్మటఁ జీనాంబరములఁ దొడిగి దివ్యాభరణభూషితుఁడై దివ్యతేజోవిరాజమానుఁడగు దేవేంద్రుఁడు రాఁగా నాతఁడే విశ్వేశుఁ డనుకొన్న గిరిజాజననితో నాతఁడు దేవేశుఁడు గాని విశ్వేశుఁడు గాఁ డనినాఁడు నారదుఁడు. తేజోరాశి యగు వైకర్తనుఁడు రాఁ జూచి తప్పక యీతఁడే నా యల్లుఁ డనుకొనుచుండఁగా "మేనకా! యీతఁ డుష్ణాంశుఁడు గాని శీతాంశుశేఖరుఁడు గాఁ డమ్మా" యనినాఁ డా నారదుఁడు. ఆ వెనుక సురజ్యేష్ఠుఁడు, సురాచార్యుఁడు రాఁగా వారుఁ గూడఁ గా రని నారదుఁ డనియెను. పాపము మేనకాదేవి హృదయము మఱింత తొందరపడుచున్నది. అంతలో

సీ. కోటి కంతుర్పుల కొమరారు సౌరుఁ దోఁ
యఁగఁజాలు మేల్మి బోయగముతోడ
శంఖ చక్ర గదాది సాధనంబుల నొంది
తనరారు నాల్గు హస్తములతోడఁ
గట్టిన మేల్మి బంగారు పుట్టంబుల
దట్టంబులౌ తళత్తళల తోడ
నురమందు రవికాంతి నొప్పారుచున్న ది
వ్యంబైన యలకౌస్తుభంబుతోడ

గీ. డంబుమీఱిన మణిమకుటంబుతోడఁ
గడు మనోహర మైన ముఖంబుతోడ
దయను వెదఁజల్లు వనజనేత్రములతోడ
విష్ణుదేవుఁడు విచ్చేసె వేల్పు లలర.

క. కనుఁగొని మేనక పెనుముద
మున నఱలే దితఁడె శివుఁడు మునినాయక ! క
న్మనుఁడు, నతఁ డితఁడు కేశవుఁ
డనఘుఁడు శివుఁ డింతకన్న నధికుండు చెలీ !

ఉ. ఆతనికన్న మిన్న యొకఁ డైనను లేఁ డిఁక నాతఁడే జగ
త్త్రాతము లేలువాఁ డఖిలపాలకపాలకుఁ డిద్ధవైభవుం
డాతత దేవతాసముద యార్తిహరుండు హరుండు ధాత్రిలో
నాతనిఁ జెప్ప గిప్పఁ దరమౌనొకొ ! నల్వకునేని మానినీ !

గీ. అనిన పలిమలదొరసాని యాత్మయందుఁ
దనదు సుతఁగూర్చి యేకొఱంతయునులేని
మంచి శ్రీమంతురా లని యెంచి తనకు
సవతు లేదని తలఁచె ముజ్జగములందు.

ఉ. ధన్యుఁ డిఁకన్ గిరీశ్వరుఁడు ధన్యను నేను నిజాన్వయంబునున్
ధన్యతరంబు వైభవము ధన్యతమం బిఁక ని ట్లనన్యసా
మాన్య విభూతులన్ దగు నమర్త్యులు భృత్యతఁ గొల్చు రాజమూ
ర్ధన్యుఁడు నాదు పుత్రికను దారనుఁగాఁ గొనుటన్ జగంబునన్.

(ఆంధ్రశివపురాణము)

అని అనుకొనునంతలో భూత ప్రేత పిశాచ గణములను వెంటఁబెట్టుకొని విరూపాక్షుఁడు వచ్చుచున్నాఁడు. అనుచరులలోఁ

గొందఱు వక్రితుండులు, కొంద ఱనేకాక్షులు, కొంద ఱేకాక్షులు, కొందఱు దండధరులు, కొందఱు వికారవదనులు, మఱికొందఱు కరచరణహీనులు, కొందఱు వికృతాకారులు, కొందఱు హీనాంగులు, మఱికొంద ఱధికాంగులు గా నున్నారు.

శ్లో. తన్మధ్యే శంకరం చైవ నిర్గుణం గుణవత్తరమ్
వృషభస్థం పంచవక్త్రిం త్రినేత్రం భూతిభూషితమ్
కపర్దినం చంద్రమౌళిం దశహస్తం కపాలినమ్
వ్యాఘ్రచర్మోత్తరీయం చ పినాక వరపాణినమ్
శూలయుక్తం విరూపాక్షం వికృతాకార మాకులమ్
గజచర్మవసానం హి వీక్ష్యత్రేసే శివాప్రసూః॥

వారి మధ్యలో నిర్గుణుఁడు, గుణవత్తరుఁడు, వృషభవాహనస్థుఁడు, పంచవదనుఁడు, త్రినేత్రుఁడు, భస్మాంగరాగుఁడు, జటాధరుఁడు, చంద్రిశేఖరుఁడు, పదిచేతులుకలవాఁడు, కపాలధరుఁడు, పులితోలు నుత్తరీయముగా ధరించినవాఁడు, పినాకమును జేతఁబట్టినవాఁడు, శూలము ధరించినవాఁడు, విరూపాక్షుఁడు, వికృతాకారుఁడు, ఆకులుఁడు గజచర్మవసనుఁడు నగు శంకరునిఁ జూచునంతలో నారదుఁ డీతఁడే నీ యల్లుఁ డనినాఁడు. ఆ వికృతాకారమును జూచి భయము నంది చింతించుచు మూర్ఛిల్లినది మేనకాదేవి. బాంధవజనపరిచర్యతో స్మృతి నంది "అయ్యో! ఈతఁడా నా యాత్మజ మనోహరుఁడు. ఈ జోగితో నా సుత యెట్లు సంసారమును జేయును? వీనిదా లోకోత్తరసౌందర్యము! ఈతఁడు విశ్వేశుఁడా! ఎంత మోసము గావించినాఁడు మతకరిముని!

ఏమి నారదా ! నా బిడ్డకుఁ దగినవాఁడు శంకరుఁడే యని పొగడి నా బిడ్డచేఁ దపముఁ జేయించితి వీ వికారునికొఱకేనా ! చంద్రమౌళి యెంతయో యందగాఁ డని మురిసిపోయినాఁడు నా పతి, ఇదేనా యందము ! ఋషులకుఁ గూడ నసాధ్య మగు తపము నొనరించి నది నా తనూజ ! దాని జీవితము దుఃఖభూయిష్ఠ మైనది. ఇట్టి భయంకరాకారునకు నా సుకుమారి నిచ్చిన లోకులు తిట్టిపోయు దురు. నా వంశోన్నతి మంటఁగలిసినది. ఏరి? నాకు నీతులు బోధించి నా మెడలు వంచి నా గొంతుఁ గోసిన సప్తమహర్షు లేరి? ఆ యరుంధతి యెక్కడకుఁ బోయినది?" యని మిక్కిలి శోకించు చున్నది.

పార్వతిని దలంచి "ఓసి బుద్ధిహీనురాలా ! ఎంత పని గావించితివి ? కురూపుని భయంకరాకారునా నీవు వివాహముఁ జేసికొన దీక్షఁబూనితివి? ఎంత ఘోరము? అసమాన సౌందర్య భాసమాను లైన వాసుదేవ, వాసవాదు లెందఱో యుండఁగాఁ గురూపి, నిటలాక్షుఁడు, నమంగళుఁడు నగు వీఁడు నీ కింప య్యెనా ? ఇంటిలోని బంగార మంతయు నిచ్చి గాజు ముక్కఁ గొనిన ట్లున్నది. దగ్గఱనున్న మరాళమును జాఱవిడిచి వాయస మును జేరఁదీసినట్లు, సూర్యకాంతిని వీడి మిఁణుగుఱుఁబురుగు నాశ్రయించినట్లు, బియ్యమును బాఱఁబోసి యూఁకఁ బొక్కినట్లు, నావునేయి విడిచి యాముదముఁ ద్రావినట్లు, పన్నీరు మంచిగం ధము మాని బూడిదఁ బూసికొన్న ట్లున్నది నీ పీతనివి గాంక్షిం చుట. కొన్నివేల వత్సరములు తపించి యీ స్థాణునిఁ బెండ్లాడ

నభిలషించితి వన్న నీ బుద్ధి కాల్పనా? నీకుఁ దెలియనిచోఁ జెలికత్తెలైనఁ జెప్పలేదా? ఇంతహీనబుద్ధివైన నిన్నుఁ గన్న నా జన్మ కాల్పనా! నా కుల మంతయు భ్రష్టమైనది. అమంగళమైనది. సప్తమహర్షులు గిల్బిషులు. వారి ముఖము నిఁకఁ జూడను. వారికి నా గుమ్మముఁ దొక్కరా దని తెల్పుఁడు. మీ రందఱు మా కులమును ధ్వంస మొనరించినారు. అస లీబిడ్డ పుట్టకుండిన బాగుండెడిది. లేక గర్భపతన మైనను జరుగవలసినది. లేదా తపమున నున్నపుడు దీని నే పులియైన నోట వేసికొన్నఁ బోయెడిదికదా! అయ్యో! ఈ కష్టములఁ గన్నులారఁ జూడకుండ నే నిదివఱలో గతించిన నెంత బాగుండెడిది! నే నిఁక బ్రతుకలేను. శిరము బ్రద్దలుగొట్టుకొని చచ్చెద నని పలువిధములఁ దనను నిందించుకొనుచుఁ గుమారిని దూషించుచు సప్తర్షులను నారదుని నోనాడిపోయుచు శోకించి శోకించి వివశయై పడినది పర్వతరాజపత్ని.

పరమేశ్వరవిముఖ యైన మేనక వృత్తాంత మపుడే మగపెండ్లి వారిలోఁ బ్రాఁకిపోయినది. కార్యరంగము రసభంగ మైనట్లే యని యెంచి పంకజసూనుఁడు దేవతలతోఁ గలిసి మేనకదగ్గఱకు వచ్చి హితమును బోధించుచున్నాఁడు.

"మేనకా! నీవు భ్రమపడుచున్నావమ్మా! అది భూతేశుని భయంకరరూపము గాని స్వభావసుందరస్వరూపము కాదు. నా మాట నమ్ముము.

ఉ. సర్వ జగ న్నిదానుఁ డయి సర్వ జగ త్పరిపోషకుండునై
పర్వ జగ న్నిహంత యయి సర్వ జగత్పరిపాలకుండునై
సర్వ జగన్మయుండు నయి సర్వ నియామకుఁడై తనర్చు నా
శర్వుని రూప మారయఁగఁ జాలెదవా ? యిటు జాలి నొందఁగన్.

ఆ మాటలు విని మేనక కోపాటోపముతో

ఉ. ఏటికి ధాత ! యిట్లు తగ నెంచక చెప్పెదు దీని రూప మా
యేటికి ధారవోయుటకు నెంచితి వట్టులు గాక దీనినే
యేటికిఁ ద్రోయరాదె? విను మే నిఁక రుద్రున కీను బుత్రికన్
గోటు లిటు ల్వచించినను గోవిదు లెంతకు నైన దంటలే.

(ఆంధ్రశివపురాణము)

నే నెంతమాత్రము నా పుత్రి నా విషకంఠున కీయను. త్రిలోకమోహన యగు నా కుమారి గొంతుఁ గోయు తలంపుతో మీ రంద ఱిటులు ప్రోత్సహించుచున్నారు. ఇది జరుగదు. ఇఁక వెడలుఁ డని యీసడించినది. పిమ్మట నింద్రాది దేవతలు, దిక్పాలకులు వచ్చి యెంతగాఁ జెప్పినను వినక త్రోసిపుచ్చినది. అంత సప్తమహర్షులు వచ్చిచెప్పుచున్నారు.

"అమ్మా ! మేనకా ! నీవు పితృదేవ కన్యవు. నీ పుత్రిక దుర్గాదేవి. ఆమె లోకోద్ధరణమునకే జన్మించినది. మహేశ్వరుఁ డామె తపస్సునకు మెచ్చి వర మిచ్చెను. అది నెఱవేర్చుటకే పెండ్లాడుచున్నాఁడు గాని వాంఛాసక్తుఁడై కాదు. నిన్ను మోస గించి కురూపికిఁ దుర్మార్గునకు నీ పుత్రిక నంటఁగట్టిన మాకుఁ

గల్గు లాభమే ముండును? ఇది యంతయు లోకసంరక్షణార్థమే కావున స్థిరచిత్తురాలవై యాదిదేవునకుఁ గన్యాదాన మొనరించి తరింపు" మనినారు. ఎంతగాఁ జెప్పినను మేనక వినక దుఃఖించుచుఁగోపముతో "మీరు నాయొద్దకు రావలదు. మీ రయోగ్యులు. మీ మాటలలో నాకు విశ్వాసము లేదు. వెడలిపొం" డని గద్దించినది. అపుడు హిమవంతుఁ డేతెంచి "సతీ! పెద్దల నట్లు తూలనాడ నగునా? శంకరుఁ డెట్లుండునో నీ విదివఱలోఁ జూచియుండలేదా! ఆతఁ డనేకరూపములఁ దాల్చుచుండును. ఆయన పూజ్యులకుఁ బూజ్యుఁడు. గురువులకు గురువు. సర్వేశ్వరుఁడు. అనుగ్రహించవలె నన్నచో నాతఁడే యనుగ్రహింపవలెను. ఈశ్వర తత్త్వమును నేను దెలిసికొన్నాను గావుననే యాత్మజ నిచ్చుట కంగీకరించితిని. నీవు మూర్ఖత మాని దుఃఖము విరమించి శాంతించుము. ఆతఁ డనన్యలభ్యుఁడు. మన యదృష్టమువలనను మన పుత్రిక భాగ్యమునను వచ్చినాఁడు. మన మాయనకుఁ గన్యాదాన మొనర్చినఁ దరింపఁగలము. లె" మ్మని యోదార్చెను.

పర్వతపతి మాటలు విని మేనక లేచి "నాథా! నా కీ సంబంధ మంగీకారము కాదు. మీ కంత సమ్మతమై యాతనికే కట్టఁబెట్టవలెనని యున్నచో నా బిడ్డను నామెడకుఁ గట్టుకొని జలధిలోఁ [illegible]లుదును. నా మాటలెక్క లేకుండ నెటులైన బిడ్డ నాతని కిచ్చె [illegible]రా యిఁక నేను మీకుఁ దక్కను. ఇది నిశ్చయ" మని [illegible]ల్లున నేడ్వసాగినది. అపుడు పార్వతి వచ్చి "అదేమమ్మా! నీ [illegible]హృదయ మింతలో మాఱి యధర్మమున వర్తించుచున్నది!

ఈశ్వరుఁడు జగత్స్వరూపుఁడు, జగత్ప్రభుఁడు, జగదేకమోహనుఁడు, సర్వలోక శుభంకరుఁడు. సర్వరూపధరుఁడు, బ్రహ్మ, విష్ణ్వాది దేవత లెల్ల రాతని సేవకులు. అతనినుండియే సర్వజగములుఁ బుట్టినవి. ఆయనచేతనే లయ మగుచున్నవి. ఆయన సనాతనుఁడు నాశరహితుఁడును. ఉమామహేశ్వర కల్యాణ వీక్షణాయత్తులై పదునాల్గుభువనములవారు వచ్చియున్నారు. నీ వింత విచారము మాని, మోహమును వీడి జగత్ప్రభువునకుఁ గన్యాదాన మొనర్చి జన్మసార్థక్యము నందుము. శీఘ్రముగ వివాహమహోత్సవమును జరిగింపుము. నేను శంకరునిఁ గాక మ ఱెవ్వరిని వరింపను. త్రికరణశుద్ధిగా నాకుఁ బశుపతియే పతి!'' యని వివరించినది.

ఆమె వాక్యములు కర్ణకఠోరములై హిమవత్పత్ని కోపావేశముతోఁ బండ్లు కొఱుకుచు నపర్ణను గ్రుద్దుచుఁ గొట్టుచు "నోసి! నీసౌఖ్యమునకై నేను జెప్పుచుండఁగా నా మాట యందు నీ కవిశ్వాసమా! నీ వాతనిని బెండ్లియాడ మానవా? బుద్ధిహీనురాలా!" యని మఱిమఱిఁ గొట్టుచుండఁగా మహర్షు లడ్డుపడి వారించినారు. మేనక మఱింత యావేశపడి "దీనిని శస్త్రముచే ఖండఖండములుగా ఛేదింతును. కడలిలోఁ బాఱవైతును. అట్లు చేయలేనిచో నా ప్రాణపరిత్యాగ మొనరింతును. అంతియ కాని దీని నా స్థాణున కీయఁబో" నని పల్కుచు దుఃఖించుచున్నది. అంత సురజ్యేష్ఠుఁడు వచ్చి యిట్లు సాంత్వనవాక్యము లారంభించెను.

"హిమశైలమహిషీ! నీవు శివతత్త్వము నెఱుంగక యిట్లు భ్రాంతిపడుచున్నావుసుమా ! అతఁడు సృష్టి స్థితి లయ కారణుఁడు. సర్వలోకత్రాత. సర్వస్వతంత్రుఁడు మాయాతీతుఁడు. త్రికాలాబాధ్యుఁడు. సర్వస్వరూపము లాయనవే.

శ్లో॥ శివతత్త్వం చ పరమం కుజ్ఞానహర ముత్తమమ్
శ్రోతవ్యం ప్రీతితో మేనే ! మదీయం వచనం శుభమ్
యస్య శ్రవణతః ప్రీత్యా కుబుద్ధి స్తే వినశ్యతి
శంకరో జగతః కర్తా భర్తా హర్తా తథైవ చ
న త్వం జానాసి తద్రూపం కథం దుఃఖం సమీహసే॥
అనేక రూప నామా చ నానాలీలాకరః ప్రభుః
సర్వస్వామీ స్వతంత్ర శ్చ మాయాధీశో ఒవికల్పకః
ఇతి విజ్ఞాయ మేనే త్వం శివాం దేహి శివాయ వై॥

(శివపురాణము)

మేనకా ! అజ్ఞానహరము నుత్తమము నైన పరమశివ తత్వమును దెల్పుచున్నాను, ప్రీతితో వినుము. నా వచనము శుభప్రదము. దీని నాకర్ణించుటవలన దుష్టబుద్ధి నశించును. శంకరుఁడు జగత్కర్త, భర్త, హర్త, ఆయన రూపము నీకుఁ దెలియక దుఃఖించుచున్నావు. అనేక రూపములతో నామములతో ననేకలీల లొనరించుచుఁ బ్రభుఁడై సర్వస్వామియై స్వతంత్రుఁడై మాయకుఁ బ్రభువై యవికల్పుఁడై యుండు నని తెలిసికొని పార్వతి నా పరమేశ్వరున కొసంగుము, పట్టుదల వీడు" మని బోధించినాఁడు.

ఆమె "పితామహా! ఈశ్వరునివంటి యందగాఁడు లేఁడంటివి. ఎందులకీ స్తోత్రపాఠములు. నేను గన్నులారఁ జూచితిని. లావణ్యవతి యగు నా కుమారి నా బీభత్సాకారునకుఁ గట్టఁబెట్టను. నీవు లక్ష చెప్పుము. నేను వినను. ఆ కురూపికే పత్నిగాఁ జేయఁబోవునపుడు నా యీ పుత్రిక కింత యందము నేల యిచ్చితివయ్యా సృష్టికర్తా! ఇఁక నా నిశ్చయము మాఱదు వెడలు" మని తిరస్కరించినది, సనక సనంద నాది మహర్షులరుదెంచి యెన్నోరీతుల బోధించినను మేనక పెడచెవిని బెట్టినది. అంత శ్రీమన్నారాయణుఁడేతెంచి పలుకుచున్నాఁడు.

"నీవు పితృదేవతల మానసపుత్రివి. గుణవంతురాలవు. హిమవంతుని పత్నివి. సాక్షాదుత్తమ బ్రహ్మకుల సంజాతవు. ధన్యవు. ధర్మమున కాధారభూతురాల వగు నీవే ధర్మమును వీడుచున్నావా? దేవతలు గాని ఋషులు గాని బ్రహ్మగానినేను గాని విరుద్ధము లేల చెప్పుదుము! నీవే బాగుగా నాలోచింపుము. శివుని నీ వెఱుఁగవా? ఆతఁడు సగుణుఁడు నిర్గుణుఁడును, అటులే విరూపుఁడు సురూపుఁడును, సర్వసేవ్యుఁడై సత్పురుషశరణ్యుఁడైన వాఁడు. మూలప్రకృతి యగు నీశ్వరిని దన వామపార్శ్వమున నిలుపుకొనుటకే సృజించెను. ఆ ప్రకృతి పురుషులనుండియే నేనును బ్రహ్మయు సృజింపఁబడితిమి. లోకహితమునకై స్వయముగ రుద్రుఁ డవతరించెను. ఆతనినుండి వేదములు, దేవతలు, ప్రపంచములోఁ గన్పించు స్థావర జంగమము లన్నియు జనించినవి.

ఆతని రూపము నెవరు వర్ణింపఁగలరు? ఎవరు తెలిసికొనఁగలరు? నేనును బ్రహ్మయు నాతనిని గూర్చి తెలిసికొనలేకపోయితిమి. లోకములోని చిఱుమొక్క మొదలు బ్రహ్మపదార్థము వఱకు గల సమస్తము శివుఁ డని తెలిసికొనుము. పార్వతీ తపఃప్రభావమువలననే యాతఁడు నీ ద్వారమునకుఁ జేరెను. కావున నీవు దుఃఖమును వీడి శివుని భజింపుము. అట్లయిన క్లేశములు నశించి మహానందము లభించును." దామోదరుని బోధనము మేనకకుఁ గొంత యుపకరించినది. కొలఁది దుఃఖమును దిగమ్రింగి "అయ్యా! మహేశ్వరుఁడు తన సహజ సుందర రూపము నొకపరి చూపినచో నాతనయ నాయన కీయఁగలను. అట్లు కానినాఁడు నే నెవ్వరి పలుకులు విశ్వసింప" నని నిష్కర్షగఁ జెప్పినది.

అంత దామోదరుఁడు మహేశ్వరునిచెంత కేఁగి "భక్తవత్సలా! దయతో నీ దివ్యమంగళస్వరూపము నొక్కసారి మేనకకుఁ జూపి యామె సంశయమును బాపి పార్వతినిఁ బరిగ్రహించి జగత్కల్యాణ మొనరింపు" మని యర్థించెను. అర్ధేందుమౌళి యంగీకరించి జగన్మోహనరూపమును దాల్చెను. ఆ విశ్వసుందరస్వరూపునిఁ జూచి దివౌకసులెల్ల రమితానందము నందిరి. దేవముని పరుగు పరుగున వచ్చి "పర్వతేంద్రరాజ్ఞి! పరమేశ్వరుఁడు జగన్మోహనాకారుఁడై వచ్చుచున్నాఁడు. కన్నులపండువుగాఁ జూడు మమ్మా" యనఁగ నామె విస్మితురాలై విచారము వీడి కన్నీరుఁ దుడిచికొని చూడసాగెను.

అదిగో! విశ్వ సమ్మోహనావతారుఁడు పరాత్పరుఁడు!

సీ. కోటి మన్మథలీలఁ గొనజాలు చక్కఁదనంబు మేలొందు రూపంబువాఁడు
కోటి సూర్యుల కాంతిఁ గొఱఁతఁ బెట్టించు దట్టంబైన కాంతిమండలము వాఁడు
కోటి చంద్రమసుల కోమల కళల రమ్యంబైన నగు లేమొగంబువాఁడు
కోటీంద్రవిభవంబుఁ గుదువ పెట్టుకొను దివ్యంబైన మణిమండనంబు వాఁడు.

గీ. చారు కస్తూరి కాగరు చందనాను
లేపన సుగంధ బంధు రాటోప మెసఁగు
వాఁడు రుచిరతరామూల్యవస్త్రయుగ్మ
కలితుఁ డగువాఁడు శంభుండు గాంచఁబడియె.

సీ. గంగా యమున లింపు గదిసి యిర్వంకలఁ జామరంబుల సేవ సల్పుచుండ
సూర్యచంద్రులు గడు సుందరం బగు సితచ్ఛత్రంబు వేడ్కతో నంతరింప
సిద్ధ్యష్టకంబు వాసిన్ బొంగి ముందఱఁ జెలువుగ నృత్తంబుఁ జేయుచుండ
శక్రాజ కేశవుల్ సంతసం బిగురొత్త జయ నినాదంబుల సందడింప

గీ. వరఁగ విశ్వావసుండు నచ్చరలు మ్రోల
బాగుగా మృదుగీతులఁ బాడుచుండ
మునులు వెనుకొని యామ్నాయములను జదువ
నలరు శంకరుఁ గాంచె శీతాద్రిపత్ని.

గీ. కాంచి మేనక దా విస్మయించి కడు భక్తి
మించి హర్షించి మదివి భావించె నిట్లు
ధన్య నాపుత్రి. నేనును ధన్య నీకను
ధన్యుఁడు గిరీంద్రుఁ డెంతయుఁ దథ్యముగను.

(ఆంధ్రశివపురాణము)

అని భావించినది. త్ర్యంబకుని జగదేకమోహనరూప దర్శనముతో నొడలు మఱచి నిశ్చేష్టయై కొంతకాలము పిదప మహానందముతో నిట్లు పలికినది శీతాద్రిరాజి.

"పరాత్పరా! నా తనుజాత యెంత ధన్యురాలు! నీ తత్వమును గ్రహింపఁ జాలక యెన్నో రీతుల నిన్ను దూషించితిని. శివాపరాధ మొనర్చితిని. లజ్జ నొందుచున్నాను. నన్ను క్షమింపవా ప్రభూ!" అని నమస్కరించి యర్థించినది. హిమవద్రాజధానీవాసు లందఱు స్వస్వకృత్యములఁ బరిత్యజించి వచ్చి యీశ్వరుని దర్శించి "పరాత్పరునిఁ జర్మచక్షువులతోఁ జూడఁ గల్గితిమి. జన్మ సార్థక మైన" దని పరిపరివిధముల ముద మందిరి. దర్శించినవారిలో నొండొరు లనుకొనుచున్నారు.

సీ. ఈ ధన్యుఁడే కదా! యీ జగంబుల కెల్ల
నాదికారణ మైన యనఘమూర్తి
ఈ మాన్యుఁడే కదా! యీ హరి బ్రహ్మాది
నై లింపచక్రంబు నేలు ఱేఁడు

ఈ చతురుఁడె కదా! యీ ప్రపంచములకుఁ
బంచకృత్యముల యోజించు దంటా
ఈ కుశలుఁడె కదా యిమ్మిగా షడ్గుణై
శ్వర్య సమృద్ధితోఁ బరఁగు మేటి
గీ. ఈ సరసుఁడే కదా! మన హిమనగేంద్ర
బాలికాచేతమును బరిపరివిధములఁ
జాలగాఁ బరిశీలించి మేలి వరము
నొసఁగి పెండ్లాడవచ్చిన యూర్జితుండు.

సీ. హాలాహలముఁ ద్రావి యఖిలలోకంబులఁ
గాచిన ఘనదయాకరుఁ డితండె
త్రిపుర దైత్యులఁ గాల్చి త్రిభువనంబుల నెల్లఁ
బ్రోచిన మగసిరి ప్రోడ యితఁడె
దక్షాధ్వరంబు విధ్వంసం బొనర్చి జే
జేల శిక్షించిన జెట్టి యితఁడె
కమలజ విష్ణుల కల నెడఁజేసి లిం
గాకారుఁడైన మహాత్ముఁ డితఁడె
గీ. చెలిమి యలరఁగ నా మఱ్ఱిచెట్టుక్రింద
సనకముఖ సంయములకు నక్షరపదార్థ
బోధనం బొనరించిన బోద్ధ యితఁడె
విశ్వముల నెల్లఁ బోషించు విభుఁ డితండె.

ఉ. ఎంత తపంబుఁజేసిరొ గిరీంద్రుఁడు మేనకయున్ గుమారి కీ
కంతుని గెల్చినట్టిదొర కాంతుఁడుగా నొనగూడు కల్మి క
త్యంతిక మందు నున్న మన మందఱ మెమ్మెయి నోఁచినామొ య
త్యంతము గన్నులొందె సుఖ, మందెను జన్మము ధన్యతాగతిన్.

(ఆంధ్రశివపురాణము)

"చంద్రశేఖర సాక్షాత్కారము గావలయు ననినఁ గొన్నివే లేండ్లుగాని కొన్ని జన్మములు గాని తపముఁ జేసిననే యది లభించును. అట్టి దర్శన మనాయాసముగనే జపతపాదిక ములు లేకుండ లభించిన మన మెంత భాగ్యశాలురము. మన పాపములు నశించినవి, సుకృతములు ఫలించిన" వని యమితానం దము నందుచు ముత్తైదువలు శంకరునిపై సుమముల, లాజలఁ జల్లుచుఁ బ్రశంసించిరి. మేనకాదేవి బంగారుపళ్లెరమునఁ గప్పురపు హారతు లిచ్చి యా జగన్మోహనమూర్తినిఁ గనులారఁ జూచు చున్నది.

శ్లో॥ చారు చంపక వర్ణాభ మేకవక్త్రం త్రిలోచనమ్
ఈషద్ధాస్యప్రసన్నాస్యం రత్నస్వర్ణాది భూషితమ్
మాలతీమాల సంయుక్తం సద్రత్నముకుటోజ్జ్వలమ్
సత్కంఠాభరణం చారు వలయాంగద భూషితమ్
వహ్నిశౌచే నాతులేన త్వతిసూక్ష్మేణ చారుణా
అమూల్య వస్త్రయుగ్మేన విచిత్రే ణాతిరాజితమ్
చందనాగరు కస్తూరీ చారు కుంకుమ భూషితమ్
రత్న దర్పణ హస్తం చ కజ్జలోజ్జ్వల లోచనమ్
సర్వస్వప్రభయాచ్ఛన్న మతీవ సుమనోహరమ్
అతీవ తరుణం రమ్యం భూషితాంగైశ్చ భూషితమ్
కామినీ కాంత మవ్యగ్రం కోటి చంద్రాననాంబుజమ్
కోటి స్మరాధిక తనుచ్ఛవిం సర్వాంగసుందరమ్॥

సుందర మగు చంపకసుమము వంటి దేహకాంతి గల వాఁడు, ఏకవదనుఁడు, త్రిలోచనుఁడు, దరహాసప్రసన్నాస్యుఁడు,

రత్నస్వర్ణాదులచే నలంకృతుఁడు, మాలతీసుమదామ లలితుఁడు, రత్నఖచిత కిరీట విభాసితుఁడు, కంఠాభరణ కేయూర కంకణాది విభూషితుఁడు, అగ్నివలెఁ బవిత్రమై యతిసూక్ష్మమై యతుల సుందరమై యమూల్యమైన వస్త్రయుగ్మముచేఁ బ్రకాశించువాఁడు, కుంకుమాగరు కస్తూరీ చందనాభిశోభితుఁడు, రత్నఖచిత దర్పణమును జేతఁ బట్టినవాఁడు, కాటుకచే విరాజిల్లు కన్నులుకలవాఁడు, స్వీయ కాంతిసర్వస్వముచే నత్యంతమనోహరుఁడు, నవయౌవనుఁడు, రమణీయుఁడు, అలంకృతావయవాలంకృతుఁడు, కామినీకాంతుఁడు, వేగిరపాటు లేనివాఁడు, కోటిచంద్రులఁబోలిన ముఖమువాఁడు, కోటిమన్మథాధిక దేహకాంతిఁ గలవాఁడు, సర్వాంగసుందరుఁడు నగు శశిశేఖరునిఁ జూడఁగల్గినది.

ఇంత సౌందర్యవంతుఁడు తన కల్లుఁడైనందులకు, నిరుపమాన సత్పాత్రునకుఁ గన్యాదాన మొనర్పఁ గలిగినందులకు మురిసి పోవుచున్నది పార్వతీజనని. తనూజను ముదమారఁ గౌఁగిలించుకొని ముద్దాడి యానందబాష్పముల రాల్చినది. పుత్రికను దోడ్కొని యంతిపురి కరిగినది.

విష్ణ్వాది దేవతలెల్లరు లోనికి వచ్చి నిర్దిష్ట ప్రదేశముల నాసీనులైనారు.

వివాహోత్పూర్వము గౌరిమదేవ తార్చన మాచార మగుట నుమాదేవిని దోడ్కొని మేనకాదేవి బంధువులతో నడచి వెడలి

పూజఁ గావించి దేవతావందన మాచరించి ప్రసాదము స్వీకరించి మఱలివచ్చినది. అప్పటి పార్వతీవధూమణిని జూచినారు సమస్త నిలింపులు :

సీ. అల్లనేరెడుపండ్ల యంద మమ్మఁగఁజాలు
　　జిగి గ్రాలు మై నిగనిగల దాని
చిఱునవ్వు దొలఁకాడు సిందూర తిలక ర
　　మ్యంబైన ముద్దుమొగంబు దాని
మందారసుమము లమర్చి కూర్చిన లలి
　　తం బైన కబరీభరంబు దాని
నాణిముత్యంబుల హారముల్ రత్నహా
　　రంబులు దనరు వక్షంబు దాని
గీ. చారుతర రత్నకంకణ సంకలిత క
రద్వయం బొప్పు దాని వజ్రముల కమ్మ
లొప్పు వీన్దోయిఁ దళ్కుల నొసఁగుదాని
శివున కగు సురతాణి జేజేలు గనిరి.

క. కనుఁగొని మదిలోఁ దత్పద
వనజములకు మ్రొక్కు లొసఁగి వారని భక్తిన్
బెనఁగొను ముదమునఁ బొదలుచు
మనములఁ దాపంబు లెల్లమానిరి కడఁకన్.

(ఆంధ్ర శివపురాణము)

లగ్నము సమీపించుచున్న దని బ్రహ్మగారు సెలవిచ్చినారు. గిరిజాకుమారికి మంగళస్నానముఁ జేయించి కనకాంబరములఁ గట్టి భద్రపీఠమునఁ గూర్చుండఁబెట్టి,

సీ. ఛాయ యావకమును జరణంబులకుఁ బెట్టెఁ
గనకకాంచి నమర్చె గార్గి మొలకుఁ
జెవులకు రోహిణి చెవులపువ్వులఁ గూర్చెఁ
గమల నత్తు తగిల్చె ఘ్రాణమునకుఁ
గరముల శచి రత్నకటకముల్ ఘటియించెఁ
దారహారము నుంచెఁ దార మెడను
గురులపైఁ జిన్నిపూ గుత్తరించెను వాణి
చౌనిపెఁ బాపటను జేర్చుకక్ర నీల
గీ. యంత గిరిజ తపః కృశం బైన మేను
మాటె ననఁగఁ గపర్దిని మరులు కొలుప
దివ్య మంగళ తనువుతోఁ దేజరిల్లెఁ
జూచువారల కెల్లను జోద్య మొదవ.

(ఆంధ్రపద్మపురాణము)

ఇట్లలంకృతయైన పార్వతి సౌందర్యము చెప్పనలవికాదు. మంగళవాద్యములు మ్రోఁగుచున్నవి. నృత్యములు జరుగుచున్నవి. మేళతాళములు సందడించుచున్నవి. గర్గపురోహితుఁడు వచ్చి "సుముహూర్తము సమీప మగుచున్నది. పెండ్లికుమారునిఁ దోడితెం" డని తెలుపఁ గన్యాదాత మంగళద్రవ్యములఁ దీసికొని మంగళనాదములతో వేదప్రవచనములతో మగపెండ్లివారి కడ కరికి సుముహూర్తమునకు విచ్చేయుఁ డని యాహ్వానించెను. పెండ్లికొడుకు సదాశివుఁడు, వాసుదే వాది సక లామరశ్రేణితో బంధుమిత్ర పరివారగణముతో బయల్వెడలి వచ్చుచున్నాఁడు. దేవతలు సుమవర్షము గురియించుచున్నారు. శ్వేతచ్ఛత్రమును

బట్టినారు. చామరము లిరువంకల వీచుచున్నారు. భేరీ మృదంగాది తూర్యనాదములు చెలరేఁగు చున్నవి. గాయకబృందములు మధురగానము లొనరించుచున్నారు. వందిమాగధుల స్తోత్రపాఠములు. మహర్షి పుంగవుల వేదపఠనములు, శ్రోత్రపర్వ మొనరించుచున్నవి. హృషీకేశుఁ డొకవైపు కమలసూతి యొకవైపు నిలిచి చంద్రచూడునిఁ దీసికొని నడచుచు మహావైభవముగాఁ గల్యాణమంటపమునకు వచ్చినారు.

హిమవంతుఁడు మగపెండ్లివారి నందఱను బ్రిణామపురస్సరముగ నాహ్వానించి లోనికిఁ దీసికొని వెడలి సుఖాసీనులఁ జేయుచున్నాఁడు. ఒక్కొక్కరికే యథార్హముగా నాసనములు చూపఁబడినవి, శైలరాజ పరివారమంతయు మగపెండ్లివారి యాదర సత్కార నిర్వహణములోనే యాయత్తమైనది. హిమవంతుఁడు కమలాసన గరుడాసనులను నవరత్నఖచిత దివ్య సింహాసనములఁ గూర్చుండఁజేసెను. ఆ మహనీయుల నందఱి నొక్కసారి కల్యాణమంటపమునఁ జూచుకొన్న తుహినశైలుని యానందమున కవధి లేకపోయినది. నిక్కముగ నేను ధన్యుఁడనైతి ననుకొని నారదుని సప్తమహర్షులను జూచి వారితో నిట్లనుచున్నాఁడు.

సీ. చలుపుచుందురొ శాస్త్రచర్చ లెవ్వని తత్త్వ
మరయంగ విద్వాంసు లైనవారు
కావించుచుందురొ కర్మముల్ యదనుగ్రి
హమునకై కర్మఠు లైనవారు

తపియించుచుందురో విపినంబులం దుండి
వేనికై తాపసు లైనవారు
ధ్యానించుచుందురో మానసంబున వేని
యాకారమును యోగు లైనవారు
గీ. నా మహేశ్వరుఁ డా యమృతాంశుమౌళి
యా యశేషజగన్నేత యల్లుఁడైన
నంతకంటెను నాకు భాగ్యంబు కలదె
యంతయును మీ ప్రసాదంబ యని వచించె.

(ఆంధ్రపద్మపురాణము)

వధువును గళ్యాణవేదికకు మేనకాదేవి తీసికొనివచ్చి కూర్చుండఁబెట్టినది. పురోధ పుణ్యాహవాచనముఁ జేయించి కన్యాదానసంకల్పముఁ జేయించెను.

క. రక్షాబంధనము జగ
ద్రక్షకునకుఁ గట్టి యెలమి రాణింపంగాఁ

వక్షంబున యజ్ఞసరము వైచి రయమునన్.

క. వాచస్పతియును నా గ
ర్గాచార్యుండును ముహూర్తమరయుచు ఘటికా
సూచకయంత్రముఁ జక్కఁగఁ
జూచుచుఁ బ్రణవంబు నుడువుచును నుండి రొగిన్.

(ఆంధ్రశివపురాణము)

అంత హిమవంతుఁడు సమయోచిత మగుట నాదిదేవుని గోత్రము, ప్రవర, పరంపర, వేదము, శాఖ తెల్పు మనఁగా

శంకరుఁడు లజ్జపడుచున్నాఁడు. ఈశ్వరేచ్ఛచే నారదుఁడు మహతీ శ్రుతి రమ్యముగా శివతత్త్వము నాలాపించుచున్నాఁడు. వీణా గానము నాఁపు మని యెంతగాఁ జెప్పిన నాతఁడు విరమించుట లేదు. అంత గిరిరాజు "మహర్షీ! యిది వీణాగానమునకు వేళ కాదు. వివాహము జరుగవలయును, మహేశ్వరుని గోత్రి ప్రవ రాదికములఁ జెప్పవలసియున్నది. నీకుఁ దెలిసినఁ జెప్పరాదా" యని బిగ్గరగా నడుగ దేవముని యనుచున్నాఁడు. "నే నందులకే కదా వీణాలాప మొనరించుచున్నాఁడను. పరమేశ్వరుఁడు నిర్గు ణుఁడు నాత్మస్వరూపుఁడు మాయాధీశుఁడు భక్తవత్సలుఁడును. ఆతని గోత్రాదికము లెవ్వరు నెఱుఁగరు. బ్రహ్మ విష్ణువులే యెఱుఁగరు. యథేచ్ఛముగా నే రూపము నొందవలె నన్న నా యాకారము ధరించును. ఉత్తమగోత్రమే యీయనది. సృష్టికిఁ బూర్వము నాద ముద్భవించినది. ఆ నాదము మహత్తర మైనది. అదియే యాతని గోత్రి మని సూచించుటకే నేను నాదమును జేయుచుంటిని. శంకరునిది నాదగోత్రము. ఆయన సచ్చిదానంద మూర్తి గావున సత్తు, చిత్తు, ఆనందము నాయనకు ఋషులు. బ్రహ్మకులము, వేదజాతి, జ్ఞానము వైరాగ్యము సమాధి యీయన వంశము. ఈయన పితృ, పితామహ, ప్రపితామహుల నామము లెవ్వ రెఱుంగుదురు? ఎప్పటివాఁడో బ్రహ్మకు విష్ణునకే తెలియదు. వీ రొకసారి యొకరికంటె నొకర మధికుల మని జగడపడుచుండ వారి మధ్య నీ సదాశివుఁడు లింగరూపమున నుద్భవించినాఁడు. ఆ లింగమున కాద్యంతములే వారికి గోచరము కాలేదు. అట్టిచో నాపరాత్పరుఁ డెప్పటివాఁడో యెవ్వరు చెప్పఁ

గలరు; ఆద్యంతశూన్యుఁడు" అని వివరించినాఁడు బ్రహ్మమానస పుత్రుఁడు. హిమవంతుఁ డానందించినాఁడు. సక లామరసంఘము సాధువాద మొసరించినది.

"విష్ణ్వాదులే యీశ్వరమాయ నధిగమింపలేరు నీ వీశ్వర మాయలోఁ బడి యిట్లు ప్రశ్నించుచున్నాఁడవు. ఇఁక నీవు కాలము వ్యర్థ మొనరింపక కన్యాదానముఁ జేయు" మని మునులు, దేవతలు తొందరింపఁగా హిమవంతుఁడు కన్యాదాన మొనరించు చున్నాఁడు.

శ్లో॥ ఇమాం కన్యాం తుభ్య మహం దదామి పరమేశ్వర ।
భార్యార్థం పరిగృహ్ణీష్వ ప్రసీద సకలేశ్వర ।
తస్మై రుద్రాయ మహతే మంత్రే ణానేన దత్తవాన్
హిమాచలో నిజాం కన్యాం పార్వతీం త్రిజగత్ప్రసూమ్
ఇత్థం శివాకరం శైలం శివహస్తే నిధాయ చ
ముమో దాతీవ మనసి తీర్ణ కామ మహార్ణ వః
వేదమంత్రేణ గిరిశో గిరిజా కరపంకజమ్
జగ్రాహ స్వకరే ణాశు ప్రసన్నః పరమేశ్వరః
క్షితిం సంస్పృశ్య కామస్య కోఽదా దితి మనుం మునే
పపాఠ శంకరః ప్రీత్యా దర్శయన్ లౌకికీం గతిమ్
మహోత్సవో మహానాసీ త్సర్వత్ర ప్రముదావహః
బభూవ జయ సంరావో దివి భు వ్యంతరిక్షకే
సాధుశబ్దం నమఃశబ్దం చక్రుః సర్వే ఽతిహర్షి తాః
గంధర్వాః సుజగుః ప్రీత్యా ననృతు శ్చాప్సరోగణాః॥

(శివపురాణము)

ఓ పరమేశ్వరా ! ఈ కన్యను నీకొఱ కిచ్చుచున్నాను. భార్యార్థము గ్రహింపుము. సకలేశ్వరా ! నన్ననుగ్రహింపుము. మూఁడు లోకములకు జననియైన పార్వతీకన్యను హిమవంతుఁడు పై మంత్రముతోఁ గన్యాదానము చేసినాఁడు. ఈ మంత్రమును జెప్పి పార్వతీహస్తము శివుని హస్తమం దుంచి మనమందుఁ దీర్ణకాముఁడై యానందమును బొందెను. వేదమంత్రముచే నీశ్వరుఁడు పార్వతీకరపంకజమును దనహస్తముచే వెంటనే గ్రహించి ప్రసన్నుఁడాయెను. శివుఁడు భూమిని స్పృశించి 'కామస్య కోఽదాత్' అను మంత్రమును లౌకికమార్గము ననుసరించి పఠించెను. సర్వులకు నానందకర మైన యుత్సవము జరిగెను. ఆకాశము, స్వర్గము, భూలోకము జయజయ శబ్దములు, పలికినవి. అందఱు నానందమయులై సాధు శబ్దమును, నమః శబమును పలికిరి. గంధర్వులు చక్కఁగాఁ బాడిరి. అప్సరసలునాట్యముచేసిరి.

క. ఈ కన్నెను బరమేశ్వర !
నీ కిచ్చెన భార్యగాఁగ నీవు గొనుము లో
కైకేశ ! త్రివర్గమునం
దీ కన్నె నతిక్రమింప కెపుడును దయతోఁ.

గీ. అని శివాకరమును శివహస్త మందు
నద్రిపతి యుంచి తీర్ణకామాబ్ధి యయ్యె
శంకరుం డద్రిజా పాణిసారసంబు
స్వకరమునఁ దా గ్రహించెఁ బ్రసన్నుఁ డగుచు.

గీ. అర్యను గ్రహించి "దేవస్య" యనెడు మంత్ర
మును శివుఁడు లౌకికాచారముగను జదివి
పల్కె "నాతిచరామి" యన్ బలుకుఁ బ్రకృతి
పురుష లగు తమ కొండు తీర్పొసఁగు పెల్లు ॥

క. జీరక గుడంబు లగక
న్యా రాజకలాపు లిరువు రన్యోన్యము గా
భూరి ప్రీతిన్ శిరసులఁ
జేరిచి యానందభరముఁ జెందిరి వేడ్కన్.

క. జవనికను దీసివేసిరి
శివుఁ డవలోకించె శివను శివుని నటులనే
శివయును నవలోకించెను
నవిరళభావోపలబ్ధ హర్షోన్నతులన్.

క. రంగారు మేల్మి బంగరు
మంగళసూత్రంబు రాజమందనుఁడు జగ
న్మంగళ యగు శివ గళమునఁ
బొంగుచుఁ గట్టెను సమస్తభువన హితేచ్ఛన్.

ఆ పిదప

గీ. ఆణి ముత్యాల రాసుల నంది యొసఁగ
నపు డుమా శివు లంచి తాహ్లాద మెసఁగఁ
గాఁ దలంబ్రాల నొకరి కొకరు శిరసులఁ
జల్లుకొని పొంగి రెంతయు సంతసమున.

క. గిరిపత్నులు మునిపత్నులు
సురపత్నులు సర్వలోకసుందరులకు శ్రీ
గిరిజాశివుల కొనంగిరి
సురుచిర నీరాజనముల శోభన మొనరన్.

ఉ. లక్ష గజంబులన్ మఱి ద్విలక్ష మహాజవ సైంధవంబు లేన్
లక్షల పాడియావులను లక్ష మదోద్ధతిమీఱు పెద్దులన్
లక్ష బిటారిచేడెలను లక్ష పసిండిరథంబు లింపుగా
నా క్షణమం దొసంగె నచలాధిపతల్లజుఁ డబ్జమౌళికిన్.

(ఆంధ్రశివపురాణము)

పార్వతీ పరమేశ్వర పాణిగ్రహ ణానంతరమున జయ జయధ్వానములు మిన్ను ముట్టినవి. గంధర్వ గానములు, దేవ వేశ్యా నృత్యములు, మహర్షిమండల వేదనాదములు జరుగు చున్నవి. విధివిధానమున వైవాహిక కృత్యము లన్నియు జరుపఁ బడినవి. అగ్నిలో హోమములఁ జేయించినారు. హోమానంతర మున నుమాశంకరులు లోకాచారముగా నగ్నికిఁ బ్రదక్షిణముఁ జేసిరి. నూతనదంపతులచే ధ్రువనక్షత్రదర్శనముఁ జేయించిరి. తదుపరి గౌరీశిరమున సిందూర మలఁదినాఁడు పరమశివుఁడు. ఉమా శంకరులు క్షీరముతోడి యన్నమును భుజించినారు. పార్వతీపర మేశ్వర కల్యాణము మహావైభవముగా జరిగినది. పరమేష్ఠికిఁ బరాత్పరుఁడు పూర్ణపాత్రి బహూకరించినాఁడు. అమిత రత్నము లను, గోవులను సాంబుఁడు దానముఁ జేసెను. భేరీ మృదంగ వేణు వీణాది మంగళవాద్యములు మ్రోఁగించిరి. వివిధ మహో

త్సవము లొనరించిరి. మేనకాదేవి బాంధవులతోఁ గూడి పార్వతీ పరమేశ్వరుల లోనికిఁ గొంపోయి యనేకము లగు వేడుకలను జరిపెను.

కొత్త దంపతులను దర్శించుటకై లక్ష్మి, సరస్వతి, సావిత్రి, యరుంధతి, శచి, లోపాముద్ర, తులసి, యహల్య, గంగ, స్వాహా, భూదేవి, శతరూప, సంజ్ఞ మున్నగువా రంద ఱును వచ్చి తమ సమ్మోదమును బ్రకటించి హైమవతితో సుఖింపు మని శివునితోఁ బల్కిరి. ఆ సంతోషసమయమున రతి గౌరీవల్లభుని యెదుటి కేఁగి "దయాసింధూ! పార్వతిని బరిగ్ర హించి సంతసించుచున్నావు. మీ యిద్దఱి సంధానముకే కదా నా పతి యత్నించినది! కోపించి నా మనోహరుని బూడిదఁ గావించితివే కాని శైలజ నుద్వాహ మాడ మానలేదు. మీ కల్యాణమును జూచి పదునాల్గులోకములవా రానందించుచున్నారు. నాకు మాత్ర మానంద ముండవలదా ? కరుణామయా! భక్తవత్సలా! నాసంతా పము నడంచి పతిభిక్ష పెట్టి నన్ను సంతోషపెట్టవా?" యని పరి పరివిధముల నర్థించినది. తన భర్త భస్మమును గోకముడినుండి విప్పి రుద్రు నెదుటఁ బోసి గట్టిగా రోదనము చేయసాఁగినది రతి. అపర్ణ జాలినొంది "నాథా! మన వివాహమహోత్సవ సమ యమున సమస్తప్రాణులు సుఖముగ నుండవలయు నని నా యభిలాష గావున నీ రతి పతితో సుఖించున ట్లనుగ్రహింపవా!" యని కోరఁగాఁ ద్రినేత్రుఁ డా భస్మరాశి నమృతవీక్షణముల నీక్షింపఁగా నా ప్రోవునుండి మన్మథుఁడు దివ్యస్వరూపుఁడై లే చి

నాఁడు. రతి మహానందముతోఁ బతిపాదములపైఁ బడినది. ఆమెను లేవనెత్తినాఁడు మదనుఁడు. ఉభయులును సర్వజ్ఞుని స్తుతింపఁగా రాజకలాపుఁడు ప్రసన్నుఁడై “మనోజా! నీకు వర మిచ్చెదను గోరు” మనెను. పంచశరుఁడు శిరము వంచి కరుణానిధీ! భక్తవత్సలా! నీ యనుగ్రహముచే ధన్యుఁడ నయితిని. నా యపరాధములు క్షమింపుము. నీ పాదభక్తినిఁ బ్రసాదింపు మనఁగా నిందుమౌళి మందహాసముతో నటులే యని యనుగ్రహించెను.

అనంతరము గిరిజను వామపార్శ్వమున నుంచుకొని వామదేవుఁడు మృష్టాన్నము నారగించి యత్తమామలకు నమస్కరించి మంగళనాద పురస్సర మహోత్సవముగా విడిదిగృహప్రవేశముఁ గావించెను. అక్కడ బ్రహ్మ విష్ణ్వాదులకు మహర్షులకు నూత్న దంపతులు వందన మాచరించిరి. వారందఱు నీ యాదిదంపతులకుఁ బునఃప్రణామ మొనరించిరి.

హిమశైలచక్రవర్తి సకల నాకవాసులకుఁ బ్రమథులకు మహర్షులకు విందు లేర్పఱచినాఁడు. పంక్తులుతీర్చి కూర్చుండి పెండ్లివా రందఱు, పలువిధముల పక్వాన్నములు, మధుర భక్ష్యములు, రకరకముల పిండివంటలు, బంగారుపాత్రములలో భుజించినారు. పరిహాసోక్తులతో, నొండొరులు వినోదించుచు విందులారగించి లేచి తాంబూలములు సేవించి విడుదులలో విశ్రమించినారు.

పెండ్లికుమారుని విడిదికిఁ బోనీక యత్తగా రాఁపి పడుక టింటి రత్నసింహాసనమునఁ గూర్చుండఁబెట్టినది. ఆగది యా లంకారికరమ్యతను దిలకించుచుఁ ద్రిలోచనుఁడు కూర్చుండెను.

సీ. మణిదీపశతము లమర్చి కూర్చిన చోట
ముత్యాల మాలికల్ పొలుచు చోట
రత్నదర్పణపంక్తి రాణమీరిన చోట
దాన్తిక్షితిఁగెలగెలల్ తనరు చోట
నానా సుగంధవితానంబు గల చోటఁ
బుష్పితాశోకముల్ పొదలు చోట
మరకత మణికుట్టిమంబులు గల చోటఁ
గప్పురంపు టనంటు లొప్పు చోట

గీ. పంచభక్ష్యాన్నపాత్రి లేర్పడిన చోట
మేల్మి కస్తూరి విడెములు మెఱయు చోట
రత్నపర్యంక మాత్మఁగరంచు చోట
ననుప మైశ్వర్యధుర్యమై యలరుచోట.

చ. సురుచిర నూత్న యౌవనము శోభిలువాని మనోజ్ఞ హాస సుం
దర మగు మోమువానిఁ బ్రమదాజనమోహనుఁ డైనవాని భా
స్వర లలితాంబరంబులను సొరుగఁ గట్టినవాని దివ్య మే
దుర మణిభూషలన్ బెడఁగు దోఁపఁగఁ దాల్చినవాని నీశ్వరున్.

ఆ. కాంచి శైలరాజకాంతలు గడుఁ బ్రశం
సించి సంతసించి శివుల కపుడు
గ్రంథిమోచనంబుఁ గావించి నవదంప
తులను జూచుచుండి రెలమి కలిమి.

(ఆంధ్రశివపురాణము)

రత్నఖచిత దర్పణములు, ముక్తారత్నహారములు, వైఢూర్యములు, గారుత్మతమణులతో నా గది యత్యంతమనోహరముగా నలంకృత మైనది. ఆ గదియందు విచిత్ర శిల్పరమ్యమగు నొక శయ్యపైఁ బూవులు పఱచి యుంచఁబడినవి. ఆ పుష్పశయ్య కొకవైపు వైకుంఠనగరము, మఱొక వైపు బ్రహ్మలోకము, నొండొక పార్శ్వమునఁ గైలాసము మనోహరముగఁ జిత్రింపఁబడినవి. ఇదియంతయు విశ్వకర్మ శిల్పకళాసృష్టి. చంద్రికళాశేఖరుఁ డా శయ్యపై శయనించినాఁడు. తెల్లవాఱు జామున ప్రభాతభేరి మ్రోఁగినది. మంగళవాద్యములు వాఁగుచున్నవి. వందిమాగధులు మేలుకొల్పులు పాడుచున్నారు. దేవత లందఱు లేచి శివస్తోత్రములు పఠించుచున్నారు. వాసుదేవు నానతని ధర్మదేవత శయనగృహ సామీప్యమున నిల్చి లోకేశు నిట్లు మేలుకొలుప సాగెను.

శ్లో॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ దేవేశ ఉత్తిష్ఠ హృదయేశయ
ఉత్తిష్ఠ త్వ ముమాస్వామిన్ బ్రహ్మాండే మంగళం కురు॥
శ్లో॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే భవ నః ప్రమథాధిప
జనావాసం సమాగచ్ఛ కృతార్థం కురు తత్రతాన్॥

( శివపురాణము )

అమరేశ్వరా ! లెమ్ము లెమ్ము. హృదయశాయీ! లెమ్ము. పార్వతీపతీ! నీవు లెమ్ము. లోకకళ్యాణముఁ గావింపుము, భవా! లే లెమ్ము. నీకును మాకును శివ మగుఁగాక ! ప్రమథనాథా! నీ నివాసమున కేతెంచి తత్రిత్యులఁ గృతార్థులఁ జేయుము.

వ్యోమకేశుఁడు మేల్కొని దంతధావ నాదికముల ముగించి దేవతానివాసములకు నడచెను. ఆతనివి దర్శించి యమర్త్యులెల్లరు భక్తివినమ్రులై ధ్యానించుచున్నారు.

క. జయ విశ్వేశ్వర ! శంకర !
జయ నిఖిలాధార ! శర్వ ! జయ సర్వేశా !
జయ రుద్ర ! మహాదేవా !
జయ కాశీపతి ! మహేశ ! జయ ప్రకృతీశా !

క. జయ నిష్కామా ! నిర్గుణ !
జయ లీలానిఖిలనిలయ ! జయ సర్వగతా !
జయ కారణాతిగామీ !
జయ భక్తేప్సితవితరణచణ ! కరుణాఢ్యా !

క. జయ వాఙ్మానసదూరా !
జయ వాత్సల్యనిధి ! నిత్య సత్య చరిత్రా !
జయ దీనబాంధవ ! శివా !
జయ వికృతివిహీన ! దేవ ! జయ సర్వాత్మా !

(ఆంధ్రశివపురాణము)

శ్రీహరియు, విరించిముఖ దేవతలును హిమవంతుని యొద్ద కరిగి వారు వారి యిండ్లకు వెడలుట కనుజ్ఞఁ గోరిరి. శైలపతి వా రందఱకు నమస్కరించి పూజించి "మా యల్లునితో పాటు మీ రెల్లరు మా గృహమునకు వచ్చుటచే మే మెల్ల ధన్యుల మైనాము. మఱి కొన్నిరోజులు మీ రంద ఱిక్కడనే యుండి మమ్మానందింపఁజేయుఁ" డని కోరినాఁడు. అది తేయులు "పర్వతరాజా ! నిజముగా నీవు కృతార్థుఁడవు. అది

దుర్గాదేవి, జగదంబ నీ తనూజ యగుటయు నామెను లోకేశ్వరున కిచ్చి పెండ్లి చేయుటయు నెంతటి యదృష్టము! నీతోఁ దుల్యుఁడు, నీవంటి సుకృతాత్ముఁడు మఱొకఁ డుండఁబోఁడు. వివాహమును మహావైభవముగ జరిపి మా కందఱ కతిథిసత్కారగౌరవముల నెంతయో విశిష్టముగ నెఱపినాఁడవు. అత్యంత సౌకర్యములు గల విడిదిగృహము లొసఁగి షడ్రసోపేతములగువిందు లొసఁగి, మా లోకములనే మేము మఱచునట్లుచేసిన నీ యాదరణాతిశయ మునకు మేము సంతుష్టులము. కృతజ్ఞులమును. పార్వతి యన్న పూర్ణాదేవియే! ఆమెకుఁ బుట్టిని ల్లయిన నీ నివాసములో నే లోప ముండు?" నని కొనియాడినారు. పర్వతపతివినతి ననుసరించి వా రంద ఱక్కడనే విందు లారగించుచు నృత్య గాన వినోద ముల నవధరింపుచు నాల్గుదినములు గడపిరి. యథాక్రమముగ విధ్యుక్తముగ వైవాహిక క్రియ లన్నియు నెఱవేర్పఁబడుచున్నవి. హిమవదాద్రిజధానిలో నెటు చూచినఁ బెండ్లివారి సందడులే, వారి వేళాకోళపుఁ బెండ్లిపాటలే, పిండివంటల పరిమళములే, దానధర్మ ములు గ్రహించి పోవు విప్రుల సమూహములే, వినోదకార్యక్రమ ములే, పెండ్లి పనులతొందరలే కనిపించుచున్నవి.

ఐదవ దివసమునఁ గూడఁ బ్రయాణ మైన పెండ్లి వారి నందఱను మఱల శైలపతి వారింప మఱికొన్నిరోజు లుండి పోయినారు.

ఒక రోజున ప్రయాణము నిశ్చయింపఁబడినది. శంకరుఁ

ద త్తమామలయొద్ద కేఁగి శాంకరిని దీసికొని కైలాసమున కేఁగుదు నని చెప్పఁగా మేనక విచారపడి యిట్లు చెప్పుచున్నది.

"పరమేశ్వరా! నీవు దయానిధివి. నా కుమారిని గృపతో నేలుకొనుము. ఎల్లప్పు డది నీయం దత్యంత భక్తితాత్పర్యములు గలదియై నీపాదపద్మనిరంతరధ్యానమున నుండును. నీ మాట స్మరించినమాత్రనఁ బులకాంకిత యగుచుండును. నిన్నుఁ బల్లెత్తుమా టెవ్వరన్న నోర్వఁజాలదు. నీ దాసురాలు. ముగ్ధసుకుమారి. దయాదృష్టి నాదరింపు" మని యర్థించినది. లోకాచారముగ రత్నాభరణ దివ్యాంబ రాదికము లొసంగి పార్వతిని బరమేశ్వరున కప్పగించి దుఃఖోద్వేగమున మూర్ఛపడినది మేనక. బంధుజనుల యుపచారములతో లేచి గాద్గద్యమున మాటాడలేక ముత్తైదువులను బిల్చి శోకసంతప్తురాలనై యెక్కువ మాటాడలేకున్నాను. అత్తవా రింటికి వెడలు నాబిడ్డకు హితోపదేశముఁ గావింపుఁ డని యడిగినది. అంత నొకపుణ్యవతి పార్వతీరమణి కిట్లుపదేశించుచున్నది.

ఉ. తల్లి! పతివ్రతావ్రత విధానముఁ దెల్పెద నాలకింపు రం
జిల్లెడు నీ వ్రతంబె శ్రుతిశీర్షము లందును ధర్మసూక్తులం
దెల్లెడ నుత్తమం బనియు విఖ్యతమం బని పేరుచెందె ము
న్నెల్ల కులాంగనాజనము లీవ్రతమే యొనరించి రిమ్ముగన్.

మ. అల సావిత్రి యరుంధతీసతియు లోపాముద్ర శాండిల్యయుఃా
జలజావాసయు సంజ్ఞ భారతి సతీ స్వాహానసూయా శచీ

నలినాస్యల్ శతరూప మున్నగు లనన్నారీవతంసల్ హిమా
చలుఁ జేపట్టిన మేన యీ వ్రతము నిచ్చల్ సల్పువా రమ్మరో.

క. వారంద ఱీ పతివ్రత
మారాధన చేసి మిగుల నవనీస్థలిపై
పేరును బెంపును గాంచిరి
శ్రీరంజిల సకలలోక సేవ్య చరితలై.

చ. ఒకసతి భానుమండలికి నుచ్చతరస్థలి నుండె భర్తతో
నొకసతి దాఁ ద్రిమూర్తులను నుయ్యల బాలురఁ జేసి యూపె నిం
కొకసతి వింధ్యగర్వహరణోగ్రుని జీవితరాజ్ఞి యయ్యె వే
ఱొక సతి మిత్తిగెల్చె మఱియొక్కతె భానుని నాఁగె నంబికా!

గీ. విభుఁడె దైవంబు సతులకు విభుఁడె గురుఁడు
ధర్మ తీర్థవ్రతము లెల్ల ధవుని కొలువె
యనుచు సర్వము విడనాడి యలరుఁ బోఁడి
విభుని నొక్కని భక్తి సేవింపవలయు.
(ఆంధ్రశివపురాణము)

శ్లో॥ తీర్థార్థినీ తు యా నారీ పతిపాదోదకం పిబేత్
తస్మి న్సర్వాణి తీర్థాని క్షేత్రాణి చ న సంశయః॥

క. తీర్థార్థిని యేని పతిపద
తీర్థంబును గ్రోలవలయుఁ దెలుప సకల స
త్తీర్థంబు లందె వెలయు య
థార్థం బిద్దాన సందియమ్ములే దంబా!

సీ. విభుఁ డారగించినపిదప తత్పరిశిష్ట
మర్థి భోజనము సేయంగవలయు
మగఁడు నిద్రించిన మఱియంత నిద్రించి
మునుముందుఁ దాన మేల్కొనఁగ వలయు
పెనిమిటి కొట్టుచోఁ బెనఁగక "విభు! దయ
సేయుమా" యనుచు యాచింప వలయు
పతిఁ దన్నుఁ బిలిచినఁ బనులన్ని వదలి సాం
జలిబంధముగఁ జేరఁజనఁగ వలయు
గీ. భర్త చెప్పిన పనిని సంబరముతోడ
నాక్షణమునందె పూని సేయంగవలయుఁ
దొడరి పూజోపకరణవస్తువుల నెల్లఁ
జెప్పఁబడకయె తాన యోజింపవలయు.

మ. పరగేహంబుల కేగరాదు తమ తత్త్వం బించుకే నొర్ల కె
వ్వరికిన్ దెల్పఁగరాదు నాధు విడి దివ్యక్షేత్రతీర్థానుసం
చరణంబున్ బొనరింపఁగూడ దుపవాసంబుల్ వ్రతంబుల్ నిజే
శ్వర నిర్దేశములేక సేయఁదగదో చంద్రార్ధ బింబాలికా!
(ఆంధ్రశివపురాణము)

శ్లో॥ హరిద్రా కుంకుమం చైవ సిందూరం కజ్జలాదికమ్
కూర్పాసకం చ తాంబూలం మాంగల్యాభరణాదికమ్
కేశసంస్కార కబరీ కర కర్ణాది భూషణమ్
భర్తు రాయుష్య మిచ్ఛంతీ దూరయేన్న పతివ్రతా॥

సీ. పరగ సిందూరంబు పసుపు కుంకుమను శ్రీ
చందనం బగరు కజ్జలము లాక్ష

తమ్ములంబును గమ్మతావిపూల్ దువ్వెన
యద్దంబు గంకణా లందియలును
మాంగల్యతంతువు మట్టె లొడ్డాణంబు
ముంగర తాటంకములును రత్న
ములపేరులును ముత్యముల పేరులును జడ
కుప్పెలు నవరముల్ కొప్పునగలు
గీ. రైకలును మేలిముసుఁగులు రాజముఖికి
నిత్యసేవ్యంబులై యొప్పు నెలఁత మగని
యాయు రభివృద్ధికై వీని హర్ష మెసఁగ
సతము దాల్పఁగవలయుఁ బర్వతకుమారి!

(ఆంధ్రశివపురాణము)

అలంకారంబులు ధరింపక భర్తసన్నిధి కేఁగరాదు. "పత్యుర్నామ న గృహ్ణీయాత్ కదాచన పతివ్రతా". భర్త నామము నుచ్చరింపరాదు. పతి కోపించిన మఱలఁ గోపపడరాదు. ద్వారమువెంతఁ గూర్చుండి యటు నిటుఁ జూడరాదు. భర్త యానతి లేనిదే యెవ్వరికి నేమియు నీయరాదు. భర్త యుచ్ఛిష్ట మును మహాప్రసాదముగ భావించి భుజింపవలెను. భర్తృనిందను జేయరాదు.

సీ. నఖ కేశ సంస్కారణమును శుభ్రాంబర
ధారణంబును మాల్యధారణమును
దాంబూలచర్వణ దంతమార్జన తిల
కాంజన ధార ణాభ్యంగములును

నాలస్యమును గలహాసక్తియును నట్ట
హాసంబు పరపురుషాశ్రయమును
నిశ్శంకతయు బహునిద్రయు స్వైరవి
హారంబు నేకవస్త్రాటనమును
గీ. బరునితోడను నర్మసంభాషణములు
చేయుటయుఁ గుట్టినీమైత్రి జేయుటయును
నర్హములు గావు సాధ్వికి నన్యదేశ
వాసియై యుండఁగను నిజవల్లభుండు.
(ఆంధ్రపద్మపురాణము)

దేవతలకుఁ బితృదేవతలకు నతిథులకు భర్తకుఁ బెట్టనిదే తాను భుజింపరాదు. పిమ్మట భిక్షులకు సేవకులకుఁ బెట్టవలెను. భర్తసుఖనిద్రలో నున్నప్పుడును నుత్సాహసమయమునను విఘ్న మొనరింపరాదు. పతి షండుఁడైనను, రోగి యైనను వృద్ధుఁడైనను దుంటరి యైనను నమాయకుఁడైనను, గ్రుడ్డి, కుంటి యైనను, నున్మత్తుఁడైనను, బధిరుఁడైనను, జోరుఁడైనను, గోపియైనను, మూఢుఁడైనను, నిష్ప్రయోజకుఁడైనను, నిర్ధనుఁడైనను, పాపి యైనను, మద్యపాయి యైనను దేవునివలెఁ బూజింపవలెను.

ఋతుమతియైన మూఁడు దినములు తనముఖము భర్తకుఁ జూపరాదు. బిగ్గరగ నెవ్వరితోను మాటాడరాదు. స్నానమైన వెంటనే భర్త ముఖము జూడవలెను. భర్త గ్రామాంతరమం దున్నచో నాతనిని మనసార ధ్యానించి ప్రత్యక్షదైవ మగు

సూర్యభగవానుని దర్శింపవలెను. వ్యభిచారిణి, రజకాంగన, యోగ్యహీనురాలు, నగువారలతో స్నేహము పనికిరాదు. ఒంటరిగాఁ గూర్చుండరాదు. తిరుగలి, రోలు, రోఁకలి, చీఁపురు, సాన, గడప వీనిపైఁ గూర్చుండరాదు. వివస్త్రయై స్నానముఁ జేయరాదు. పరిగల్భము లాడరాదు. భర్తకిష్టమైన పనులనే చేయుచుండవలెను. భర్త యుత్సాహముగ నున్నచోఁ దానుగూడ నుత్సాహముగ నుండవలెను. భర్త సంపాదకుఁడైనను గాకున్నను సంపదలలోను విపత్తులలోను నొకతీరుగనె యుండవలెను. భర్తకుఁ బ్రీతిగలవారియందే తానుగూడఁ బ్రీతిగలిగి యుండవలెను, సదా పతిహితమునే కాంక్షింపవలెను.

శ్లో॥ సర్పి ర్లవణ తైలాది క్షయేఽపి చ పతివ్రతా
పతిం నాస్తీతి న బ్రూయా దాయాసేషు న యోజయేత్
విధే ర్విష్ణో ర్హరా ద్వాపి పతి రేకోఽధికో మతః
పతివ్రతా యా దేవేశి స్వపతిః శివ ఏవ చ
వ్రతోపవాస నియమం పతి ముల్లంఘ్య యాఽఽచరేత్
ఆయుష్యం హరతే భర్తు ర్మృతా నిరయమృచ్ఛతి॥

(శివపురాణము)

నేయి, లవణము, నూనె మున్నగునవి యింట లేకున్నను బతివ్రత పతితో నవి లేవని చెప్పరాదు. ఆతనికి శ్రమలఁ గలిగింపరాదు. బ్రహ్మవిష్ణు మహేశ్వరుల కన్నను నాధుఁడే మిన్న. పతివ్రతకుఁ బతియే పరమేశ్వరుఁడు. భర్తమాటను గాదని వ్రతోపవాసనియమము లాచరించు సతి, పతియాయువును

హరించును. తాను మరణించి నరక మందును. భర్త కోపముగా మాటాడినఁ దానుగూడఁ గోపముతోఁ బలుకరాదు. అట్లుమాటాడినచో గ్రామమునఁ దొండగా జన్మించి నిర్జనారణ్యమున నక్కయై జన్మించును. భర్తకన్న నున్నతముగఁ గూర్చుండరాదు. దుష్టుల సాన్నిధ్యమున నుండరాదు. భయంకర వాక్యములు భర్తకుఁ జెప్పరాదు. అపవాద వాక్యములఁ జెప్పరాదు. కలహ మాడరాదు. అత్తమామలు మున్నగు పెద్దల సన్నిధిని బిగ్గరగా మాటాడరాదు. నవ్వరాదు. భర్త యింటికి రాఁగానె పాదప్రక్షాళనమున కుదకము నిచ్చి స్నాన భోజనాదు లైన పిదపఁ బాదసేవఁ జేసి మృదు వాక్యములు పలుకవలెను. భర్త నానందింపఁజేసిన వనిత మల్లోకములలోఁ బూజింపఁబడును. జనకుఁడు, సోదరుఁడు, కుమారుఁడు మితసౌఖ్యము నొసంగుదురే కాని భర్తను బూజించిన నాతఁ దమితసౌఖ్యము నొసంగును.

శ్లో॥ భర్తా దేవో గురు ర్భర్తా ధర్మ తీర్థ వ్రతాని చ
తస్మా త్సర్వం పరిత్యజ్య పతి మేకం సమర్చయేత్
యా భర్తారం పరిత్యజ్య రహశ్చరతి దుర్మతిః
ఉలూకీ జాయతే క్రూరా వృక్షకోటర శాయినీ॥

(శివపురాణము)

పతియే దేవుఁడు, భర్తయే గురుఁడు, ధర్మము, తీర్థము వ్రతమును. కావున సర్వమును విడిచి నాధునే సేవింపవలెను. నిజపతిని విడిచి రహస్యరతిఁ గావించు దుష్టవనిత చెట్టుతొఱ్ఱలో

నివసించు గ్రుడ్లగూబగా జనియించును. భర్త కొట్టెనని సతి మరలఁ గొట్టినచో నామె వ్యాఘ్రిమై పిమ్మట మార్జాలమై జనియించును. ఇష్టాన్నమును భర్తకుఁ బెట్టకుండ భుజించు వనిత సూకరమై జనించును. పరపురుషులను గ్రీఁగంటఁ జూచిన గ్రుడ్లగూబగా జనించును. పరపురుషుని ననురాగ దృష్టితోఁ జూచు నామె కురూపియై పుట్టును.

సీ. పెనిమిటిఁ బాసి యోదనము మెక్కిన యోష
మేషియై చరియించు మేదిని పయిఁ
బరునిన్ మరగి మరుపనికి లోనైన య
క్కోమలి ఘూకమౌ కోటరమున
భర్త తన్ గొట్టిన బదులు గొట్టిన వారి
భూరి బిడాలమై పొదముఁ బుడమి
పతితో జగడ మాడి ప్రత్యుక్తి నిచ్చిన
పొలఁతుక శ్వానమై పుట్టు భువిని
గీ. పరునిఁ గ్రేగంటఁ జూచిన పణఁతి గిల్ల
కన్ను లొంది జనించు జగంబునందు
నీవు నీ వని నాధుని నీతి మాలి
దెగడెడు గయాళి మూగయై తగ జనించు.

(ఆంధ్రశివపురాణము)

భర్తతోడనే లోకము, భర్తతోనే ధర్మము, భర్తయే దైవము, భర్తయే సర్వస్వము ననెడి భావము గలిగి వర్తించు సతియే పతివ్రత. అట్టిపతివ్రతయొక్క తల్లిదండ్రులు భర్తయు

ధన్యులు. ఆమె కుటుంబములోని పితృ మాతృ భర్తృ వంశీయులు మూఁడుతరములవారు స్వర్గసౌఖ్యముల ననుభవింతురు. దుష్టురాలైన వనిత పితృమాతృవంశీయులను భర్తను గూడ నిహ పరములందు దుఃఖమును బొందించును.

గీ. ఎచ్చ టెచ్చట సాధ్వియౌ నింతి యడుగు
లీ ధరాభాగమును స్పృశియించు నెలమి
నచ్చ టచ్చటఁ బావనంబై సమస్త
దోష హరణక్షమం బయి తోఁచుఁ బుడమి.

చ. పరమ పవిత్రుఁడైన యల భాస్కరుఁ డా యమృతాంశుఁ డామరు
ద్వరుఁ డగు గంధవాహుఁడు వవశ్యముగాఁ దమ శుద్ధిఁ గోరి యి
ద్ధరను బతివ్రతాతనువుఁ దామ స్పృశింతురు నిక్కమింక న
ట్లురువుగ నాసచేయు శుచియున్ సలిలంబులు సాధ్వి తాఁకుకై.

(ఆంధ్రశివపురాణము)

సర్వ కిల్బిషముల హరించు గంగాది పుణ్యనదులు తమ యందుఁ బతివ్రత వచ్చి యవగాహ మొనరించినఁ బవిత్రల మగుదు మని తలంచుచు నట్టి వారి రాకకై నిరీక్షించుచుండును. గృహస్థాశ్రమసిద్ధికి, సౌఖ్యములకు, ధర్మాచరణమునకు, సంతాన వృద్ధికి, యజ్ఞయాగాదిక నిర్వహణమునకు, దేవతలఁ దృప్తి పఱచుటకుఁ, బితృదేవతారాధనమునకుఁ బత్నియే మూలము. కావునఁ బతిభక్తిఁ గలిగి భర్తృసపర్యఁ గావించు పతివ్రత తాఁ దరించి పతినిఁ దరింపఁజేయును.

శ్లో॥ యథా గంగావగాహేన శరీరం పావనం భవేత్
తథా పతివ్రతాం దృష్ట్వా సకలం పావనం భవేత్
న గంగయా తయా భేదో యా నారీ పతిదేవతా
ఉమా శివ సమా సాక్షా త్తస్మా త్తా పూజయే ద్బుధః॥
(శివపురాణము)

గంగాస్నానముచే శరీరము పవిత్ర మగునట్లు పతివ్రతా దర్శనముచే సర్వమును బూత మగును. గంగకును బతివ్రతకును భేదము లేదు పతివ్రతాయుతుఁడైన పురుషుఁడు పార్వతీయుత శంకరుఁడే. కాన విద్వాంసుఁడు గంగా పతివ్రతలను బూజించును.

శ్లో॥ భర్తు స్త్రివర్గసిద్ధి శ్చ సాధ్యం తత్కులయోషితామ్
పాతయం త్యేవ దౌశ్శీల్యా దాత్మానం సకులత్రయమ్
ఉద్ధరంతి తదై వైతాః ప్రియ శ్చారిత్ర భూషణాః
భర్తృచి త్తానుకూలత్వం యాసాం శీల మవిచ్యుతమ్
తాసాం రత్న సువర్ణాది భార ఏవ న మండనమ్
లోకజ్ఞానే పరా కోటిః పత్యౌ భక్తి శ్చ శాశ్వతీ
శుద్ధాన్వయానాం నారీణాం విద్యా దేతత్ కులవ్రతం
తస్మా ల్లోక శ్చ భర్తాచ సమ్య గారాధితో యయా
ధర్మ మర్థం చ కామం చ సై వాప్నోతి నిరత్యయా॥
(భవిష్యపురాణము)

భర్తయొక్క ధర్మార్థకామములనెఱవేర్చుటయే కులస్త్రీలకుఁ జేయఁదగినది. చెడునడతవలనఁ గులత్రయముతోపాటుగనభో

లోకమునఁ బడవేయుదురు. మంచిశీలము నాభరణముగా ధరించు వనితలు కులత్రియమును, దమ్మను నుద్ధరింతురు. ఎవరు పతి చిత్తానుకూలముగా వర్తించుచు శీలమును రక్షించుకొందురో వారికి రత్నసువర్ణాదికములు బరువుకొఱకే కాని యలంకారము కొఱకు కాదు. ఉత్తమవంశజాతలగు వనిత లీ కుల వ్రతమును బాటింతురు. లోకజ్ఞానములో నుత్తమకోటికిఁ జెంది, శాశ్వత మైన పతిభక్తి కలిగియుండుటయే యావ్రతము. ఏ వనిత లోకమును, భర్తను జక్కఁగా నారాధించునో యామె యతిక్రమ ములేని ధర్మమును, నర్థమును గామమును బొందుచున్నది.

శ్లో॥ తస్మాత్సర్వా స్వవస్థాసు మనోవాక్కాయకర్మభిః
హితం స్వామ్యనుకూలత్వం నారీణాం తు విశేషతః॥

(భవిష్యపురాణము)

స్త్రీలకు ముఖ్యముగా నన్నియవస్థల యందును మనో వాక్కాయ కర్మలచేత భర్తకనుకూలముగా వర్తించుటయే మేలు.

శ్లో॥ గుణానా మార్జనే నిత్యం శీలవత్పరిరక్షణే
ప్రేత్య చేహచ నిర్ద్వంద్వం సుఖ మాప్నోత్యనుత్తమమ్॥

(భవిష్యపురాణము)

సదా సుగుణముల నార్జించి శీలము నట్లు కాపాడినచోఁ జనిపోయినను,జీవించియున్నను, నుత్తమమగు సాటిలేని సుఖము నందుచుండును.

పతివ్రతలు నాలుగు విధములుగ నుందురు. ఉత్తమ, మధ్యమ, అధమ, అధమాధమ.

ఆ. పతినిఁ దక్క నెపుడు పరపురుషునిఁ గల
నేనిఁ దలఁప కన్య నీక్షణంబు
చేయనట్టి సాధ్వి చెన్నుగా నుత్తమ
యనఁగఁ జెల్లు నవని హరుమిటారి।

స్వప్నమందుఁ గూడఁ దనపతినే చూచుచు నితరుల నెప్పుడును జూడదో యామె యుత్తమపతివ్రత.

క. సుతువలెఁ దోఁబుట్టుల వలెఁ
బితవలెఁ బెఱవారిఁ గనుచుఁ బెనిమిటియం ద
ప్రీతిమ మగు భక్తి నెఱపెడు
సతి మధ్యమ యనఁగఁజెల్లు శైలవరసుతా।

పరపురుషునిఁ దండ్రిగ సోదరునిగఁ గుమారునిగ భావించు నామె మధ్యమ పతివ్రత.

క. వ్యభిచారము కులకామిని
కభిరూపము గాఁ దటంచు నాత్మ నెఱిఁగి తా
విభుని భజింపుచు నుండిన
నిభయాన కనిష్ఠ యనుచు నేర్పడుఁ బుడమిన్.

పరపురుషునం దెప్పుడైనఁ గామము గల్గినను బాపభీతిచే మనమును నిగ్రహించి వ్యభిచరింపక పతిని సేవించునామె యధమపతివ్రత.

క. పెనిమిటి భయంబునను గుల
జనుల భయంబునను బరుని సాంగత్యము న
ల్పని వధు వధమాధమ యని
యనుదురు ప్రజ లెల్ల ధాత్రి నగరాజసుతా।

(ఆంధ్రశివపురాణము)

భర్తృభయముచేఁ గాని బంధుజన భీతిచేఁ గాని పరపురుష సాంగత్యము సల్పని యామె యధమాధమ పతివ్రత. ఈ నల్వురును పాపమును హరింపఁజేసి లోకపావన మొనర్తురు.

శ్లో॥ పాతివ్రత్య ప్రభావే ణాత్రిస్త్రియా త్రిసురార్థ నాత్
జీవితో విప్రఏకో హి మృతో వారాహశాపతః ॥

(శివపురాణము)

త్రిమూర్తుల యభ్యర్థనచేఁ పాతివ్రత్యప్రభావమహిత యగు ననసూయాదేవి వారాహశాపమున మృతుఁడైన బ్రాహ్మణు నొకనిని బునర్జీవితుఁ గావించినది.

పాతివ్రత్య ప్రభావముచే సుమతి సూర్యగమననిరోధ మొనర్చినది. సావిత్రి మృతభర్తను బ్రతికించుకొన్నది. ఇటు లెందఱో సాధ్వులు మహత్తరకార్యము లొనరించిరి. పార్వతీ ! నీ వీ పాతివ్రత్య ధర్మముల గ్రహించి పతిసేవాతత్పర వగుము. అద్దాన సర్వసౌఖ్యముల నందుకోఁగలవు. ఓ జగజ్జననీ ! సాక్షా చ్ఛంకరుఁడే నీ పతి కావున నీ నామోచ్చారణమాత్రముననే స్త్రీలు పతివ్రత లగుదురు. ఇంతకును సమస్తలోకములఁ బవిత్ర మొన రించెడి యాదిదుర్గవు జగన్మాతవు నైన నీకు నేను ధర్మముల బోధించుటయా ! లోకాచారముగఁ జెప్పితినిజుమా !" యని యా పురంధ్రి యామెకు వందన మిడి యూరకున్నది.

ఉమను జూచి మేనక మిక్కిలి దుఃఖించుచు "నమ్మా ! శుభప్రదముగ నిన్నత్తవారింటి కనుపుచుఁ గంట నీ ర్వెట్టుట

తగ ధని తెలిసియు నిన్ను విడిచి యుండలేని నా హృదయ మప్ర యత్నముగఁ బొంగి వచ్చు దుఃఖతరంగముల నరికట్టలేకపోవు చున్న" దని పలుకుచు గాఢముగఁ గౌఁగిలించుకొని బిగ్గరగా నేడ్చి వివశ యైనది. హైమవతి తల్లికిఁ బరిచర్యఁ గావించి యోదార్చుచున్నది. శైలరాజుగూడ ద్రవీభూత చేతస్కుఁడై కంటినీరుఁ దుడిచికొనుచు

ఉ. తల్లిరో! యెట్లు వోయెదవు తల్లినిఁ దండ్రిని నన్నదమ్ములన్
 బెల్లుగ బంధువర్గమును వేశ్మమునున్ విడనాడి యిప్పు డీ
 యెల్లరు నిన్నుఁ బాయఁగల రెట్లు కనుంగొను చిన్నవోయె నీ
 యిల్లును బట్టణం బిపుడె యే నెటు సైఁతు వచింపు మమ్మరో!

 గీ. అనుచుఁ గన్నీరు దొరఁగ మహావ్యసనము
 తోడ వందురుచున్నట్టి తుహినభూమి
 ధరున కధ్యాత్మత త్త్వంబుఁ దద్జ్ఞుఁ డగు పు
 రోధ బోధించె నాత్మనిరూఢి దనర.

(ఆంధ్ర శివపురాణము)

ఆఁడుబిడ్డ కత్తవారింటి కరుగునపు డెంత దృఢస్వభావ కైనను గంట నీరు వచ్చుట సహజ మగుటఁ బార్వతికిని దుఃఖ మాఁగినది కాదు. తల్లిదండ్రులకు, గురువులకు, సోదరులకు, వదినెలకు, మహర్షులకుఁ బురసతులకుఁ బ్రణమిల్లినది. ఎల్ల రామె నాశీర్వదించినారు. పల్లకీ వచ్చినది. వృద్ధాంగన లామె నందుఁ గూర్చుండఁ బెట్టినారు. నగరాజు నాగభూషణునికినమస్క రించి"సర్వేశ్వరా! మేము సామాన్యులము. నీవు జగన్నాథుఁడవు.

అల్లారుముద్దుగఁ బ్రాణప్రాణముగఁ బెంచుకొన్న నా యాత్మజను నీ కప్పగించితిని. పుట్టింటి యలవాటున నా కుమారిక యేదేనిఁ బొరపా టొనరించినను మన్నించి యేలుకొనుము.ఆమె లాలన పాలనాదికము లన్నియు నీ పాలఁ బెట్టితిని. మా యం దనుగ్రహ ముంచు" మని చేతులఁ బట్టి విన్నవించెను. చంద్రశేఖరుఁడు మందహాసముతో నంగీకారమును సూచించెను. పల్లకీ లేచినది. పార్వతి మఱల నందఱకుఁ బ్రణమిల్లి కంట నీరు గార్చుచు శిరము వంచి కూర్చున్నది. పల్లకి వెడలుచున్నది. మేనకాహిమవంతులు సపరివారముగ సాఁగనంపి కనుచూపు మేరకుఁ జూచుచు దుఃఖాక్రాంతులై యింటికి వెడలిరి.

పార్వతీపరమేశ్వరులు కైలాసమును జేరిరి. మహర్షులకు, దేవతలకు, సకలపరివారములకు విందులొనరించి యింద్రోపేంద్ర విరించ్యాది బృందారకులతోఁ గూడి తాను నారగించినాఁడు పరమ శివుఁడు. అందఱకు నాతఁడు యథోచిత స్వర్ణ భూషణాదికముల బహూకరించినాఁడు. బ్రహ్మ విష్ణ్వాదులకు వశిష్ఠాది మహర్షులకు వందనములఁ జేసినాఁడు. నారాయణుఁడు శంకరు నాలింగన మొనర్చుకొని యానందాశ్రువుల రాల్చి నమస్కరించినాఁడు. హిరణ్యగర్భుఁడు గూడ మహేశ్వరున కభివందన మొనరించి స్తోత్రము గావించినాఁడు. సకల దేవతలు నుమామహేశ్వరులకుఁ బ్రణమిల్లి సెలవుఁ దీసికొని తమతావుల కరిగిరి.

# కుమారస్వామి చరిత్ర

ఉమామహేశ్వరులు కైలాసమున నొక నిర్జనప్రదేశ మందలి గుహలో శృంగారమందిరమును గల్పించుకొని యందు దివ్యవర్షసహస్ర పర్యంతము శృంగారలీలావినోదమున నుండిరి. పార్వతీపరిణయ మై సహస్రవర్షము లైనను గుమారోదయము కాలేదు. కుమారోదయము తోఁగాని దేవతలకుఁ దారకాసురునివలని కష్టములు తీఱవు. అందులకై దేవతలు నిరీక్షించుచున్నారు. భోగాసక్తుఁడై శంకరుఁడు దేవకార్యమును విస్మరించియుండు నని భావించి సుపర్వులా గుహాముఖద్వారమునఁ జేరి స్తోత్ర మొనరించి తారకాసురుని బాధలనుండి తమ్ముఁ గాపాడు మని మొఱపెట్టుకొనిరి. పార్వతీశృంగార మహానందములో నున్న శంకరుఁడు గుహాముఖమునకు వచ్చి వారి ననుగ్రహింపఁ దలంచి సురసంఘముతో నిటు లనెను.

శ్లో॥ యద్భావి తద్భవ త్యేవ కోఽపి నో తన్నివారకః
యజ్జాతం తజ్జాత మేవ ప్రస్తుతం శ్రుణు తామరాః
శివతః స్ఖలితం వీర్యం కో గ్రహిష్యతి మేఽధునా
సగృహ్ణీయా దితి ప్రోచ్య పాతయామాస తద్భువి
అగ్నిర్భూత్వా కపోతో హి ప్రేరితః సర్వ నిర్జరైః
అభక్ష చ్ఛాంభవం వీర్యం చంచ్వా తు నిఖిలం తదా॥

(శివపురాణము)

"దేవతలారా ! కానున్నది కాక మానదు. దాని నెవ్వఁడు నాఁపఁజాలఁడు, జరిగినది జరుగనిండు. ప్రకృతాంశ మాలకింపుఁడు. ఈశ్వరవీర్యము నిర్గమన సంసిద్ధమై యున్నది. దీని నిపు డెవ్వరు ధరింతు" రనుచు మహాదేవుఁడు భూమిపై రేతః పతన మొనరించెను. బృందారక ప్రేరితుఁడై వహ్నిదేవుఁడు కపోతరూపముతో ముకుపుటములచే నా మహావీర్యమును భక్షించెను. శేషవీర్యమును సుపర్వు లెల్ల రాహారించిరి. అంతలో గౌరీదేవి గుహాద్వారమునకు వచ్చి యంతయుఁ దెలిసికొని మండిపడి "యో దివౌకసులారా ! స్వార్థపరులై మీరు మాయానంద లీలకు భంగమును గల్పించి నేను ధరింపవలసిన మహాదేవ వీర్యమును మీరు గ్రసించి నన్ను వంధ్యను గావించిరి. తత్ఫలముగా మీసతులు వంధ్యలై మీ రెల్ల దుఃఖభాజను లగుదురుగాక ! ఓ పావకా ! మూర్ఖుఁడవై జగదేకనాథుని వీర్యమును భక్షించితివి గాన నేఁటినుండి నీవు సర్వభక్షకుఁడ వగుదువుగాక ! దేవసేవకుఁడవై వారికి హవిర్భాగముల నందఁజేయుచుందువు గాక !" యని శపించి వెడలిపోయినది.

శివవీర్య భక్షకులైన యాదితేయుల కమితతాప ముదయింపఁగాఁ దాళలేక శంకరునే శరణుఁ గోరిరి. అతఁడు క్రక్కివేయుఁ డని తెలుపఁగా వా రటు లొనరించి తాపమును వీడిరి. వైశ్వానరుఁడును ధరింపలేక యుమాధవునిఁ జేరి నుతించి రక్షింపుమని యర్థింపఁగా నాతఁడు ప్రసన్నుఁడై "నీ వా వీర్యమును

యోగ్యవనితయం దుంచుము. నీ తాప మణఁగు" నని పలికెను. అగ్ని నారదునితో సమాలోచించెను.

ఒకనాఁడు సప్తమహర్షుల పత్నులు నదికి వచ్చి స్నాన మొనరించి శీతబాధానివృత్తికై యగ్నినిఁ బ్రజ్వలింపఁజేసి యరుంధతికాక తక్కిన యాఱుగురును దాని చుట్టును గూర్చుండిరి. అదే యద నని యెంచి జాతవేదుఁడు తనలోని శివరేతస్సును గణరూపమున రోమములద్వారమున నా యాఱుగురిలోఁ బ్రవేశ పెట్టి తాను విగతతాపుఁ డయ్యెను. అయ్యమోఘ వీర్య ప్రవేశము వలన నా వనితలు గర్భవతులు కాఁగా పతులు వారినిఁ బరిత్య జించిరి. వారును గర్భభారముల మోయలేక దాహసంతప్తలై హిమాలయ పార్శ్వభాగమున నా మహావీర్యమును విడిచి దాహ విపర్జిత లైరి. తుహినభూధరుఁడును భరింపలేక నా శివరేతస్సును గంపించుచు గంగాంబువులలో విడిచెను. గంగకును నది దుస్సహ మగుటచేఁ దరంగములచే దాని నొడ్డునకుఁ గొట్టెను. ఒడ్డుననున్న రెల్లుదుబ్బులలోఁ బడి యమోఘశక్తి సంపన్నమగు నా వీర్యము కుమారుఁడుగ నయ్యెను. ఆ కుమారసంభవము మార్గశీర్ష శుద్ధ షష్ఠి దివసమున నయ్యెను. అంతట షట్కృత్తికలు స్నానార్థము గంగకు వచ్చి రెల్లుదుబ్బులలో సుందర సుకుమారతేజఃపుంజము వలె నానందవర్ధనుఁడుగాఁ గ్రీడించుచున్న కుమారునిఁ జూచి యానందించి యెవరికి వా రాతనిని గ్రహింప నభిలషింపు చుండఁగా నా శరవణభవుఁడు వారి నందఱి నానందింపఁజేయు టకై షణ్ముఖుఁ డయ్యెను. షట్కృత్తికలు నా షణ్ముఖములకు

స్తన్య మొసంగి యానందించి తమ యాశ్రమముల కాతనిని గొనిపోయి యల్లారుముద్దుగాఁ బెంచుకొనుచుఁ గార్తికేయుఁ డని పిలుచుకొనుచుండిరి. ఆతని యునికి నితరులకుఁ దెలియ నీకుండిరి.

పార్వతి యొకనాఁడు మహేశ్వరునితో "మీ వీర్య మమోఘము కదా! అది యేమైన" దని ప్రశ్నించినది. ఈశ్వరుఁడు సకలదేవతలను రావించి యా రేతస్సును గూర్చి యడుగఁగా వారివలనఁ గ్రమక్రమముగా నది కుమారుఁడై షట్కృత్తికలచేఁ బెంపఁబడుచున్నట్లు తేలినది. శంకరనియోగమున నందీశ్వరుఁడు సపరివారముగాఁ గృత్తికలయింటి కరిగి కార్తికేయునితో సంభాషించి యాతని నొప్పించి కృత్తికల యనుమతినిఁ గుమారుని నుమామహేశుల సన్నిధికిఁ దీసికొనివచ్చెను. వారాతనినిఁ గౌఁగిలించుకొని మహానంద మనుభవించిరి. బ్రహ్మ విష్ణు మహేంద్రాదు లా శివనందనునకు వందనము లొనరించినారు.

సదాశివుఁడు కుమారుని రత్నసింహాసనమునఁ గూర్చుండఁ బెట్టి సర్వతీర్థ సలిలములచేఁ బవిత్ర మంత్రపూర్వకముగ నభిషేకించెను. శూలము, పాశుపతాస్త్రము, శక్తియున్నగు నాయుధములను సకల ధనుర్విద్యను నొసంగెను. విధాత యజ్ఞోపవీతమును వేదమాతయగు గాయత్రి బ్రహ్మవిద్యను నిచ్చిరి. సూర్యుఁడు మనోవేగముగల రథము నొసంగెను. సకలదేవతలు ననేక శస్త్రాస్త్రములను గానుకలను నిచ్చిరి. త్వష్ట కైలాసపర్వతము

క్రింద నొక సుందరనగరమును వాసుదేవు నానతిని నిర్మించి యందు మణిమయ దివ్యభవనమును దానిలో మహోజ్జ్వలరత్న సింహాసనమును నిర్మించి యిచ్చెను.

శ్లో॥ బ్రహ్మాండాధిపతిత్వం హి దదౌ తస్మై ముదా హరిః
చకార తిలకం తస్య సమానర్చ సురైః సహ
ప్రణమ్య కార్తికం ప్రీత్యా సర్వైర్దేవర్షిభి స్సహ
తుష్టావ వివిధ స్తోత్రైః శివరూపం సనాతనం
వర సింహాసనస్థో హి శుశుభేఽతీవ కార్తికః
స్వామిభావం సమాపన్నో బ్రహ్మాండస్య చ పాలకః॥
(శివపురాణము)

వివిధాయుధ హస్తుఁడైన శక్తిధరుని నాయకునిఁగా వించుకొని నారాయణ ప్రముఖ సుపర్వు లెల్లఁ దారకాసురునిపై రణమున కేఁగిరి. ఘోరసంగ్రామ మయ్యెను. కుమారుఁడు మహాశక్తియుక్త మగు శక్తినిఁ బ్రయోగించి తారకుని సంహరించెను. కుమార విజయ వర్తమానమును విని యుమా శివులు వచ్చి యాతనిని ముద్దాడి మురిసిరి. సర్వదేవతలు సకలలోకనివాసులును సంతసించి మహోత్సవ మొనరించి కుమారు నిట్లు సంస్తుతించిరి.

శ్లో॥ నమః కుమారాయ మహాప్రభాయ
స్కందాయ చాఽఽస్కందిత దానవాయ
నవార్కబింబ ప్రతిమ ప్రభాయ
నమోఽస్తు తే షణ్ముఖ! కామరూప!॥

శ్లో॥ పినద్ధ నానాభరణాయ తుభ్యమ్
నమో రణోదార ముదారసాయ
నమోఽస్తు తే ఽర్క ప్రతిమ ప్రభాయ
నమోఽస్తు గుహ్యాయ గుహాయ తుభ్యమ్॥

శ్లో॥ నమోఽస్తు తే లోకభయాపహాయ
నమోఽస్తు తే లోకకృపాపరాయ
నమో విశాలామల లోచనాయ
నమో విశాఖాయ మహావ్రతాయ॥

శ్లో॥ నమో నమస్తేఽస్తు రణోత్కటాయ
నమో మయూరోజ్జ్వల వాహనాయ
నమోఽస్తు కేయూరధరాయ తుభ్యం
నమో ధృతోదగ్ర పతాకినే తే
నమః ప్రభావ ప్రణతాయ తే ఽస్తు
నమోఽస్తు ఘంటాధర ధైర్యశాలినే॥

(పద్మపురాణము)

## కు మా ర క ల్యా ణ ము

శ్రీమహావిష్ణువు కుమారునకు బ్రహ్మాండాధిపత్య మొసంగి రత్నఖచిత సింహాసనమునఁ గూర్చుండఁ బెట్టినపుడు దేవత లందఱు నాతని కనేక బహుమానముల నిచ్చిరి. ఆ సమయమున మహేంద్రుఁడు మణి కాంచన ముక్తాభరణముల నీయ నిచ్చగింపక త్రిజగద్గణనీయ మనోజ్ఞయు, సుగుణాలవాలయు నగు తన

పుత్రిక దేవసేనను దీసికొనివచ్చి చంద్రశేఖర కుమారునకుఁ బత్నిగా బహూకరించెను. మహాలావణ్యవతి యగు నా దేవసేనను పార్వతీపరమేశ్వరుల యనుమతిని వివాహ మాడి దివ్యసభా మధ్యమున నుజ్జ్వల పీఠమునఁ గూర్చుండి యెల్లరకుఁ బ్రమోదమును గలిగించినాఁడు శివకుమారుఁడు.

ఒకనాఁడు స్కందుఁడు స్నేహితులతో విహారకేళీ వినోదమున నుండఁగా నారదుఁడు వచ్చి సమస్తలోకములలోని విశేషములు చెప్పుచుండఁగా నాతఁడు వినుచుండెను. ఆ ప్రసంగములో నారదుఁ డిటు లనెను, "నాయనా! కుమారా! భిల్లపురియందు భిల్లనాయకుఁ డొకఁ డుండెను. అతఁడు బోయల కధిపతియై మహైశ్వర్యవంతుఁడై తన పరాక్రమముచే జగమును స్తంభింపఁజేయును. అతని పురమునకు సమీపారణ్యమున శివుఁ డను ముని యొకఁడు నవయౌవనమున నున్న హరిణినిఁ జూచి భ్రమించి రేతస్స్ఖలనము గావింప దానిని గ్రహించి యా హరిణి యొక బాలికను బ్రసవించి వనమున విడిచి వెడలిపోయెను, వీర్య పాతమునకుఁ జింతించి శివమౌనియు నెచటికో పోయెను. ఆ తావునకు భిల్లరాజు వచ్చి బాలశశాంకఫాల యగు నా దివ్యబాలనుఁ జూచి యుత్సుకుఁడై యెత్తికొని ముద్దాడి తనయింటికిఁ గొనిపోయి సతి కిచ్చి గారాబముగఁ బెంచెను. ఆ బాలిక ప్రవర్ధమాన యయి యిప్పుడు నవయౌవనమున నున్నది. ఆమెపేరు సౌందర్యవల్లి. ఆమె యౌవనమునకు సాటి యెవ్వరును గారు.

గీ. కలికి పరిజనములపాలి కల్పవల్లి
సకలజన మోహ నాతనుపావవల్లి
ఏ సుకృత శక్తిధరునకో హృదయవల్లి
తన్వి యాహ్వాయ మరయ సౌందర్యవల్లి.

(ఆంధ్రశివపురాణము)

ఆమె యెంతయు నీకుఁ దగిన కన్య. ఆ లలితసుకుమారి షణ్ముఖప్రియ యగునని యొకనాఁడు చతురాననుఁడు నాతోఁ జెప్పెను.

గీ. రాజశేఖరతనయః విరాజిలెడును
గరము నీయందు వల్లి శృంగారగరిమ
నీ వచోమృత నిష్యంద నియతివల్లి
దేవి కోమలాధర మందుఁ దేజరిలెడు.

(ఆంధ్రశివపురాణము)

మీ యిర్వురి దాంపత్య మనుపమాన మై శృంగార మహా సామ్రాజ్యమును మీ రేలఁగలరు".

ఆ మాటలను వినుచున్న గుహుఁడు వల్లీ పరిగ్రహణ లాలసుఁ డై యెటులైన నా వల్లిని దన ప్రాణవల్లినిఁ గావింప నిశ్చయించుకొనెను.

నారదుఁడు కార్తికేయుని విడిచి భిల్లపురమున కేఁగెను. భిల్లుఁడు భక్తిభావమున నాతనిఁ బూజించి తన కుమారిచేఁ బ్రణ

మిల్లఁ జేసి "నారదమహర్షీ! మీ వాక్యము వేదమువలె సత్యము. నా సుతకుఁ బతి యెవ్వఁ డగునో వివాహ మెపుడు జరుగునో తెలుపుఁ డని కోరెను. అంత నారదుఁడు

చ. శివునకు గట్టురాసుతకుఁ జెల్వగు నందనుఁ డాదితేయసై
న్య విభుఁడు తారకాసురనిహంత ప్రలంబవిఘాతి బాణదై
త్యవధకరుండు క్రౌంచగిరిదారణుఁ డాఢ్యుఁడు కార్తికేయుఁ డీ
లవలిని రాణిగాఁ గొనఁగలండు దృఢంబు వనేచరాగ్రిణీ!

క. పూర్వజనినుండి వీరల
కిర్వురకుఁ బరస్ప రేచ్ఛ యెలరిన దౌటన్
శర్వకుమారుండే యీ
పర్వేందుముఖిన్ వరించుఁ బరమప్రీతిన్.

(ఆంధ్రశివపురాణము)

వివాహమును ద్వరలో జరుగు" నని వెడలెను. అప్పటి నుండియు వల్లి యుల్లమున నుల్లసిల్లి బాహులేయలీలల నభి వర్ణించుకొనుచు నాతని పాణిగ్రహణమునకై నిరీక్షించు చుండెను.

నారదుఁడు వర్ణించి చెప్పిన సౌందర్యవల్లీ రామణీయ కతను హృదయమునఁ జిత్రించుకొని పార్వతీనందనుఁ డామెకై యెంతయు విరహము నొంది యామె నెటులైనఁ దెచ్చి పెండ్లా డవలె నని నిశ్చయించి భిల్లకుమారవేషమున భిల్లపురి కరిగెను.

ఆ నగరమునఁ బ్రియంగువనమున విహరించు వల్లినిఁ జూచి నారదుని వాక్యము లన్నియు సహజోక్తులు గాని యతిశయోక్తులు గావని తెలిసికొని యామె యనన్యసామాన్య లావణ్యమునకు ముగ్ధుఁడై దగ్గఱగా వెడలి "రాజముఖీ! నేను రాజకలావతంస నందనుఁడను. నీ సౌందర్యమును విని నీవు నా పత్నివగుదు వన్న బ్రహ్మవాక్యమును విని నీకై యరుదెంచి నీ యందమును గన్నులారఁజూచి మోహించి నిన్ను గోరుచున్నాను. నన్నుఁ బరిగ్రహింపు" మనెను. వల్లియు మున్ను నారదుఁడు చెప్పిన లక్షణము లాతనిలో గుర్తించి యాతఁడు మహాసేనుఁడే యగునను కొన్నను "ఆర్యా! మీర లెవరో నే నెఱుఁగను. నేను గన్యను. భిల్లదంపతులు నా తలిదండ్రులు. నా హృదయము శివకుమార సమర్పితము, నన్ను మన్నింపుఁ" డనఁగా నాతఁడు కృతకభిల్ల రూపమును విడిచి నిజరూపమును జూపి "వల్లీ! నేనే శంకరకుమారుఁడను, ఇఁక సందేహమును మాని నా హృదయవల్లి వి క"మ్మనునంతలో మధ్యాహ్నసమయ మగుటఁ బుళిందుఁడు పుత్రిక నన్వేషింపుచు నట కరుదెంచెను. సుబ్రహ్మణ్యుఁడు వెంటనే సహకారకుజముగా మాఱి పోయెను. బాలికను దీసికొని భిల్లుఁ డింటికిఁ బోయెను, కుమారస్వామి మఱల నిజరూపము నొంది యెట్లైన వల్లినిఁబెండ్లాడికొని వెడలరా దని నిశ్చయించి యొక సరోవరతీరమునఁ గూర్చుండి సమయమునకై నిరీక్షించుచుండెను. ఇంటి కేఁగిన వల్లియు గుహునికై విరహార్తి నొందుచుండెను. ఆమె యవస్థను గ్రుర్తించి యొక చెలికత్తె యా

వృత్తాంతమును భిల్లదంపతులకుఁ దెలిపెను. కుమారస్వామి యనుగ్రహముచే నా భిల్లదంపతులకు దివ్యజ్ఞానము కలిగెను. వారు వచ్చి యాతనిని గుమారస్వామిగా గుర్తించి సంతోషముతో వల్లి నాతని కిచ్చి వివాహ మొనరించిరి. వల్లీసహితుఁడై కైలాసమునకు వచ్చి తల్లిదండ్రులకు నమస్కరించి వల్లిచే దేవసేనకుఁ బ్రణమిల్లఁజేసి వల్లీ దేవసేనాసహితుఁడై సుబ్రహ్మణ్యుఁడత్యాంతానందమున నుండసాగెను.

శ్లో॥ నమస్తే పుండరీకాక్ష భక్తానా మభయప్రద
సుబ్రహ్మణ్య నమస్తేఽస్తు త్రాహిమాం శరణాగతమ్॥
(వామనపురాణము)

## కు మా ర కృ త సా ము ద్రి క ము

కుమారస్వామి హస్తరేఖ లాధారముగఁ జెప్పు జ్యోతిశ్శాస్త్రగ్రంథమును రచింపుచుండెను. అందు పురుషలక్షణములు వ్రాయఁబడెను. వనితాలక్షణములను వ్రాయ నారంభింపఁగా రచనము ముందునకు నడచుటలేదు. విఘ్న మగుచున్నది. ఇది తనసోదరుఁడైన విఘ్ననాథుని కృత్య మని యెంచి యాగ్రహించి యాతనిని దండింప నారంభించెను. అన్నచే దెబ్బలు తినుచున్న గణపతినిఁ జూచి పరమేశ్వరుఁడు జాలిపడి కుమారస్వామి నుద్దేశించి "యేమిరా? వాని నంతగాఁ గొట్టుచున్నావు, నీ దెబ్బలకుఁ దట్టుకొనలేకపోవుచున్నాఁడు. వానిని జంపుదువా

మేమి" యని మందలించెను. అంతఁ గార్తికేయుఁడు తాను రచించుచున్న జ్యోతిశ్శాస్త్రగ్రంథమునకు గణపతి విఘ్న మొనరింపుచుండె ననియుఁ బురుషలక్షణములు మాత్రమే రచితములైన వనియు స్త్రీలక్షణములు వ్రాయవలసియున్న వనియు వివరించెను. గణపతిని బంపివేసి కుమారునకుఁ దన హస్తమును జూపి ఫలములను బ్రశ్నించినాఁడు మహేశ్వరుఁడు. స్వీయరచనానుసారముగ శిఖివాహనుఁడు తండ్రిగారి హస్తరేఖలను బరిశీలించి "నాయనగారూ! మీ హస్తమునఁ గపాలరేఖ యున్నందునఁ గొలఁదికాలములో మీచేతికిఁ గపాలము రాఁగలదు. తత్కారణముగ మీరు కపాలి యని పిలువఁబడుదురు" అనినంతనే శంకరున కాగ్రహము వచ్చి యాతనిని జ్యోతిశ్శాస్త్రమును సముద్రమునఁ బాఱవైచెను.

శ్లో॥ అథోవాచ మహాదేవః ప్రహసన్ స్వసుతం కిల
మమ కిం లక్షణం పుత్ర! పశ్య సే త్వం వదస్వ మే
స చోవాచ కరే తుభ్యం కపాలం ద్విజలక్షితమ్
అవిచారేణ సంస్థాప్యం కపాలీ తేన చోచ్యతే
స తల్లక్షణ మాదాయ సముద్రే ప్రాక్షిప ద్రుషా॥
(భవిష్యపురాణము)

కొంతకాలము తర్వాత బ్రహ్మపైఁ బరమేశ్వరున కాగ్రహము వచ్చుటయు నా యావేశములో నాతఁడు విధాతృ పంచమ వదనము నుత్తరించుటయుఁ దన్మూలముగాఁ గపాలము శివుని హస్తమునకు వచ్చుటయు జరిగెను. అపుడు తనకుమారుఁడు

చెప్పిన జ్యోతిషము యథార్థ మని గుర్తించి పరమేశ్వరుఁ డా గ్రంథము నుద్ధరింపఁ దలఁచి సాగరునికడ కరిగి

శ్లో॥ ఆహూయ చ సముద్రం స ప్రీత్యావా చావిచారయన్
కురు ష్వాభరణం స్త్రీణాం లక్షణం య ద్విలక్షణమ్
కార్తికేయేన య త్ప్రోక్తం తద్వద స్వావిచారయన్
స చాహ మమ నామ్నేదం భవే త్పురుషలక్షణమ్
దేవేన త త్ప్రతిజ్ఞాతం ఏవ మేత ద్భవిష్యతి
... ... ... ...
స్త్రీ పుంసో ర్లక్షణం శ్రేష్ఠం సాముద్రి మితి విశ్రుతమ్॥

(భవిష్యపురాణము)

"సాగరా! కార్తికేయునిచేఁ జెప్పఁబడిన పురుషలక్షణములు నీయం దుంచితిని. స్త్రీలక్షణములు లేని యీ గ్రంథము విలక్షణముగ నుండును. వానిని నీవు చెప్పి శాస్త్రమును బూర్తిచేసి తె" మ్మనఁగా నతఁడు "మహేశా! ఆ గ్రంథమునకు నాపేరుఁ బెట్టిన నట్లే చేయుదు" ననఁగాఁ బరమేశుఁ డంగీకరించెను. స్త్రీ పురుష లక్షణ లక్షితమొనరించి సముద్రుఁ డా గ్రంథమును బహిర్గత మొనర్చెను. దానికిఁ బరమేశ్వరుఁడు సాముద్రిక మని నామకరణ మొనర్చెను.

# గణపతి వృత్తాంతము

శ్వేతకల్ప మందలి గణనాథ చరిత్రమును శివపురాణ మిటులు చెప్పుచున్నది.

పార్వతికి సఖురాండ్రగు జయ విజయ లొకనాఁ డామె దగ్గఱఁ గూర్చుండి "అమ్మా! మీకు భృంగీశ్వర నందీశ్వ రాది భృత్యగణము లున్నవి గాని వా రందఱు శంకరవిధేయులు, శివాజ్ఞానువర్తులు. నీ హృదయమునకుఁ గలియువారు కారు. నా వాఁ డనువాఁ డొక్కఁడైన నుండితీఱవలెఁ గదా! అట్టి యాప్త భృత్యునొకనిని సృష్టించుట లెస్స" యని చెప్పఁగా నా మాట లామెకు హితముగఁ దోఁచినవి. అనంతర మొక దివసమున శైలజ తల యంటుకొనఁబోయి ద్వారమున నందిని గూర్చుండఁ బెట్టి పురుషుల నెవ్వరిని లోనికి రానీయవల దని చెప్పెను. అక్కడకుఁ బరమేశుఁడు రాఁగా నంది యది యసమయ మనియు, లోనికిఁ బోవల దనియు వారించినను నాతఁ డాఁగక లోనికిఁ బోఁగా హైమవతి సిగ్గిల్లెను, అపు డామెకుఁ జెలికత్తెల మాటలు జ్ఞప్తికిఁ దోఁచి నా యాప్తభృత్యుఁడు లేకుండుటచేతనే కదా యిటు లైనది తప్పక నావాఁ డొకఁడుండవలె నని నిశ్చ యించుకొనినది. మఱల నొకనాఁ డభ్యంగన మొనరింపుచు జగదంబిక నలుగుపిండితో నొక సుందర బాలకాకృతి నిర్మించి దానికిఁ బ్రాణము పోసి యలంకారము లన్నియుఁ బెట్టినది.

ఆ బాలుఁడు "జననీ! నేను జేయవలసిన కృత్య మేదియో యాజ్ఞాపింపు" మనఁగా నామె వాని కొక దృఢదండ మొసంగి "కుమారా! నీవు దండధరుఁడవై ద్వారమునఁ గాచి యుండి నా యాజ్ఞ లేనిదే లోని కెవ్వరిని రానీయవల" దని యాజ్ఞాపించి లోని కేఁగెను. క్షణకాలములో శివుఁ దేతెంచి లోనికిఁ బ్రవేశింపఁ బోఁగా నా బాలుఁడు దండము నడ్డుగఁ బెట్టిలోనికిఁ బోరా దనెను. "ఓరీ! నేను గిరిజాపతిని. ఇది నా యిల్లు. నా యింటిలోని కేఁగు నన్ను వారించు మూర్ఖుఁడవు నీ వెవ్వఁడవు? తొలఁగు"మని లోనికి వెడలుచుండఁగా నా బాలుఁ డడ్డము వచ్చి దండముతోఁ బరమ శివుని మోఁదెను. అంత నుగ్రున కాగ్రహము గలిగి భృత్యగణ మును బిల్చి "వీఁ డెవఁడో నన్ను వారించి దండించుచున్నాఁడు. వీనిని దండింపుఁ" డని యాజ్ఞాపించెను. వారు వచ్చి "ఓయీ! మే మిక్కడ నుండు ద్వారరక్షకులము. నీ వెవ్వఁడవు? మా యాకృతినే తాల్చిన నీవు నూతనుఁడవు. ఈశ్వరునే శిక్షింపఁబూనిన నీ దెంతటి సాహసము! నిన్నుఁ జంపకుండ విడుచుచున్నాము. దూరముగఁ బొమ్ము, ఇక్కడ నున్న నీవు మృతుఁడ వగుదువు సుమా!" యని హెచ్చరించిరి. వారినిఁ గూడ నా గిరిజా నందనుఁడు దండముచే దండించి "మా యమ్మ యెవ్వరిని లోనికి రానీయవలదని చెప్పినది. ఫాలాక్షుఁ డైన రా వీలులేదు. పొం" డని తఱిమివై చెను. వారును బోయి శంకరునకు విన్నవించిరి. ఆతని నెటులైన ద్వారసీమనుండి తొలఁగింపుఁ డని మఱలఁ బరమేశ్వరుఁ డాజ్ఞాపింపఁగా వా రరిగి "ఓయీ! నీవు పిన్నవాఁడ

వని యుద్ధముచేయు టన్యాయ మని చూచుచున్నాము గాని చేఁత గాక కాదు. సగౌరవముగా నీ విచటినుండి వెడలు" మని సామ మున వివరించినను నిష్ఫల మయ్యెను. మహాదేవున కది లజ్జాహేతు వయ్యెను. భార్య యెవ్వనినో యొక బాలకునిఁ గాపుఁ బెట్టఁగా వానిమూలమున నిజగృహములోని కేఁగలేని నేను హేళనపాత్రుఁడనుగదా యని యూహించి స్కందుని నాతని పరివారమునుఁ బిల్చి యా ద్వార రక్షక బాలకుని గెంటివేయుఁ డని తెల్పెను. వారందఱును బోయి యాతనిని గెంటలేక యుద్ధ మొనర్చుచుండిరి. అనేకాస్త్రశస్త్రములఁ బ్రయోగించుచుండిరి. ఆ బాలుఁడు తనదండముతో వాని నుపసంహరించుచు వారల నంద ఱను బరాజితుల నొనర్చెను. అంతఁ బరమేశుఁడు బ్రహ్మను రావించి యా బాలునికి నచ్చఁజెప్పి యటనుండి వెడలింపు మనఁగా బ్రహ్మ వెడలి పార్వతీకుమారునకుఁ జెప్పఁ బోఁగా నాతఁడు బ్రహ్మగారి గడ్డమును బట్టి లాగెను. ప్రజాపతి "నాయనా! నేను నీతోయుద్ధ మొనరింప రాలేదు నీకపకార మొన రించువాఁడఁ గాను. నీ యనుగ్రహపాత్రుఁడను. క్షమింపు"మను చుండఁగా బాలుఁడు చేతికఱ్ఱ నెత్తఁబోఁగా నాతఁడు పలాయితుఁ డయ్యెను. త్రినేత్రునకుఁ గోప మత్యధిక మయ్యెను. ఇంద్రాది దేవతలను, షణ్ముఖాది పరివారమును, భూత ప్రేత పిశా చాదిక ములను బిల్చి యా బాలునిపై రణ మొనరింపఁ బంపెను. వారలతో నా గిరిజాసూనుఁడు పోరాడుచున్నాఁడు. ద్వారమునందలి యుద్ధకోలాహలము నెఱిఁగి కాళి యాగ్రహించి శక్తిద్వయమును

సృష్టించి కుమారునకు సహాకరింపఁ బంపెను. జగజ్జననీదత్త శక్తిద్వయ సహాకృతుఁడైన యా బాలుఁడు జగదేకవీరుఁడుగాఁ బోరాడి వారల నందఱను బలాయితులఁ జేసెను. వారుఁ దిృపు రాంతకుని చెంత కరిగి "ప్రభూ! అతఁడు బాలమాత్రుఁడు గాఁడు. పరాశక్తి కుమారుఁడు. ఎన్నఁడును గని విని యెఱుఁగని సమర మైనది. మా శక్తు లుడిగినవి. నీవే శిక్షింపవలయు" ననిరి. చక్రధారుఁ డగు శ్రీహరియు దేవపరివృతుఁడై వెడలి యా బాలునితోఁ బోరాడినను నిష్ఫల మయ్యెను. నారదుఁడు వచ్చి ప్రోత్సహింపఁగాఁ ద్రినేత్రుఁడే యత్యుగ్రుఁడై నిజపరివారముతోఁ బోయి శాంకరీకుమారునితోఁ బోరాడసాఁగెను. ఆ బాలకుని పరాక్రమమునకు రణధీరత్వమునకు శంకరునికే యచ్చెరు వైనది. పోరాడి పోరాడి తుట్టతుదకు శంకరుఁడు త్రిశూలముతో నా బాలకుని శిరమును ఖండించెను. నారదుఁ డేఁగి కుమార శిరశ్ఛేద వార్తను గిరిజ కెఱింగించెను. జగదీశ్వరి విచారించి పిమ్మట మిక్కిలి కోపించి కొన్నిశక్తులను సృజించి ప్రళయ మొనరింప నాజ్ఞాపింపఁగా నవి చెలరేఁగి లోకనాశనముఁ జేయుచుండెను. అంత దేవమౌని దేవతల నందఱను బిల్చి "కాత్యాయని కాగ్రహము కలిగినది. ఆమె యనుగ్రహము లేనిదే యిఁక సౌఖ్యము లేదు. మన మందఱ మరిగి యాపెను క్షమాభిక్ష నర్థింపవలె" ననఁగా నందఱును బోయి యా జగదంబికను జేరి నమస్కరించి స్తోత్ర మొనరించి "జగదంబా! మేము నీ దాసులము. మా యపరాధము లన్నియు క్షమించి మమ్ముఁ గాపాడుము. సర్వలోక

సంహారము గావింపకుము. నీవే మాకు శరణ్యము" అని విన్న వించిరి. అంత హైమవతి వారితో నిటు లన్నది.

శ్లో॥ మత్పుత్రో యది జీవేత తదా సంహరణం నహి
యదా హి భవతాం మధ్యే పూజ్యోఽయం చ భవిష్యతి
సర్వాధ్యక్షో భవే దద్య యూయం కురుత త ద్యది
తదా శాంతి ర్భవే ల్లోకే నాన్యథా సుఖ మాప్స్యథ॥

(శివపురాణము)

"నా కుమారుఁడు జీవితుఁ డయ్యేనేని లోకసంహారము జరుగదు. మీ యందఱిలో నితఁడు పూజ్యుఁడగుఁగాక ; ఈతనిని సర్వాధ్యక్షు నొనర్చినచో లోకశాంతి యగును. కానినాఁడు సుఖము నొందలేరు." సర్వమంగళ వాక్యములు బ్రహ్మాదులు విని సర్వేశ్వరునకు విన్నవింపఁగా నాతఁడు సంతసించి వారల నుత్తరదిశగా నరిగి ప్రథమమునఁ గనిపించు నేజీవి శిరము నైన ఖండించి తెండని యాజ్ఞాపించెను. దేవత లుత్తరదిశగా వెడలఁగా

శ్లో॥ ప్రథమం మిలిత స్తత్ర హ స్తీ చా ప్యేకదంతకః
త చ్ఛిర శ్చ తదానీత్వా తత్ర తే ఽ యోజయ న్ధ్రువమ్॥

( శివపురాణము )

మొదట నొకదంతముగల గజము కన్పడినది. దాని మస్తకమును దెచ్చి యా బాలక శేబరమునకు స్థిరముగా నతికిరి.

బ్రహ్మ విష్ణ్వాది సుపర్వులు వేదమంత్రాభిమంత్రిత తోయముల నా మృతజాలునిపైఁ జల్లఁగా సీశ్వరేచ్ఛచే నా బాలకుఁడు జీవితుఁ డయ్యెను. గజవదనుఁడై విరాజిల్లుచుండెను. అంబికయు స్వకుమార పునర్జీవనమునకు మిక్కిలి యానందించెను. అమరు లెల్ల నమితానందముతో నాతనిని గణాధ్యక్షునిఁగా నభిషేకించి మహోత్సవములఁ గావించిరి. ఉమాదేవికుమారునకు వివిధ వస్త్రాలంకారముల నొసంగి తా నాతనిని మొదటఁ బూజించి వరము లిచ్చినది.

శ్లో॥ ధన్యోఽసి కృతకృత్యోఽసి పూర్వ పూజ్యో భ వాధునా
సర్వేషా మమరాణాం వై సర్వదా దుఃఖవర్జితః
ఆననే తవ సిందూరం దృశ్యతే సాంప్రతం యది
తస్మా త్త్వం పూజనీయోఽసి సిందూరేణ సదా నరైః
పుష్పైర్వా చందనై ర్వాపి గంధే నైవ శుభేన చ
నై వేద్యేన సురమ్యేణ నీరాజేన విధానతః
తాంబూలై రథ దానై శ్చతథా ప్రక్రమణై రపి
నమస్కార విధానేన పూజాం య స్తే విధాస్యతి
తస్య వై సకలా సిద్ధి ర్భవిష్యతి న సంశయః
విఘ్నా న్యనేకరూపాణి క్షయం యాస్యం త్యసంశయం॥

(శివపురాణము)

"నీ విపుడు ధన్యుఁడవును గృతకృత్యుఁడవు నైతివి. దేవత లందఱికంటెఁ బ్రథమపూజ్యుఁడవుఁ గమ్ము. నీ కెన్నఁడును దుఃఖము గలుగదు. నీ ముఖ మం దిపుడు సిందూరము

గనిపించుచున్నందున మానవు లెల్లప్పుడు నిన్ను సిందూరముచేఁ బూజింతురుగాక ! పుష్పములచేఁ గాని, చందనములచేఁ గాని, శుభప్రద మగు ధూపముచేఁ గాని, నైవేద్యముచేఁగాని, యంద మగు నీరాజనముచేఁ గాని, తాంబూలముచేఁ గాని, దానముచేఁ గాని, ప్రదక్షిణ నమస్కారములచేఁ గాని యెవ్వఁడు నీకుఁ బూజఁ జేయునో వానికి సర్వసిద్ధి కలుగును. సంశయము లేదు. అనేక రూపము లగు విఘ్నములు నిస్సంశయముగ నశించు"నని పార్వతి చెప్పి గణపతికి నలంకారము లిచ్చి మఱలఁ బూజించెను.

దేవత లందఱు కానందమును సౌఖ్యమును గలిగెను. వా రా గణనాథునిఁ దోడ్కొని చని చంద్రశేఖరుని యంకమునఁ గూర్చుండఁబెట్టఁగా సంతసించి యాతఁడు వాని నాశీర్వదించెను.

శ్లో॥ త్రయోఽపయం సురవరా యథా పూజ్యా జగత్త్రయే
తథాఽయం గణనాథ శ్చ సకలైః ప్రతిపూజ్యతామ్॥

(శివపురాణము)

త్రిలోకములందును ద్రిమూర్తుల మగు మే మెట్లు పూజింపఁ దగియుందుమో యా విధముగనే గణనాథుఁడు నందఱచేతఁ బూజింపఁబడుఁగాక !

శ్లో॥ అస్మి న్న పూజితే దేవా పరపూజా కృతా యది
తదా తత్ఫలహానిః స్యా న్నాత్ర కార్యా విచారణా॥

(శివపురాణము)

ముందుగా నీతనిఁ బూజించి పిమ్మట మనలఁ బూజింప వలెను. ఇతని పూజ లేనిచో మనపూజ నిష్ఫలము. ఇతనినిఁ బూజింపకుండఁ బరపూజఁ గావించిన నిష్ఫల మగును. సంశయము లేదు.

ఇట్లు త్రిమూర్తులును వరము లిచ్చి పూజించిరి. సర్వ దేవతలు నర్చించి గణాధ్యక్ష యని పిలిచి దివ్యవస్త్రాభరణాదు లొసంగిరి.

శ్లో॥ స గణేశః శివా తుష్ట్యై సర్వాధ్యక్షో నివేదితః
హే గిరీంద్రసుతాపుత్ర! సంతుష్టో ఽహం న సంశయః
మయి తుష్టే జగత్తుష్టం విరుద్ధః కోపి నో భవేత్
బాలరూపో ఽపి యస్మాత్త్వం మహావిక్రమకారకః
శక్తిపుత్రః సుతేజస్వీ తస్మాద్భవ సదా సుఖీ॥

(శివపురాణము)

దేవత లందఱుఁ గలిసి గిరిజాప్రీతికై యా గణపతి సర్వాధ్యక్షుఁ డని వెల్లడించిరి.

శివుఁడు సంతోషించి వరము లొసఁగి "గిరిరాజసుతా కుమారా! నీ విషయమున నేను సంతుష్టుఁడ నైతిని. నేను సంత సించిన లోక మంతయు సంతసించును. విరుద్ధుఁ డొకఁడుఁ నుండఁడు. నీవు బాలుఁడ వయ్యును శక్తిపుత్రుఁడ వగుట మహా విక్రమకారకుఁడ వైతివి. మంచి తేజస్సు కలవాఁడవై సర్వదా సుఖముగా నుండుము.

శ్లో॥ త్వన్నామ విఘ్నహంతృత్వే శ్రేష్ఠం చైవ భవ త్వితి
మమ సర్వగణాధ్యక్షః సంపూజ్య స్త్వం భ వాధునా
ఏవ ముక్త్వా శంకరేణ పూజావిధి రనేకశః
ఆశిష శ్చాప్యనేకా హి కృత స్తస్మింస్తు తత్‌క్షణాత్॥

విఘ్నములను నశింపఁజేయుటలో నీ నామమే శ్రేష్ఠమైన దగుఁగాక। నీవు నా సర్వగణాధ్యక్షుఁడవై సంపూజ్యుఁడ వగు" మని శంకరుఁడు పలికి యనేకవిధము లైన పూజావిధు లొనర్చి యాశీర్వదించెను. ఆ తరువాత నాదిదేవుఁ డిటు లనెను. గణపతీ! నీవు భాద్రపదశుక్ల చతుర్థీ దివసమునఁ జంద్రోదయ ప్రథమ యామమున నావిర్భవించితివి గాన నా దినమున నీవ్రతముఁ జేసిన సమస్తవిఘ్నములు తొలఁగి సర్వసిద్ధులును గలిగి శుభములు చేకూరును. ఆనాఁటి వినాయకవ్రతము సర్వశ్రేష్ఠము.

శ్లో॥ (శివా, శాంతా, సుఖా రాజం శ్చతుర్థీ త్రివిధా స్మృతా)
మాసి భాద్రపదే శుక్లా శివా లోకేషు పూజితా
తస్యాం స్నానం తథా దాన ముపవాసో జప స్తథా
క్రియమాణం శతగుణం ప్రసాదా ద్దంతినో నృప।
గుడ లవణ ఘృతానాం తు దానం శుభకరం స్మృతమ్
గుడాపూపై స్తథా వీర। పుణ్యం బ్రాహ్మణభోజనమ్॥

(భవిష్యపురాణము)

భాద్రపదశుక్లచతుర్థికి శివాచతుర్థి యని ప్రసిద్ధి. ఆనాఁడు స్నానముఁ జేసినను, దానము జేసినను, నుపవాసము జేసినను,

జప మొనరించినను నూఱురెట్లు ఫలము గలుగును. ఆ రోజున బెల్లము, లవణము, నెయ్యి దానముచేయుట శుభకరము. బెల్లపు టప్పములతో బ్రాహ్మణులకు భోజనము పెట్టుట పుణ్యప్రదము." అని తెల్పెను.

## గణేశకల్యాణము

ఉమాశంకరనందను లిర్వురును గ్రమముగాఁ బెరిఁగి వివాహోచితవయస్కు లయినారు. ఉభయులును వివాహము నొనరింపుఁ డని తల్లిదండ్రులను గోరిరి. తనకు ముం దని కుమారస్వామియుఁ దనకే ముందని గణపతియుఁ దొందర పెట్ట సాగిరి. అంతఁ బార్వతీశంకరులు "కుమారులారా! మీర లిరువురును మాకు సమానులే. ప్రేమపాత్రులే. మీరు తగవాడఁ దగదు. మీలో నెవ్వరు ముందు భూప్రదక్షిణ మొనరించి వత్తురో వానికి ముందు పెండ్లిఁజేయుదు" మనిరి. తత్క్షణమే బలశాలి యగు శిఖివాహనుఁడు భూప్రదక్షిణమునకు వెడలెను. ధీమంతుఁ డగు గణపతి భూప్రదక్షిణ మొనరింప నశక్తుఁ డగుటచే నాలోచించి యొకనిశ్చయమునకు వచ్చి స్నాన మొనరించి జగత్పూజ్యు లయిన మాతాపితరుల నాసనాసీనులఁ గావించి యథావిధిగాఁ బూజించి సప్తపర్యాయములు వారికిఁ బ్రదక్షిణ మొనర్చి స్తోత్ర మొనరించి "జననీజనకులారా! నా కుద్వాహ మొనరింపుఁ" డని యర్థించెను. అంత శూలి "వత్సా! భూప్రదక్షిణ మొనరించి రమ్మంటిమిగదా! స్కందుఁ డేఁగినాఁడు, నీవును బోయిరా"

మ్మనెను. అంత గణనాధుఁడు "తల్లిదండ్రులారా! మీరు ధర్మ స్వరూపులరు. మీకుఁ దెలియని ధర్మములు లేవు. నేను సప్త వారములు భూప్రదక్షిణ మొనరించియుండఁగా మఱలఁ జేయు మందు రేల?" యనెను. మహాలీలాకరుఁ డైన శంకరుఁడు "వత్సా! మహత్తరమై సప్తద్వీపములతో నిండి సముద్రవేలా వలయిత మగు పృథివి నంతయు నెపుడు తిరిగివచ్చితి" వనెను. అంత గిరిజాకుమారుఁ డనుచున్నాఁడు.

శ్లో॥ భవతోః పూజనం కృత్వా శివాశంకరయో రహమ్
స్వబుద్ధ్యా హి సముద్రాన్త పృథ్వీ కృతపరిక్రమః॥
ఇత్యేవం వచనం వేదే శాస్త్రేవా ధర్మసంచయే
వర్తతే కిం చ తత్తథ్యం నహి కిం తథ్యమేవ వా॥
పిత్రోశ్చ పూజనం కృత్వా ప్రక్రాంతిం చ కరోతి యః
తస్యవై పృథివీజన్యం ఫలం భవతి నిశ్చితమ్
అపహాయ గృహే యో వై పితరౌ తీర్థ మావ్రజేత్
తస్య పాపం తథా ప్రోక్తం హననే చ తయో ర్యథా॥
పుత్రస్య చ మహత్తీర్థం పిత్రో శ్చరణపంకజం
అన్య తీర్థం తు దూరే వై గత్వా సంప్రాప్యతే పునః
ఇదం సంనిహితం తీర్థం సులభం ధర్మసాధనమ్॥
(శివపురాణము)

"గిరిజామహేశ్వరు లగు మీ పూజలు నేమ జేసితిని, కావున సముద్రాంతముఁ గల భూప్రదక్షిణము చేయఁబడి నటులే యని వేదమందును శాస్త్రమునందును ధర్మశాస్త్రము లందును జెప్పఁబడినది. అదిసత్యమా? అసత్యమా? తల్లి

దండ్రులఁ బూజించి యెవఁడు ప్రదక్షిణము జేయునో వానికి నిశ్చయముగ భూప్రదక్షిణఫలము లభించును. ఇంటియొద్ద తల్లిదండ్రులను విడిచి యెవఁడు తీర్థయాత్రలకు వెడలునో వానికిఁ దల్లిదండ్రులను జంపిన పాపము సంక్రమించును. తల్లిదండ్రుల పాదపద్మములే కుమారున కుత్తమతీర్థము. దూరముగ వెడలినఁ గాని యన్యతీర్థములు లభింపవు. ధర్మసాధనమై సులభమై సన్నిహిత మయిన గొప్పతీర్థము కుమారునకుఁ బితృచరణమే ! అని శాస్త్రములు వేదములు ఘోషింపుచున్నవి.

అందుచే నేను మీకు సప్తప్రదక్షిణము లొనరించినవాఁడ నగుట నేడు మాఱులు భూప్రదక్షిణ మొనర్చిన ఫలము నాకు సంప్రాప్త మైనది. ఇది యసత్య మగుచో వేదశాస్త్రములకుఁ బ్రమాణయోగ్యత లేదు. వేదశాస్త్రములు సత్యబద్ధము లైనచో ధర్మస్వరూపు లగు మీరునాకు శీఘ్రముగ వివాహ మొనరింపుఁడు."

ఉమామహేశులకు ధర్మబద్ధములు యథార్థములు యుక్తియుక్తములు నగు కుమారుని మాటలవలన నాశ్చర్యము గలిగినది. ధర్మబద్ధ మని యంగీకరించి గణపతికి వివాహ మొనరింప నిశ్చయించిరి. విశ్వరూపుఁ డను ప్రజాపతికి సిద్ధి, బుద్ధి యను నిర్వురూపవతు లగుపుత్రికలు కలరు. వారిని గైకొనుఁడని విశ్వరూపుఁడు కోరఁగా గౌరీశంకరు లంగీకరించి మహావైభవముగా నా కన్యలను గణపతి కిచ్చి వివాహము లొనరించిరి. దేవతలు మహానందముగా మహోత్సవముఁ గావించిరి.

గణేశుఁడు సిద్ధి బుద్ధులతో నానందించుచు సిద్ధియందు క్షేముఁడను పుత్రుని, బుద్ధియందు లాభుఁడను కుమారునిఁగాంచి తలిదండ్రుల యడుగుజాడలలో మెలఁగుచు సుఖముగ నుండెను.

శ్లో॥ సురాసుర శిరోరత్న మరీచి ఖచి తాంఘ్రయే
విఘ్నాంధకారసూర్యాయ విఘ్నేశాయ నమో నమః॥



# మ హే శ్వ రా వ తా ర ము లు

## దూ ర్వా సా వ తా ర ము

బ్రహ్మమానసపుత్రుఁ డగు నత్రిమహర్షి పురుషసంతతికై పరమేశ్వరుని గూర్చి శతవత్సరములు తప మొనరించెను. ఆ యుగ్రతపము వలన నొక తేజము బయలువెడలి త్రిదివేశులకుఁ దాప మొదవించినది. ఆ తాపమును భరింపఁజాలక వా రందఱు బ్రహ్మలోకమున కరిగి విధాతను బ్రార్థించిరి. విధాతయు నూహింపఁజాలక బృందారకులతోఁ గలిసి నారాయణునిచెంత కరుగఁగా నాతఁడును వా రందఱితోఁ గైలాసమునకుఁ బోయి కృత్తివాసునిఁ బ్రార్థింపఁగా నాతఁడు "బృందారకులారా ! యిది యత్రి తపోగ్నిజనితమగు వేఁడిమి. మన మందఱ మాయనను దర్శింతము రం" డని వారందఱు నా యత్రిసన్నిధికి వెడలిరి. త్రిమూర్తులును "నీ కేమి వరము కావలె" నని యడుగఁగా నత్రి యోగ్యుఁడైన పుత్రునిఁ గోరెను. త్రిమూర్తులును బ్రసన్నులై తమ యంశలచేఁ బుత్రత్రయము గల్గు నని వర మిచ్చి వెడలిపోయిరి. ఆ వరప్రభావమున నత్రికి బ్రహ్మాంశచేఁ జంద్రుఁడును, విష్ణ్వంశచే దత్తాత్రేయుఁడును శివాంశచే దూర్వాసుఁడును జనియించిరి. దూర్వాసుఁడు బ్రహ్మ్యతేజమున ననేకులను బరీక్షించెను.

సూర్యవంశజుఁడగు నంబరీషుఁ డేకాదశీవ్రతము నత్యంత దీక్షతో నాచరించువాఁడు. ఏకాదశినాఁ డుపవసించి ద్వాదశిపారణ కుద్యుక్తుఁ డగుచుండఁగా దూర్వాసమహర్షి యాతని భక్తినిఁ బరీక్షింప నెంచి శిష్యపరివృతుఁడై యరుదెంచెను. రాజా మహర్షి కతిథిపూజఁ గావించి సశిష్యముగా ద్వాదశిపారణకు రం డని కోరెను. ద్వాదశి తిథి యింకఁ గొంఁది కాలమే యున్నది. మహర్షి శిష్యులతో స్నానమున కరిగి యెంతకును వచ్చుట లేదు. ద్వాదశి తిథి యుండఁగ భుజింపనిచో వ్రతఫలము శూన్యమగును. అతిథి రాకుండఁగ భుజించుట ధర్మదూరము. అందుచే నాతఁడు మిక్కిలి యోజించి వ్రతఫల పరిరక్షణమునకై కొంఁది జలమును ద్రావెను. మహర్షి యది తెలిసి రాజు కడకు వచ్చి క్రుద్ధుఁడై "మూఢుఁడా! శిష్యసమేతముగ మమ్ము భోజన మున కాహ్వానించి మేము వచ్చువఱ కుండక జలపానముఁ గావింతువా? ధర్మహీనుఁడ వైన నిన్ను భస్మమొనరింతు" నని యుగ్రుఁడై పలుక నంబరీషుఁడు గజగజలాడుచు విధేయుఁడై నిలు వఁబడెను. మనమున నారాయణస్మరణము తక్క నన్యచింత లే దాతనికి. ఇంతలో జగముల వెలిఁగించు కాంతిపుంజమువలె సుదర్శనచక్రము మహావేగమున రాఁగా నాకాశవాణి యిట్లనెను. "అంబరీషా! యీ సుదర్శనచక్రము తొల్లి శంకరునిచే నారాయ ణున కొసఁగఁ బడినది. ఈ దూర్వాసుఁ డీశ్వరాంశజుఁడు. నీ పరీక్షకై వచ్చినాఁడు. ఈ చక్ర మీతనిని సంహరించెనా విలయ మగును. అట్టి దుస్థితి రాకుండఁగ నీ సుదర్శనమును వేఁడికొని

శాంతింపఁజేయుము." ఆకాశవాణిని విన్న రాజు చక్రమున కంజలించి

శ్లో॥ యద్యస్తి దత్త మిష్టం చ స్వధర్మోవా స్వనుష్ఠితః
కులం నో విప్ర దైవం చే ద్ధరే రస్త్రం ప్రశామ్యతు
యది నో భగవా న్ప్రీతో మద్భక్తో భక్తవత్సలః
సుదర్శన మిదం చాస్త్రం ప్రశామ్యతు విశేషతః॥

(శివపురాణము)

చక్కఁగా ననుష్ఠింపఁబడిన స్వధర్మమును, నిష్టముతో నొసంగఁ బడిన దానమును గలిగి మా వంశము బ్రాహ్మణుని దైవముగా భావించున దైనచో నీ సుదర్శనము శాంతించుఁగాక; భక్తవత్సలుఁ డైన భగవంతుఁడు నాయందుఁ బ్రీతుఁ డగుచో నీ సుదర్శనము శాంతించుఁగాక;

అని ప్రార్థింపఁగా నది శాంతించి మఱలిపోయినది. మహర్షికి నమస్కరించి స్తుతింపఁగా నతఁడు సంతోషించి "యంబరీషనృపాలా! నీ వ్రతనిష్ఠకు, భక్తికి నానంద మైనది, వర మొసంగుదును గోరు" మనఁగా నంబరీషుఁడు "మహర్షీ! మీరు శిష్యులతో నా యింట భుజింపవలయు" నని కోరఁగా దూర్వాసుఁ డంగీకరించి శిష్యులతో నారగించి వెడలిపోయెను.

ఒకప్పుడు దూర్వాసమహర్షి గంగానదిలో స్నానము చేయుచుండఁగా నాతని కౌపీనము ప్రవాహమునఁ గొట్టుకొని

పోయినది. అందుచే సిగ్గిలి మహర్షి యొద్దునకు రాఁజాలకుండెను. కొలఁది దూరములో స్నాన మొనరించుచున్న ద్రౌపది యిది గుర్తించి తన పైటచెఱఁగుఁ జీరి మహర్షి చెంతను బడవేయఁగా నాతఁడు దానిని ధరించి బయటికి వచ్చి ద్రౌపదీసహాయమునకు సంతసించి యామె కక్షయవస్త్రప్రాప్తి యగునట్లు వర మొసంగెను. కౌరవసభలో వస్త్రాపహరణ మైనపుడు ద్రౌపది కీ వర ప్రభావముననే యక్షయవస్త్రములు శ్రీకృష్ణునివలన లభించినవి.

ఇట్లు దూర్వాసుఁ డనేకులకు వరము లిచ్చిధర్మబోధనలఁ జేసి జ్ఞానోపదేశ మొనరించి తరింపఁజేసెను.

## హ ను మ ద వ తా ర ము

శ్రీహరి మోహినీరూపము ధరింపఁగాఁ జూచిన శంకరుఁడు కామాసక్తుఁడై తనవీర్యమును స్ఖలనముఁ గావించుకొనెను. అది భావిలో శ్రీరామకార్యార్థమై యుపకరింపవలసి యున్నది. శివాజ్ఞచే దానిని మహర్షులొక పత్రమం దుంచి కొనిపోయి గౌతమ పుత్రిక యగు నంజనీదేవి కర్ణమునం దుంచిరి. అయ్యమోఘ వీర్య మామెలోఁ బ్రవేశించి గర్భవతి కాఁగాఁ గపిరూపమున హనుమంతుఁడు జన్మించెను. అందుచేతనే యాంజనేయుఁ డీశ్వరావతారుఁ డయ్యెను.

ఆంజనేయుఁడు జన్మప్రభృతి యతుల పరాక్రమశాలి. బాల్యమున దివాకరునిఁ గాంచి పండని భ్రాంతిపడి తినుటకై రవి మండలమున కెగురఁగా, భాస్కరహీన మైనచో నంధకారబంధు రమై లోకము వ్యాకుల మగు నని సురలు వలదని ప్రార్థింపఁగా నాహనుమంతుఁ డా యత్నము విరమించుకొనెను. తమ మాటను గౌరవించినందుల కానందించి యమరు లాతని కనేక వరము లిచ్చినారు. హనుమ యింటికి వచ్చి వృత్తాంత మంతయుఁ దల్లికి నివేదించెను. సూర్యశిష్యుఁడై సకలవిద్య లభ్యసించి యాతని యానతిని సూర్యపుత్రుఁడైన సుగ్రీవునకు మంత్రిగా సహాయుఁ డుగా ఋశ్యమూకాద్రిపై నుండసాగెను.

సీతాన్వేషణపరులైన రామలక్ష్మణులు ఋశ్యమూకాద్రికి రాఁగా నాంజనేయుఁడు వారికి సుగ్రీవునితో సఖ్య మొనరించెను. సీత రావణాపహృతయై లంకలో నున్న దని తెలిసి హనుమం తుఁడు సుగ్రీవాజ్ఞపై మహోదధి నవలీలగా లంఘించి లంకలో సీతను దర్శించి యామెకు రామవార్త నెఱిఁగించి యామె శోకమును జల్లార్చి దనుజుల ననేకులఁ గూల్చి లంకఁ గాల్చి సీతా దత్త చూడామణిని దెచ్చి రామున కిచ్చి యానందపఱచినాఁడు. సేతుబంధ మొనరించి రాముఁడు సైన్యయుక్తుఁడై దశకంఠునితో రణ మొనరించెను. శక్తిబాణ ప్రయోగముచే మూర్ఛిల్లిన లక్ష్మణుని సంజీవి పర్వతముఁ దెచ్చి సజీవునిఁ గావించినాఁడు మారుతి. అమిత బలవంతుఁడైన యాతఁ డన్నిరీతుల రాము నకు సౌఖ్యమును సమకూర్చువాఁడు. రామరావణయుద్ధములో నహిరావణుఁడు మాయచేసి రామలక్ష్మణులను బాతాళమునకుఁ

గొనిపోఁగా వాయునందనుఁ డాతనిని జంపి రామలక్ష్మణులఁ దెచ్చెను. లెక్కలేని రక్కసుల నుక్కడఁగించెను. నిరపేక్షముగా రామసేవఁ గావించిన మహాభక్తుఁడు, భక్తసంరక్షకుఁడు నైన హనుమంతుఁ డీశ్వరావతారుఁడే।

సీ. సురలు బెగ్గిల ద్రోణగిరిని వాలంబుచే
నుద్ధూఁత లూఁపిన యుగ్రమూర్తి
యక్షుం డనెడి రాక్షసాగ్రణి నవలీలఁ
జదిమివైచిన మహాశౌర్యరాశి
సత్రికూటంబైన రాత్రించర పురంబు
దగ్ధంబు చేసిన ధైర్యశాలి
శతయోజనంబుల సాగరంబును నొక్క
పెట్టున లంఘించినట్టి జెట్టి
గీ. యుద్ధమున రుద్రగణముల నోటుపఱచి
శివునిచే మెప్పు నొందిన చేవకాఁడు
రామభక్తుఁడు దుష్టమర్దన చణుండు
శ్వసనతనయుండు... ...........

(ఆంధ్రపద్మపురాణము)

శ్లో॥ హనుమా నంజనాసూనుః వాయుపుత్రో మహాబలః
రామేష్టః ఫల్గునసఖః పింగాక్షో ఽమితవిక్రమః
ఉదధిక్రమణ శ్చైవ సీతాశోకవినాశనః
లక్ష్మణప్రాణదాతా చ దశగ్రీవస్య దర్పహా
ద్వాద శైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః
స్వాపకాలే పఠే న్నిత్యం యాత్రాకాలే విశేషతః
తస్య మృత్యుభయం నాస్తి సర్వత్ర విజయీ భవేత్॥

## వృ ష భా వ తా ర ము

అమృతార్థులై దేవదానవులు పాలకడలిని మథింప నెంచి కార్యాచరణ మె ట్లని యోజించికొనుచు భీతిల్లుచుండఁగా నాకాశ వాణి యిట్లనియెను. "మీరు విచారింప నక్కఱలేదు. మందర మును గవ్వ మొనరించి వాసుకిని రజ్జువుఁ జేసి మీర లిరు పార్శ్వ ములనుండి మథింపుఁ" డనెను. అంత వారు మందరముదరికి నరిగి దానినర్థించిపెల్లగించిమోయలేక మహేశ్వరునిఁబ్రార్థించి యాతని దయవలనఁ దెచ్చి వాసుకిని గోరి త్రాడును జేసి క్షీరసాగర మథనముఁ గావించినారు. ఆసాగరమునుండి లక్ష్మి, ధన్వంతరి, చంద్రుఁడు జనించిరి. పారిజాతము, ఖడ్గము, శంఖము, సుర, యైరావతము. కౌస్తుభమణి, యుచ్చైశ్శ్రవము, కామధేనువు. కాలకూటము, అమృతము నుద్భవించినవి. అమృతబిందువులు చింది యా సాగరమునుండి యప్సరోవనితలు కోట్లకొలఁది బయలువెడలి పరమలావణ్యవతులై జగన్మోహినులయినారు. వారు జరామరణరహితలు.

అంత లక్ష్మిని, శంఖమును, గౌస్తుభమును, ఖడ్గమును శ్రీహరి స్వీకరించెను, ఉచ్చైశ్శ్రవమును సూర్యుఁడు, నైరావత పారిజాత కల్పనగముల వాసవుఁడును గ్రహించిరి. మహేశ్వ రుఁడు హాలాహలమును బాన మొనరించి గరళకంఠుఁడై చంద్రునిఁ దలఁ దాల్చి చంద్రశేఖరుఁ డయ్యెను, దైత్యులు శివ మాయా మోహితులై సురాపాన మొనరించిరి. దేవత లందఱును

ధన్వంతరిని వైద్యునిగా గ్రహించిరి. మహర్షులు కామధేనువును దీసికొనిరి. అమృతమునకై సురాసురులు పోరాడుచుండఁగా నారాయణుఁడు మోహినియై యమృతమును బంచిపెట్టెను. అందు లేశమును ముట్టని యసురులు దేవతలచేఁ బరాజితులై పాతాళమునకుఁ బాఱిపోయిరి. వారితో నప్సరఃకాంతలఁ గొనిపోయి దివ్యభవనములలో దాఁచినారు, మాధవుఁ డా దనుజులఁ దఱుముకొనుచుఁ బాతాళమునకు వచ్చి యా యచ్చరల మోహంపు టుచ్చులలోఁ జిక్కుకొనిపోయినాఁడు. వారితోఁ గామక్రీడలలో విహరింపుచు నుండిపోఁగా నాతనివలన వారి కనేక పుత్రు లుదయించిరి. వారే హరిపుత్రులు. వారు భూలోక స్వర్గలోకములలో స్వేచ్ఛావిహార మొనరింపుచు సకలదేవతలను మహర్షులను బీడింపుచుండ వా రేఁగి బ్రహ్మతో మొఱపెట్టుకొనఁగా బ్రహ్మ వారిని వెంటఁ బెట్టుకొని విరూపాక్షుని కడకు వెడలి, మాధవుఁడు నాగలోకమునఁ గాంతాలోలుఁడై యుండుటయు హరిపుత్రుల యనివార్య దుష్కృత్యములును వివరించి రక్షింపఁ బ్రార్థించెను.

వామదేవుఁడు వారి నాదరించి వృషభరూపుఁడై భీకరుఁడై పాతాళమును జేరి ఱంకెలు వేయఁగా నా ధ్వనికి నాగవాసులు భయకంపితు లైరి. హరిపుత్రులును భీతిల్లియు ధనుర్ధరులై యరుదెంచి యా వృషభముతోఁ బోరాడసాఁగిరి, వృషభుఁడు క్రుద్ధుఁడై ఖురశృంగములచే వారినెల్లఁ ద్రొక్కి చీల్చి సంహరించెను. గోవిందుఁ డిది కాంచి కోపించి యా మహోక్షముపై శస్త్రాస్త్రములఁ బ్రయోగింపుచుండఁగా నా వృషభుఁ డొక గిరి

శిఖరము నెక్కి యా యస్త్రశస్త్రముల నుపసంహరించి వేగముగ వచ్చి శ్రీహరిని డీకొని గిట్టలచేఁ గొమ్ములచేఁ జీల్చివేయ మొదలిడెను. ఆదెబ్బలకుఁ దట్టుకొనలేక మాధవుఁడు గర్వము వీడి యిది సామాన్యవృషభము కా దని సాక్షన్మహేశ్వరుఁ డని యెఱింగి నమస్కరించి స్తుతించి తన యపరాధమును క్షమింపు మని వేఁడికొనెను. భక్తవత్సలుఁ డగు పశుపతి "నాయనా, నన్నుఁ దెలిసికొనలేకపోతివి. నీ జ్ఞాన మంతయు నేమైనది? నాతో యుద్ధ మొనరింతువా? నీ పరాక్రమ మెంతటిదో తెలిసికొంటివా? కామార్తుఁడవై స్త్రీలోలుఁడవై యుండిన నీకు జ్ఞాన మెట్లు కలుగును? నీ విందుండఁదగదు. లోకరక్షకుఁడవైన నీవే యిట్లు వర్తించిన లోక మెంత వంతఁ జెందునో యూహించితివా?" యనఁగా వాసుదేవుఁడు సిగ్గుపడి "మహాదేవా! నీ యాజ్ఞానుసారముగా నిటనుండి వైకుంఠమునకు వెడలుదు" నని చెప్పి వెడలిపోయెను, వృషభేశ్వరుఁడు కైలాసమునకుఁ బోయెను. దామోదరుఁడు దేవతలను పాతాళమునకు వెడలి సౌందర్యవతు లగు నా వనితలతో భోగింపుఁ డనఁగా వారు వెడలఁబోయిరి. ఈశానుఁ డది యెఱింగి "పాతాళమునకునా యంశజులును, నారాయణుఁడును దానవులును దప్ప నన్యులు వెడలినచో నిధనము నందుదు" రని శపించెను. అందుచే నాదిత్యులు పాతాళమున కేఁగుట విరమించుకొనిరి.

---

## పిప్పలాదావతారము

పూర్వము వృత్రాసు రా ద్యసురులచే నోడిన దేవతలు భయపడి తమ యాయుధములు దధీచిమహర్షి చెంతఁ బడవైచి పలాయితు లైరి. బ్రహ్మకడ కేఁగి చెప్పుకోఁగా "మిమ్ము జయించుటకే త్వష్టృప్రజాపతి యా వృత్త్రాసురుని, బుట్టించెను. ఆతఁ డమిత పరాక్రముఁడు. ఆతనిని జయించుట కొక యుపాయముఁ జెప్పుదును, దధీచిమహర్షి మహా తపశ్శాలి. శివార్చన మత్యధికముగఁ గావించి యాతనివలనఁ దన యెమ్ములు వజ్రములవలె నుండునట్లు వరము నొందెను. ఆతఁడు మహాదాత. మీరంద ఱాతనిని యాచించి వాని యెముకల నాయుధములుగాఁ జేసి వృత్రసంహారము, గావింపుఁ" డనినాఁడు స్రష్ట. వెంటనే యింద్రాదు లా దధీచి యాశ్రమమున కేఁగిరి. సతీయుతుఁడైన యా మౌనికి సమస్కరించిరి. దేవతలు వచ్చుటచే సతిని లోని కేఁగు మని ఋషి యానతీయఁగా నామె లోని కేఁగినది.

స్వర్గనాథుఁడు స్వార్థపరుఁడై "మహర్షీ! నీవు మహాదాతవు. మహేశ్వర భక్తుఁడవు. పరోపకార శీలుఁడవు. మేము వృత్రుని భయముచే నిన్ను శరణుఁ గోరితిమి. నీ యెమ్ములు వజ్ర తుల్యము లని తెలిసికొంటిమి. అందుచే నీ యస్థులను మా కను గ్రహించితివేని వాని నాయుధములుగఁ జేసి వృత్రుని జయింతుము, కా దనక యీ దేవహితము నొనరింపు" మని వేఁడఁగా నాతఁడు

మా తాడక "నాయనా, యటులే యిచ్చెద" నని చెప్పి పరమే శ్వర ధ్యానముఁ జేయుచు నసువులఁ బాసెను. అతని దాతృత్వ మును ద్యాగశీలతను మెచ్చి సుపర్వులు సుమవర్షముఁ గురిసిరి. ఇంద్రుఁడు కామధేనువును రప్పించి దానిచే దధీచి కళేబరము మీఁది రక్తమాంసముల నాకించి మిగిలిన యెముకలను విశ్వ కర్మచే శస్త్రములుగాఁ జేయించి వెన్నెముకను వజ్రాయుధముగా నొసరింపఁజేసినాఁడు. దానిచే సునాసీరుఁడు వృత్రుని శిరము ఖండించి దేవతల కానందముఁ గలిగించెను. అమరు లానంద ముతో నుత్సవ మొనరించుకొనుచుండిరి.

దధీచిమహర్షి భార్య సువర్చ వెలుపలికి వచ్చి విషయము నెఱింగి నేను దగ్గఱ లేని సమయమున స్వార్థపరులై లోభులై క్రూరులై నా పతిని బరిమార్చితిరి. పశువులవలెఁ బ్రవర్తించినారు గాన మీరు పశువు లగుదు రని దేవతలను శపించి భర్తతో సహ గమనముఁ నాచరింప జితిని బేర్చి యందు దూఁకఁబోవునంతలో నాకాశవాణి "నీవు గర్భవతివి. సాహసింపకుము. మహాపాపము సంభవించును. నేను నీ శ్రేయమును గోరి చెప్పుచున్నా" నని పలికెను? ఆమె యా మాటలు విని నా భర్తతో సహగమించుట కీగర్భ మడ్డువచ్చిన దనెడి కోపముతో నొక ఱాతితో మోఁదు కొనఁగ నా గర్భమునుండి యొక శిశువు జనియించి దేదీప్య మానుఁడై వెలుఁగొందుచు నపరశివునివలె నున్నాఁడు. సాక్షా త్తు రుద్రుఁడే జన్మించె నని సంతసించి యొక్కసారి కౌఁగిలించుకొని ముద్దాడి చిరంజీవివై వర్ధిల్లు మని దీవించి యా బిడ్డ నొక

యశ్వత్థవృక్ష మూలమున విడిచి తానగ్నిలో దూఁకి భర్తను జేరినది. శివలోకమున నిర్వురును మహేశ్వరారాధనముఁ జేసి కొనుచుండిరి.

దధీచినందనుఁడు శివావతారుఁడు నగు నా కుమారుని దర్శించుట కచ్యుతాద్యమరు లరుదెంచి నమస్కరించి స్తుతించి యాతనికిఁ బిప్పలాదుఁ డని పేరు పెట్టి జాతకర్మాదిక మొనరించి సుమవృష్టి గురిపించిరి. ఆ బాలుఁ డా యశ్వత్థఫలములే యాహారించుచుఁ బెరిఁగి పెద్దయై తపోదీక్షితుఁ డయ్యెను. అనరణ్య రాజకుమారి యగు పద్మను వివాహమాడెను. ఆమె, లక్ష్మి శ్రీహరికి వలెఁ బతి కన్నివిధముల నుచితరీతిని సేవఁజేయుచు భర్తృ సౌఖ్యమును బొందుచుండెను. వార లన్యోన్యానురాగమునఁ గాఁపురింపఁ బదిమంది కుమారు లుదయించిరి. పిప్పలాదుఁ డనేక లీలలఁ గావించుచు భక్తుల కనేక వరము లొసంగెను.

శనిపీడ లోకమున నధికముగ నుండుటచేఁ బిప్పలాదుఁడు ప్రజాక్షేమమునకై పదునాఱు వర్షముల లోపలి వయసువారిని శివ భక్తులను శని పీడింపకుండునటుల వరము లనుగ్రహించెను. అందువలన శివభక్తులను శని పీడింపఁడు.

శ్లో॥ గాధి శ్చ కౌశిక శ్చైవ పిప్పలాదో మహామునిః
శనై శ్చర కృతాం పీడాం నాశయంతి స్మృతా స్త్రయః॥

గాధి,కౌశికుఁడు, పిప్పలాదుఁడు నను ముప్వురను స్మరించిన వారికి శనిపీడ యుండదు.

## కా ల భై ర వా వ తా ర ము

మేరుగిరి శిఖరమున హిరణ్యగర్భుఁ డాసీనుఁడై యుండగా నమరులును మహర్షులు నక్కడకువచ్చి సభక్తికవందనములాచరించి సంస్తుతించిరి. వారు కమలాసనునిఁ బరాత్పరతత్త్వము నుపదేశింపు మని కోరిరి.

కమలగర్భుఁడు శివమాయామోహితుఁడై యాత్మతత్త్వ మెఱుఁగక "సురలారా ! సృష్టికర్తను జగత్పోషకుఁడను జగత్కారణుఁడను, ననాదిని, ఆత్మస్వరూపుఁడను స్వయంభవుఁడను, సర్వేశ్వరుఁడను లయకర్తను నేనే" యని నుడివెను. అంతఁ బీతాంబరుఁడు పితామహుని మాటలు విని యీశ్వరమాయలోఁ బడి కోపావిష్టుఁడై "బ్రహ్మ ! నీ వింత మూర్ఖుఁడ వనుకొనలేదు. జగత్కర్తవును, లోకపాలకుఁడవును, నాత్మస్వరూపుఁడవును నీవా ? అట్లు భావింతు వేమి ? పరాత్పరుఁడను యజ్ఞస్వరూపుఁడను నచ్యుతుఁడను నేను. నా యాజ్ఞానుసారమే సృష్టి స్థితి లయములు జరుగుచున్నవి. నా శాసనముననే నీ వీ సృష్టిఁ గావించుచున్నావు. నీ వస్వతంత్రుఁడవుగాన నా యాజ్ఞానుసారమే వర్తింపవలె." ననెను.

ఇట్లు బ్రహ్మయు వాసుదేవుఁడును జగడ మాడుకొనుచుండఁగా నచటికి వేదములు రాఁగా వా రిర్వురును వేదమూర్తుల నిట్లు గోరిరి. "చతుర్వేద స్వరూపులారా ! మీరే సకలమునకును బ్రమాణీభూతులరుగదా ! యథార్థతత్త్వ మేదియో వివరింపుఁ" డనిరి.

అంత వేదవేద్యుఁ డగు విశ్వేశ్వరుని సంస్మరించి తొలుత ఋగ్వేదము పలుకుచున్నది :-

శ్లో॥ య ద న్తః స్థాని భూతాని యతః సర్వం ప్రవ ర్తతే
య దాహుః పరమం త త్త్వం స రుద్ర స్త్వేక ఏవ హి॥
(శివపురాణము)

ఎవ్వనియందు సమస్తభూతములు గలవో, యెవ్వనివలన సకలమును బుట్టుచున్నవో యెవ్వఁడు పరతత్త్వస్వరూపమో ఆతఁడు రుద్రుఁడే ।

యజుర్వేదము వచించుచున్నది :-

శ్లో॥ యో యజ్ఞై రఖిలై రీశో యోగేన చ సమిజ్యతే
యేన ప్రమాణం ఖలు నః స ఏకః సర్వదృక్ శివః॥
(శివపురాణము)

యజ్ఞములకుఁ బ్రభువైనవాఁడు యోగులచేఁ బూజింపఁబడు వాఁడు, సర్వసాక్షియై సమస్తమునువీక్షించువాఁడు శివుఁడే ।

సామవేద మిటు లనుచున్నది :-

శ్లో॥ యే నేదం భ్రమ్యతే విశ్వం యోగిభి ర్యో విచి న్త్యతే
యద్భాసా భాసతే విశ్వం స ఏక స్త్ర్యంబకః పరః॥
(శివపురాణము)

ఎవ్వనిచే జగము సంచరించుచున్నదో, యెవ్వఁడు యోగులచేఁ జింతింపఁబడుచున్నాఁడో, యెవ్వని తేజస్సుతో లోకము ప్రకాశించుచున్నదో యా త్ర్యంబకుఁడే పరాత్పరుఁడు.

అథర్వణవేదము నుడువుచున్నది :—

శ్లో॥ యం ప్రపశ్యన్తి దేవేశం భక్త్యనుగ్రాహిణో జనాః
తమాహు రేకం కైవల్యం శంకరం దుఃఖతః పరమ్॥
(శివపురాణము)

భక్తివలన ననుగ్రహింపఁబడు జను లెవ్వనిని దేవేశునిగాఁ జూచుచున్నారో యెవ్వఁడు కైవల్యస్వరూపుఁడో యెవ్వఁడు దుఃఖములను దూర మొనరించునో యాతఁడే శంకరుఁడు. వేదనిర్ణయమును విని కమలనాథ కమలగర్భులు చిఱునవ్వు నవ్వి "మీ రింత మందబుద్ధు లనుకొనలేదు. మీ తెలివి యే మైనది? మమ్ముఁ గాదని యా దిగంబరుని గొప్పవానిని జేయుచున్నారు. విరూపాక్షుఁడు, విషభక్షకుఁడు, శ్మశానవాసుఁడు, జటిలుఁడు, నాగభూషణుఁడు, కృత్తివాసుఁడు, విభూతిరాయఁడు, వాఁడా పరమాత్ముఁ" డని హేళనము గావించిరి. అంతలోఁ బ్రణవము రూపు దాల్చి వచ్చి యి ట్లుద్బోధించినది.

శ్లో॥ న హీశో భగవాన్ శక్త్యా హ్యాత్మనో వ్యతిరిక్తయా
కదాచి ద్రమతే రుద్రో లీలారూపధరో హరః
అసౌ హి పరమేశానః స్వయం జ్యోతిః సనాతనః
ఆనందరూపా తస్యైషా శక్తి ర్నాగంతుకీ శివా॥
(శివపురాణము)

శివునికంటె భిన్న మగు శక్తి లేదు. లీలారూపధరుఁ డగు హరుఁ డొకప్పుడు శక్తితోఁ గ్రీడించుచుండును. సనాతనుఁ డైన పరమేశ్వరుఁడే స్వయంజ్యోతి. ఆనందరూప మగు నాతని శక్తియే శివాదేవి గాని యాగంతుకి కాదు.

ప్రణవోద్బోధముపైఁ గూడ వారికి విశ్వాసము కుదుర లేదు. అంత వా రిర్వురి నడుమఁ గోటిసూర్యప్రకాశ భాసమాన జ్యోతి యావిర్భవించి యం దొక దివ్యపురుషుఁడు గన్పించి నాఁడు. బ్రహ్మ. విష్ణువు చూచిరి. ఆ పురుషునకు లలాటమున నేత్రము. చేతఁ ద్రిశూలము, శిరమున శశి, జటాజూటమున గంగ, నడుమున గజచర్మము, శరీరముపై నాగాభరణము లున్నవి. ఆ పురుషునిఁ జూచి " యో నీలలోహితా ! నీవు నా లలాటమునుండి జనించితివి. పుట్టిన వెంటనే రోదన మొనరించు టచే నీకు రుద్రుఁ డని పేరు పెట్టితిని గదా ! నీవు భయపడక నన్ను శరణుఁ గోరుము. రక్షింతు" నని బ్రహ్మ పంచమవద నముతో గర్వమునఁ బలికెను. అతని మాటల కుగ్రుఁడు మహో గ్రుఁడై మహాభైరవ రూపమును బుట్టించి "భైరవా ! కమలాస నుఁడు కన్ను మిన్నుఁ గాన కున్నాఁడు. వానికిఁ దగిన శిక్ష నొనరింపుము.

గీ. కాలుఁ దట్టుల రాజిలు కారణమున
కాలరా జను పే రొంది క్రాలఁగలవు
మఱియు విశ్వము భరియించు బిరుద వొట
భైరవుం డను పేరున భాసిలుదువు.

ఉ. కాలుని గుండెకున్ బెదురు గల్గఁజేయుటఁ గాలభైరవా
ఖ్యా లలితుండ వౌదువు జగమ్మున భక్తజనంబులోని పా
పాలను మ్రింగివేయుటనుబట్టి కడున్ గలుషాదనాఖ్యనున్
మేలుగ నొందఁగాఁగల వమేయ చరిత్ర ! పవిత్ర ! నీ వికన్.

గీ. ఇఁకను దుష్టాత్మకుల నెల్ల నెపుడు మర్ద
నంబు చేయుటచే భువనంబు లందు
గరిమ నామర్దనాఖ్య నొనరఁగఁ జెంది
ఖ్యాతిఁ గాంతువు లోకకళ్యాణమూర్తి!

(ఆంధ్రశివపురాణము)

నా రాజధానియుఁ బరమపవిత్రమైనదియు నగు కాశిపై నీ కాధిపత్య మొసంగితిని. నీ వట వసింపుము. మానవు లొన రించు సుకృత దుష్కృతములు చిత్రగుప్తుఁడు లిఖించుచుండును వానికిఁ దగిన శిక్షలు నీవు విధించుచుండు" మని యాజ్ఞాపించెను.

భైరవుఁడు తీవ్రక్రోధుఁడై శివాజ్ఞానుసారము విజృంభించి శివనిందఁ గావించిన కమలాసనుని పంచమశిరమును దన నఖ ముఖములఁ దుంచివైచెను. కమలాక్షుఁడు భయకంపితుఁడై కనులు ముడిచి శతరుద్రీయముచే మహేశ్వరుని స్తోత్ర మొన రించెను. వాణీనాధుఁడును భీతిల్లి రుద్రపారాయణ మారంభించెను.

విగతగర్వులై విష్ణు బ్రహ్మలు పరమేశ్వరుఁడే యాత్మ స్వరూపుఁ డనియు గుణాతీతుఁడనియుఁ బ్రకటించి నమస్కరించిరి.

శివుఁడు వారి యహంకార మంతరించెనని గ్రహించి యను గ్రహింపఁ దలంచి యోదార్చి భైరవునిఁ బిల్చి "వీరిని మిత్రులు గాఁ జూడుము. బ్రహ్మకంఠ లుంఠనము వలన నీకు బ్రహ్మ హత్య సంక్రమించినది. తద్దోషనివృత్తికై యీ కపాలము ధరించి భిక్షాటన మొనరింపుచుఁ దీర్థయాత్రల నాచరింపుము. నీ హస్తమందలి కపాలము నెవరు వీక్షింతురో వారి బ్రహ్మ

హత్యాది మహాఘము లడంగును గాన దీని నందఱకుఁ జూపుచుండు" మని యాన తిచ్చి యాతని బ్రహ్మహత్యాపాతకము నొక వనితను గావించి యాతనితోఁ బంపుచు "భైరవా! యిది నీ యాత్రలో నీ వెంటనే వచ్చుచుఁ గాశీక్షేత్రముఁ జేరుసరికి విముక్త మగు " నని సెలవిచ్చెను.

కాలభైరవుఁడు శివాజ్ఞను శిరసావహించి కపాలియై సకల లోక తీర్థాటనముఁ గావింపుచుండ బ్రహ్మహత్య వాని వెంటనే నడిచిపోయెను.

కాలభైరవుఁడు వైకుంఠమునకు వెడలెను.

క. వైకుంఠపురికిఁ జనుదున్
శ్రీకాంతుం డెదురువచ్చి చేరి చరణనా
ళీకములకు మ్రొక్కిడి సు
శ్లోకముల నుతించి రమను జూచి యిటు లనెన్.

మ. చెలువా? చూచితె! దేవదేవుని విభున్ శీతాంశురేఖాంకురో
జ్జ్వల పింగోరు జటాకలాప మకుటున్ శశ్వ జ్జగన్మండలీ
విలస త్సర్గ కలాభిరక్షణ లయాభి ప్రేతకేళీ పరున్
జ్వల దగ్ని ప్రతిమాననున్ ఘనకృపా శ్లాఘ్యైక చారిత్రునిన్.

చ. కలికిరో! ధన్యవైతి విటు కాలగళున్ గని యేను ధన్యుఁడన్
జలజవిలోచనా! యితఁడె సర్వ జగద్రచనాస్పదుండు కౌ
శలుఁడు విభుండు యోగి హరిచందన మాత్మ సమ స్తభూతకో
టులఁ కిటువంటి దైవము కడున్ గృపఁ జేకుతెఁ బున్నె మెంతయో.

గీ. ఎవని నామముఁ దల్చిన నెల్లవారి
కీ తనువ్యథ లన్నియు నిగిరిపోవు
నట్టి దేవర తను వొంది యిట్టుడాసె
రూప మెద్దియు లేకున్న రూపరి వలె.

గీ. నళినములఁ బోలె నిడుపైన నాదు కనులు
చెలియరో! యిందు విందుశకలశిరస్కు-
హరునిఁ గని పండు వొంది ధన్యంబు లయ్యె
నహహ! మనదైన భాగ్య మెంతనఁగ వచ్చు.

(ఆంధ్రశివపురాణము)

"భైరవా! నీవు సర్వజ్ఞుఁడవు, సృష్టి స్థితి లయ కారణుఁడవు. సకలాఘసంహారకుఁడవు. పరిపూర్ణుఁడవు. నీ లీలలు దురూహములు. నీచేత నీ కపాలము, నీ కీ భిక్షాటనము నేమి? నీ సేవఁ గావించువారికిఁ ద్రిలోకాధిపత్య మిచ్చువాఁడ వైన నీకు భైక్ష్య వృత్తియా తండ్రీ!" యనెను.

భైరవుఁడు దరహాసముతో "నారాయణా! బ్రహ్మశిరమును ఖండించుటచే బ్రహ్మహత్యాదోషము ప్రాప్తించినది. ఆ బ్రహ్మ కపాలముఁ జేతఁబూని కాపాలికవ్రత మాచరించుచున్నా" ననెను.

వాసుదేవుఁడు ముకుళిత కరకమలుఁడై "మహాదేవా! నేనింతకుముందు నీ మాయలోఁ బడి యుండి యిపుడు నీ యనుగ్రహమున నీ లీల లన్నియుఁ దెలిసికొంటిని. సంహారకాలమున నీచే బ్రహ్మాండము లన్నియు నశించును గాని నీ వొక్కఁడవే
నిలిచియుందువుగదా [illegible]

గిల్బిష మంటుటయా ! నీ కంఠమందుఁ బూలదండవలె నున్న యీ కపాలము లన్నియు ననేక కల్పములలో నీచేఁ దుంపఁబడిన కమలాసన శీర్షములే గదా ! నీ స్మరణఁ గావించువారికి నీ భక్తులకు ననేక జన్మములలోని బ్రహ్మహత్యాది దురితములు నశించి పోవుచున్నవే ! అట్టి నీకుఁ బాతక మేమి ప్రభూ !

గీ. కడఁగి పంచ మహాపాతకములఁ జేసి
యును విభూ ! నీదు నామంబులను దలంచి
నాశ మొనరించు నా పాపరాశి జనుఁడు
నీకు దోసంబు లెటఁ గమ్మ నీలకంఠ !

(ఆంధ్రశివపురాణము)

నీవు సర్వస్వతంత్రుఁడవు. ఈ బ్రహ్మహత్య నీకు లోఁబడియే యున్నది. అయినను లోకాదర్శమున కిట్లు కనఁబడుచున్నాఁడవు. నాశనరహితుఁడవు మంగళప్రదుఁడవు నగు నీ దర్శనభాగ్యమున నేనును లక్ష్మియు ధన్యులమైనాము" అని స్తుతించెను.

భైరవుఁడు "భవతి ! భిక్షాం దేహి!" యనఁగా లక్ష్మి యాతనికి భిక్షను బెట్టినది. భైరవుఁడు వెడలుచుండఁగా నాతనిని వెంటాడుచున్న బ్రహ్మహత్యాంగనను బిల్చి "నీ వా సర్వేశ్వరుని వెంటాడి యేల బాధింతువు ! విడిచిపో" మ్మని శ్రీహరి చెప్పఁగా నా బ్రహ్మహత్య యిట్లు విన్నవించినది. "జగన్నాధా ! నే నీ విధముగ శివారాధనముఁ గావించుకొనుట కవకాశము

లభించినది. ఆ మృత్యుంజయుని సేవించి తరింపవలె నని భావించి యాతని ననుసరింపుచున్నాను గాని యాతనిని బీడించు టకుఁ గా" దనుచుండఁగా నీ సంభాషణమును విన్న భైరవుఁడు "నారాయణా! నాయందు నీ కెంత యభిమానము! నాకొఱ కీ బ్రహ్మహత్యను బ్రార్థింపుచున్నావు. సత్పురుషుల హృదయము లట్టులే యుండును. నీవు నా భక్తులలో శ్రేష్ఠుఁడవు. వర మొసం గుదును గోరు" మనఁగా వాసుదేవుఁడు "మహేశ్వరా! నీవు నా చక్షువులకుఁ గన్పించితివి. దరిద్రున కప్రియత్నముగ నిధి లభించి నట్లు నీవు స్వయముగ నా యింటికి వచ్చి దర్శన మిచ్చితివి. ఇంతకన్నఁ గావలసిన దేమి? అయినను నీ పాదారవిందముల యందే నా మనము సర్వదా లగ్న మగునట్లు చేయు" మనఁగా భైరవుఁ డట్లే వర మిచ్చెను.

ఇట్లు భైరవుఁ డన్ని లోకముల సంచరించుచుఁ దుదకుఁ బరమపావని యగు గంగానదితో సర్వకిల్బిషహరమయి ఖ్యాతిని గొన్న యవిముక్తక్షేత్రమున కరిగెను. "అవి" యనఁగాఁ బాపము. దానిచే విడువఁబడినది గాన నవి ముక్తమయ్యెను.

శ్లో॥ అవి శబ్దేన పాపస్తు వేదోక్తః కథ్యతే ద్విజైః
తేన ముక్తం మయా జుష్ట మవిముక్త మతోచ్యతే॥
(లింగపురాణము)

అట్టికాశిని సమీపించినంతనే బ్రహ్మహత్య మొఱ్ఱో యని యఱచుచు భైరవుని విడిచి పాతాళమునకుఁ బరువెత్తెను.

తత్క్షణమే కరమునుండి కపాలము నేలఁబడెను. ఆ కపాలము క్రిందఁబడిన తావే కపాలవిమోచన క్షేత్రము. బృందారకులు భైరవునిపై సుమవృష్టి గురియించిరి. ఎన్ని తీర్థములు క్షేత్రములు సేవించినను వీడని బ్రహ్మశీర్ష మిచట వదలిపోయిన దను సంతోషముతో భైరవుఁడు నృత్య మొనరించెను.

మానవుని యెన్ని జన్మల కిల్బిషము లైనను బ్రహ్మహత్యాది మహాపాతకము లైనను నవిముక్త క్షేత్ర మందలి కపాలమోచన తీర్థమున స్నానమాడిన నశించును. కాలభైరవ దర్శన సేవనముల వలన సమస్తాఘములు పటాపంచ లగును. కాశికిఁ బోయి భైరవుని దర్శింపనిచో వాని కలుషములు శుక్లపక్ష చంద్రునివలె వృద్ధినందును. మార్గశీర్ష బహుళాష్టమీ దివసమున భైరవోద్భవ మయ్యెను గాన నా నాఁ డుపవసించి భైరవునిఁ బూజించి జాగరణముఁ జేసినఁ బాతకములు హరింపఁబడును.

కాలభైరవుఁడు కాశీక్షేత్రమునకు క్షేత్రపాలకుఁడుగా నుండిపోయినాఁడు.

## గృహప త్యవతారము

నర్మదా తీరమున ధర్మపురి యను గ్రామమున శాండిల్య గోత్రుఁడు వేదశాస్త్రివ్యయనుఁడు శివభక్తుఁడు షట్కర్మ నిరతుఁడు నియమ బద్ధుఁడు నగు విశ్వానరుఁ డను విప్రుఁడు గలఁడు.

ఆతని భార్య శుచిష్మతి. ఆమె గుణవతి, రూపవతి, పతివ్రత. ఆ దంపతులు నిత్యము నియమముగా నతిథి, దేవ, పితృ పూజ లొనరించుచున్నారు.

ఒకనాఁడు శుచిష్మతి పతితో "నేను గృహస్థాశ్రమములో స్త్రీ యనుభవింపవలసిన భోగము లన్నిటి ననుభవించితిని. ఒక్క వాంఛ మాత్రమీదేఱలేదు. శంకరసన్నిభుఁ డైన కుమారునిఁ బ్రసాదింపుఁ" డని యర్థించినది. విశ్వానరుఁ డించుక నే పాలోచించియది మిక్కిలి కష్టసాధ్య మని యూహించి యీశ్వరేచ్ఛచే నిట్టి కోరిక కలిగిన దని యెంచి తప మొనరింపఁ దలంచి పరమ పవిత్ర క్షేత్ర మగు నవిముక్త క్షేత్రమునకు వెడలెను. అచట గంగాస్నానముఁ గావించుచు నన్నపూర్ణా విశ్వనాథులను, గణపతులను, గాలభైరవుని, దండపాణిని, లోలార్కునిఁ బూజింపుచుండెను. అన్ని తీర్థములందును బితృదేవతలకుఁ బిండప్రదానము లొనరింపుచుండెను, మునీశ్వరులను భూసురులను శ్రద్ధాభక్తులతోఁ బూజింపుచు భోజనము లొసంగుచుండెను. పుత్రసంతాన ప్రాప్తికై సిద్ధలింగ మగు వీరేశ్వరలింగము నర్చింపవలె నని యోజించి దానిని జేరి నియమయుక్తుఁడై యొకమాసము పగటి భోజన మొనరించియు, నొక మాసము రాత్రిభోజన మొనరించియు, నొకమాసము జలపానముఁ జేసియు, నొక నెల పంచగవ్యప్రాశనఁ జేసియు, నొక నెల చాంద్రాయణవ్రత మొనరించియు సేవించెను. కుశోదకపానము, క్షీరపానము, ఫలభక్షణము, తిలభక్షణము, వాయుభక్షణముఁ జేయుచు నీ రీతిగ నొక

వర్షము కాలము వీరేశ్వరలింగార్చన మొనరింపుచుఁ దప మాచరించెను.

ఒకనాఁడు గంగాస్నానముఁ గావించి వీరేశ్వరలింగమును సమీపింపఁగా నా లింగమం దష్టవర్షప్రాయుఁ డైన బాలుఁడు దర్శన మొసంగెను. ఆబాలుఁడు జటాజూటధరుఁడు దిగంబరుఁడు భస్మాంగరాగుఁడు మందస్మితాననుఁడు నై వేదపఠనముఁ గావింపుచుఁ గన్పడఁగా విశ్వానరుఁ డాశ్చర్యపడి శంకరుఁ డని తలంచి సాష్టాంగవందన మాచరించి యా శివు నిట్లు స్తోత్రము చేసెను.

శ్లో॥ ఏకం బ్రహ్మైవాద్వితీయం సమస్తం
సత్యం సత్యం నేహ నానాస్తి కించిత్
ఏకో రుద్రో న ద్వితీయోఽవత స్థే
తస్మాదేకం త్వాం ప్రపద్యే మహేశమ్॥

కర్తా హర్తా త్వం హి సర్వస్య శంభో
నానారూపే ష్వేకరూపోఽ ప్యరూపః
యద్వత్ప్రత్యగ్ధర్మ ఏకోఽ ప్యనేక
స్తస్మాన్నాన్యం త్వాం వినేశం ప్రపద్యే॥

రజ్జౌ సర్పః శుక్తికాయాం చ రౌప్యం
నైరః పూర స్తన్మృగాఖ్యే మరీచౌ
యద్వత్తద్వద్విష్వగేవ ప్రపంచో
యస్మిన్జ్ఞాతే తం ప్రపద్యే మహేశం ॥

తోయే శైత్యం దాహకత్వం చ వహ్నౌ
తాపో భానౌ శీతభానౌ ప్రసాదః
పుష్పే గంధో దుగ్ధమధ్యేఽపి సర్పి
ర్యత్తచ్ఛంభో త్వం తతస్త్వాం ప్రపద్యే॥

శబ్దం గృహ్ణాస్యశ్రవా స్త్వం హి జిఘ్రి
స్యఘ్రాణ స్త్వం వ్యంఘ్రిరాయాసి దూరాత్
వ్యక్షః పశ్యే స్త్వం రసజ్ఞోఽప్యజిహ్వః
కస్త్వాం సమ్యగ్వే త్త్యత స్త్వాం ప్రపద్యే॥

నో వేద త్వామీశ సాక్షాద్ధి వేదో
నో వా విష్ణుర్నో విధాతాఽఖిలస్య
నో యోగీంద్రా నేంద్రముఖ్యా శ్చ దేవా
భక్తో వేద త్వామతస్త్వాం ప్రపద్యే॥

నో తే గోత్రం నో సజన్మాపి నాశో
నో వా రూపం నైవ శీలం న దేశః
ఇత్థం భూతోఽపీశ్వర స్త్వం త్రిలోక్యాః
సర్వాన్కామా న్పూరయే స్త్వం భజే త్వాం॥

త్వ త్త స్సర్వం త్వం హి సర్వం స్మరారే
త్వం గౌరీశ స్త్వం చ నగ్నోఽతిశాంతః
త్వం వై వృద్ధ స్త్వం యువా త్వం చ బాల
స్తత్వం యత్కిం నాన్యతస్త్వాం నతోఽహమ్॥

ఈ స్తోత్రమునకు భూతేశుఁడు హర్ష మంది వరమును గోరు మనఁగాఁ "దండ్రీ! నా యభీష్టము నీకుఁ దెలియదా?

సర్వాంతర్యామి వైన నీకుఁ దెలియని కోరిక లున్నవా! నీ ప్రేరణచేతనే యిట్లుస్తోత్ర మొనరింపఁజాలితిని. నీ యిష్టము వచ్చినట్లు ప్రసాదింపు" మని విశ్వానరుఁ డర్థించెను. విశ్వేశ్వరుఁ డానందించి "నాయనా నీ సతి కోరికపై నావంటి సుతునికై తప మొనరించితివి. అటులే నీకుఁగుమారుఁడనై జనింతును. గృహపతి యని పేరు పెట్టుము. నీ వొనరించిన యీ స్తోత్రమున కభి లాషాష్టక మని పే రిడితిని. ఒక వత్సరము శివలింగ సన్నిధిని త్రికాలములందు దీనిని బఠించి వారికి సకలాభీష్టములు నెఱ వేఱును. మోక్షము ప్రాప్తించును. ఒకవత్సరము శివసన్నిధాన మునఁ బఠించిన వంధ్యయైనను సంతానవతి యగు" నని వర మిచ్చి పరమేశ్వరుఁ డంతర్ధానుఁ డయ్యెను. విశ్వానరుఁ డానంద ముతో నింటి కేఁగెను.

కొలఁది కాలమునకు శుచిష్మతి గర్భవతియై నవమాస ములు నిండఁగా శుభసమయమున సర్వలక్షణ లక్షితుఁ డైన పుత్త్రుఁ డుదయించెను. శంకరుఁడే జన్మించె నని సప్తమహ ర్షులు, వాల్మీకి భృగు మతంగ జమదగ్ని దూర్వాస ఋశ్య శృంగ నార దాది మహర్షులు, బ్రహ్మ విష్ణ్వాది సురలు, నాగులు, నదులు, నగములు సంతోషముతో రాఁగా మహోత్సవము జరిగెను. చతురాననుఁడు పదునొకండవ దినమున నా బాలునకు గృహపతి యని నామకరణ మొనరించెను. అందఱును వేద మంత్రములతో నా బాలుని దీవించి మునిదంపతుల శ్లాఘించిరి.

శ్లో॥ అపుత్రస్య గృహం శూన్య మపుత్ర స్యార్జనం వృథా
అపుత్రస్య తప శ్ఛిన్నం నో పవిత్ర త్యపుత్రతః
న పుత్రా త్పరమో లాభో న పుత్రా త్పరమం సుఖమ్
న పుత్రా త్పరమం మిత్రం పర త్రేహ చ కుత్రచిత్॥
(శ్రీశివపురాణము)

"పుత్రులు లేని గృహము శూన్యము. అపుత్రకుని యార్జనము వ్యర్థము, అపుత్రకుని తపము వ్యర్థము. అపుత్రతవలనఁ బవిత్రత లేదు. పుత్రుఁడే పరమలాభము. పుత్రుఁడే పరమ సుఖము. ఇహ పరములలో నెక్కడైనను బుత్రునికంటెఁ బరమ మిత్రుఁడు లేఁడు." అని తలంచెడి విశ్వానరుఁడు పుత్రోదయముతో నమితానందుఁ డైనాఁడు. బాలున కన్నప్రాశనము, చౌలముఁ గావించి పంచమాబ్దమున నుపనయన మొనరించి వేదాధ్యయన మారంభింపఁజేసెను. ఒక వర్షముకాలములో వేద విద్యా పరిపూర్ణుఁ డయ్యెను. సకలవిద్యలను శీఘ్రకాలమున నధ్యయనముఁ జేసెను.

నవమ వర్షమున నారదముని వారి యాశ్రమమునకు రాఁగా విశ్వానరుఁడా మహర్షి కర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించి యాసన మొసంగెను. బాలుఁడును నమస్కరింపఁగా నాతని నెత్తియంకమునఁ గూర్చుండఁబెట్టుకొని నారదుఁడు "విశ్వానరా! యేమి నీ యదృష్ట విశేషము. ఎట్టి పుత్రునిఁ బడసితి" వనుచు నా బాలుని హస్తగతరేఖలను దిలకింపసాఁగెను. ఈశ్వరేచ్ఛాను సార మా మహర్షి పలుకుచున్నాఁడు. "ఈ బాలుఁడు దివ్యలక్షణ

లక్షితుఁడు, ఆనందకరుఁడు, లోకోపకారకుఁడు వీనిని జాగ రూకుఁడవై పోషించుకొనుము. దైవవిధి యనుల్లంఘ్యము. ఇఁకఁ బన్నెండవ మాసమునఁ దెల్లవాఱువేళ నీతనికి విద్యుద్ఘాత ముచే మృత్యు వున్నది.

ఈ మాటలు వినుట తడవుగ విశ్వానరదంపతులు మూర్ఛిల్లి కొంతవడికి లేచి శోకింపుచుండఁగా నా బాలుఁడు మందహాసముతో ననుచున్నాఁడు. "తలిదండ్రులారా! మీరు భీతిల్లకుఁడు మీ చరణ సేవాధన్యుఁడ నగు నన్ను మీ పాదపరాగరేణు వే యాపదయు రాకుండ రక్షింపఁగలదు. కాలము న న్నేమియుఁ జేయలేదు. మృత్యుంజయ సేవకుల కా మృత్యువు దూరముగ నుండవలసి నదియె. కావున మృత్యుంజయ మంత్ర ముపదేశింపుఁడు. తత్ప్ర భావముతో నపమృత్యువును జయింతును." అమృతోపమానము లైన యా బాలకుని భాషణము లాలించి తల్లిదండ్రులు "నాయనా! మృత్యుంజయారాధన మొనరించుటకంటెఁ గావలసిన దేమి? శ్వేతకేతుఁ డీశ్వరారాధనఁ జేయఁగా శంకరుఁడు వాని నపమృ త్యువునుండి రక్షించెను. శిలాద కుమారుఁడైన నందీశ్వరునిఁ గూడ నటులే కాపాడి వాహనముగాఁ జేసికొన్నాఁడు శర్వుఁడు. అతని నర్చింపు" మని బోధించినారు మాతాపితలు.

గృహపతి ప్రళయకాలముననుగూడఁ జలింపని దగు కాశి కేఁగి మణికర్ణికలో నవగాహ మొనరించి విశ్వేశ్వరుని దర్శించి నమస్కరించి యా లింగమును మాటిమాటికి నాలింగన మొన ర్చుచుఁ దన భాగ్య మెంత మహనీయ మనుకొనెను.

కాశిలో నొక సుముహూర్తమున శివలింగ మొకటి స్థాపించి నియమబద్ధుఁడై తప మొనర్చుచుఁ, బ్రతిదిన మా లింగ మున కష్టోత్తరశత పూర్ణ కుంభ నిర్మలసలిలాభిషేక మొన రించుచు, నిత్యము నీలోత్పలమాలిక నర్పించుచుండెను. పక్ష మున కొకపరి పతితపత్రములఁ దినుచు; షణ్మాసములు వాయు భక్షణఁ జేయుచు, షణ్మాసములు కుశోదకపాన మొనరించుచు ఘోరతప మొనరించుచున్నాఁడు. ద్వాదశమాసతపము జరిగినది. అంత సహస్రాక్షుఁడు ప్రత్యక్షమై నీ తపోవిధి కానంద మైనది. వరము వేఁడు మనఁగా నా గృహపతి "శచీపతీ ! నీసామర్థ్యము నే నెఱుంగుదును. నేను జేయు తపము సహస్రాక్షునిఁగూర్చి కాదు. ఫాలాక్షునిఁగూర్చి, నా కా శంకరుఁడే వర మీయవలెఁ గాని యన్యుల వరము లనవసరము" లనెను. బాలుని తృణీకారముతో సునాసీరున కాగ్రహ మొదవి వజ్రాయుధము నెత్తి యాతనిని మొత్తఁ బోఁగా వాఁడు భీతిల్లి మూర్ఛిల్లెను. అంతఁ బరమేశుఁ డవతరించి యభయపాణిచే వానిని స్పృశింపఁగా మూర్ఛనుండి లేచిన గృహపతి శంకరుని దర్శించి యొడలు మఱచి యానందా తిరేకమున నాతనికి వందన మొనరింపవలెనో స్తోత్రమును జేయవలెనో తెలియక నిలిచిపోఁగా భక్తపరాధీనుఁ డైన గౌరీ వల్లభుఁడు "నాయనా ! నీ కభయ మిచ్చితిని. ఇంతకు ముందు వచ్చినవాఁడు స్వర్గనాయకుఁడు కాఁడు, నీ పరీక్షకై నేనే యా రూపమున వచ్చితిని. నీ శివభక్తి యనన్య మైనది. వర మొసంగు దును. నీ వగ్నివై సకల జీవులందు జఠరాగ్ని రూపమున

నుందువుగాక ! ప్రాగ్దక్షిణదిశల మధ్యఁ గల యాగ్నేయదిశ కధిపతి వగుదువుగాక! వైశ్వానరుఁ డను నామము గలుగును. నీచేఁ బ్రతిష్ఠితుఁ డైన యీ శివుఁ డగ్నీశ్వరుఁ డను నామమున నుండును. ఈ లింగము నారాధించిన వారికి మందాగ్ని, యశని పాతము, వజ్రాయుధముల వలని యాపద లుండవు. అప మృత్యువు గలుగదు. నీ పురము చిత్రహోత్రమను పేరు గలిగి యుండును. భర్తతో సహగమనమొనరించిన సాధ్వీ లీ నగ రమునకు వత్తురు. బ్రహ్మచారులు గృహస్థులు నియమముతో నగ్నికార్య మొనరించినచో నీ నగరమునకు రాఁగలరు. అనాధ ప్రేత సంస్కారమును జేసినను, జేయించినను నీ నగరము నకే వత్తురు, అపవిత్ర మైన వన్నియు నీచేఁ బవిత్రితము లగును. అందువలననే నీకుఁ బావకుఁ డని పేరుగలుగు" నని వర మొసంగెను.

అగ్ని యీశ్వరావతారము. పశుపతికి ఫాలనేత్ర మగ్నియే. దేవతలకై ఘృతము హవిస్సు మున్నగువానిని నిమంత్రించి యగ్నిలో వైచిన వాని నగ్ని దేవతల కందించును. అందుచేతనే "అగ్ని ముఖావై దేవాః" యని శ్రుతి, సురలను దృప్తిపఱచవలె నన్న నగ్నియే సాధనము.

## అ గ్ని స్తో త్ర ము

శ్లో॥ అగ్ని ర్వైశ్వానరో వహ్నిః కృష్ణవర్త్మా భయానకః
ప్రభవో విభవ శ్చైవ వీతిహోత్ర స్తనూనపాత్

భవ్యో భీమో భీమనేత్రి సముత్థో దేహసంస్థితః
త్రైలోక్యదీపకో భాను స్స్వర్భాను స్సర్వగ స్తథా
చిత్రభాను శ్శీతహంతా శీతసంస్థః కృపాకరః
ధేనుకో బడబా జన్మా జాఠరో జఠరస్థితః
యజ్ఞనేతా యజ్ఞభోక్తా భ క్తగమ్యో లయంకరః
కృపీటయోనిః శోచిష్మాన్ జ్వలనో జాతరూపదః
జాతవేదా వేదసంస్థో హ్యాశ్రయాశో మహాప్రిభుః
దానవారి ర్జ్వలత్కేశో మదనో దీనవత్సలః
అగ్నే రేతాని నామాని యః పఠే త్ప్రయతో నరః
సర్వసిద్ధి మవాప్నోతి శతయజ్ఞ ఫలం లభేత్
మందాగ్ని ర్యో నరో విప్ర! సుభక్త్యా ప్రతిప త్తి థౌ
నామామృతం పిబే న్నిత్యం త్రివారం నియతః శుచిః
మందాగ్ని స్తస్య నశ్యే ద్వై సర్వరోగక్షయ స్తథా
భవ్యో భవతి లోకేషు పూతాత్మా నాత్ర సంశయః॥

(స్కాంద పురాణము)

## నందీశ్వరావతారము

శిలాదుఁ డను విప్రుఁడు సంతతి లేక వంశక్షయభయమున వనమునకు వెడలి యమరేంద్రునిఁగూర్చి తప మొనరింపఁగా నాతఁడు ప్రత్యక్షమై వరముఁ గోరు మనెను. శిలాదుఁడు వినయ వినమిత గాత్రుఁడై నిలిచి "యయోనిసంభవుఁడు మృత్యువులేనివాఁడు నగు తనయుఁడు గావలె" నని యర్థించెను. శక్రుఁ డది తన కసాధ్య మనియు విష్ణువునకు బ్రహ్మకుఁ

గూడ శక్తి చాల దనియు నట్టికోరిక నెఱవేర్పవలె నన్నఁ బరమ శివుఁ డొక్కఁడే సమర్థుఁ డనియు శివారాధనమును జేయు మనియుఁ జెప్పెను. అతని యానతిపై భూసురుఁడు దీక్షదక్షుఁడై సహస్రవత్సరము లీశ్వరునిఁగూర్చి తప మొనరించెను. ఒడలి నిండఁ బుట్టలు పోసినవి. రక్తమాంసములు క్షీణించి యస్థులు మాత్రము మిగిలినవి. అతని యచంచల తపోదీక్షకు మహేశ్వరుఁడు ప్రీతి నొంది దర్శన మొసంగి "నాయనా! నీ దీక్షకు సంతస మైనది. ఈప్సిత మే" మని యడిగెను. కాని యా వాక్యము లాతనికి విన్పడలేదు. శంకరుఁడు చేత స్పృశింపఁగాఁ గనులు తెఱచి యుమాశంకరులఁ గాంచి యెంతయో ముద మంది "పరమేశా! యయోనిసంభవుఁడు, మృత్యురహితుఁడు త్వత్తుల్యుఁడు నగు పుత్రునిఁ బ్రసాదింపవే!" యని యర్థించెను. మహేశుఁడు "పూర్వము నేను బ్రహ్మాదులకు వర మొసంగి తిని గాన నీ కోరినట్టులు 'నంది' యను పేరుతో నీకు జన్మింతు" ననెను. ఆదిదంపతు లంతర్ధానులైరి.

శిలాదుఁడు యజ్ఞ మారంభముఁ గావించి చేయుచుండఁగా యజ్ఞశాలలో నీశ్వర దేహము నుండి నందీశ్వరుఁ డవతరించెను. పరమేశ్వరుఁడు నందిని శిలాదునకుఁ జూపి వీఁడే నీ బిడ్డ యని యొసంగెను. పుట్టినపుడు నంది చతుర్భుజుఁడు, త్రినేత్రుఁడు త్రిశూలధారిగా నుండెను. శిలాదుఁ డా బాలునిఁ దన పర్ణ శాలకుఁ గొనిపోఁగా నా రూపము మాఱి మానవాకారము గలిగెను. ఆతనిని శిలాదుఁడు పెంచుకొనుచున్నాఁడు.

ఒకనాఁడు మిత్రావరుణులను మును లిర్వురు శిలాదు నింటికి వచ్చి నందిని జూచి "యీతని కిపుడు సప్తమవత్సరము. ఇఁక నొక వత్సరములో వీనికి మృత్యు వున్న" దని చెప్పఁగా శిలాదుఁడు కొడుకును గౌఁగిలించుకొని విలపించుచుండెను. నంది తండ్రి నోదార్చి మృత్యుంజయు నర్చించి మృత్యువుఁ దొలఁగించుకొందు నని ధైర్యము చెప్పి యడవి కరిగి యేకాగ్రచిత్తుఁడై మహోగ్రముగా రుద్రునిఁగూర్చి తప మాచరింపనాతఁడు ప్రత్యక్షమై "నాయనా! నీవు మృత్యుభీతి నందుచున్నాఁడవు. భయపడకుము. ఆ మునులు నేను బంపఁగా వచ్చినవారలే. నీకు మృత్యువు గాని ముసలితనము గాని లేదు. నిత్యము నాపార్శ్వ వర్తివై ప్రమథగణమం దుందువు. నీ తల్లితోఁ గలిసి ర"మ్మని పలికి తన మెడలోని మాలికఁ దీసి వాని మెడలో వైచెను. తత్ప్రభావమున నందికి మానుషరూపము పోయి శివస్వరూపము కలిగెను అంత నంది గంగ కావలెనని కోరఁగా శివుఁ డైదు ప్రవాహములుగ గంగను బ్రవహింపఁజేసెను. అదియే పంచనద గంగ. ఆ గంగాస్నాన మత్యంతఫలప్రదము.

బ్రహ్మాదు లరుదెంచి నందిని బ్రమథగణమున కధిపతిగాఁ బట్టాభిషేక మొనరించిరి. మరుద్గణముల కుమారిక యగు సుయశ నొసఁగి వివాహ మొనరించిరి. శ్రీ వాణీ గిరిజ లాదంపతుల కనేక మణిభూషణ కిరీటాదికము లొసంగి యాశీర్వదించిరి. నందీశ్వరుని కోరికపై నాతని కచంచల శివ చరణభక్తియు, సుయశకుఁ బతిభక్తియుఁ బ్రసాదించి వెడలినారు. ఈ నందీశ్వరావతారగాథ యిహపరసుఖసాధన మెనది.

ఆలయమున కేఁగి శివుని దర్శించుటకు ముందు నందీశ్వరుని గ్రిందిశ్లోకముతో నర్థించి యనుజ్ఞఁబొంద వలెనని పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ నందీశ్వర నమ స్తుభ్యం సాంబానంద ప్రదాయక
మహాదేవస్య సేవార్థ మనుజ్ఞాం దాతు మర్హసి॥

శివదర్శన మొనరించు నపుడు నందియొక్క యండమును స్పృశింపవలయును. నందిశృంగముల మధ్యనుండి శివుని దర్శించిన తిరిగి జన్మ నందఁడు. ఎడమచేతి చూపుడు వ్రేలును బొటనవ్రేలును నందిశృంగములపై నుంచి కుడిచేతితో నంది వృషణమును స్పృశించుచుఁ గొమ్ములమధ్యనుండి శివుని స్మరింపుచు దర్శించు టాచారము.

శ్లో॥ వృషస్య వృషణం స్పృష్ట్వా ఈశ్వర స్యావలోకనమ్
శృంగమధ్యే శివం దృష్ట్వా పునర్జన్మ న విదంతి॥

శ్లో॥ శృంగయో ర్వామహ స్తస్య తర్జ న్యంగుష్ఠకౌ న్యసేత్
అండం సవ్యేన చ స్పృష్ట్వా శృంగమధ్యే శివం స్మరేత్॥

## యతి నా థా వ తా ర ము

అర్బుదాచలముపై నాహుకుఁ డను బోయవాఁ డాహుకి యను భార్యతో నివసించుచున్నాఁడు. ఆ బోయదంపతులు పరమ శివభక్తులు. ఆహుకి పతిభక్తిపరాయణ. శివారాధన యతినాథసమర్చనయాదంపతులకు నిత్యనియమముగాఁ గాలము గడచుచున్నది.

ఒకనాఁడు వీరిని బరీక్షింపఁ దలంచి శంకరుఁడు యతి రూపము నవధరించి వారి యింటికి సాయంసమయమున రాఁగా నాహారార్థమై యడవికిఁ జాలదూర మేఁగి యపుడే వచ్చిన భిల్లుఁడు మిక్కిలి యానందించి యతిథిపూజఁ గావించి కుడువఁబెట్టినాఁడు. అతిథి మిక్కిలి సంతసించి "యాహుకా! నీ యాతిథ్యముతో మిక్కిలి తృప్తి నందితిని. ఈ చీఁకటిలో నెచ్చటికిఁ బోలేను గాన రేయి నీ యింట నిద్రించి యుదయమే వెడలుదును. రాత్రి నీ యింటఁ బరుండని" మ్మనినాఁడు. భిల్లుఁడు తనయిల్లు మిక్కిలి చిన్న దని మూఁడవవానికిఁ జోటులేని దని విన్నవింపఁగా యతి నాథుఁ డతిదీనముగఁ జూచి వెడలఁబోఁగా నాహుకి హృదయము కరఁగి పతితో "నాథా! మన యింటికి వచ్చిన యతిథి కాశ్రయ మిచ్చుట గృహస్థధర్మము. ఈ గాఢాంధకారములో నీ యతి యెట్లు పోఁగలఁడు? మనము శ్రమించియైన నీయన కాశ్రయ మీయవలెను. మీరును యతియు లోనఁ బరుండుఁడు. నేను ధనుర్ధారిణినై బైట నిలిచి రాత్రి గడపెద" నని వివరింపఁగా నాహుకుఁడు "సతీ నీ మాటలు ధర్మసమ్మతములు. భార్యను బైటఁ బెట్టి నేను లోన నిద్రించుట యధర్మము. ఆశ్రయ మీయక యతిథి నంధకారములోఁ బొమ్మనుటయు గృహస్థున కధర్మమే. కావున నీవును యతినాథుఁడును లోన నిద్రింపుఁడు. నే నీవల శస్త్రధారుఁడనై యుందు" నని చెప్పి పత్నినొప్పించి యతిని సతిని గృహ మందు నిద్రింపఁజేసి తాను ధనుర్బాణము లను గైకొని బయట నిలిచినాఁడు. అర్ధరాత్రివేళఁ గ్రూరజంతు వులు వచ్చి యాతనిని భక్షింపఁబోఁగా శరములచే నెంతఁ గొట్ట

బోయినను దైవప్రేరణచే నవి వారింపఁబడలేదు. ఒక పులి యా భిల్లుని సంహరించి రక్తమాంసములు గ్రసించి యెమ్ములు విడిచి పోయినది. తెల్లవాఱఁగనే యతినాధుఁడును భిల్లియు నాయెమ్ములఁ జూచి మిక్కిలి చింతించినారు. ఒకింతవడి కాహుకి ధైర్య మూని "యతినాధా! మీరు క్షేమముగ నున్నా రదియే పదివేలు. అతిధిసపర్య లో నాపతి దేహత్యాగ మొనరించి ధన్యుఁ డైనాఁడు. నే నాతనితో సహగమించి నా సతీధర్మమును బాటింతు" నని చెప్పి చితినిఁ బేర్పించి స్నానముఁ జేసి శుద్ధ వస్త్రము ధరించి యగ్నికిఁ బ్రద క్షిణించి మానసమున శివుని ధ్యానించి యిట్లు పలుకుచున్నది.

క. తెలిసీ తెలియని నాచే
తల ననుచిత మెంతయేనిఁ దనరెడుఁ గృప నా
కలుషములఁ బాపు మిదె జో
తలు సేసెద దేవదేవ! దర్పకదమనా!

సీ. ఎత్తిన వేడ్కమై యెడవక నీ పాద
పద్మచింతనమును బాయనేని
విభుని దైవముగ భావించి తదాజ్ఞఁ జే
కొని మేలి నడవడి మనెదనేని
కల్ల నెప్పుడు నాలుకన్ జొరనీక స
త్యంబె పట్టని మదిఁ దలఁతునేని
అతిధుల యందు నభ్యాగతు లందును
బేర్మి నన్నంబు లర్పింతునేని

గీ. ఇఁకను జన్మంబు మఱల నా కిడెదవేని
దాస జనుల కభీష్టముల్ దార్తువేని
భిల్లు నాహుకునే కూర్పు విభుని నాకుఁ
బర్వతేంద్రసుతామనఃపద్మమిత్ర!

క. జన్మము లెన్ని యొసంగిన
ని న్మఱవంజాల నట్టి నేటగు భక్తిన్
మ న్మనమునఁ బెనుపుము త్రిజ
గన్మోహన! దివ్యచరిత! గౌరీకాంతా!

(ఆంధ్రశివపురాణము)

అని యగ్నిలో దుమికినది. ఆమె పాతివ్రత్యనిరతికిఁ బ్రీతి నంది యతిరూపము వీడి పార్వతీపతి ప్రత్యక్షమై యామెతో

ఉ. ధన్యవు ధన్య వీ విఁక నితాంతము నిన్ వరియించినట్టి సౌ
జన్యనిధాన మీ శబరస త్తముఁ డాహుక నామధేయుఁడున్
ధన్యుఁడు సంతసం బొదవెఁ దద్దయు నీ పరిపూత రీతికిన్
మాన్యచరిత్ర! సందియము మాని వరంబులఁ గోరు మిచ్చెదన్.

వ. అనినంత

గీ. అత తానందకందమై యలరు పరమ
శివుని నుడి విని హరుసంబుఁ జెంది మ్రొక్కి
యూరకుండె నిషాదిని యురుతర కరు
ణాళుఁడై యిట్లు పల్కెఁ జంద్రార్ధమౌళి!

క. ఈ జన్మ మిందుఁ గడచె వి
రాజితగతి నీకు భిల్లరాయని కిటుఁజన్
బై జన్మమున సిరులు పై
పైఁ జెన్నెసలారఁగలవు పల్కెద వినుమా!

ఉ. చందురు వంగసంబునఁ బ్రశస్తి వహించిన వీరసేన రా
జేందునికిన్ దనూజుఁ డయి యా శబరుండు నలుండునాఁగఁ బు
ట్టొందుఁ జతుస్సముద్ర రశనోన్నత దివ్య దిలాధినాథ సం
క్రందనుఁడై సిరిన్ దనరు గౌరవ శోకంబును జెందు నెంతయున్.

ఉ. నీవు విదర్భనేల నరనేతకు భీమునకున్ గొమార్తవై
యావటిలంగఁ బేర్మి దమయంతి యనన్బడు పేరితో నన
న్యావహ రూప కాంతి సుగుణాకరవై యమరేంద్రముఖ్యులన్
బోవిడి యన్నలున్ నృపతిపూజ్యు వరించి సుఖింతు వెంతయున్.

ఉ. ఏను యతీంద్రరూపమున నెంతయు మీ పరిచర్య లొందుటన్
మానిని ! రాజహంస నయి మంచిగ నీకును నైషధావనీ
జానికి దౌత్యమున్ సలిపి చక్కని కూరిమిఁ గూర్చి పెండిలిన్
మానుగఁ గూర్తు నిర్వురు సమంచిత భోగము లొందుదు రృవిన్.

మ. అవసానంబున మీర లిర్వురును నా యాత్యంతికంబైన భ
క్తి విశేషంబును జెంది యోగము మదిన్ గీల్కొల్పి యద్దాన ను
ద్భవ నాశంబులు లేని మోక్షపదమున్ ప్రాపింత్రు నాఁ జెప్పి యా
శివుఁ డవ్వారలచోట లింగ మయి వాసిన్ జెందె మోదంబునన్.

క. అచలం బగు లింగంబై
అచలముపై వెలసినట్టి యక్కృతమున వం
దచల్వేరుఁ డను నాహ్వయ
మచలేంద్రసుతావిభుండు హరుఁ డొందె నటుల్.

(ఆంధ్రశివపురాణము)

ఆ. శివవాక్యానుసార మా భిల్లదంపతులు తర్వాతిజన్మ
మున నలదమయంతు లైనారు. యతీశ్వరుఁడు రాజహంసయై
రాయబారముఁ గావించి నలదమయంతుల కల్యాణమును సంధాన
పఱచెను.

## భిక్షువర్యావతారము

విదర్భదేశమును సత్యరథుఁ డను నృపాలుఁడు పాలించు వాఁడు. ఆతఁడు సత్యనిరతుఁడు ధర్మవర్తితుఁడును. ఒకప్పుడు సాళ్వలతో నాతనికి యుద్ధము గలిగి యం దాతఁడు ససైన్య ముగా మృతుఁడైనాఁడు. గర్భవతి యగు నాతని భార్య మారు వేషమునఁ బారిపోయి యడవిలోఁబడి నడచి నడచి యొక్క మర్రిక్రింద విశ్రమించి యచటనే యొక బాలునిఁ బ్రసవించినది. ప్రసవించిన వెంటనే దప్పిక కలిగి చెంతనున్న కొలనిలో దిగి జలము ద్రావఁబోఁగా దానిలో మొసలి యామెను బట్టిలాగి మ్రింగెను. బొడ్డూడని యా పసిబిడ్డ మఱ్ఱిక్రింద రోదించు చుండెను. గర్భములో నున్నపుడు పోషించిన భగవానుఁడు బయటమాత్రము రక్షింపఁడా? ఒక భిక్షుకి యాదారిని వచ్చి యా శిశువును జూచినది.

ఆ భిక్షుకి యొక బ్రాహ్మణ వితంతువు. పతి గతించి వత్సరమైనది. ఆమె చంకలో నొక బాలుఁ డున్నాఁడు. ఆమె చెట్టుక్రింది బాలునిఁ జూచి హృదయము ద్రవించి సమీపించినది. "మానవ సంచారము లేని మహారణ్యములోని కీ నెత్తురుకందు వచ్చు టెట్లు? తల్లిదండ్రు లెక్కడఁ గానరారే! దిక్కెవ్వరు? మహారణ్యములో నే క్రూరజంతువును దినలేదే! ఈశ్వరలీల యెంత చిత్ర మైనది! ఈతని యందు నా కేలొకో కరుణ గలుగుచున్నది. దరిద్రురాల నైనను నా బిడ్డతోపాటి బిడ్డమ

గూడఁ బెంచుకొందును. నేను బ్రాహ్మణ కులజను, ఈతఁడే కులజుఁడో, పరిగ్రాహ్యుఁ డగునో కాఁడో" యని సందేహించు చున్నది.

ఇంతలో శంకరుఁడు సన్న్యాసిరూపమున వచ్చి యా బ్రాహ్మణితో "వనితా! నీవు సంశయింపకుము. ఈ తేజోరాశి యగు శిశువువలన నీకు మంచి రానున్నది. తీసికొని పెంచు కొను" మనెను.

ఆ స్త్రీ యడుగుచున్నది. "యతీంద్రా! ఈ సంఘటనము మిక్కిలి యాశ్చర్యముగ నున్నది. ఈ బాలుఁడు గతజన్మమున మహిమాన్వితుఁ డనియు నీ జన్మమునఁ గూడ నుజ్జ్వలభవిష్య మున్నవాఁ డనియు నాతని తేజము చాటుచున్నది. మీదర్శనము చే నాలో నేదియో జ్ఞానోదయ మగుచున్నది. ఈ బాలుని గత వృత్తాంతము నా కుమారుని వృత్తము వివరింపుఁడు."

ఆ యతి దరహాసముతో "ఈ బాలుఁడు విదర్భావనీపతి యగు సత్యరథుని కుమారుఁడు. సత్యరథుఁడు మహా శివ భక్తుఁడు. అతఁడు రణమున మరణింపఁగా నంతర్వత్ని యగు నాతని పత్ని యడవినిఁ బడి వచ్చి యీ వృక్షముక్రింద నీ శిశువును బ్రసవించి జలపానమునకుఁ గొలని కేఁగి మొసలిచే మరణించినది. ఇదంతయు దైవలీల" యనఁగా మహాత్మా!మీరు త్రికాలవేదులుగదా! సత్యరథుని మరణమునకుఁ గారణ మేమి, శిశువు మాతాపితృహీనుఁ డగుటకు గతజన్మమున నే యకృత్య

మొనరించెను ; నా బిడ్డయుఁ బితృహీనుఁ డేల యయ్యెను? ఈ బిడ్డ లిర్వురు భవిష్యమున నెట్లుందురో యానతీయుఁ" డని యా వనిత కోరినది.

"సత్యరథుఁడు గతజన్మమునఁ బాండ్యనరనాథుఁడు. మహా శివభక్తుఁడు. ప్రజాసౌఖ్య మెఱిఁగి పాలించువాఁడు.

ఒకత్రయోదశినాఁ డా రా జుపవసించి ప్రదోషసమయమున శివపూజఁ గావింపుచున్నాఁడు. శ్రద్ధాభక్తులతో మగ్నమానసుఁడై పూజలో నుండఁగా నొక భయంకరధ్వాన మైనది. శత్రువుల రాకడ యను భయము గలిగి పూజామధ్యమున విరమించి లేచి వెడలినాఁడు. సైన్యముతో శత్రువుల నెదిరించి వారిని సంహరించి వచ్చినాఁడు గాని తన ప్రదోష శివపూజ యసంపూర్ణ మన్నమాట మఱచినాఁడు! శివపూజకు విఘ్నము కలుగరాదు, పూర్తిచేయనిదే లేవరాదు. జీవితాంతము శివారాధన మొనరించుటవలన మఱల నిపుడు విదర్భావనీనాథుఁడై జనియించి పూజావిఘ్నము చేసికొనినందున నైశ్వర్యము ననుభవించుచు మధ్యలో మృతుఁ డైనాఁడు. ఆ జన్మలో వాని కుమారుఁడే మఱల నీ జన్మమున కుమారుఁడుగా జన్మించినాఁడు. ఈతని తల్లి గతజన్మమున సవతిపుత్రుని సంహరించినందున తా నీ పుట్టువులో బిడ్డను గన్న వెంటనే మొసలిచే మృతి నందినది. శివపూజకు విఘ్న మొనరించినవారు దరిద్రు లగుదురుసుమా, నీ

కుమారుఁడు కూడా గతజన్మములో బ్రాహ్మణుఁడై ప్రతిగ్రహ మధికముగాఁజేసెను, అందువలన దరిద్రుఁడుగాఁ బితృహీనుఁడుగా జనియించినాఁడు. నీవు శివార్చన మొనరింపుము, సంపన్నురాలవై సంతసింతువు. ఈ పిల్లల కుపనయన మొనరించిన దాది నీ కైశ్వర్యము గలుగును, నీవు ప్రదోషకాలమునుండి యారంభించి శివపూజఁ గావింపుము. నేను బరమేశ్వరుఁడ"నని చెప్పి యా సన్న్యాసి మాయ మయ్యెను.

ఆ వనిత జన్మము కృతార్థమైన దని సంతసించి యా మహేశ్వరుని సంస్తుతించినది.

ఆ రాచబిడ్డను లేవనెత్తుకొని తన బిడ్డతోపాటు విప్రవనిత యేకచక్రపురమునకుఁ బోయి పెంచసాఁగినది. అచటి భూసురు లా కుమారుల కుపనయనము గావించిరి, శాండిల్యముని వారికి విద్య లను నేర్పెను. సోదరులవలె వారు మెలఁగుచు విద్యావివేకసమన్వి తులైనారు. భిక్షువర్యుని యుపదేశానుసారముగా నామె ప్రదోష కాలమున నారంభించి నిత్యము శివపూజ వారిచేఁ జేయించుచుండె డిది, ఒకనాఁడు నృపకుమారుఁడు స్నాన మొనరించి వచ్చు చుండఁగా నొక నిధి దొరికినది, ఈశ్వరానుగ్రహ మని గ్రహించి యాధనముతో సుఖింపుచున్నారు. ఒక నాఁ డా రాజనందనుఁడు వనవిహార మొనరించుచుండఁగా నొక గంధర్వుఁడు వచ్చి యాత నికిఁ దన కుమారి నిచ్చి పెండ్లిఁ గావించి తన రాజ్యము నొసంగెను, బ్రాహ్మణిని, గుమారుని గూడఁ దీసికొనివెడలి యా

నృపనందనుఁడు ధర్మగుప్త నామముతో రాజ్యపాలన మొనరించి సుఖించెను. ఇదియంతయుఁ బ్రదోషసమయ శివపూజాఫలము వలననే లభించినది.

ప్రదోషసమయ మనఁగాఁ ద్రయోదశినాఁటి సాయంకాలము. ఆ సమయమున నటరాజమూర్తియై పరమశివుఁడు కైలాసమునఁ బార్వతియెదుట సకలదేవతాసమక్షమున నృత్య మొనరించును. అట్టి యానందకాలమున శివార్చన మధికఫలప్రదము.

శ్లో॥ త్రియోదశ్యాం తిథౌ సాయం ప్రదోషః పరికీర్తితః
తత్ర పూజ్యో మహాదేవో నాన్యే దేవాః ఫలార్థిభిః
ప్రదోష సమయే దేవః కైలాసే రజితాలయే
కరోతి నృత్త మానందా త్ప్రశ్యంత్యాం సురసంసది
అతః పూజా జపో హోమ స్తత్కథా తద్గుణ స్తవః
కర్తవ్యో నియతం మర్త్యై శ్చతుర్వర్గ ఫలార్థిభిః ॥

(స్కాందపురాణము)

త్రయోదశినాఁటి సాయఁకాలమునకుఁ బ్రదోష మని ప్రసిద్ధి. ఫలాకాంక్షులు మహాదేవుని పూజ నా సమయమున నొనర్ప వలెను. ఇతర దేవతలకుఁ గాదు. ప్రదోషసమయమునఁ గైలాస రజితాలయమున దేవసభామధ్యమున దేవతలెల్లఁ జూచుచుండఁగా మహాదేవుఁ డానందముతో నృత్త మొనర్చును. పురుషార్థముల నభిలషించు మానవులు తప్పక నియమముగా శివపూజా జపహోమ కథా కీర్తనాదుల నొనర్పవలెను.

# మ హా బ లే శ్వ రుఁ డు

శ్లో॥ లంకానాధ దశాన నోగ్రతపసా గానేన తుష్టోభవః
కైలాసాచలవాస శంకర శివః స్వప్రాణలింగం దదౌ
తల్లింగం నవరత్నపీఠ సహితం విఘ్నేశ్వర స్థాపితమ్
గోకర్ణస్థ మహాబలేశ మమలం వందే భవానీ పతిమ్॥

రావణాసురుఁ డుగ్రతపముఁ గావించి పరమేశ్వరునుండి యాత్మలింగమును బడసి లంకాపురమునకుఁ గొనిపోవుచు దారిలో సంధ్యాసమయ మగుటచే నిత్యకృత్య నిర్వహణమునకై తన చేతి లింగమును గ్రిందఁ బెట్టక గణపతిచేతి కిచ్చి పట్టుకొను మని వెడలఁగా గణనాయకుఁడు యుక్తిచేసి యాలింగమును గ్రిందఁ బడవేయఁగా నది భూస్థాపిత మై పాతాళమువఱకుఁ బోయినది. వినాయక ప్రతిష్ఠిత మైన యా లింగమే మహాబలేశ్వరుఁ డను నామముతోఁ బశ్చిమసాగరతీర గోకర్ణక్షేత్రమున విఖ్యాత మయ్యెను. అతని భార్య తామ్రిగౌరి.

శా. శ్రీనాధుండు విరించి వాసవుఁడు విశ్వేదేవులున్ దస్రులున్
భానుద్వాదశకంబుమన్ వసువులున్ బంకేరుహారాతి నా
నా నక్షత్రములున్ మరుత్తులు విమానస్థాయులై నిత్యమ
న్యూనప్రీతినిఁ బూర్వగోపురమునన్ యోజింతుర్రి ధ్యానంబులన్.

గీ. అమర రుద్రగణంబులు జముఁడు మిత్రి
చిత్రగుప్తుఁడు పితరులు జిత్రభానుఁ
డప్లై దక్షిణగోపుర నాశ్రయించి
భజన మొనరించుచుందురు భక్తి మీఱ.

క. వరుణుండు సరిత్పతియును
సరిదగ్రిణు లల్ల జహ్నుజా ప్రభృతులు శం
కరు నిచ్చలుఁ గొలుచుమనుం
దురు పశ్చిమగోపురమునఁ దోరపు నిష్ఠన్.

గీ. వాయుదేవుఁడు ధనపతి భద్రకాళి
చండికయు మున్ను గల్గు ప్రశస్తమాతృ
కలు నుదగ్ద్వారమం దొప్పి కడిఁది భక్తిఁ
గొల్తురు మహాబలేశ్వరుఁ గూర్మిపేర్మి

క. గరుడులు గంధర్వులు కి
న్నరులును గుహ్యకులు చారణప్రముఖులు కిం
పురుషులు సిద్ధులు విద్యా
ధరులు మహాబలునిఁ గొల్చెదరు సత మర్థిన్.

చ. కొలిచినవారి కెల్లరకుఁ గొంగున బంగర మా మహేశ్వరుం
డలఘుత రేప్సితార్థముల నారసి యైహిక పారమార్థికం
బుల నిడుచుండు నందుఁ దపముల్ పొనరింతురు పల్వు రమ్మహా
బల శివలింగముఁ జాగుఁ బిచి పల్కుదు రాత్మల మోక్షదాతగాఁ.

గీ. మాఘ కృష్ణ చతుర్దశీ మహితపర్వ
మున మహాబల పూజనమున సమస్త
పాపు లెల్లరు మోక్షంబుఁ బడయుదురు ది
దృక్ష నేతెంతు రఖిల దిగ్దేశ జనులు,

(ఆంధ్రశివపురాణము)

ఒక చండాలవనిత మహాశివరాత్రినాఁ డీ మహాబలేశ్వరు నర్చించి శివలోకమున కేఁగెను. ఆ కథ వింధము.

ఒక చండాలి గతజన్మమున సౌమిని యను విప్రకన్య. ఆమెకు యుక్త వయస్సులోఁ దండ్రి పెండ్లిచేసినాఁడు. భర్తతోఁ గొన్నివత్సరములు కాఁపుర మొనరించిన పిదపఁ బతి మృతుఁడైనాఁడు. యౌవనమున నున్న సౌమిని నిగ్రహము లేక వ్యభిచారవర్తనురాలైనది. ఆమె దుష్ప్రవర్తనము నోర్వక బంధువులు బహిష్కరింపఁగా నిల్లు విడిచి పోయి మఱింత స్వేచ్ఛగాఁ దిరుగ నారంభించి యొక శూద్రుని యండ నుండి వానితో మద్యమాంసాదుల సేవించుచు నుండఁగా నొకపుత్రిక యుదయించినది. ఆ శూద్రుఁ డొకనాఁడు గ్రామాంతర మేఁగఁగా నామె మాంసభక్ష ణాసక్తయై రాత్రి సురాపాన మత్తయై వెడలి గోశాలలోఁ జూచి మేఁక యను భ్రాంతి నొక గోవత్సమును గోసినది. మత్తత తొలఁగి గోవత్సమని గ్రహించి "శివ శివ" యెంత ఘోర మొనరించితి నని దుఃఖించి పశ్చాత్తాపపడియుఁ గోసిన యా మాంసమును వండి తానును భర్తయుఁ దినిరి. కొంతకాలమున కామె మరణించి యమలోకమునకుఁ బోయి యమ బాధలఁ బడినది. పిదప నల్లని మేనితో జాత్యంధయై చండాల స్త్రీగా జనియించినది. పురాకృత పాపశేషమున దానికిఁ గుష్ఠమారంభ మైనది. అంధురాలును రోగిణియు నగుటచే నెవ్వరామెను దరిఁ జేరనీయలేదు. తినఁ దిండిలేక మాడుచుఁ దినిపాఱవైచిన యెంగిలి మెతుకు లేఱుకొని తిని బ్రతుకసాఁగినది.

కొందఱు భక్తులు శివరాత్రికి గోకర్ణ క్షేత్రమునకు వెడలుట తెలిసి వారలతోఁ బోయిన నెవ్వరైన నచటఁ దిండిని

గుడ్డను నొసంగుదు రని తలంచి పోయినది. ఆ క్షేత్రములో నొకచోటఁ గ్రింద గుడ్డ పఱచి యుంచి తాను దోసిలిఁ బట్టి యర్థించుచు నిలిచినది. రాత్రివేళ నెవ్వఁడో యా బట్టపై నొక బిల్వదళము విసరినాఁడు. అది చేతఁ దీసి భక్ష్యము కా దని యాదళమును దూరముగ విసరినది. అక్కడ నొక శివలింగ ముండి దానిపై నీ దళము వెడలి పడినది. ఆనాఁడు శివరాత్రి. ఎవ్వరును బెట్టని కారణముగ నుపవాసము, పెట్టుమరను నాళచే రాత్రి యంతయు నిద్రలేక జాగరణము, తెలియక విసరి కొట్టి నను బిల్వార్చనము దానికి లభించినవి. ఆఁకలి బాధకుఁ దాళ లేక యచ్చట నది మరణింపఁగా శివదూతలు వచ్చి దానిని శివలోక మునకుఁ దీసికొని వెడలిరి.

గత జన్మమున గోవత్సమును జంపియు శివ శివ యని నామోచ్చారణ మొనరించిన సుకృతముచే నీ జన్మమున మహా పవిత్ర క్షేత్ర మగు గోకర్ణమునకు వచ్చుటయు నచ్చట శివ రాత్రినాఁ డుపవాస, జాగరణ, బిల్వార్చ నాదికములు యాదృచ్ఛి కముగఁ బ్రాప్తించి తత్ఫలముగా శివలోకము లభించినది. తెలి యక చేసిననే యంత మాహాత్మ్య మున్నచోఁ దెలిసి చేసిన నెంతఫలమోకదా !

ఇక్ష్వాకువంశజుఁడు మిత్రసహుఁ డొక నృపాలుఁడు. అతని పత్ని మదయంతి, నలునకు దమయంతివలె మదయంతి ఖ్యాతిఁ గన్నది. మిత్రసహుఁ డొకనాఁడువేఁటకు వెడలి యడవిలో రాక్షస

పీడ యధికముగ నున్న దని మునులు చెప్పఁగాఁ గమతుఁ డను రాక్షసుని సంహరించెను. ఆ కోపముతో వాని సోదరుఁడు మాఱు వేషముతో రాజసన్నిధి కరిగి యతి వినయముగా మాటాడి తన కొక యుద్యోగము నర్థించెను. రా జంగీకరించి వంటవారిపై నధిపతిగా నియోగించెను.

ఒకనాఁడు రాజు తండ్రిది శ్రాద్ధదినముకాఁగా నానాఁడు వశిష్ఠుని భోక్తగాఁ బిలిచినారు. నాఁటి వంటకములలో మేఁకమాంసము వడ్డింపవలసి యుండఁగా నా రక్కసుని కపటవర్తనము వలన నరమాంసము వడ్డింపఁబడెను. నరమాంసమునుజూచియాగ్రహించి వశిష్ఠుఁ డారాజును రాక్షసుఁడవు గమ్మని శపించెను. రా జాతని పాదములపైఁ బడి తా నేమియుఁ దప్పు చేయలేదని యర్థింపఁగా మహర్షి దివ్యదృష్టిని జూచి రాజు నిర్దోషి యని సేవకుని మోసము వలన జరిగెనని గ్రహించి "రాజా! నీవు నిర్దోషివే! కాని నా వాక్కు వృథ కాదు. అందుచేఁ బండ్రెండు వత్సరములు రాక్షసుఁడవుగా బ్రతికి పిదప రాజ వయ్యెద వని శాపమోక్ష మొసఁగినాఁడు. తప్పు లేనిదే నన్ను శపించెను గాన వశిష్ఠునే శపింతు నని జల మును దీయఁగా భార్య మదయంతి వారించి పతి నిట్లు ప్రార్థించినది.

గురువులు నిగ్రహానుగ్రహ సమర్థులు గాన శాపమోచన మీయఁగలరు. శాప మొసంగుటకే కాని త్రిప్పుటకు మీరు చాలరు. గురుధిక్కారము మహాపరాధము. కావునఁ బ్రతిశాప మీయవలదని యర్థింపఁగా రాజు శాంతించి పశ్చాత్తప్తుఁడై తీసిన జలమును బాద

ములపైఁ బోసికొనెను. అది శాపోదక మగుటచే దాని వేఁడిమి కాతని పాదములు నల్లఁబడెను. ఆ కారణమున నాతఁడు కల్మాష పాదుఁ డయ్యెను. శాపఫలముగ నాతఁడు రక్కసుఁడై వనమునఁ దిరుగుచు ననేక జంతువులను మనుజులను దినుచుండెను. అయ్యడవిలో నూతన విప్రదంపతులు వచ్చుచుండుటఁ జూచి యా దనుజుఁడు పురుషుని బట్టి తినఁబోవఁగా సతి యెంతయో దీనముగ నర్థించినది. కరుణాహీనుఁ డైన యా రక్కసుఁ డా విన్నపమును వినక యా వరుని దినివేసెను. ఆ దృశ్యమును జూచి మూర్ఛపడి లేచి మహాదుఃఖమున నా వనిత చితిని బేర్చి తనపతి యెమ్ములను దానిలోఁ బడవైచి తాను సహగమనము చేయ సంకల్పించి రాక్షసు నుద్దేశించి యిట్లు పలికినది.

“మాకుఁ గొలఁది దినముల క్రిందటనే వివాహ మయినది. క్రొత్తజంట యగు మాలోఁ బతిని జంపి మాకు సంగమము శూన్య మొనరించితివి గాన నీవు స్త్రీసంగమ మొనరించినచో మృతుఁడ వగుదు” వని శపించి యగ్నిలోఁ బడి మరణించినది. ఆ దనుజుఁడు ద్వాదశవర్షముల రాక్షసత్వ మనుభవించి పిదప స్వస్వరూపము నొంది యింటికిఁబోయి బ్రాహ్మణవనితా శాప భీతిచేఁ గుందుచుండెను. పుత్రహీనుఁ డైన కల్మాషపాదుఁడు వంశక్షయ మగు నని చింతించుచుండెను. విరక్తుఁడై తప మొన రించుకొనుట కడవులకు వెడలఁ దలఁచెను. బ్రహ్మహత్య యాత నిని వెంటాడుచు మ్రింగుదునని భయపెట్టుచుండెను. తన్నివార ణకై రా జనేక యజ్ఞములు జప తపములు గావింపుచుఁ దీర్థ

యాత్రలు గావించెను. కాని యది విడువలేదు. అంత నా నృపతికి గౌతమర్షిదర్శన మయినది. మహర్షికి సాష్టాంగపడి తనకు బ్రహ్మహత్యాపాతక విముక్తిసాధనముఁ దెల్పుమని యర్థించెను. గౌతముఁ డోదార్చి "నాయనా! దీనజన వత్సలుఁడు, జగద్రక్షకుఁడు నగు శంకరుఁ డుండఁగా భయ మెందులకు? గోకర్ణ క్షేత్రమునకుఁ బోయి మహాబలేశ్వరుని సేవించుకొనుము. నీ పాతకములు నాశన మగును. గోకర్ణేశ్వరుని సేవించినవాని పాతకములు పటాపంచ లగును.

శ్లో॥ (శృణు రాజ న్మహాభాగ) క్షేత్ర మన్య త్ప్రతిష్ఠితమ్
మహాపాతక సంహారి గోకర్ణాఖ్యం శివాలయమ్
తత్రస్థితి ర్న పాపానాం మహద్భ్య మహతా మపి
మహాబ లాభిధానేన శివః సన్నిహితః స్వయం
సర్వేషాం శివలింగానాం సార్వభౌమో మహాబలః
చతుర్యుగే చతుర్వర్ణః సర్వపాపాపహారకః
పశ్చిమాంబుధితీరస్థం గోకర్ణం తీర్థ ముత్తమమ్
తత్రాస్తి శివలింగం తన్మహాపాతకనాశకమ్.

(శివపురాణము)

మహాపాతకములను బోఁగొట్టు నట్టి దని విఖ్యాతి నందిన గోకర్ణమను శివక్షేత్రము పశ్చిమసాగర తీరమున నున్నది. అక్కడ ఘోరపాతకము లైనను నశించును. ఆ క్షేత్రమున మహాబల నామముతో స్వయముగా శివుఁడే నిలిచి యున్నాఁడు. సకల శివలింగములందు నీ మహాబల లింగము సార్వభౌమము.

నాలుగు యుగములలోను శివుఁడు నాలుగు వర్ణములలో నుండి మహా పాపములను హరించును గాన గోకర్ణక్షేత్ర శివలింగము మహా పాతకముల నశింపఁజేయున దని ప్రసిద్ధ మగుటచేత నా తీర్థ ముత్తమ మైనది.

శా. గోకర్ణంబున కేగు వేగ మచటన్ గోరాజవాహున్ హరున్
శ్రీకల్యాణకరున్ మహాబలశివున్ సేవింపు మీ బ్రహ్మహ
త్యా కాలుష్యము నాశ మొందు సుఖముల్ దైవాఱు సర్వేశ్వరుం
డేకాకారముతో నటన్ దనరు భూమీశానచూడామణీ!"

క. అన విని సంతుష్టుండై
ముని సెలవున్ గొని ప్రయాణము సలిపి యటకున్
జని కొల్చి మహాబలుఁ ద
ద్ఘనకృప ద్విజహత్యఁ బాసి కనియెన్ ముదమున్.

(ఆంధ్రశివపురాణము)

గోకర్ణక్షేత్రమున మఱికొంతకాలము వసించి కల్మాష పాదుఁడు నిర్ధూ తాఖిల కల్మషుఁడై సకలరాజభోగము లనుభ వించి యంత్యమున శివానుగ్రహమున మోక్షము నందెను.

శ్లో॥ గోకర్ణ సదృశం క్షేత్రం నా స్తి నా స్తి జగ త్త్రయే
మహాబల సమం లింగం న భూతో న భవిష్యతి
నా గ్నినా న శశాంకేన న తారాగ్రహనాయకైః
తమో వినశ్యతే సమ్యక్ యథా సవితృదర్శనాత్
తథైవ నేతర స్తీర్థే నానాక్షేత్ర మనోరమైః
సద్యః పాపవిశుద్ధి స్స్యాత్ యథా గోకర్ణదర్శనాత్

దృష్ట్వా వా దివ్యలింగం చ శృత్వా వా సాగరధ్వనిమ్
కోటితీర్థే నర స్స్నాత్వా పునర్జన్మ న విదంతి॥
శ్లో॥ అతిపాప శతం కృత్వా బ్రహ్మహత్యాది మానవః
సకృత్ ప్రవిశ్య గోకర్ణే సద్యో ముచ్యేత పాతకైః॥

ముల్లోకము లందును గోకర్ణతుల్య మగు క్షేత్రము లేదు. మహాబల లింగముతో సాటి యగునది భూతకాలమున లేదు. భవిష్యమున నుండదు. సూర్యదర్శనమువలనఁ జీఁకటి చీల్చఁబడిన ట్లగ్నిచేఁ గాని, చంద్రునిచేఁ గాని, నక్షత్రములచేఁ గాని, గ్రహ నాయకులచేఁ గాని చీల్చఁబడదుగదా! అటులే గోకర్ణ క్షేత్ర దర్శనమువలనఁ బాపములు వెంటనే తొలఁగిన ట్లితర క్షేత్రములవలనఁ దొలఁగవు. మహాబలేశ్వర లింగమును జూచుటవలనను, సాగర ధ్వనిని వినుటవలనను, కోటితీర్థమున స్నాన మొనరించుట వలనను నరునకుఁ బునర్జన్మము లేదు.

మానవులు బ్రహ్మహత్యాది మహాపాపశతము లొన రించియు గోకర్ణ క్షేత్రము నొకసారి ప్రవేశించినచోఁ బాపముల నుండి ముక్తులగుదురు.



# శ్రీ హరికి సుదర్శన ప్రాప్తి

బలసంపన్ను లగు దైత్యు లాదితేయులను బీడింపుచుండఁగా నోర్వ లేక దేవతలు నారాయణునికడకు నరిగి మొఱపెట్టుకోఁగా "రక్కసులు బలవంతులు. వారిని నిగ్రహింపవలె నన్న శివానుగ్రహము కావలెను గాన శివానుగ్రహమునకై యత్నింతును. మీరు వెడలుఁ" డని విష్ణువు వారిని బంపి తాను గైలాసమున కరిగి శివుని గుఱిచి తప మొనరించుచుఁ బార్థివలింగము నర్చింపసాఁగెను. మానససరోవర మందలి సహస్రదళపద్మములచేఁ బూజింపుచు స్థిరచిత్తుఁడై ధ్యాననిర్మలుఁడై యీశ్వరార్చనా దీక్షితుఁ డయ్యెను. ఎంతగా సేవించినను శివసాక్షాత్కారము కాలేదు. మఱింతదీక్ష వహించి భక్తిశ్రద్ధలతో దృఢమనస్కుఁడై యొక్కొక్క నామమున కొక్కొక్క కమలము వంతున శివ సహస్రనామార్చన మారంభించి నిత్య మొనరింపసాగెను.

ఒకనాఁడు శివుఁ డాతనిని బరీక్షింపఁ దలఁచి సహస్ర కమలములలో నొకటి లోపింపఁజేసెను. తగ్గిన యొక్క కమలము నకై విష్ణువు పృథ్వియంతయు గాలించినను సమకూరలేదు. అందుచేఁ గమలనేత్రుఁడు తననేత్రకమలమును దీసి శంకర పూజను బూర్తిచేసెను. శంకరుఁడు సాక్షాత్కరించి " నీభక్తికిఁ బ్రసన్నుఁడ నైతి నభీష్ట మేమి" యని ప్రశ్నింపఁగా దేవతలను

రక్కసులు పీడించుచున్నా రనియు వారిని నిర్జింపలేక నీ శరణు గోరితి మనియు విన్నవించెను.

శ్లో॥ ఇతి శృత్వా వచో విష్ణో ర్దేవ దేవో మహేశ్వరః
దదౌ తస్మై స్వకం చక్రిం తేజోరాశిం సుదర్శనమ్
తత్ప్రాప్య భగవా న్విష్ణుః దైత్యాం స్తా న్బలవ త్తరాన్
జఘాన తేన చక్రేణ ద్రుతం సర్వా న్వినా శ్రిమమ్
జగ త్స్వాస్థ్యం పరం లేభే బభూవుః సుఖినః సురాః
సుప్రీతః స్వాయుధం ప్రాప్య హరి రాశీ న్మహాసుఖీ ॥
(శివపురాణం)

దేవదేవుఁ డగు మహేశ్వరుఁ డా విష్ణుని వాక్యము లాలకించి తేజోరాశి యగు సుదర్శన మను తన చక్రము నాతని కొసంగెను. ఆ చక్రిముచే ననాయాసముగా సత్వరము విష్ణు వా బలవంతులగు రక్కసుల నందఱను సంహరించెను. దేవతలు సుఖవంతులై యుత్కృష్టమైన స్వాస్థ్యమును బడసిరి. ఉత్త మాయుధమును బడసి శ్రీహరి సంతోషించి సుఖవంతుఁ డయ్యెను.

సుదర్శనమును బ్రిసాదించి పరమేశ్వరుఁడు విష్ణువుతో నిట్లు చెప్పెను.

నారాయణా ! నీ వొనరించిన సహస్రనామస్తోత్రిము మిక్కిలి పవిత్ర మైనది. దాని రూపమే యీ సుదర్శనము. ఆ స్తోత్రిములోని యొక్కొక్క నామ మొక్కొక్క యంచుగా నిర్మింపఁబడినది. దీనితో సకల దైత్య సంహారము గావింపఁ

బడును. ఆ స్తోత్రమును బఠించువారికి సకలాభీష్టములు నెఱ వేఱును. సర్వానర్థశాంతికై నారూపము ధ్యానించి, సకల దుఃఖ శాంతికై నా యీ సహస్రనామముల సంస్మరించి సర్వాభీష్టసిద్ధికీ సుదర్శనమును ధరింపుము. విధివిహితముగా సహస్రనామముల శతపర్యాయములు పఠించినచో సకలభయములు తొలఁగును. దీని పఠనమువలన నీరోగమై విద్యాప్రాప్తియు శివభక్తియు శివలోకప్రాప్తియుఁ గలుగు నని మహేశ్వరుఁ డంతర్హితుఁ డయ్యెను.

విష్ణు వా సుదర్శనమును ధరించి శివుని ధ్యానింపుచు శివసహస్రనామముల స్మరించి సకలదేవతలచేఁ బఠింపఁజేసి సకలదానవసంహార మొనరించి లోకశాంతిని గలిగించెను.

## గజాసురగాథ

మహిషాసురుని కుమారుఁడు గజాసురుఁడు. పరాశక్తి దేవతల సౌఖ్యమునకై మహిషాసురుని మర్దించినందున దేవతలపైఁ బగఁదీర్చికొనుటకు గజాసురుఁడు బ్రహ్మనుగూర్చి మహాఘోరముగఁ దప మొనరించెను. ఆయుగ్రతకు దేవతలు తాపము నొంది బ్రహ్మను శరణమువేఁడఁగా నాతఁడు వారి కభయమిచ్చి గజాసురునకు దర్శన మొసంగి వరముఁ గోరుమనెను.

వాఁడు "కామనిర్జితులైన స్త్రీపురుషు లెవ్వరిచేతను దాను వధ్యుఁడు కాకుండునట్లును, సర్వులను జయింపఁగల మహా బలవీర్యములు పొందునట్లును బ్రసాదింపు" మని కోరెను. విరించి యట్లే యొసంగి మాయ మయ్యెను. వరప్రభావ గర్వమున గజాసురుఁడు విజృంభించి దేవతలను బ్రమథులను మానవులను మునులను బాధించుచుండెను. లోకములన్నియు ధర్మభ్రష్టము లగుచున్నవి. పృథ్వి గజగజలాడుచున్నది. దేవత లందఱును గైలాసమునకు వెడలి మహేశునితో మొఱపెట్టుకొనిరి, ఉగ్రుఁడు శివగణములను వెంటఁబెట్టుకొని గజాసురునిపై రణభేరి మ్రోగించినాఁడు. ఇరు వర్గముల భీకరసంగ్రామము జరిగినది. ఆ సంగ్రామమున శూలి త్రిశూలముచే గజాసురుని బొడిచి పై కెత్తినాఁడు. శూలమునకుఁ బైనున్న దనుజుఁడు చంద్రమౌళికి ఛత్రమువలె నిల్చినాఁడు. మహేశ్వరశూల సంస్పర్శచే నాతని పాపబుద్ధి మాఱి శివభక్తి పొడమి యాతని నిట్లు స్తోత్ర మొనరించెను.

## — దండకము —

నాథా భవానీసనాథా దురక్షహతాత్ముండ దుర్మాన భూతావిభూతుండఁ గ్రోధాగ్నితప్తుండ దుర్గర్వశైలాధిరూఢుండ నీచాతినీచుండఁ బాపాత్ముఁడన్ మత్సరోపేతుఁడన్ శాసనీయేంద్రియాధీనుఁడన్ హీనుఁడన్ ద్వద్గుణస్తోత్రముం జేయ నే నెంతవాఁడన్ భుజంగేంద్రుఁడే వేయి శీర్షంబులన్ వంచె మృత్యుంజయా నిన్నె నే దిక్కుగా నెంచుకొన్నాఁడ నాపైని నీపూర్ణ

కారుణ్య ధారాప్రసారంబు గావింపవే మామకీనాపచారంబు సైరింపవే ఘోరసంసారపాథోధితీరంబునకా జేర్చవే మోహపాశంబు ఛేదింపవే ధూర్జటీ తండ్రి వీ వే ను బుత్రుండఁ బాలింపవే నన్ను దేవా యమేయ ప్రభావా ప్రసన్నస్వభావా భవద్భక్తికిన్ సాటి గానేర వష్టాంగయోగంబులున్ వేదమంత్రంబులున్ దానముల్ ధర్మముల్ యజ్ఞముల్ దేవతోపాసనల్ తండ్రి మూర్తిత్రయాత్ముండ వీవే ప్రపంచంబు లెల్లన్ సృజింపంగఁ బోషింపఁగన్ సంహరింపంగ నీకంటె నన్యుం డెవం డుండు దక్షుండు స్వామీ గిరీశా మహేశా నమస్తే నమస్తే నమస్తే నమః.

(ఆంధ్రపద్మపురాణము)

కపర్ది సంతోషించి వరమును గోరు మనఁగా "మహేశా, నీవు దిగంబరుఁడవుగా నుంటివి. నేఁటినుండి నా చర్మమును నీవు ధరించి కృత్తివాసుఁ డను నామమును వహింపుము. నా యీ చర్మము చిరుగక, కాలక పవిత్ర సుగంధబంధురమై యుండుఁ గాక!" యనికోరెను, మహాదేవుఁ డనుగ్రహించెను. గజాసుర చర్మమును దీసి ధరించి కృత్తివాసుఁ డయ్యెను. ఆనాఁడు సకల దేవతలును మహోత్సవము నొనరించిరి. ఈశ్వర ప్రసాదమున గజాసురుని శరీరము పవిత్ర లింగమై కృత్తివాసేశ్వర నామమునఁ బ్రసిద్ధమై కాశిలో ముక్తి నిచ్చుచుండెను.

# త్రిపురాసుర సంహారము

స్కందునిచే సంహరింపఁబడిన తారకదనుజుని తనూజులు ముువ్వురును సుపర్వులపై ద్వేష మూని వారిని జయించుటకై బలపరాక్రమలబ్ధిఁగోరి తప మొనరింప సంకల్పించిరి. పరమేష్ఠినిఁ గూర్చి మహాఘోరముగఁదప మొనరించుచున్నారు, కొన్నివేలేండ్లు జరిగినవి. విధాత ప్రత్యక్షమయి వర మొసంగుదును గోరుఁడనఁగా వారు జరామరణములు తమకు లే కుండునట్లును, నెట్టివానినైనఁ జంపఁగలుగునట్లును గోరిరి. అంత ధాత యది యసాధ్య మనియుఁ బుట్టినవానికి గిట్టుట తప్పదనియు వేఱొక వరముఁ గోరుఁ డనియు ననెను. వారు శత్రువులకు దుర్గమమై యభేద్యమై కామగమనము గలిగిన మూఁడు నగరములు నిర్మించి యిమ్మనినారు. జ్యేష్ఠుఁడు స్వర్ణపురమును, ద్వితీయుఁడు రజితపురమును, దృతీయుఁడు లోహపురమును గోరిరి. అవి వేరువేరుగా నుండుచు గగనవీధిని దిరుగుచుఁ జూచువారికి మేఘములవలెఁ గన్పడ వలె నఁట. రుద్రుఁడు రథారూఢుఁడై నొక్కశరముచే మూటి నొకే లక్ష్యమునఁ గొట్టినప్పుడే నాశము కావలె నఁట. శివుఁడే వారి కిష్టదైవము గావలెనఁట; ఇవి వారి యభీష్టములు. సురజ్యేష్ఠుఁ డనుగ్రహించి యంతర్ధానుఁ డైనాఁడు. ఆతని శాసనమున మయుఁడు స్వర్ణ, రజిత, లోహ నగరముల రమణీయముగ నతులైశ్వర్య శోభితముగఁ గామగమనములతో నిర్మించెను.

ఆ పురములు మూఁడును మనోహర సౌధములతో, జల పూర్ణ తటాకములతో, మహనీయ తరులతా విలసి తోద్యానవన ములతోఁ, గోష్ఠలములతో, రథ గజాశ్వ పదాతి బలములతోఁ రమణీయ దేవతాయతనములతో, మంజుల ద్విజగాన నిస్వనము లతో, వేదవేదాంగవేత్త లగు భూసురులతో మహావైభవమునఁ దేజరిల్లుచున్నవి. అందలి ప్రజ లందఱును సుకృతాత్ములే. వారే కొదవయు లేక యానంద మయులై జీవించుచున్నారు. ఈపుర ములఁ బాలించు రక్కసులు మూఁగురును దేవతలను భూత కోటిని బీడించుచున్నారు. ఈశ్వరసేవా సంపన్నులై స్వధర్మ వర్తనమును మీఱక తిరుగుచున్నారు, దేవత లందఱు వెడలి బ్రహ్మతోఁద్రిపురాసురుల వలన తమబాధలు చెప్పుకోఁగా బ్రహ్మ తానే వారి కట్టి వరము లొసంగితి ననియు వారిని జయించు టకు నీలకంఠుఁడే సమర్థుఁ డనియు నాతని యర్థింపుఁ డనియు బోధించెను. వారు పరమేశ్వరుని బ్రార్థించి విన్నవింపఁగా నాతఁ డాలించి "దేవతలారా! త్రిపురదైత్యులు నా భక్తులు, స్వధర్మపరాయణులు, నాకు మిత్రులు. మిత్రద్రోహము నేను గావింపఁజాలను. బ్రహ్మహత్యా సురాపా నాది మహాపాత కముల కైనఁ బ్రాయశ్చిత మున్నది కాని మిత్రద్రోహమునకు నిష్కృతి లేదు. మీరు వెడలి నారాయణుని గోరుఁ" డనఁగా వారు వెళ్లి వైకుంఠునితోఁ జెప్పికొనిరి.

శ్రీహరి "దేవతలారా! ధర్మమెక్కడనున్నదో యచట నాశ మన్న దుండదు, వారు ధర్మవర్తనులు. వారి నేమియుఁ

జేయఁ జాలను. అయినను బరమేశ్వరప్రీతిగా మీరు యజ్ఞము లొనరింపుఁ" డనఁగా దేవత లాచరింపఁగా నగ్నికుండమునుండి కొన్ని గణము లుత్పన్న మైనవి. ఆ సైన్యముతో మీరు త్రిపు రాసురుల నెదిరింపుఁడని దేవతలను బంపినాఁడు వాసుదేవుఁడు. ఆ సైన్యములన్నియుఁ ద్రిపురదనుజ పరాక్రమాగ్నిలో శలభములై నశించినవి.

ఆ దనుజులు పాపములఁ గూడఁ జేయుచున్నను, నిరంతర శివారాధనాఫలముగా వారి పాతకములు నశించుచున్నవి. ఈశ్వర భక్తులగుటచేతను. వేదధర్మానువర్తను లగుటను నిత్యకర్మాను ష్ఠానపరులై నందునను వారి నేమియుఁ గావింపలేక దామోదరుఁ డాలోచించి తనదేహమునుండి 'అరిహన్' అను వానిని బుట్టించెను. త్రిపురాసురులను ధర్మదూరప్రవర్తకులఁ గావించుకొరకై యాతనిచే వేదవిరుద్ధగ్రంథము నొకటి వ్రాయించెను. ఆ గ్రంథము స్వర్గ నరకము లెక్కడను లేవనియు, సుఖానుభవమే స్వర్గ యనియు, దుఃఖానుభవమే నరక మనియు, భగ వానుఁ డెక్కడ లేఁ డనియు, నేప్రాణికిని హింసఁ గావింపరా దనియు, నహింసయే పరమధర్మ మనియు, యజ్ఞయాగాదులు చేయరా దనియు బోధించును.

హృషీకేశుఁ "డా గ్రంథార్థముల బోధించుచు సన్యాసి వేష మున సంచరించుచుఁ ద్రిపురాసురులను వేదవిరుద్ధవర్తనులుగఁ గర్మభ్రష్టులుగ నాస్తికులుగఁ జేయు" మని యరిహన్‌కుఁ జెప్పెను.

అతఁడు నలుపురు శిష్యులను గైకొని త్రిపురముల కేఁగి యొక వృక్షముక్రిందఁ గూర్చుండి బోధింపసాఁగెను. ఎన్నిదినము లైనను నాతని బోధనముల వినుట కొక్కఁడును రాలేదు. వినలేదు. తనమాయ నిష్ఫలమై యాతఁడు శ్రీహరిని స్మరించెను. ఆతఁడు నారదునిఁ బంపి త్రిపురాసురుల కరిహన్మతబోధపై రక్తి కలిగి నాస్తికు లగునట్లు చేయు మనఁగా నారదుఁడు వెడలి తార కాక్షుని దర్శించెను. ఆతఁడు నారదు నర్ఘ్యపాద్యాదికములతోఁ బూజించి యాసనమునఁ గూర్చుండఁబెట్టి యడుగుచున్నాఁడు,

గీ. మూతికడ పేల్కయేమి ? యీ ముఱికి పటము
లేమి ? యీ కుంచె యేటికి? ఋషి వరేణ్య !
క్రొత్త వేసంబు వింతగాఁ గొంటి వేటి
కెఱుఁగఁజెప్పుము మాకు బొంకేమిలేక.

ఆమాటలకు నారదుఁడు సమాధాన మిచ్చుచున్నాఁడు.

గీ. అసురనాథ ! యొకండు మహానుభావుఁ
డగపడియె నాతఁ డొసఁగె నీయతులదీక్ష
యిదియె నిర్వాణకారణ మిదియె సకల
భోగ సంపన్నిదానంబు పుడమిలోన.

క. దీనికి మించిన దెందును
గానఁగడ దరసినాఁడఁ గౌశల్యమునన్
దీనికిఁ గ్రిందివె యన్నియు
మానితి తొలినాఁటి వెఱ్ఱిమతముల నెల్లన్.

(ఆంధ్రశివపురాణము)

ఆ మాటలు విని "జ్ఞానవృద్ధులును మునిశ్రేష్ఠులు నగు మీ రవలంబించిన మతమే మాకు నవలంబనీయముగదా! మేము నా దీక్షను స్వీకరింతుము. ఆ మహానుభావుఁ డెవ్వఁ డెక్కడున్నాఁ" డని దనుజుఁడు ప్రశ్నించెను. అతఁడు నేఁటి కేడవ దినమున నీకడకు రాఁగలఁడు. నీ వాతనికడ దీక్ష నొందితివేని యీశుఁడవు శ్రీశుఁడవు నీవే యగుదు వని నుడివి వెడలినాఁడు నారదుఁడు.

ఏడవ దినమున నొక యతి తనపురమునకు వచ్చెనని చారులు విన్నవింపఁగా దానవనాయకుఁ డాతని యొద్ద కరిగి సాష్టాంగపడి "మహాత్మా! మీ మాహాత్మ్యము నారదుని వలన నెఱిఁగి మీ యుపదేశము నాసించి మీ యానతిని వర్తింపఁ గోరి వచ్చితిని. నన్ననుగ్రహించి శిష్యునిగా గ్రహింపుఁ" డని యర్థించెను. ఆ యతి త్రిపురదనుజత్రయమునకు దీక్ష నొసంగెను. యథా రాజా తథా ప్రజా గానాపురజనులెల్లరును రాజ మతమునే స్వీకరించిరి. త్రిపురాసురులు సపరివారముగాఁ బ్రజావాహినితో నాతని శిష్యులైనారు. ఆ గురుఁ డాశిష్యులను గూర్చుండఁబెట్టి బోధించు ధర్మము లివి :—

ఆ. బ్రహ్మ మొదలు గడ్డిపఱక వఱకును నా
త్మయె యొకండు వేఱుఁ దలఁపఁ గనము
హరిహరులు విరించి యను పేర్లు మనపేరు
లట్టె యిందు భేద మరయనగునె?

ఆ. బమ్మ మొదలు దోమవఱకును దేహంబు
సుఱుఁగు నియత మింత సూటిగాను
సకల జీవులకును సమమె యాహార ని
ద్రాసురత భయములు తలఁచి చూడ.

సీ. మంచ మందుఁ బరున్న మహిఁ బరున్నను నిద్రి
యొక్క-తీరుగ సౌఖ్య మొందఁజేయు
బ్రహ్మ కేని కొలందిపాటి కీటమునకేన్
జా వన్న కడు వెఱ పావహిల్లు
హింస సేయఁగఁబోల దే జంతువును గాని
భువి నహింసయె గడు భూరిధర్మ
మిచ్చటనే స్వర్గ మిచటనే నరకంబు
సుఖదుఃఖములె వానిచొప్పు లరయఁ

గీ. గలవు ధర్మములను దానములును బుడమి
స్వల్ప ఫలదము లయ్యివి చర్చ సేయ
హింసకుం దేగు నరకం బహింసకుండు
చనెడు స్వర్గం బిచట లేదు సందియంబు.

గీ. సకల నిగ మాగమాంత శాస్త్రముల సార
మరసి చెప్పెద రెండు వాక్యముల వినుఁడు
లే దహింసను నెందుఁ బోలిన సుకృతము
లేదు హింసను నెందుఁ బోలిన యఘంబు.

(ఆంధ్రశివపురాణము)

యజ్ఞములు చేయరాదు. అభయదానమే గొప్పదానము. వ్యాధిగ్రస్తున కౌషధము లిచ్చుట, విద్యార్థికి విద్య నొసంగుట, దేహమున్నంతవఱకు యథేచ్ఛగా భోగము లనుభవించుటయే ధర్మము.

మతములు జాతులును లేవు. అందఱు నొక్కటియే. బ్రాహ్మ ణాది వర్ణచతుష్టయవిభాగము కల్పితము.

ఈ బోధనములు త్రిపురాసురులకు వారి పరిజలకుఁ దృప్తి నొసంగినవి. తదను సారులై యీశ్వరార్చనము, వేద కర్మానుష్ఠానము మాని యర్థ కామముల నాశ్రయించిరి. వారి వనితలు పాతివ్రిత్యధర్మముల విడిచి స్వేచ్ఛాప్రవృత్తి కలవా రైరి. గర్వములు పెరిఁగినవి. సుకర్మలు తఱిఁగినవి. అపవిత్రత, యవిధేయత, యనాచారతలు పెల్లుబికినవి. నాస్తిక లత నలు వైపుల తీవ లల్లుకొని పుష్పించినది. త్రిపురదైత్యులు వైదిక ధర్మచ్యుతులైనారని దేవత లచ్యుతేశ్వరులకు నివేదించినారు.

ఇఁక దైత్యులను బ్రత్యక్షముగ నేను సంహరింతు నని త్రినేత్రుఁడు పల్కెను. విశ్వకర్మను రప్పించి భూమండల మంతయు రథముగా నిర్మింపఁజేసెను. నాల్గువేదములును రథ్యము లైనవి. ఓంకారము కొరడా, బ్రహ్మ సారథి. ఆకాశము ఛత్రము, మేరునగము ధనుస్సు, శేషుఁడు నారి, విష్ణువు శరము. శరధులే శరధి, సూర్యచంద్రులు రథచక్రములు, మహేశ్వరుఁడే రథి కుఁడునై సకలదేవతాసైన్యము వెంటఁబెట్టుకొని త్రిపురాసురసంహా రమునకు బయలుదేఱినాఁడు. ఈ యుద్ధసన్నద్ధుఁ డగు శివుని రూప మొక తాత్త్వికరూప మగునుగదా : దేహము రథము, గుఱ్ఱములే యింద్రియములు, చిత్తమే పాశము, బుద్ధియే సారథి, జ్ఞానమే కశము, అరిషడ్వర్గములు రిపులు, స్థూలసూక్ష్మ కారణ శరీరములే త్రిపురములు, మనోవికారములే తత్పురజనులు,

ఈషణత్రయములే త్రిపురాసురులు, వారిని సంహరించుటయే శివకృత్యము - అదే జన్మసాఫల్యసిద్ధి —

త్రిపురదనుజ సంహారమునకు వచ్చిన త్రినేత్రుఁడు రక్కసుల నొక్కబాణమునఁ గూలనేయఁ దలంచి శరసంధాన మొనరించి త్రిపురములను గుఱిపెట్టుచుండఁగా నా పురము లొకేవరుసకు రాకున్నవి. మూఁడును వేరువేరుగా భ్రమించుచున్నవి, ఎంత లక్షించినను మూఁడు నొక్కరేఖకు వచ్చుటలేదు. వేయివత్సరములు యత్నించినాఁడు పరమేశ్వరుఁడు, ఇంతలో నభోవాణి "మహేశా! వినాయకునిఁ బూజింపకుండ యత్న మారంభించితివి. ఇది నెఱవేఱదు. గణనాధునిఁ దొలుతఁ బూజింపు" మనఁగా శివుఁడు గణపతిని గొలిచి పిదప గుఱిఁజూచి శరసంధాన మొనరింపఁగా మేఘములవలె నాకసమువఁ బయనించు త్రిపురములు గోచరించినవి. విష్ణుమయ మగు పాశుపతాస్త్రమును బ్రయోగించినాఁడు క్షోణీరథుఁడు. మూఁడు నగరము లొక్కమాటున భస్మమైపోయినవి. త్రిపురదనుజులును దమతప్పును గుర్తించి సనాతన వైదికధర్మము విడిచి నూతన గురువుల బోధలు విని ధర్మవ్యతిరేక మొనరించినందుల కిది ఫల మని చెప్పుచు శివుని సంస్తుతించి తమ దుశ్చర్యలచేఁ దాము నశించుచుంటి మని యెన్నఁడు శివభక్తి తమ కుండున ట్లనుగ్రహింపు మని వేఁడికొని మువ్వురును భస్మమైనారు. ప్రళయనాశమువలెఁ ద్రిపురజననాశము నిశ్శేష మైనది. త్రిపురాసురదాహముతో దేవత లందఱు సంతుష్టులై నిజనివాసముల కరిగిరి.



# దశారామభీమేశ్వరుఁడు

వేదవిభాగమును గావించిన వ్యాసమహర్షి భూమండలములోని బహుపుణ్యతీర్థయాత్రలఁ గావింపుచుఁ జిత్తము భవభక్తి యుక్తముగఁ బుణ్యరాశియగు వారణాసి (కాశి) కి వెడలెను. శమదమాదిసంపన్నులును సమధిక సత్కవీశ్వరులు నగు జైమిని పైల సుమంతాదులు మున్నూరుశిష్యులు వెంట నున్నారు. ఎట్టి ముహూర్తమున నా కాశిలో నడుగుఁ బెట్టినారో కాని వారి కా వీట నేడుదినములు భిక్ష లభింపలేదు. శిష్యపరివృతముగ నా దివ్యమౌని కుపవాసము లైనవి. శ్రీ విశ్వేశ్వరకృపా పాత్రి దివోదాసభుజబలపరిరక్షితమై, ధనధాన్యాయురారోగ్యపశ్రిజాపశు సంపత్సమృద్ధమై నిరతాన్నదానరత, వేదాధ్యయనసంపన్న బ్రాహ్మణాగారవిరాజమానమై. నిత్యోత్సవస్థిరతరమై యున్న కాశీపురములో నొక్కనాఁడు కూడ వారికి భిక్షాలబ్ధి లేకపోయినది. క్షుధావ్యథితహృదయులై సాత్యవతేయుఁడును శిష్యులును మిక్కిలి దుఃఖించినారు. అష్టమదివసమున నరుణోదయమున మేల్కాంచి మణికర్ణికాంబువుల నఘమర్షణస్నాన మాచరించి, తత్తీరస్థవాలుకాలింగములను బీఠార్చనాశంభులింగములను మంత్రాక్షతపుష్పాదులచేఁ బూజించి పంచాక్షరీమంత్రజపనిష్ఠుఁడై సకల దేవతావందన మాచరించి ముక్తిమంటమునఁ గూర్చుండి శాస్త్ర విచారములఁ గావించి మధ్యాహ్నము కాఁగా శిష్యులతో భిక్షాటనమున కరిగినాఁడు బాదరాయణుఁడు. ప్రచండభానుఁడు నడినెత్తికెక్కి

విజృంభించుచున్నాఁడు. ఆ కఱకుటెండలో సప్తవాసరోపవాస కృశములయిన దేహములతో నెన్నిగృహముల కేఁగి "భిక్షాం దేహి భవతి!" యన్నను నాస్తివాచకమే కాని యస్తిశబ్దమే వినఁబడలేదు. నెత్తిపై నెండకుఁ గుక్షిలోనియాఁకటికిఁ దట్టు కొనలేక వ్యాసమౌని భిక్షాపాత్రమును శతధా భిన్నము లగు నట్లు నడివీధిలోని బండఱాతిపై విసరికొట్టెను. ఆతనిలోఁ గ్రోధ మధిక మైనది. ప్రజ్ఞావిభవ మంతయుఁ జెడినది. మనోనైచ్యము పొడమినది. వివేక మంతరించినది. బుభుక్షితః కిన్న కరోతి పాపమ్!" నిఖిలకైవల్యకల్యాణనిలయ మగుకాశిపైఁ గోపించి శపింపఁ దలఁచి నిజకమండలువు లోని గంగాజలమును నంగుళీ పవిత్రసనాధమగుహస్తమున గ్రహించి - "గురువర్యా! యిది ధర్మము కాదు. కోపము నుపసంహరింపుఁ" డని తాపసశిష్యు లెల్లరు సాంజలిబంధులై యర్థించినను వినక భారతామ్నాయ గ్రధనాబ్జసంభవుఁడు

శ్లో॥ మా భూ త్త్రైపూరుషీ విద్యా, మా భూత్త్రైపూరుషం ధనమ్
మా భూ త్త్రైపూరుషీ భక్తిః, కాశ్యాం నివసతాం సదా॥

(భీమఖండం)

కాశియందు నివసించువారలకు మూఁడుపురుషాంతరముల వఱకు విద్యగాని, ధనము గాని, భక్తిగాని, లేకపోవుఁగాక! యని శపింపఁ బోఁగాఁ గంప మొదవి కలఁతపడుచున్నదే కాని శాపజల మందుకొనుటకుఁ గేలు సాఁగదయ్యెను. అంతలో నొక యింటితలుపులఁ దెఱచి యేఁబదియేండ్ల ముత్తయిదువ మృదు

మధురముగా నెలుఁ గె త్తి "విప్రోత్తమా! శాపమును మాని యిటు రమ్ము. భిక్షను గొను" మని పిలిచినది. వ్యాసముని సంతసముతో నామెసన్నిధి కరిగి జోహరుఁ జేసి నిలువఁగా నక్కాంత యిటులు పలికినది. "మునివరా! భిక్ష లే దని కాశీపట్టణముపై నింత యాగ్రహింతువా? నీ మనోనిగ్రహమును దెలియుటకై విశ్వ నాథుఁ డిటు లొనరించెను గాని కాశిలో నన్నమునకు లోపముండు నఁటయ్యా!

గీ. శ్రీవిశాలాక్షి బంగారు త్రెడ్డునందు
నమృతపాయస మొసఁగు నభ్యాగతులకుఁ
గాశికాపురి మధ్యాహ్నకాల మనఁగ
వినియు నెఱుఁగవె యాతిథ్య వేళలందు.

ఉ. ఏడు దినంబు లన్నమున కెడ్డము పుట్టినయంతమాత్రిలో
నేడుచుచున్నవాఁడవు మునీశ్వర! నేఁడును నీదు ధీరతన్
పాడఱిపోయెనే శివునిభార్యకు ( గాశికిఁ బుణ్యరాశికిం
గాడు నొనర్పఁ జూచెదవు కంఠపుఁగ్రోధము పెచ్చుపెచ్చుఁగన్.

ఉ. క్రొన్నెలపువ్వుదాల్పునకుఁ గూరిమిభోగపురంధ్రి కక్కటా!
యిన్నగరీలలామమున కీ పరిపాటికి నిట్టికోపమే
లన్న ఘటించెదో మునికులాగ్రణి! నిక్కమువో "బుభుక్షితః
కిన్న కరోతి పాప" మనుకేవలనీతిఁ దలంచి చూడఁగన్.

గీ. కాశిపైఁ గోపగింపఁగఁ గాదు నీకు
నెంత కోపించునో యింత కిందుమౌళి
విప్రుఁడవు గాన నేరము వెదకఁ దగదు
భిక్షఁ గొన రమ్ము మాటలు పెక్కులేల?

(శ్రీనాథుఁడు)

ఆ మాటలపై మౌనియు

శా. తల్లీ! యిన్నిదినాలకేనియు సుధాధారారసన్యందియై
యుల్లంబున్ సుఖియింపఁజేయు పలు కెల్లోవింటి నిప్పీటిలోఁ
బెల్లాకొన్నతనాన నే నొకఁడనే భిక్షనకున్ వత్తునో
యెల్లన్‌శిష్యులఁ గొంచు వత్తునొ నిజం బేర్పాటుగాఁ జెప్పుమా!

గీ. ఈవు పెట్టినభిక్ష మే మిందఱమును
బంచుకొని చేయువారము ప్రాణరక్ష
నాతి! యందఱవియును బ్రాణములు కావె?
నాయదియె ప్రాణ మని వత్తునా భుజింప?

(శ్రీనాథుఁడు)

అని యడిగెను. అంత నా వృద్ధసీమంతిని మందస్మిత వదనారవిందయై "నీవును నీ యంతేవాసులును మధ్యాహ్నస్నాన సంధ్యాదులను గంగలో నిర్వర్తించుకొని రండు. అందఱకును దృప్తిగా నిష్టాన్నములఁ బెట్టింతును. పాపము! భిక్ష పుట్టక యిన్నాళ్లు నాఁకొంటిరి. కడుపునిండఁ బెట్టుదు రం" డనఁగా మున్నూఱుశిష్యులతో మునినాథుఁడు జాహ్నవిలో మునిఁగి మాధ్యాహ్నికవిధుల ముగించుకొని వేదపఠన మొనరింపుచు వచ్చి యా సాధ్వియింటియరుఁగులపైఁ గూర్చుండెను. లోనుండి పరిచారికలు వచ్చి వారల నందఱను సబహుమానముగా లోనికిఁ దోడికొని పోయి భోజనశాలలో వృద్ధానుపూర్వకముగా నుచితాసనములఁ గూర్చుండఁబెట్టి "మొగి విరిసి కఱకుఁ గూడక పగులక వెడలు

పును నిడుపుఁ బసిమియుఁ గలలేఁజిగురరఁటాకులు" వేసినారు. అందఱను గంధపుష్పాక్షతలచేఁ బూజించి కర్పూరపుటారతులతో గౌరవించినారు. వృద్ధవనిత పంక్తిపంక్తిమధ్యను నిలిచి భక్తి శ్రద్ధాతాత్పర్యములతో,

ఉ. ఇందఱుఁ గూడి శాంతి పఠియింపుఁడు, మజ్జన మాచరింపుఁడ
ర్ధేందుకళాకిరీటునకు, నీ యమృతాన్నము లీ పదార్థముల్
మందగతిన్ భుజింపుఁడు. సమస్తజగత్పతికాశికాపురీ
మందిరవిశ్వనాయకుఁ డుమాపతి ప్రీతి వహించుఁగావుతన్.

(శ్రీనాథుఁడు)

అనుచు నా విప్రుల కందఱకు నాపోశనంబులఁ బోయింప నుండెను. "ఆకులలో నాహారపదార్థము లెవ్వియును వడ్డింపఁబడ లేదు. వండినచొప్పుగాని పొగపువాసన గాని లేదు. ఇంతయు వేళాకోళము కాదుకదా! ఈనాఁడును భోజనము లేదు కాఁబోలును. ఇ దేమి మాయయో ! ఆచల్లనిసౌమ్యదృష్టియు, నా ప్రసాద మాధురియు, నా మౌగ్ధ్యమును, నా నిర్మలినత్వమును జూచిన నొక్కింతయు నామెలోఁ గల్లదనము కానరాదు. అరఁటాకుఁ జూచినచోఁ గుండె ఝల్లుమనుచున్నది. పాత్రశుద్ధి కాజ్యముప్రస్త రించి యూరకున్నా రేమి? శాకపాకము లేమియుఁ గానరావు. చంద్రఘుటికాన్యాయము మనపట్ల నిజ మైనది." అని మును లను కొనుచున్నారు. అంతలోఁ బరిచారికలు విప్రుల కాపోశనములు వడ్డించినారు. ముసలిముత్తైదువ నమస్కారము లొనరింపుచు "మీ కీయన్న మమృత మగుఁగాక ! ప్రొద్దుపోయినది. నెమ్మదిగా

గూర్చుండి తృప్తిగా నారగింపుఁ" డని విన్నవించినది. అందఱు నాపోశనముఁ దీసికొనినారు, అంతలో నాకులనిండఁ బిండివంటకములు, దివ్యాన్నములు, షడ్రసీరుచిమత్పదార్థములు నొక్కుమ్మడిని వచ్చినవి. ఆఁకటిచిచ్చు పెచ్చున నొచ్చుకొనుచున్న బ్రాహ్మణులు మధురాన్నములఁ దృప్తిగా భుజించుచు నీమె యన్నపూర్ణా పరమేశ్వరి గాని యన్యభామిని కా దని యూహించుకొనిరి.

గీ. ఎవ్వఁ డే పదార్థ మెంతేనిఁ జింతించు
నతని కాపదార్థ మంత గలిగి
యరఁటియాకుమీఁద నవతారమై యుండు
నిట్టి మహిమ చూడ మెన్నఁ దేని.

(శ్రీనాథుఁడు)

అన్నపూర్ణాదేవి యన్నిపంక్తులలోఁ దిరుగుచు స్వయముగా నమృతాన్నము వడ్డింపఁగా నందఱును గడుపులనిండ భుజించి లేచి సౌధమధ్యస్థవేదికాస్థలమున విశ్రమించినారు. అంతలో నన్నపూర్ణావిశ్వనాథు లొకరిచేతి నొకరు పట్టుకొని నడచి రాఁగా నందఱును లేచి యా పురాణదంపతులకుఁ బ్రణమిల్లి నిలిచినారు. పార్వతీపరమేశ్వరులు వేదికపైఁ గూర్చున్నారు.

శా. గౌరిం జూచినయప్పు డంచితమహాకారుణ్యసంపత్తియుం
దారానాయకమౌళిఁ జూచినపు డుద్యత్క్రోధసంరంభముం
దోరం బై యపు డంతరంగముల సంతోషంబు సంత్రాసముం
బూరించెన్.. ........................

(శ్రీనాథుఁడు)

అపుడు శంకరుఁడు కోపాటోపముతోఁ బారాశర్యునిఁ జూచుచు

సీ. ఓరి దురాత్మ ! నీవారముష్టింపచా
భాస ! యోజనగంధ ప్రథమ పుత్ర !
దేవరన్యాయదుర్భావనాపరతంత్ర !
బహుసంహితా వృథాపాఠపఠన !
భారత గ్రంథ గుంఫన పండితం మన్య !
నీవా ? మదీయపత్నికి నశేష
కైవల్య కల్యాణఘంటా పథమునకుఁ
గాశికాపురికి నిష్కారణంబ

గీ. శాప మిచ్చెద నని యనాచారసరణి
నడుగు పెట్టినవాఁడ వహంకరించి
పొమ్ము నిర్భాగ్య మాయూరిపొలము వెడలి
యెచటికేన్ శిష్యులను నీవు నీక్షణంబ.

క. పోక నడగొట్టితేనియు
రాకింతుఁ బూమీ మొగంబు రాచట్టుపయిన్
శ్రీకాశిక నిందించిన
నీ కింతట నేల పోవు నీచచరిత్రా !

(శ్రీనాథుఁడు)

అని హుంకరించినాఁడు. వ్యాసుఁడు భయకంపితుఁడై వారి యడుగులపైఁ బడి మ్రొక్కి కాశిని వీడిపోవుచుండఁగా నన్నపూర్ణా హృదయము దయాపూర్ణమై యాతనిని బిలిచి యిటు లనినది.

చ. వెఱవకు మో కుమార ! పదివేలవిధంబుల నైన నిన్ను నే
మఱవ మఱేదకుం జనుట మాని సుఖంబున దక్షవాటికన్

దుఱఁగలిగొన్నసమ్మదముతో గమనింపుము భీమనాయకుం
డఱగొఱలేనివేల్పు నిఖిలాభ్యుదయంబులు నీకు నయ్యెడున్.

(శ్రీనాధుఁడు)

ఆ మాటలతో నించుక తేఱికొని యా దంపతులకుఁ బునః ప్రణామ మాచరించి శిష్యసహితుఁడై కాశిని వీడి పోవ నిశ్చయించి యా రాత్రి గడపి తెల్లవాఱఁగనే కాలోచితముల ముగించుకొని కాశీవియోగవేదనాభారముతో నా నగరమునకుఁ బ్రదక్షిణ మొనరించి లోలార్కకేశవులకును, గంగానదికిని, విశాలాక్షీవిశ్వనాయకులకును, ముక్తిమంటపమునకును, గాలభైరవునకున్వుడుంఠిగణపతికిని, దండపాణికిని, సకలదేవతలకును నమస్కృతులొనరించి ప్రయాణమును సాగించి వ్యాసముని జగన్నాథము, శ్రీకూర్మము, సింహాచలము మున్నగు క్షేత్రముల కరిగి స్వాముల సందర్శించుకొని కాశీవియోగదుఃఖము కొంత శాంతింపఁగా హరిహరధ్యానపూజాపరాయణుఁడై పీఠికాపురమును జేరినాఁడు. అచ్చటఁ గుంతీమాధవునిఁ బీఠాంబికను, గుక్కుటేశ్వరుని, దుర్గను, హుంకారిణీశక్తిని, బురక్షేత్రాధిదేవతలను సేవించి యేలానదిని దర్శించి యేలాశక్తిని సంస్తుతించి బాదరాయణముని కుమారారామక్షేత్రమున కేఁగెను. శిష్యమునులతోఁ గూడి ముని కుమారనదిలో స్నానముఁ గావించి కుమారారామ భీమేశ్వరు నర్చించుకొనెను. అచ్చటినుండి త్రిలింగక్షోణి వైకుంఠ మగుసర్పవరమున కరిగెను, అందుఁ బాపహారిణియగు నారదకుండమున మజ్జన మాడి శుభదర్శనుఁడైనభావనారాయణుని సందర్శించెను. భావనారాయణప్రీతికై శిష్యులతోఁ గూడి

వ్యాసమౌని శనివారోత్సవ మాచరించి ద్వాదశాక్షరమంత్రమును జెప్పుచు నూత్నరక్తోత్పలములచేతను, నష్టాక్షరమంత్రమును జెప్పుచు బంగారుపుష్పములచేతను బూజించెను. అటుపైఁ దుల్య భాగానదీతీరమం దున్నయగస్త్యేశ్వరసంగమేశ్వరులను బ్రిణవ పంచాక్షరీమంత్రియుక్తముగ బిల్వపత్రములచేఁ బూజించెను. పిదపఁ దత్తీరమున నున్నబిల్వాటవియందలి సాంపరాయణ (సంపర) గ్రామసమీపస్థుఁ డగుముక్తీశ్వరుని దర్శించి శిష్య సంఘముతోఁ గలిసి బిల్వార్చన మొనరించెను. అటుపై బంగారు కాంతిఁ గలయారగ్వధకుసుమముల (తేలపువ్వుల) చేతను, దెల్ల తామరపూలచేతను గూడ సేవించి యటనుండి పయనమును సాగింప నుండఁగా నోంకారపుర (ఓదూరు) ప్రాంతమున లోపా ముద్రాగస్త్యు లెదురైనారు. వారు దక్షారామభీమేశుని సేవించు కొని కుక్కుటేశ్వరదర్శనముసకై పీఠికాపురమున కరుగు చున్నారు. మౌను లొండొరులు ప్రత్యభివాదగౌరవము లొన రించుకొనిరి, వ్యాసశిష్యు లెల్లరు నయ్యగస్త్యదంపతులకు నతు లొనర్చిరి. వ్యాసాగస్త్యు లిర్వురును బిల్వవనమందలి యొక చంద్రశిలాఫలకముపైఁ గూర్చుండి కుశలప్రశ్నము లొనరించు కొనిరి. అపుడు వ్యాసునిముఖవైవర్ణ్యమును, నేత్రదైన్యమును, మనోవ్యథను గుర్తించి యందులకుఁ గారణ మడిగి తెలిసికొని నాఁడు కుంభజమౌని. కాశి నేల విడిచి వచ్చితి వనఁగా నాతఁడు తనకుఁ గాశీవియోగము కలిగిన కారణమును వివరించి విశ్వ నాథుని యాగ్రహామునకు గుఱియైనతా నమృతోపమాన మగు

నన్నపూర్ణవాక్యానుసారముగ దక్షారామభీమేశ్వరునిఁ జూడఁ బోవుచు దైవవశమునఁ బరమేశ్వరభక్తుఁడ వగునిన్ను దర్శించితి నని చెప్పి కాశికావియోగస్మరణముచేఁ గంట నీరు పెట్టఁగా లోపాముద్రాగస్త్యులకును దుఃఖమువచ్చినది. కొంతవడికి వ్యాసుఁ డుపశమిల్లి కమండలూదకప్రక్షాళితనేత్రుఁడై "యగస్త్యమునీ! దక్షారామమార్గమును జూపుము. ఆ భీమనాయకుఁడు నన్ను రానిచ్చునా? నా పూజాదికములఁ బరిగ్రహించునా? సప్తగోదావరమందు వేసవిలోఁ గూడ సమృద్ధజల ముండునా? దక్షవాటికలో నాలువేళలఁ జేయవలసినశివార్చనమునకు దళములు సుమములు లభించునా? విప్రగృహములలో భిక్ష లభ్యపడునా? కాశిలో నవమానింపఁబడిన నన్ని భీమనాయకుఁ డాదరించి నా యభీష్టములఁ దీర్చునా? ఆ భీమనాయకవైభవమును దక్షారామమహాన్నత్యమును వివరింపవా?" యని యడిగెను. అంత లోపాముద్రాప్రాణనాథుఁ డిటులు వివరించెను.

శ్లో॥ మోక్షస్థానం భోగభూమి ర్దక్షిణాబ్ధితటక్షితౌ
సాక్షాద్బ్రహ్మాపదం నవ్య స్వర్గో దక్షపురం మహత్
భీమనాధమహాధామ దక్షారామమహాపురం
త్రిలోకీచక్షురానందసంధాయి శ్రీమదంచితమ్॥

(భీమఖండమ్)

దక్షిణ సాగరతీరమందు మోక్షభూమియు, భోగభూమియు, సాక్షాద్బ్రహ్మాపద మైనదియు, నూతనస్వర్గ మగునదియు నగు దక్షారామమహాపుర మున్నది. భీమనాధ నివాసపట్టణ మగు దక్షా

రామము త్రిలోక జనులకును నేత్రానంద మొనరింపుచు లక్ష్మీ యుతమై విరాజిల్లుచున్నది.

క. దక్షుని సవనాగారము
దక్షారామంబు. శివుఁడు దన్మధ్యమునన్
సాక్షాత్కరించి యుఁడుట
మోక్షము భోగంబు బ్రాఁతె ముజ్జగములకున్.

గీ. భీమనాథేశ్వరునికన్న పెద్దవేల్పు
దక్షవాటంబుకంటె నుత్తమపదంబు
సప్తగోదావరము కంటె సకలతీర్థ
సారమగుతీర్థ రాజంబు జగతి లేదు.

క. అచ్చ మగుభోగమోక్షము
లచ్చోటం దొరకుఁ గరతలామలకముగన్
విచ్చలవిడి బ్రతికినను
జచ్చినఁ గడు లెస్స భీమశంకరునగరన్.

క. దక్షిణ వారాణసికిని
మోక్ష శ్రీభోగవిభవ మూలంబునకున్
దక్షారామంబునకు స
దృక్షం బగునట్టిపుణ్యక్షేత్రము గలదే!

(శ్రీనాథుఁడు)

శ్లో॥ శ్రీకోటిపల్లిసోమేశప్రకాశిత సమీపభూః
కుత్రచిత్తైర్థికానందవర్ధనీ వృద్ధగౌతమీ॥

(భీమఖండమ్)

ఈ భీమమండలమునఁ గోటిపల్లి సోమేశ్వరునకు దగ్గఱగాఁ దీర్థయాత్రాపరుల కానందవర్ధని యగు వృద్ధగౌతమి ప్రవహింపు చున్నది.

శ్లో॥ త్ర్యంబకాద్రిశిఖోద్భూతా ప్రాప్తాన్యావర్తమేదినీం
దండకారణ్యవసుధా మధ్యమార్గ ముపేయుషీ
తరంగతాడితప్రస్థం కృత్వా ప్రస్రవణాచలం
దృష్ట్వా శ్రీవట్టిసస్థానవీరభద్రం మహాప్రభుం
తీరసోమేశ్వరాగారసమీపధరణీం గతా
సంప్రాప్యానంతభోగేశస్థానాఖ్యాసవసుంధరాం
రుద్రపాదస్థలం స్పృష్ట్వా కోటిపల్లీపురేశ్వరం
శ్రీసోమనాయకం నత్వా కుండలాముఖతీర్థభాక్
వామ భాగసముద్దామ భీమమండలశోభితా
పావనీ గౌతమీ గంగా ప్రావిశల్లవణాంబుధిం
అన్యా స్తటిన్య శ్శ్రీభీమమండలీభాసమానయా
గౌతమీగంగయా లోకే గౌరవేణ కిధం సమాః॥

(భీమఖండమ్)

పరమపావని యగు గౌతమి త్ర్యంబకాచలశృంగమున నుద్భవించి, యార్యావర్తమును బొంది దండకారణ్యమధ్యభూమి యందుఁ బ్రవహించి, ప్రస్రవణాద్రిని నిజతరంగములచేఁ గొట్టి శ్రీపట్టిసాచలవీరభద్రమహాదేవుని దర్శించి తీరమున నున్న సోమే శ్వరాగారమును జూచి యనంతభోగేశసమీప భూమిని బ్రవహించి రుద్రపాదప్రదేశమును స్పృశించి కోటిపల్లీపురేశ్వరుఁడైన సోమే శ్వరునకు నతి యొనర్చి కుండలాముఖతీర్థమును జూచి భీమ

మండలమును దన వామభాగమున నుంచుకొని లవణసాగరమును జేరుచున్నది. భీమమండలమునఁ బాఱు నీ గౌతమితో నితర నదు లెట్లు సాటి కాఁగలవు?

శ్లో॥ బ్రహ్మహత్యాదిపాపాని నృణాం నశ్యంతి తత్ క్షణే
శ్రీభీమనాయకస్వామికల్యాణోత్సవదర్శనాత్
కార్తిక్యాం భీమనగరే యో గచ్ఛే ద్వహ్నితోరణం
న గచ్ఛతి స దేహాంతే కృతాంతపురతోరణం ॥

(భీమఖండమ్)

భీమేశ్వరకల్యాణోత్సవమును జూచినచోఁ దత్ క్షణమే బ్రహ్మహత్యాది పాతకములు నశించును. కార్తిక పూర్ణిమనాఁడు దక్షారామములో జ్వాలాతోరణముక్రింద నెవ్వఁడు గమించునో వాఁడు మరణించిన పిదప యమగృహతోరణమునకుఁ బోఁడు.

క. కార్తికీవేళ భీమశంకరునినగరఁ
దూఱునెవ్వాఁడు చిచ్చుఱతోరణంబు
వతఁడు దూఱఁడు ప్రాణనిర్యాణవేళ
ఘోరయమపట్టణద్వారతోరణంబు.

(శ్రీనాధుఁడు)

శ్లో॥ పూర్వత స్సాగర స్సీమా దక్షిణే వృద్ధగౌతమీ
పశ్చిమే గౌతమీ గంగా తుల్యభాగా తథోత్తరే ॥

(భీమఖండమ్)

ఈ భీమమండలమునకుఁ దూర్పున సముద్రము, దక్షిణ మున వృద్ధగౌతమి, పశ్చిమమున గౌతమీనది, యుత్తరమునఁ దుల్యభాగయు సరిహద్దులు.

శ్లో॥ భోగమోక్షమహైశ్వర్యకాంతయా భీమమండలే
ఆపేక్షంతే మర్త్యజన్మ సిద్ధసాధ్యామరాదయః ॥

(భీమఖండమ్)

భోగము, మోక్షము, మహైశ్వర్యము, పొందఁ గోరు సిద్ధులు సాధ్యులు దేవతలు మున్నగువారు భీమమండలములో మానవజన్మమును గోరుదురు.

అట్టి దక్షారామభీమేశ్వరుని సేవించుకొందువు గాక రమ్మని యగస్త్యుఁడును లోపాముద్రయు శిష్యయుక్తముగ వ్యాసర్షిని సాంపరాయగ్రామమునుండి యోంకారపురమార్గమున దక్షారామ మునకుఁ గొనిపోయిరి. ముప్వురును దపశ్శక్తిచే నాకాశమార్గ మునఁ బయనించి పైనుండియే భీమమండల మంతయు సమగ్ర ముగఁ బరిశీలించి నిశ్చిత ముహూర్తమునకు దక్షారామమేదినిపై దిగిరి. వ్యాసుఁడును సప్తగోదావరమున స్నాన మొనర్చి మాణి క్యాంబాభీమనాథుల దర్శించి యర్చించి కాశీవియోగతాపమును జల్లార్చు కొనెను.

## —* పంచారామములు *—

శ్లో॥ తత త్రిపురదైతేయగణానాం కులదైవతమ్
తద్దివ్యలింగం పరమం నిర్మలం నిరుపద్రవం

పంచాక్షరీపంచతత్వం పంచబ్రహ్మమయం ప్రభుం
పంచఖండాని కృత్వాథ పంచ స్వారామభూమిషు
అమరేశారామ, సోమారామ, క్షీరవనాని చ
కుమారారామ విఖ్యాతా శ్చతురారామ పట్టణే
ప్రతిష్ఠాప్య స్వయం భీమో దక్షిణాబ్ధితటక్షితౌ
దక్షారామపురే రమ్యే దక్షిణానందకాననే
శుద్ధస్ఫటిక సంకాశం సర్వలోకమనోహరం
స్వర్గలీలావతీ చారులోచన ప్రసవార్చితం
సమ స్త భువన స్తుత్య మనంతఫలదాయకం
భీమేశ్వరమహాలింగం ప్రాప త్రిపురసంహరః॥

త్రిపురదైత్యసంహారానంతరము పరమశివుఁడు త్రిపుర దనుజుల కులదైవత మగునదియు, దివ్యము, సర్వోత్తమము, నిర్మలము, నిరుపద్రవము నగునదియుఁ, బంచాక్షరీపంచతత్త్వ రూప మగునదియుఁ, బంచబ్రహ్మస్వరూప మగునదియు నగు నా శివలింగము నైదు ముక్కలుగా ఖండించి, అమరారామ, సోమారామ, క్షీరారామ, కుమారారామ దక్షారామము అను పంచారామ పట్టణము లందు స్థాపించి దక్షిణసాగరతీరమునందు దక్షిణానందకాననమగు (దక్షిణకాశి) దక్షారామమందలి శుద్ధస్ఫటిక సమాన మగునదియు సకలలోకమనోహర మగునదియు స్వర్గనగరీకాంతల మనోహరనేత్రకుసుమములచే నర్చింపఁ బడునదియు సకలలోకములచే స్తుతింపఁ బడునదియు, ననంతఫలము నిచ్చు

నదియు నగు భీమేశ్వరమహాలింగమును దాను స్వయముగఁ బొందెను.

శ్లో॥ సమస్త సంపత్సంపూర్ణా పంచారామా మహీతలే
తత్రాపి స్థాన ముత్కృష్టం దక్షారామం ప్రశస్యతే ॥

(భీమఖండమ్)

పృథ్విలోఁ బంచారామములును సర్వసంపత్సమృద్ధములై యున్నవి. వానిలో దక్షారామ ముత్కృష్టమైన దని ప్రశంసింపఁ బడుచున్నది.

శ్లో॥ ఉత్తరే వసతిః కాశీ మోక్షలక్ష్మ్యా యథాతథా
భోగ మోక్షరమావాసో దక్షవాట్యస్తు దక్షిణే ॥

(భీమఖండమ్)

ఉత్తరభారతములోఁగాశి యెట్లు మోక్షలక్ష్మికి స్థానమైనదో అటులే దక్షిణభారతమున దక్షారామము భోగమోక్ష లక్ష్మీవాసభూమి యగుఁ గాక యని భీమేశ్వరుఁ డనుగ్రహించెను.

శ్లో॥ అశక్తాః కాశికాం గంతుం పంగవోంధా శ్చ కుష్ఠినః
బాలవృద్ధాదయో మోక్షం లభంతాం దక్షవాటికే ॥

(భీమఖండమ్)

కాశి కేఁగలేని కుంటివారు, గ్రుడ్డివారు, కుష్ఠరోగులు, బాలురు, వృద్ధులు మున్నగువారు దక్షారామమున ముక్తినొందఁగల రని యనుగ్రహించెను.

శ్లో॥ శంభుపాదాబ్జ భక్తానాం ప్రణాశో నాస్తి మంకణ
పాపాని న స్పృశంతే చ భక్తిపూరిత మానసాన్ ॥

(భీమఖండమ్)

శివపాదారవిందభక్తులకు నాశము లేదు. శివభక్తిపూరిత చేతస్కులకుఁ బాపము లంటవు.

శ్లో॥ భీమనాథమహాస్థానం సర్వకామార్థసాధనం
సంవత్సరవ్రతేన స్యా త్సద్యోముక్తిప్రదాయకం ॥
(భీమఖండమ్)

భీమేశ్వర నివాసమగు దక్షారామము సకలవాంఛితములను దీర్చుకొను సాధనము. వత్సరకాల మర్చించినచో సద్యోముక్తి నిచ్చునది.

శ్లో॥ భీమనాయక దేవస్య దివ్యశ్రీపాద సేవయా
మోక్షసామ్రాజ్య పదవీ మహైశ్వర్యం మనోరమే
మహోగ్రపాపకర్మాపి మర్త్య స్సమధిగచ్ఛతి ॥
(భీమఖండమ్)

భీమేశ్వర దివ్యశ్రీచరణ సంసేవనమువలన మహోగ్ర పాపకర్మముల నొనరించినవాఁడైనను మోక్షసామ్రాజ్యమహైశ్వర్య పదవి నందును.

—: భీమనాథప్రతిష్ఠ - సప్తగోదావరము :—

త్రిపురదైతేయకులదైవతలింగఖండమం దధివసించిన శంకరుని దర్శించి సప్తమహర్షులు నానందించి యా లింగమును దక్షారామమునఁ బ్రతిష్ఠింపఁ దలఁచి శుభలగ్ననిర్ణయ మొనరించి కావలసిన సంభారము లన్నియు సంపాదించిరి. భీమేశ్వర

మహాభిషేకమునకై శుద్ధవాహిని నొకదానిని దెచ్చినపిదపఁ బ్రతిష్ఠాకార్యక్రమ మారంభింప నెంచిరి. గౌతమాదిసప్తమహర్షులును బయలుదేఱి గౌతమీనదిని సందర్శించిరి. సుధారసతుల్య మధురాంబువులు గలిగి, శీతలతరంగసంగతములచే నెల్లరశ్రమలఁ దేర్చుచు, స్నానవిస్తాపరు లగు జనులచేఁ గిక్కిరిసి యున్న తీర ప్రదేశములతో నొప్పుచున్న యత్యంతపుణ్యప్రద యగు నా గౌతమికి నమస్కరించి మహర్షిసప్తక మిట్లు సంస్తుతించెను.

శ్లో॥ గీర్వాణయక్షోరగసిద్ధసాధ్య గంధర్వవిద్యాధరపూర్ణ తీరే
లోకైకసంరక్షణబద్ధవర్ణే రక్షాంబ గోదావరి సర్వ దాస్మాన్ ॥

శ్లో॥ శరీరిణః పాస్యమృతోపమానై ర్నిత్యం పయోభి స్తవ దేవి సర్వాన్
తస్మా దసి త్వం జన నీహ గంగే త్రైలోక్యపావ న్యరవిందగర్భే ॥

శ్లో॥ కరాబ్జకుందీపరిపూర్ణతోయే అస్మాన్ ప్రపన్నా న్పరిపాలయ త్వం
మహేశజాయే నగరాజకన్యే జగత్పవిత్రీకరణాతిదక్షే ॥

శ్లో॥ గోదావరీతి ప్రవదంతి భక్త్యా యే గణ్యశీలా స్తవ పుణ్యనామ
తే భ్యోంబ గోదావరి మంగళాని ప్రియచ్ఛసి త్వం సతతం బహూని॥

శ్లో॥ అంబూని తే కంబుమరాళముక్తా మణిప్రభాజాలవిభాసితాని
సుధారుచీని ప్రదిశంతు నిత్య మస్మభ్య మంబాభ్యుదయా నదభ్రాన్ ॥

శ్లో॥ నమోస్తు తే గౌతమి లోకమాత స్తారావళీహారసుధారసాభే
ఆభోగకల్లోలగభీరనీరే నీరాకరాలింగనలబ్ధసౌఖ్యే ॥

శ్లో॥ నమోస్తు గోదావరి దేవలోక నిశ్రేణికే ద్వీపసమగ్రభూషే
సంతాపనిర్వాపణకౌశలాఢ్యే నమ స్తకల్యాణవిధాత్రి తుభ్యం ॥

శ్లో॥ కాంతాశతస్వర్ణఘటాంబుపూర్తి ధ్వనీభగండూషవిభిన్నరూపే
అంభోజఖేలద్వరరాజహంసే గంగే నతాస్మో భవతీం త్రిసంధ్యం ॥

శ్లో॥ ఆనందకర్త్రీ మఘబృందహర్త్రీం వందారుబృందావన కల్పవల్లీం
బృందారకవ్రాతమునీంద్రవంద్యాం వందామహే గౌతమకన్యకే త్వాం॥

శ్లో॥ ఏహ్యోద్భృతాత్ర్యంబకపర్వతేంద్ర వేదండగండస్థలదానధారే
ఆగచ్ఛ శీతాంశుకళాకిరీట జూటాటవీనూతన పుష్పవల్లీ ॥

శ్లో॥ ఆయాహి కంజాసనపాణికంజ కమండలూదంచితతీర్థవారే
ఉత్తిష్ఠగోత్రావనితా వతంస కంఠస్ఫురన్మౌక్తికహారవల్లీ ॥

శ్లో॥ ఆలోలకల్లోలపరంపరాభి ర్డిండీరఖండై రపి పాండురైశ్చ
ముక్తామణిశ్రేణిసమానశోభై స్సముచ్ఛలద్వారి సముత్కరైశ్చ
విరాజమానా వినుతప్రభావా జలాభిరామాజనవీక్షణీయా
నిరంతరామోదభరప్రపూర్ణా తూర్ణం వ్రజ త్వం జనయిత్రి గంగే ॥

(భీమఖండమ్)

తల్లీ! దక్షారామమున మేము ప్రతిష్ఠింపఁ బోవు భీమేశ్వరుని సన్నిధానమునకు విచ్చేయుము. ప్రతిష్ఠాముహూర్తము దగ్గఱకు వచ్చినది. ఆలసింపక రమ్మని యర్థించినారు మునులు. గౌతమి యంగీకరించి యా మహర్షులవెంట బయలుదేఱినది. ముందువెనుకలను, గుడియెడమలను నిలిచి సేవింపుచు ఋషులు గౌతమిని దీసికొని దక్షారామమార్గమును బట్టిరి. ఆ దారిలో నొకచోటఁ గొందఱు రాక్షసమునులు బంధువులతోఁ గూడి గార్హస్థ్యతప మొనరించుచున్నయాశ్రమస్థల మున్నది. ఋషులతో వచ్చుచున్న గౌతమీప్రవాహముతో దారిలో నున్న యా దైత్యర్షుల

యాశ్రమములను సర్వస్వమును గొట్టుకొనిపోయినవి. అగ్ని హోత్రవేదికలు, యూపస్తంభములు, స్రుక్స్రువాదులు, కమండలువులు, వస్త్రములు, గ్రంథములు, దేవతార్చనములు సర్వమును నీటిపాలైనవి. అందువలన రాక్షసఋషులకును సప్త మహర్షులకును వివాద మేర్పడి యది పెరిఁగి యన్యోన్యశాపముల వఱకు వచ్చినది. సప్తర్షివరానీతగౌతమి శుష్కతోయ యగుఁ గాక ! యని రాక్షసర్షులు శపించినారు. రాక్షసమునుల యాశ్రమ ప్రాంతమున నున్నపుణ్యతరంగిణి నపూజ్య యగుఁగాక ! యని సప్తర్షులును శపించిరి. ఈ రాక్షసుల నదియుఁ బూర్వము గౌతమీ నదియందుఁ బుట్టినదియే. ఆ నదిని దుల్యభాగుఁ డనురాక్షసఋషి తీసికొనివచ్చినట్లు తత్త్వజ్ఞులుచెప్పుదురు. తుల్యభాగుఁడు దైత్యుఁ డయ్యును సాధువర్తనుఁడును బరమాత్మతత్త్వజ్ఞుఁడును. పక్షపాతము లేక దేవదానవులవైరములను నివారించుచుండువాఁడు. తుల్యముగ విభజించువాఁ డగుటచేతనే తుల్యభాగుఁ డనిరి. ఆతఁడు తీసికొనివచ్చిన నది యగుటఁ దుల్యభాగ యైనది. ఆ తుల్యభాగఋషి వచ్చి యా యా ఋషుల వివాదమును నిలిపి "మహానుభావులారా ! కోపమును శాంతింపఁ జేయుఁడు. కోపము వలన మేలు రాదు. ఈ రెండునదులును లోకపావన మొనరింపఁ జాలుజలములు గలవి. అట్టివానిని శపింపఁదగునా ? శమప్రధాను లగుతాపసులకుఁ గ్రోధ ముండరాదు. ఉభయులును శాపముల మఱలించి లోకోపకార మొనరింపుఁడు." అని హితముపదేశించెను. దైత్యఋషు లాతనివాక్యముల గౌరవించి తమశాపమును

సడలించి స ప్తముఖ్యానీతగౌతమి నంతర్వాహినిని గావించిరి. స ప్తర్షులు సహర్షులై రాక్షసనది యగుతుల్యాభాగ దక్షిణాయనో త్తరాయణసంక్రాంతులందును. సూర్యచంద్రగ్రహణము లందును నాదిత్యవారాదిపుణ్యదివసములందును నధికఫలదాయిని యగున ట్లను గ్రహించిరి. గౌతమి సమ్మోదముతో సకలబృందార కానందసంధాయినిగా దక్షారామమును బ్రవేశించెను. మార్గములోఁ గలిగినవివాదకారణముగా మహర్షులకుఁ బ్రతిష్ఠాసుముహూ ర్తము దాఁటిపోయినది. వారు దక్షారామముఁ జేరుసరికే భీమేశ్వరప్రతిష్ఠ జరిగిపోయినది. వారు నిశ్చయించినలగ్నమునకే జరిగినను దాము చేయవలసినకార్య మన్యులచేఁ జేయఁబడుట వారికి వ్యాకుల పాటును గలిగించెను. అంత నాకసమునుండి సూర్యుఁడు వచ్చి భ క్తి నమ్రుఁడై వారికిఁ బ్రణమిల్లి "మహర్షులారా! మీకు మార్గ మధ్యమున విఘ్న మొదవికాలవిలంబ మగుటచే మీచేనిశ్చయింపఁ బడినశుభముహూ ర్తమున శంకరుఁడే స్వయముగా నిచటఁ బ్రతిష్ఠితుఁ డై నాఁడు. అటుపై మొదట నేను బూజించితిని. మీరు చేయఁ దలఁచినభీమప్రతిష్ఠాపనమును నేను జేయ సమర్థుఁడనా? స్వయంప్రతిష్ఠితుఁ డగుభీమనాయకుని నేనును నారాయణుఁడును బ్రహ్మయు సకలదేవతలును బూజించితిమి." అని విన్నవించెను. మహేశ్వరప్రతిష్ఠను మనచేతులారఁ జేసికొనుభాగ్యము లేక పోయె నని ఖేదపడుచున్నమహర్షి స ప్తకముతో నాకాశవాణి యి ట్లనెను. "మునీంద్రులారా! దయాంతరంగుఁ డగుభీమేశ్వరుఁడు మీ యందలియనుగ్రహముచేతనే మీరుపెట్టినముహూ ర్తమునకు స్వయంప్రతిష్ఠితుఁ డయ్యెను. ఇది మీ ప్రయత్నమువలనిఫలమే

కదా ! మీరు విచారింపకుఁడు. మీచేతఁ బరమపావని యగు గౌతమి భీమేశసన్నిధికిఁ దీసికొనిరాఁబడినది. ఇది మహో త్కృష్టకార్యము. మీ రేడుగురును, బ్రతిష్ఠాకాలమునఁ బూజఁ గావించినరవియు సమానఫలభోక్తలు, మీ యష్టకమునకును బ్రతిష్ఠాగౌరవము దక్కినది. మీరు ధన్యులు.

ఆ మాటలు విని మౌనులు తాపమును వీడి సంతోషముతో సూర్యునితోఁ గూడ బంగారుపాత్రముల నిండుగాఁ దమచేఁ దీసి కొనిరాఁబడినగోదావరీనదీపావనోదకములఁ దెచ్చి భీమేశ్వరునకు మహాభిషేక మొనరించి సంతుష్టులైరి, ఆ యభిషేకమును జూచి యిందాద్రిదిసువర్వు లెల్లరు నానందించి భీమేశ్వరునిఁ గొని యాడిరి.

శ్లో॥ తైస్సప్తభి ర్మునివరై రానీతాయా స్తతోఽభవత్
గోదావరీమహానద్యా స్సప్తగోదావరాహ్వయః॥

(భీమఖండమ్)

ఆ సప్తమహర్షులచేఁ దీసికొని రాఁబడుటచేతనే గోదా వరీనది కీ దక్షారామములో సప్తగోదావర మను పేరు కలిగినది.

శ్లో॥ సప్తగోదావరే స్నానమంత్రద్వయ మిదం మహత్
పఠనీయం ప్రయత్నేన స్నానకాలేషు సువ్రత ।
సప్తగోదావరం తీర్థం సర్వతీర్థోత్తమోత్తమం
అత్ర సన్నిహితో రుద్రో భీమనాథేశ్వరేశ్వరః
నమస్తే భీమనాథాయ సప్తగోదావరాంభసే
పాపేంధనాగ్నయే తుభ్యం నిమజ్జామి హరేశ్వయః

(భీమఖండమ్)

సప్తగోదావరస్నానకాలమున రెండుమంత్రము లవశ్య పఠనీయములు. సప్తగోదావరతీర్థము సకల తీర్థములలో నుత్తమోత్తమము. ఈశ్వరేశ్వరుఁ డగు భీమనాధుఁ డిచట సన్నిధాన వర్తియై యుండెను.

"పాపము లను కట్టెల కగ్నివంటిదియు, భీమేశ్వరరూప మగునదియు నగుసప్తగోదావరోదకమా ! నీకు నమస్కారము. హరా ! నీయందు స్నాన మొనరింపుచున్నాను."

పరమ పవిత్రమగు సప్తగోదావరతీర్థము గలిగి, మాణిక్యాంబాభీమనాధేశ్వరుల నివాసభూమియై భీమమండలాలంకారమై పట్టిసాచల, కోటిపల్లి, పీఠికాపుర, కుమారారామ దివ్యక్షేత్ర సమీప పుణ్యభూమి యగు దక్షారామము దక్షిణకాశియే !

శ్లో॥ శ్రీభీమనాయకస్వామీ భగవా న్విశ్వనాయకః
సప్తగోదావరం తీర్థం సాక్షాజ్జహ్నుతనూభవా
విఘ్నాధినాయకో దేవో ఢుండీదంతావళాననః
దక్షిణే దండపాణీశో దండపాణీశ్వర స్స్వయం
పాతాలభైరవస్వామీ తథా శ్రీకాలభైరవః
నందికేశ స్స ఏ వాయం నందికేశో న సంశయః
దక్షవాటీనగ ర్యేవ కాశికా నగరీ న కిం ?

(భీమఖండమ్)

శ్రీభీమేశ్వరుఁడు సాక్షాత్తు విశ్వేశ్వరుఁడే. సప్తగోదావరము సాక్షాద్గంగానదియే. నృత్యగణపతి ఢుండిగణపతియే. దక్షిణదిశ నున్నదండపాణీశ్వరుఁడు స్వయముగ దండపాణీశుఁడే.

పాతాలభైరవుఁడు కాలభైరవుఁడే. నందీశ్వరుఁడా నందీశ్వరుఁడే. సందేహము లేదు. దక్షారామము కాశీనగర మెందుకుఁ గాదు? ముమ్మాటికిని గాశియే.

సీ. భీమేశ్వరేశ్వర శ్రీమహాదేవుండు
హిమధామ మౌళి విశ్వేశ్వరుండు
సప్తగోదావర సలిల ప్రవాహంబు
సాక్షాత్కరించిన జహ్నుకన్య
తిరుచుట్టుమాలెలోఁ దిరమైనగణపతి
యేకాంతదుంతి విఘ్నేశ్వరుండు
దక్షిణంబున నున్న దండపాణీశుఁ డూ
హింపంగ దండపాణీశ్వరుండు

గీ. భైరవస్వామి శ్రీకాలభైరవుండు
నంది నందీశ్వరుం డేమి సందియంబు
దక్షవాటంబు కాశికాస్థలము గాదె
శివశ్రీకరతేజ! సత్యవతీతనూజ!

(శ్రీనాథుఁడు)



# కోటిఫలిసోమేశ్వరుఁడు

దేవేంద్రుఁడు గౌతమమహర్షిచే శపింపఁబడి పిమ్మటఁ దదాదేశానుసారముగా గోదావరీతీరమున మహాలక్ష్మిసిద్ధిజనార్దన స్వామి కుత్తరదిశగాఁ గూర్చుండి యుమాకోటిఫలీశ్వరరూప మునఁ బార్వతీపరమేశ్వరులను ధ్యానింపఁగా శంకరుఁడు స్వయంభూలింగముగా నాతనియెదుట నవతరించెను. సురపతి మహానందభరితుఁడై కోటిపుణ్యనదులజలమును నంతర్వాహినిగా రప్పించి లింగసమీపమునందలిబిలములో నుంచెను. సిద్ధలింగము నకు సమీపమున నుమను బ్రతిష్ఠించెను. నాఁటినుండి యుమా కోటీశ్వరలింగము లోకప్రసిద్ధమైనది. ఇక్కడఁ జేయుసుకృ తము గాని దుష్కృతము గాని కోటిరెట్లయి ఫలముల నిచ్చు చుండును. అందుననే యీ క్షేత్రమునకుఁ గోటిఫలి యని పేరు వచ్చినది. ఇచటిస్నానముచేతను, దానముచేతను మహాపాతక కోటులు నశించును.

శ్లో॥ యత్రైకం కోటిగుణితం సుకృతం చాపి దుష్కృతం
కోటీశ్వరప్రభావేన కోటితీర్థ మితి స్మృతమ్
తత్రస్నానేన దానేన మహాపాతకకోటయః
విలయం యాంతి తత్తేన హ్యన్య త్తుల్యం న విద్యతే॥

(బ్రహ్మపురాణమ్)

చంద్రుఁడు గురుపత్నీగమనకిల్బిషమును బోఁగొట్టుకొను టకుఁ గోటితీర్థమునకు వచ్చి స్నాన మాచరించి శుచిర్భూతుఁడై సిద్ధలింగమునకు సమీపమునఁ దనపేరితో నొకలింగమును బ్రతి ష్ఠించెను. అదియే సోమేశ్వరలింగము. ఆతనిభార్య రాజరాజేశ్వరి.

ఈ కోటిఫలిక్షేత్రమందలిగౌతమిలో నొకసారి స్నాన మాచరించి సోమేశ్వరలింగమునకు నమస్కరించినచోఁ గోటి గోదానములు, కోటికన్యాదానములు, మున్నూ అశ్వమేధయాగ ములు గావించినఫలము లభించును. ఈ తీర్థమునకే మాతృగమన దోషాపహారి యనుప్రసిద్ధి గలదు. బ్రహ్మపురాణ మందలి యీ క్రింది యితిహాసము దానిని స్పష్టము చేయుచున్నది.

పూర్వము కాశ్మీరదేశమునఁ గల్యాణపురమందు సుభావితుఁ డనువృద్ధవిప్రునకు భార్యయగు దుర్మేధ యనుయువతి యందు సుమిత్రుఁ డనుకుమారుఁడు జన్మించెను. కొంతకాలమునకు సుభావితుఁడు కాలధర్మము నందెను. యౌవనవతియగుదుర్మేధ స్వైరిణియై కుమారుని వీడి దేశాంతరములఁ దిరిగి తిరిగి కోటి ఫలిగ్రామమును జేరుకొని వారాంగనగా జీవించుచుండెను. సుమి త్రుఁడు మాతాపితృవిహీనుఁ డయ్యును విద్యాపారంగతుఁ డై దేశములఁ దిరుగుచు విధివశమున విటుఁ డయ్యెను. దేశసంచార ములోఁ గోటిఫలికి వచ్చి యొకనాఁటిరాత్రి యా వారాంగనను జూచి మోహించి కూడి ఘోరపాపమునకు గుఱి యయ్యెను. మఱునాఁటియుదయమునకు శరీరమున మహావ్యాధి సంక్రి

మించెను. అంతలో రోమశమహర్షి దర్శనభాగ్యము లభింపఁగా రోగవిముక్తికై యాతని నర్థించెను. రోమశమహర్షి రాత్రివృత్తాంతము నంతయు నడిగి తెలిసికొని యా వారకాంతను రప్పించి యామెపూర్వవృత్తాంతమును బ్రశ్నింపఁగా వారు మాతాపుత్రు లని స్పష్ట మైనది. అపుడు వా రిరువురు మహాదుఃఖమును బొందిరి. కృపాళుఁడైన రోమశమహర్షి వారి నోదార్చి చంద్రునకు గురుతల్ప గమన పాపమును నివారించిన యీ కోటిఫలిక్షేత్రమున స్నాన మాచరించి, రాజరాజేశ్వరీసోమేశ్వరులను సేవించి పాపవిముక్తులు కం డని యుపదేశించెను. వా రట్లాచరించి గతకిల్బిషులైరి. కోటిఫలి సోమేశ్వరుఁడు దివ్యఫలప్రదుఁడు. అచటితీర్థస్నానము సకలపాపహరము. శుభంకరము.



# శ త రు ద్రీ య ప్రా భ వ ము

సకల ప్రాణిశుభంకరుఁ డగుశంకరుని యర్చావిధానము లనేకము లున్నవి. అభిషేకప్రియుఁ డైనశివునకు యజుర్వేదోక్త శతరుద్రపఠనపూర్వకాభిషేక మొనరించుటయు శతరుద్రపారాయణ మొనరించుటయు విశేషఫలప్రదము లని భట్టభాస్కరాదులు నిర్వచించిరి. శతరుద్రీయమునకుఁ గలశక్తి వర్ణనాతీతము. ఏ యితర పారాయణములును దీనికి సరి గా వని మహనీయు లందురు. రుద్రాధ్యాయ గ్రంథములో భాష్యకారులు తన్మంత్ర జపానుష్ఠానాదులకు విశేషఫలములను దెల్పిరి. నమకాధ్యాయములో వివిధమంత్రానుష్ఠానమువలన వివిధఫలములు లభించు నని భాష్యకారు లీ క్రిందివిధముగ వివరించిరి. దుర్భిక్షనివారణము, అన్నప్రాప్తి, గోశాంతి, అకాలమృత్యురాహిత్యము, రోగనాశనము, బాలగ్రహశాంతి, గర్భరోగ రాజయక్ష్మ కుష్ఠాది మహావ్యాధినాశము, మహాజ్వరాదినివారణము, గర్భపాతస్రావనిరోధము, పుత్రప్రాప్తి, అనావృష్టి నివారణము, శత్రుజయము, జనపద వాహనసామాన్య రాజ రోగాది వ్యాధినిర్మూలనము, ఆయుర్మేధాపత్యాయుర్వృద్ధి, రాజ్యవృద్ధి, రాజపురుషవశ్యము, మొదలగు శతాధికమహాఫలములు గలుగు నని చెప్పఁబడినవి. "సర్వకామా నవాప్నోతి"యని చెప్పఁబడినది.

శ్లో॥ కిం జప్యే నాఽమృతత్వం నో బ్రూహి హీ త్యుక్తో మునిర్జగౌ
శతరుద్రీయకే ణేతి జాబాలా అమన న్తి హి॥

దేనిని జపించుటవలన నమృతత్వము కలుగునో తెలుపు మని బ్రహ్మచారులు ప్రశ్నింపఁగా శతరుద్రీయజపముచేత నని జాబాలురు చెప్పెదరని, యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

శ్లో॥ భస్మదిగ్ధశరీర స్తు భస్మశాయీ జితేంద్రియః
సతతం రుద్రజాప్యోఽసౌ పరాం ముక్తి మవాప్స్యతి ॥

భస్మమును దేహమున నలఁదికొని భస్మశాయి యై జితేంద్రియుఁ డై సర్వదా రుద్రజప మొనరించువాఁడు ముక్తి నందును.

శ్లో॥ రోగవాన్ పాపవాం శ్చైవ రుద్రం జప్త్వా జితేంద్రియః
రోగా త్పాపా ద్వినిర్ముక్తః హ్యతులం సుఖ మశ్నుతే॥

ఇంద్రియ నిగ్రహము గలిగి రుద్రమును జపించిన రోగియుఁ బాపియు రోగపాపములనుండి విముక్తు లై సాటిలేని సుఖము ననుభవింతురు.

వాయుప్రోక్తపురాణములో నమకమహిమ మిటులు చెప్పఁబడినది.

శ్లో॥ య శ్చ రుద్రాన్ జపే న్నిత్యం ధ్యాయమానో మహేశ్వరం
య శ్చ సాగరపర్యన్తాం సశైలవనకాననామ్
సర్వాన్నాత్మగుణోపేతాం సువృక్షజలశోభితామ్
దద్యా త్కాంచనసంయుక్తాం భూమిం చౌషధిసంయుతామ్
తస్మా ద ప్యధికం తస్య సకృ ద్రుద్రజపా ద్భవేత్
మమ భావం సముత్సృజ్య యస్తు రుద్రా న్జపే త్సదా
స తే నైవ చ దేహేన రుద్రః సంజాయతే ధ్రువమ్

ఏకాదశభి రేతై స్తు మహారుద్రః ప్రకీర్తితః
నిర్ధనో ధన మాప్నోతి మహాపాతకనాశనః ॥

శివుని ధ్యానించుచు నిత్యము నెవఁడు శతరుద్రమును జపించునో వానికి సాగరపర్యంత మై పర్వతవనారణ్య పారివృత మై సువృక్షజలశోభిత మై యోషధిసంయుతమై వసుసంపన్న మై యదనీయ మగు సర్వభక్ష్యవిశేషోపేత మైనభూమిని దానము చేసినవానికంటె నెక్కుడు ఫలము లభించును. మమతను వీడి సదా రుద్రజపమాచరించు వాఁ డీ దేహముతోడనే రుద్రుఁడగుట నిశ్చయము. శతరుద్రమును బదునొకండావృత్తులు జపించిన మహారుద్ర మనఁబడును. అట్లు చేసినవాఁడు మహా పాతకముల నశింపఁ జేసికొని దారిద్ర్యమును దొలఁగించుకొనును.

శివపురాణము శతరుద్రీయమహాఫలము నిటులు వెల్లడించు చున్నది.

శ్లో॥ జ్వరప్రలాపశాంత్యర్థం జలధారా శుభావహా
శతరుద్రీయమంత్రేణ రుద్ర స్త్యైకాదశేన తు
రుద్రజాప్యేన వా తత్ర సూక్తేన పౌరుషేణ వా
షడంగే నాథవా తత్ర మహామృత్యుంజయేన చ
గాయత్ర్యా వా నమోంతై శ్చ నామభిః ప్రణవాదిభిః
మంత్రై ర్వా దాగమోక్తై శ్చ జలధారాదికం తథా
సుఖసంతానవృద్ధ్యర్థం ధారా పూజన ముత్తమమ్॥

(శివపురాణమ్)

సన్నిపాతజ్వరశాంతికై శివునకు శతరుద్రమంత్ర పూర్వక ముగ నేకాదశవారజలాభిషేకము చేయుట శుభకరము. సత్సంతానాభివృద్ధికొఱకు శతరుద్రిజపముచేఁ గాని పురుషసూక్తముచేఁ గాని షడంగయుతమైన మహామృత్యుంజయముచేఁ గాని గాయత్రిచేఁ గాని ప్రణవ మాదియం దుండి నమశ్శబ్ద మంతమం దుండు నామములచేఁ గాని యాగమోక్తమంత్రములచేఁ గాని జలధారాభిషేక మొనరించి శివునిఁ బూజించు టుత్తమము.

ఇట్టి మహామహిమప్రభావసంపన్నమై సర్వోపనిషత్సారముగా యజుర్వేదమున నున్న నమకప్రాభవమును స్కాంద పురాణ బ్రహ్మోత్తరఖండ మిట్లు వెల్లడించుచున్నది. కాశ్మీర దేశాధిపతి యగుచంద్రసేనుని సభాభవనమునకు బ్రహ్మర్షి యగు పరాశరుఁడు విచ్చేయఁగా నృపాలుఁ డత్యాదరగౌరవములతో నతనిని బూజించి కూర్చుండఁబెట్టి తనకుమారునిచేతఁ గూడఁ బ్రణమిల్లఁజేసినాఁడు. "దివ్యమునీ: మీ రాక మా హృదయ సాగరమునకు రాకాశశాంకాగమనసదృశము. సత్పురుషసాంగత్యము కామధేనువు వలె సర్వార్థసిద్ధికారణము కదా! సర్వసంశయచ్ఛేదసమర్థ మగుతమదర్శనముచే నా యజ్ఞానాంధకారము నాశమై జ్ఞానదృష్టి కలిగినది. ఓ పరాశరమునీ! పరశ్శత పరీణామములు. ఈ నా కుమారుని భవిష్యచ్చరిత్రముఁ దెలిసికోవలె నని కుతూహల పడుచున్నాఁడను. నా కోరికను దీర్పు"డనఁగాఁ బరాశరుఁ డిటులు చెప్పెను.

"చంద్రసేనా! భవిష్యములో జరుగనున్నచెడు నెట్లు చెప్పఁగలను? భావిదుఃఖములను విన్నచో నెంతధృతిమంతు లైనను దుఃఖింపక తప్పదు, కాని నిష్కపట హృదయుఁడ వై యడుగుచున్నందున నవాచ్య మయ్యును జెప్పుదును, వినుము. ఈ నీ కుమారున కిప్పటికి ద్వాదశవర్షములప్రాయము గడచినది. ఇంక సప్తమదివసమున మృతుఁడు కాఁగలఁడు. అపుడే కాలకూట సమాన మగునీమాట విని మూర్ఛపోవుచున్నావు. ఊరడిల్లుము. భయపడకుము. నీకు హితము నుపదేశింతును.

సృష్టికిఁ బూర్వము నిష్కళంకము, చిదానందమయము, నద్వితీయము, జ్యోతిస్స్వరూపము శివరూపము నగుపరమాత్మ రజోగుణముచేఁ దొలుత బ్రహ్మను సృజించి ప్రపంచనిర్మాణ కార్యము నొసంగి వేదముల నిచ్చెను. ఆ పరమాత్మయే సర్వోప నిషత్సారమును, బరమాత్మ తత్త్వసంగ్రహమును నగు రుద్రాధ్యా యము గూడ నొసఁగెను. ఆ రుద్రాధ్యాయమునం దవ్యయమును సర్వమూలమును సాక్షాద్బ్రహ్మస్వరూపమును నగు పరమశివ తత్త్వమే వర్ణితమైనది. లోకస్థితికొఱకై యా బ్రహ్మ చతుర్వదనములచేఁ జతుర్వేదముల నుచ్చరించెను. ఆతని దక్షిణాన నమునుండి వెలువడినయజుర్వేదములో సర్వోపనిషత్సార మగు రుద్రాధ్యాయ మున్నది. దానిని మరీచ్యత్ర్యాదిప్రాచీనమహర్షులు వేదములతో నధ్యయన మొనరించి తమశిష్యుల కుపదేశించిరి. ఇట్లు వారినుండి వారిపుత్రులకు, శిష్యులకు మఱల వారినుండి వారి వారలకుఁగా వ్యాప్త మైనది.

శ్లో॥ ఏష ఏవ వరో మంత్రః ఏష ఏవ పరం తవః
రుద్రాధ్యాయజపః పుంసాం పరం కైవల్యసాధనమ్॥
యే మహాపాతకై ర్యుక్తా ఉపపాతకినశ్చయే
రుద్రాధ్యాయం జపంత స్తు తేఽపి యాంతి పరాం గతిం॥

(బ్రహ్మోత్తరఖండమ్)

ఈ రుద్రాధ్యాయమే మహామంత్రము. ఇదియే గొప్ప తపము. రుద్రాధ్యాయపారాయణము పురుషునకు మోక్షసాధనము. మహాపాతకోపపాతకములను జేసినవారుఁ గూడ రుద్రాధ్యాయ జపముచే ముక్తినిఁ బొందుదురు.

బ్రహ్మ, దేవతిర్యఙ్మనుష్యాదుల నందఱను సృజించి. వర్ణానుసారముగఁ గర్మముల నియోగించెను. వా రా కర్మానుసారముగఁ బ్రవర్తిల్లుచుఁ గర్మఫల మనుభవింపుచుండిరి. ఆ ప్రజాపతి లోకప్రవృత్తికొఱకై ముందుభాగమున ధర్మమును వెనుకవైపున నధర్మమును బుట్టించెను. ధర్మకర్మాచరణులు పుణ్యఫలమును, నధర్మకర్మాచరణులు పాపఫలమును ననుభవింపుచుండిరి. పుణ్యకర్మలకు ఫలము స్వర్గప్రాప్తి. దానికి దేవేంద్రుఁ డధిపతి. పాపకర్మలకు నరకప్రాప్తి, దానికి యముఁ డధిపతి – అధర్మమునకుఁ గామము, క్రోధము. లోభము, మదము, మోహము, మాత్సర్యము ననునార్గురు కుమారులు, వీ రందఱును నరకమునకుఁ జేర్చువారే. కామమునకు గురుతల్పగమనము, సురాపానము, చండాలవనితాసంగమము, ననుముగ్గురు ప్రధానపుత్రు లున్నారు.

క్రోధమునకుఁ బితృహత్య, మాతృహత్య, బ్రహ్మహత్య, *వీర
హత్య యను ప్రధానకుమారు లున్నారు. లోభమునకు దేవద్రవ్య
హరణము, బ్రాహ్మణవిత్తచౌర్యము, స్వర్ణస్తేయము ననుముగ్గురు
పుత్రిలు. ఈ కామ, క్రోధ, లోభాదులకు కుమారుల నందఱను నరక
లోకాభి వృద్ధికొఱకై పాపకర్మాధినాథులుగా యముఁడు నియో
గించెను. వీ రందఱును బాపుల నొనరించి నరకలోకమును నిండిం
చిరి, పాపకర్మప్రచారకు లగువీ రందఱును లోకసంచార మొనరిం
పుచు సాక్షాత్కైవల్యసాధన మగు రుద్రపారాయణము, భువన
ములో వ్యాపించుటచే దానిచేఁ గొట్టఁబడినవారై భీతు లయి తమ
ప్రభుఁడగు యమునికడ కరిగి "యమధర్మరాజా! గ్రామగ్రామము
లందును నదీతీరములందును బుణ్యతీర్థములందును రుద్రజపము
జరుగుచున్నది. తత్ప్రభావముచే మేము దహింపఁబడు చున్నా
రము. ప్రాయశ్చిత్తసహస్రములైనగణింపనిమే మీ రుద్రజప
మును సహింపలేకున్నాము. ఇఁక మా కృత్యము లన్నియు
నిలిచిపోయినవి. ఈ కష్టము నీవే పోఁగొట్టవలె" నని మొఱపెట్టు
కొనిరి. అతఁడును బ్రహ్మకడకుఁ బోయి యీ విషయము లన్ని
యును జెప్పి "మహానుభావా! భూలోకముకోనిపాపు లందఱును
శతరుద్రీయపారాయణమహిమచే పవిత్రులై మా పాపవంశ
మును నాశ మొనరించుచున్నారు. పాపవంశనాశనముతో నర
కము శూన్యమై నా పాలనాప్రాభవములే నిష్ఫలము లగును.

---

*వేదశాస్త్ర సంపన్నుఁడై తదనుష్ఠాన పరుఁడగు బ్రాహ్మణుఁడుగాని, అభిషిక్తుఁ
డగురాజు గాని వీరుఁడు—

కావున నీ వేదేని యుపాయ మాలోచించి శతరుద్రీయపారాయణ విఘ్నము నొనరించి మా రాజ్యమును నిలువఁబెట్టు" మని కోరెను. అంత విధాత అజ్ఞానమునకు అశ్రద్ధ - దుర్మేధ యనెడి కుమారికాద్వయమును సృజించి మానవులశ్రద్ధామేధలకు విఘ్న మొనరింపఁ బంపెను. అవి మానవులలోఁ బ్రవేశించి రుద్రపారాయణసమయమున నశ్రద్ధను దురాలోచనమును గలిగించి మనుజులను బాపాత్ములఁ జేయుచుండఁగా గృతాంతుఁ డంతులేనిసంతసము నందెను.

పూర్వజన్మకృతపాపఫలముగా మానవు లల్పాయుష్కులుగ జనింతురు. అట్టివారు రుద్రపారాయణమునఁ బాపనిర్ముక్తులయి దీర్ఘాయువు, బలము, ధైర్యము, నారోగ్యము, జ్ఞానము, నైశ్వర్యము వర్ధిల్లి సుఖింతురు.

శ్లో॥ రుద్రాధ్యాయేన యే దేహం స్నాపయంతి మహేశ్వరం
తజ్జలైః కుర్వతే స్నానం తే మృత్యుం సంతరంతి చ॥

ఈశ్వరునకు రుద్రాధ్యాయమును జెప్పుచు నభిషేక మొనరించి యా జలముతో నెవ్వఁడు స్నాన మొనర్చునో వానికి మృత్యువు గలుగదు.

శ్లో॥ శతరుద్రాభిషేకేన శతాయు ర్జాయతే నరః
అశేషపాపనిర్ముక్తః శివ స్యేష్టతమో భవేత్ ॥

శతరుద్రీయముతో శివాభిషేక మొనరించినవారు శతాయుష్కులై సకలాఘములను దొలఁగించుకొని పరమేశ్వరున

కత్యంతప్రీతిపాత్రు లగుదురు. కావున నీ కుమారుఁడు పదివేల సారులు శతరుద్రీయపారాయణతోడిస్నానము చేయవలయును. అట్లు గావించినచో భూలోకములోఁ బదివేలవర్షములు భోగభాగ్యములతో మహేంద్రునివలె సుఖింపఁగలఁడు.

ఆ వాక్యములు విని నరేంద్రుఁడు పరాశరునే పారాయణమునకు గురువుగాఁ గోరి యొనరించి వేలకొలఁది శుద్ధాత్ములగు మునీశ్వరులను బారాయణమునకు వెంటనే రప్పించెను. వారు పుణ్యవృక్షదళములతోడను జలములతోడను నూతుకలశలను స్థాపించి శతరుద్రీయముచే నా నీటిని మంత్రించి సప్తమదివసమున నా రాజకుమారునకు శాస్త్రోక్తవిధిని మంత్రజలముతో స్నానముఁ జేయించిరి. ఆ స్నాన మొనరింపుచుండఁగనే రాజకుమారుఁ డకస్మాత్తుగా క్షణమునేపు మూర్ఛపడెను. కాని మునిప్రవరులు రుద్రమంత్రపవిత్ర జలముచే స్నాన మొనరించుచుండుటవలన వెంటనే మూర్ఛనుండి లేచి యా కుమారుఁ డిటులు చెప్పెను. "మహాత్ములారా! యెవఁడో యొకదండహస్తుఁడు నా దగ్గఱకు వచ్చెను. వాఁడు పెద్దపెద్దకోఱలు గలిగి భయంకరుఁడై నన్నుఁ జంప సిద్ధపడుచుండఁగా నాతనిని మహావీరులైన రాజులు, రాజభృత్యులు దండించిరి. అతనిని త్రాళ్లచేఁ గట్టి యెచటికో తీసికొనిపోయిరి. మీరు నన్ను రక్షించుటచే నే నింతమాత్ర మెఱుఁగుదును." ఆ మాటలు విని ఋషు లెల్లరు "నృపాలా! నీ సుతుఁడు పునర్జీవితుఁడై దీర్ఘాయుర్దాయము గలవాఁ డయ్యె" నని యాశీర్వదించిరి. రాజు వారల నందఱను యథోచితముగా

గౌరవించి షడ్రసోపేతభోజనమును బెట్టెను. అనంతరము సభలో గూర్చుండఁగా నారదుఁడు వచ్చి "రాజా! నీవు మిక్కిలి యదృష్ట వంతుఁడవు. మృతుఁ డగుచున్న నీ కుమారుని బంధింప నున్న మృత్యుదేవతను, శతరుద్రీయ మహత్త్వమున వీరభద్రుఁడు వచ్చి శిక్షించి శృంఖలముల బంధింపఁగా యముఁ డా బాలకుని యాయుః ప్రమాణము పదివేలవర్షములు వృద్ధినందుట నెఱిఁగి, వీరభద్రునిఁ బ్రార్థించి మృత్యువుచెఱను విడిపించెను. శతరుద్ర మంత్రాభిషేక మహాఫలముగ నీ కుమారుఁడు పునర్జీవితుఁ డయ్యెను, ఈ దృశ్యమంతయు నేను గన్నులార నా లోకములలో జూచితి" నని చెప్పెను.

ఆ నారదవాక్యములు విని యందఱు నానందించి నిజాశ్ర మముల కరిగిరి. కాశ్మీరదేశాధిపతియుఁ గుమారుఁడును శతరుద్ర పారాయణ నియమవంతులై కృతార్థులైనారు.

శతరుద్రీయ మంతటి మహాప్రభావసంపన్నమైనది.

కార్తికమాసమున శివారాధన మే విధానముగ నొనర్చినను మహాఫలము నొసఁగును. ఆర్ద్రానక్షత్రము శివప్రీతికరము కావున నా నక్షత్రముగల దినమున నీశ్వరాభిషేకము శతరుద్రీ యముతో నొనరించు టుత్తమము.

శ్లో॥ ఆర్ద్రాయాం చ మహార్ద్రాయాం శివపూజా విశిష్యతే
మాఘకృష్ణ చతుర్దశ్యాం సర్వాభీష్ట ఫల ప్రదా
ఆయుష్కరీ మృత్యుహరా సర్వసిద్ధికరీ నృణాం॥

(శివపురాణమ్)

ఆర్ద్రానక్షత్రమందుఁగాని యార్ద్రికా ర్తెయందుఁగాని శివారాధనము శ్రేష్ఠము. శివరాత్రినాఁటి పూజ సర్వాభీష్టములఁ దీర్చును. ఆయుర్వృద్ధియు మృత్యుజయమును గలిగించును.

శతరుద్రమంత్రమును బదునొకండు పర్యాయములు చెప్పుచు నభిషేకము గావించుట మహారుద్ర మనియు, నేకాదశ రుద్ర మనియు నందురు. అట్టి శివాభిషేకము మిక్కిలి గొప్పది.

శివపూజకుఁ గుసుమములు గాని, దళములు గానిలక్షసంఖ్య యుండుటశ్రేష్ఠము. శివపూజ కన్నిపుష్పముల నుపయోగింపనగును గాని చంపకమును, గేతకిని నుపయోగింపరాదు.

శ్లో॥ విద్యతే కుసుమం తన్న యన్నైవ శివ వల్లభమ్
చంపకం కేతకం హిత్వా త్వన్య త్సర్వం సమర్పయేత్॥
(శివపురాణం)

బ్రాహ్మణు లెల్లరును నిత్యము వేదాధ్యయన మొనరింపవలెను. అందులకు శ క్తిచాలనిచో సంహితామాత్రముగాని, యందులకును నశక్తుఁ డగుచో నాల్గవ యష్టకమునుగాని, యందులకును గుదురనిచో శతరుద్రీయము నైనఁ బారాయణ మొనరింపవలెను. దానికిని వీలుపడనిచో "నమ స్సోమాయ చ" మంత్రమునైనఁ జదువుకొనవలెను, లేదా నిత్యమును స్నాన మొనరించి "నమ శ్శివాయ" యని పదునొకండు పర్యాయము లైన జపించినఁ దత్ఫలము గలుగును. అందులకే మనపెద్ద లక్షరాభ్యాసకాలమునఁ బంచాక్షరి నుపదేశించు టాచార మైనది. "యం యం కామయతే కామం తం తం వేదేన సాధయేత్."

# శివతత్త్వము

హిమశైలమునఁ దప మాచరించుచున్న మునులకుఁ గాశీక్షేత్రసందర్శనకౌతూహలము గలిగి యటకుఁ బోయి మణికర్ణికా ఘట్టమున స్నాన మొనరించి దేవ. పితృ, ఋషి తర్పణాదు లాచరించి విశ్వేశ్వరుని దర్శించిరి. అత్యంతభక్తితో విశ్వనాథుని సేవించి వేదపారాయణ, రుద్రసూక్తపారాయణము నొనరించి శివార్చనవలన ధన్యుల మైతి మని సంతసించినా రా మౌనివర్యులు. సూతమహర్షియు వారణాసి వచ్చి విశ్వనాథు నర్చించి పంచక్రోశ యాత్ర చేయుచుండెను. మునులందఱు ముక్తిమంటపమునఁ జేరి సూతు నర్ఘ్యపాద్యాదులతోఁ బూజించి "సూతా! నీవు వ్యాస మహర్షికిఁ బ్రియశిష్యుఁడవు. నీలో సకలపురాణము లున్నవి. వేదరహస్యములు, ప్రణవతత్త్వము, పరమేశ్వరతత్త్వము పురాణములందుఁ జెప్పఁబడినవి. నీవు మా గురుఁడవు గాన మా కా శివతత్త్వమును వివరించి మమ్ముఁ దరింపఁజేయు" మని యడిగిరి. సూతుఁడు "మహర్షులారా! పూర్వము మునిగణమునకు వ్యాసుఁడు చెప్పిన దానిని మీకుఁ జెప్పుదును.

పూర్వము స్వారోచిష మన్వంతరమున నైమిశారణ్యములో ఋషు లందఱు దీర్ఘ సత్రయాగము చేయుచుండఁగా వ్యాసమౌని యటకు విచ్చేయఁగా మును లాతనిని గోరిరి. అపుడు సర్వ వేదరహస్యముల నెఱిఁగిన వ్యాసుఁ డిట్లు వివరించెను.

పార్వతీపరిణయానంతర ముమామహేశ్వరులు కూర్చుండి యుండఁగాఁ బార్వతి శివునిఁ బ్రశ్నించినది. "నాథా! ప్రతిమంత్ర మునకుఁ బ్రణవము ముం దుంచుదురు. అది యెట్లు వచ్చినది? వేదముల యాది ప్రణవ మనియుఁ బంచబ్రహ్మలు నీ ప్రణవ ములో నున్నా రనియుఁ జెప్పుదురు. ఆ విషయమును బోధించి పరమేశ్వరతత్త్వము నుపదేశింపుఁ" డనఁగాఁ బరమేశ్వరుఁడు సంతోషముతో మంత్రోపదేశము గావించి "పార్వతీ! ప్రణవము సూక్ష్మ మైనది. వటవృక్ష మెంతపెద్దదో ఆ ప్రణవములో నంత విశేషార్థ మున్నది. వేదసారమే ప్రణవము. నా రూపమే ప్రణవ" మని వివరించి చెప్పెను. పరమాత్మయనఁ ద్రిగుణా తీతుఁడు, సమస్తబ్రహ్మాండకారణభూతుఁడు. సర్వత్ర నిండి యున్నను నోంకారములో నున్నాఁడు పరమేశ్వరుఁడు. జగ మంతయుఁ బ్రణవమయమే. పరమేశ్వరుఁడు ముందుఁ బ్రణవ మును సంస్మరించి పిదప జగత్సృష్టి నారంభించెను. శివుఁడే ప్రణవము. ప్రణవమే శివుఁడు. వాచ్య వాచక నామ రూప భేదము లెట్లు లేవో యట్లే యేకాక్షర మైన ప్రణవమే బ్రహ్మ స్వరూపము. నామరూప రహిత మైనది ప్రణవము, దాని నుండియే జగ మంతయుఁ బుట్టినది. మంత్రమే పరమాత్మ. పరమాత్మయే మంత్రము. అందువల్లఁ గాశిలో మరణించినవానికి శివుఁడు ప్రణ వమునే యుపదేశించును. ప్రణవోత్పత్తిఁ దెలిసికొనిన జ్ఞానము కలుగును. ప్రణవమంత్ర జపముచే ముక్తి సంప్రాప్తించును. బ్రహ్మాది మొదలు తృణపర్యంతము ప్రాణ మైనది ప్రణవము.

ప్రాణరూప మైన దగుటచే ప్రణవ మైనది. ఈ ప్రణవమునకు "అ" మొదటి వర్ణము. 'ఉ' రెండవ వర్ణము. 'మ్' అంత్య వర్ణము. నాదము, బిందువు నను రెంటిసంయోగమే 'ఓం' కారము. అదే ప్రణవము. అ ఉ మ వీనికి మాత్ర లని పేరు. ప్రహ్స్వరూప మన్నమాట, వేదముల కాది యీ ఓంకారమే."

అని ప్రణవస్వరూపమును వివరించి యానాటి సదస్సు ముగించి సూతముని కాశినుండి యాత్రార్థియై దక్షిణసాగరతీరము నకుఁ బోయి కన్యాకుమారి సేవించి పిమ్మటఁ గాళహస్తి కరిగి సువర్ణముఖిలో స్నానమొనరించి కాళహస్తీశ్వరుని జ్ఞానప్రసూ నాంబికను సేవించి జపించుచుండఁగా నాకాశవాణి యిట్లనినది. "సూతా! నీవు శీఘ్రముగఁ గాశి కరుగుము నీవు మునివరుల కచ్చట నోంకారోత్పత్తి మహిమాదికముల వివరించితివిగదా! ఇంకను వారు విన నభిలషించుచు నీకై వేచియున్నారు, వెడలుము." అది విని సూతుఁ డటనుండి కాశికి వచ్చి మునివరుల స్వాగత మును స్వీకరించి వామదేవమతమును వివరింప నారంభించెను.

రథంతర కల్పములో వామదేవుఁ డను ఋషీశ్వరుఁడు కలఁడు. ఆతఁడు వేద వేదాంగ సకలపురాణ సారముల నెఱిఁగిన వాఁడు. త్రికాలజ్ఞుఁడు, ద్వంద్వాతీతుఁడు, దిగంబరుఁడు. మహా జ్ఞాని. భస్మమును ధరించి సాక్షాచ్ఛివునివలె నుండి తీర్థయాత్రల కరుగుచుఁ దనపాదస్పర్శచే భూమిని బవిత్రి మొనరించువాఁడు. సర్వదా పరమేశ్వరధ్యాన నిమగ్న చిత్తుఁడు. ఆతఁడు తన

తీర్థాటనములో వల్లీసహితుఁడై ద్వాదశభుజములతో నాఱుశిరములతో మయూరవాహనుఁడై సురసేవితుఁడై యున్న కుమారస్వామిని దర్శించి యాతనిని బూజించి సాష్టాంగవందనము గావించి స్తుతించెను. వినయవంతుఁడై వామదేవుఁడు కుమారస్వామి ముందు బద్ధాంజలియై నిలువఁగాఁ గుమారస్వామి "నాయనా నీ భక్తికి సంస్తుతికి సంతోష మయ్యెను. నీవు యోగులలో శ్రేష్ఠుఁడవు, మహాజ్ఞానివి. మీబోంట్లు లోకశ్రేయమునకే దేని నైనఁ గోరుదురు. నే యభిలషిత మేమి" యనఁగా వామదేవుఁడు సంతోషించి వినయాతిరేకముతో "భగవానుఁడా! నీవు సర్వజ్ఞుఁడవు. సర్వశక్తిసంపన్నుఁడవు మేము సాధారణజీవులము నీ విజ్ఞానములో నొక కణము నాలో నున్నందున ని న్నడుగుచున్నాను. క్షంతవ్యుఁడను. ప్రణవార్థము పరమేశ్వరుఁడే! బ్రహ్మాండ మంతయు నోంకారమే. సర్వవ్యాపకుఁడు, సర్వాంతర్యామి. సమష్టి వ్యష్టి రూపుఁడు శివుఁడేకదా! ఆ ప్రణవస్వరూపమును దెలిసికొనుటకు నీ వంటిగురు వెక్కడను లభ్యపడలేదు. కావున నెఱింగింపవే!" యని కోరెను.

స్కందుఁడు ప్రణవస్వరూపుఁడు, ముప్పది యెన్మిది కళలకుఁ బ్రభువైనవాఁడు నగు పరమేశ్వరుని ధ్యానించిచెప్పుచుండెను.

"లోకములోని జీవు లందఱును బశువులే. ఆత్మజ్ఞానము దెలిసినవాఁడు మాత్రము కాదు. మానుషజన్మ వచ్చినందులకుఁ

బరమేశ్వరతత్త్వము తెలిసికొని యీజన్మలోనే తరణోపాయముఁ జూచుకొనవలె ననెడు నిశ్చయజ్ఞానము కలిగి యుండవలెను, పరమాత్మస్వరూప మొక టున్న దనియు నదియే శివుఁడు విష్ణువు బ్రహ్మ దేవతలు ననెడి జ్ఞాన ముండవలెను.

ప్రణవము సాక్షాత్ పరమాత్మను జెప్పును. రాముఁ డధికుఁ డని కొందఱు, కృష్ణుఁ డెక్కువ యని కొందఱు, నీశ్వరుఁడు ఘనుఁ డని కొందఱు విమర్శింతురు. కాని వేదము లేమి చెప్పుచున్నవో తెలియరు. పరమాత్మ యానందమయుఁడు. స్థిరమైనవాఁడు. జగమంతయుఁ బరమాత్మ నుండియే పుట్టినది. పరమాత్మ వల్లనే సూర్యుఁడు చంద్రుఁడు ప్రకాశించుచున్నారు. సర్వజగత్తును బరమాత్మయే. ఆ పరమాత్మ నెఱిఁగినవానికి భయమన్నదుండదు.

వామదేవుఁడు ప్రశ్నించుచున్నాఁడు.

"పరమాత్మనుండి పుట్టుగు వఱకుఁ బురుష స్త్రీ మయమే కదా! పరమాత్మ పురుషుఁడా? స్త్రీయా? నపుంసకమా? మిశ్రమమా!

ప్రతిమనుజుఁడు నేను దెలిసికొంటిని, నేను జేయుచున్నానని తలంచును, కొందఱు రాముఁడు గొప్ప యని, కొందఱు కృష్ణుఁడు గొప్పయని భావింతురు. ఇట్టి యజ్ఞానము విషవృక్షము వంటిది, ఆ యజ్ఞానవృక్షమును ఛేదించి నాలో శివాద్వైతవృక్షబీజమును నాటుము. అద్వైతభావమును బోధింపు" మని వామ

దేవుఁ డడుగఁగా స్కందుఁడు నుడువుచున్నాఁడు.

ఈ విషయము మా తండ్రిగారు మా యమ్మకుఁ జెప్పు చుండఁగా నేను మా తల్లి యొడిలో నుండి విన్నాను. ఆ విన్న దానినే చెప్పెద నాలింపుము.

"మొట్టమొదటి దస్తితత్త్వము. అనఁగాఁ గర్త్రయున్నదను తత్త్వము. ఇచ్చటఁ బ్రత్యక్షప్రమాణమే కాని యనుమాన ప్రమాణము పనికిరాదు. జగత్తులో స్త్రీరూపము పురుషరూపము రెండు కన్పించుచున్నవి. గర్భములోని పిండ మాఱుకోశములతో నిండి యున్నది. పిండములో మూఁ డంశలు తల్లివి. మూఁ డంశలు తండ్రివి యుండును. అందుచేఁ బిండము స్త్రీపురుషస్వరూపము. అటులే పరమాత్మయు స్త్రీ పురుష స్వరూపమే. శాస్త్రములచేతఁ గాని యింద్రియములచేఁ గాని గోచరముకానిదే పరమాత్మ. పరమాత్మ త్రిలింగశబ్దము. అనఁగా నన్నిలింగములలో నున్నది. ఏ లింగము వాడినను వాడ నగును. పుంలింగముగ, స్త్రీలింగముగ నపుంసకముగ వ్యవహరింపఁబడువాఁడే పురుషుఁడు. పురుషుఁ డనఁగా జీవుఁడు. జీవుఁడు తేజస్స్వరూపుఁడు.

జ్ఞానశబ్దము నపుంసక లింగము. చిచ్ఛబ్దము స్త్రీ లింగము. ప్రకాశము పురుషలింగము. పరమాత్మ సచ్చిదానందరూపము. వత్తిని దైలములో నుంచి వెలిఁగించినఁ దేజము బయలుదేఱినది. అందులో వత్తి కొడికట్టి మాలిన్యము కూడ

వచ్చినది, అట్లే శివుఁడు శక్తి కలిసినచోఁ దేజస్సు వచ్చును. అదే పరమాత్మ. మాలిన్యమే జగత్తు. అందుచే మాలిన్య మగు జగత్తును వదలి తేజస్స్వరూప మగు పరమాత్మను గ్రహింపుము. విస్తరింపఁజేయునది విస్తరించునదియుఁ గానఁ బరమాత్మకు బ్రహ్మయని పేరు. అష్టాత్రింశత్కళాతీతుఁ డగు పరమేశ్వరునిఁ దెలిసికొన్నవాఁడే యద్వైతుఁడు. ఆ తెలిసికొనుటయే జ్ఞానము. పరమాత్మ సచ్చిదానందమయుఁడు గదా ! ఆది మధ్యాంతములం దుండును గాన 'సత్' అనఁబడును. జగము లేనపుడు పరమాత్మ యథార్థస్వరూపము కనఁబడును. జ్ఞాన మన్నదే 'చిత్'. పరమాత్మ కిచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి యను త్రివిధ శక్తులున్నవి. అగ్నియందు వేఁడి, సూర్యునియందుఁ దేజము, చంద్రునిలో వెన్నెల యె ట్లున్నవో యటులే పరమాత్మలో జ్ఞాన శక్తి యున్నది. శివుఁడు వేఱు శక్తివేఱును గాదు. ఒక్కటే యని శ్రుతిప్రమాణము.

జీవాత్మ పరమాత్మ లొక్కటే. మానవునియందుఁ జిచ్ఛక్తి తగ్గుటచే సంసారాంభోధిలోఁ బడుచున్నాఁడు. ఆ మానవుఁడు జ్ఞానశక్తిని బెంచుకొనినచోఁ దాను బరమాత్మ నను జ్ఞానమును బొందును, అపుడే ఆనందస్వరూపుఁ డగును. ఆచిచ్ఛక్తిని బెంపొందించుకొనుటకే ఋషులు మొదలగువా రడవులకు వెడలి శరీరమును శుష్కింపఁజేసి తపము నొనరించి ఆనందస్వరూపు లగుదురు. అదే శాశ్వత మెనది.

ఆత్మయే శివుఁడు. శివుఁడే ఆత్మ. ఆత్మయే ప్రణవము. ప్రణవమే ఆత్మ. ప్రణవమే జగత్తు. జగత్తే ప్రణవము. ఇదియే శివాద్వైతము."

ఇట్లు షాణ్మాతురుని ముఖమునుండి శివాద్వైతతత్త్వమును విని వామదేవమహర్షి నమస్కరించి ధన్యుఁడ నైతి నని బ్రహ్మానంద మందెను.

ఈ విధముగా సూతమహర్షివలన శివతత్త్వమును విని మును లెల్లరు సంతుష్టులైరి.



# ముక్తి

ముక్తి యీశ్వరానుగ్రహైక లభ్యము. శివానుగ్రహము గల్గినచో దేవ దానవ మానవ పశు పక్షి కీటకములలో నెవ్వరైన ముక్తు లగుదురు. స్వర్గనివాసుఁడు గాని, నరకస్థుఁడు గాని, పండితుఁడు గాని, పామరుఁడు గాని, ముక్తుఁడు గావచ్చును. నిస్సందేహము. ముక్తినొందవలె నన్న నీశ్వరభక్తుఁడు కావలెను. క్షుద్రుఁడైనను దనభక్తిగలవాని నాతఁ డనుగ్రహించును. శివానుగ్రహమున భక్తియు, భక్తిచే ముక్తియు లభ్యమగును. మనుజుఁ డొకజన్మచే ముక్తుఁడు కాలేఁడు. వివిధజన్మములలో శ్రౌత స్మార్త కర్మ లాచరించి విరక్తుఁడై జ్ఞానము నార్జించినచో నీశ్వరభక్తి యలవడును. ఈశ్వరభక్తివలనఁ దరువాతి జన్మమున నీశ్వరధర్మపరాయణుఁడై తప మొనరించి పరమేశ్వరుఁడు తప్పఁ దన కన్యుఁడు లేఁ డను తత్త్వము తెలిసికొనును. దానితో భవ బంధము లూడి ముక్తుఁ డగును. ఎంత యల్పమగు శివభక్తి యున్నను మానవుఁడు మూఁడు జన్మములలో ముక్తుఁ డగును.

శ్లో॥ ముక్తి శ్చతుర్విధా ప్రోక్తా శ్రూయతాం కథయామి వః
సంసారక్లేశ సంహర్త్రీ పరమానందదాయినీ
సారూప్యా చైవ సాలోక్యా సాన్నిధ్యా చ తథా పరా
సాయుజ్యా చ చతుర్థీ సా వ్రతే నానేన యా భవేత్

ముక్తేర్దాతా మునిశ్రేష్ఠాః కేవలం శివ ఉచ్యతే
బ్రహ్మాద్యా న హితే జ్ఞేయాః కేవలం చ త్రివర్గదాః
బ్రహ్మాద్యా స్త్రిగుణాధీశాః శివ స్త్రిగుణతః పరః
నిర్వికారీ పరబ్రహ్మ తుర్యః ప్రకృతితః పరః
జ్ఞానరూపోఽ వ్యయః సాక్షీ జ్ఞానగమ్యోఽ ద్వయః స్వయమ్
కైవల్య ముక్తిదః సోఽత్ర త్రివర్గస్య ప్రదోఽపి హి
కైవల్యాఖ్యా పంచమీ చ దుర్లభా సర్వధా నృణామ్ ॥

(శివపురాణం)

ముక్తి నాల్గువిధము లని చెప్పఁబడినది. ఇది సంసారక్లేశములను నాశ మొనరించి బ్రహ్మానంద మొసఁగును. సారూప్యముక్తి, సాలోక్యముక్తి, సాన్నిధ్యముక్తి, సాయుజ్యముక్తియను నవి నాలుగు రకములు. సారూప్యముక్తి యనఁ బరమేశ్వర స్వరూపము నందుటయే. సాలోక్యమనఁగా నా పరమేశ్వరుని లోకమును జేరుట. సాన్నిధ్యముక్తి యనగఁ బరమేశ్వరుని సన్నిధి నుండుట. సాయుజ్యముక్తి యనఁ బరమేశ్వరునిలో లీనమగుట. ఈ ముక్తి ప్రదాత యీశ్వరుఁ డొక్కఁడే. ఇతరులెవ్వరు నీయలేరు. బ్రహ్మాదు లందఱును త్రిగుణాధీశులు. శివుఁడు త్రిగుణాతీతుఁడు. అతఁడు పరబ్రహ్మస్వరూపుఁడు, నిర్వికారుఁడు, బ్రహ్మాండముకంటె వేఱైనవాఁడు. ప్రకృతికంటెఁ బరుఁడు,జ్ఞానరూపుఁడు,అవ్యయుఁడు.సర్వసాక్షి.జ్ఞానగమ్యుఁడు.అద్వయుఁడు, అతఁడే మానవులకు సర్వధా దుర్లభ మగు నైదవ దగు కైవల్యముక్తినిఁ గూడఁ బ్రసాదించును.

శ్లో॥ జ్ఞానం తు దుష్కరం లోకే భజనం సుకరం మతమ్
తస్మాచ్ఛివం చ భజత ముక్త్యర్థ మపి సత్తమాః
శివో హి భజనాధీనో జ్ఞానాత్మా మోక్షదః పరః
భక్త్యైవ బహవః సిద్ధా ముక్తిం ప్రాపుః పరాం ముదా
జ్ఞానమాతా శంభుభక్తి ర్ముక్తి భుక్తి ప్రదా సదా
సులభా య త్ప్రసాదార్ధి స త్ప్రేమాంకురలక్షణా
భక్తిజ్ఞానే న భిన్నే హి శంభునా వర్ణితే ద్విజాః
తస్మాద్భేదో న కర్తవ్య స్తత్కర్తుః సర్వదా సుఖమ్
విజ్ఞానం న భవత్యేవ ద్విజా భక్తి విరోధినః
శంభుభక్తి కరస్యైవ భవేత్ జ్ఞానోదయో ద్రుతమ్
తస్మా ద్భక్తి ర్మహేశస్య సాధనీయా మునీశ్వరాః
తయైవ నిఖిలం సిద్ధం భవిష్యతి న సంశయః॥

(శివపురాణము)

లోకమునందు జ్ఞానమార్గము కష్టము. భక్తిమార్గము సులభము. సత్పురుషులారా! ముక్తికొఱకై యీశ్వరునే భజింపుఁడు. జ్ఞానాత్ముఁడు, మోక్షప్రదుఁడు, పరుఁడు నగు శివుఁడు భజనాధీనుఁడు. మిక్కిలి సంతోషముతో భక్తితోడనే సిద్ధులనేకులు ముక్తులైరి. సర్వదా భుక్తిముక్తుల నొసంగు శంభుభక్తియే జానమాత. ప్రేమ లక్షణ యగు నా భక్తి శివానుగ్రహమున సులభమే. భక్తిజ్ఞానము లభిన్నము లని పరమేశ్వరుఁడు చెప్పినాఁడు గావున వానిని భిన్నముగాఁ జూడరాదు. అభిన్నముగ నెంచువాఁడు సర్వదా సుఖ మందును. భక్తివిరోధునకు విజ్ఞాన లబ్ధిలేదు. శివభక్తి నాచరించువానికే శీఘ్రముగజ్ఞానోదయ మగును.

కావున మునులారా! మహేశ్వరుని యందు భక్తి సాధింపఁదగినది. దానివలన సమస్తము నిస్సంశయముగ సిద్ధించును.

శివభక్తి వలన ముక్తుఁడు గావచ్చు నని తేలినది. భక్తి కూడ మూఁడువిధములుగ నున్నది. తామసభక్తి, రాజసభక్తి, సాత్త్వికభక్తి.

స్వధర్మహీనుఁడు, నిర్దయుఁడు, ధనలుబ్ధుఁడు నైన శివ భక్తుఁడు తామసభక్తుఁడు. అతఁడు పదిజన్మలలో ముక్తుఁడగును. స్వధర్మపరాయణుఁ డై పరోపకారగుణుఁడు నాశారహితుఁడు నై యహింసావ్రతుఁ డయిన యీశ్వరభక్తుఁడు రాజసభక్తుఁడు. అతఁడు మూఁడు జన్మములలో ముక్తి నందఁగలఁడు. నిజాశ్రమ ధర్మవర్తనుఁడై, నిష్కాముఁడై, పండితుఁడై, ఆశారహితుఁడై, కళత్రాదులయందు విరక్తుఁడై, యాత్మార్పణ మొనరించి, శివావ తారవిగ్రహములకు నిత్యోత్సవము లొనరించుచు, శివకథాశ్రవణ రతుఁడై శాంతుఁడైన యీశ్వరభక్తుఁడే సాత్త్వికభక్తుఁడు, అతఁడే నే నని పరమేశ్వరుఁడే చెప్పెను.

శ్లో॥ యస్తు స్వధర్మహీన స్స్యాత్ నిర్దయో ధనలోలుపః
మద్భక్తః తామసః ప్రోక్తో మాం వ్రజే ద్దశజన్మభృత్
స్వధర్మకృత్ పరార్థో యో నిస్పృహో నాతిహింసకః
మద్భక్తో రాజసః ప్రోక్తో ముక్తో జన్మత్రయా ద్భవేత్

యస్తు స్వాశ్రమధర్మే స్యాత్ నిష్కామో నిస్పృహ స్సుధీః
విరక్తః స్వకళత్రాదౌ మయ్యే వాత్మనివేదనః
హృష్టో మ మావతారేషు నిత్యోత్సవపరాయణః
మత్కథైకరత శ్శాంత స్సాత్త్విక స్సోఽహ మేవ హి॥

కావున మానవుఁడు నిరంతర మహేశ్వరభక్తిభావ బంధురుఁడై భవబంధములఁ దొలఁగించుకొని ముక్తుఁడు కావలెను.

శివమ్



# పండితాభిప్రాయములు - పత్రికాసమీక్షలు

"కవిసామ్రాట్" రేపల్లె
శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు ది. 20-12-71

......శ్రీ పరమశివుని మహత్త్వమును, ఉపాసనావిశేషములను, శివలీలలను, అవతారములను సామాన్యజనులకు తెలియని వాని నెన్నిటినో మీ రీగ్రంథములో నిక్షేపించినారు.......

వైదికమైన శివభక్తి కలవారికి మీ గ్రంథము ఎన్నో విధముల మార్గదర్శకమై వారి శివభక్తిని దృఢపరచునదిగా ఉన్నది.......

"కళాప్రపూర్ణ" అప్పికట్ల
శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు 28-11-71

......సమాజములో దైవభక్తియు, సదాచారసంపత్తియు లోపించుచున్న యీ కాలమున మీరు నిర్మించిన యీ కృతి ప్రజలకు పరమోపకారమొనర్పఁగలదు. భక్తవత్సలుఁ డగు శివుఁడు మీకు సర్వదా ప్రసన్నుఁ డగుఁగాక!

### "ఆచార్య" శ్రీ యస్వీ జోగారావుగారు ఎం. ఏ; పి హెచ్. డి
### హెడ్- తెలుగు డిపార్టుమెంటు
### ఆంధ్ర యూనివర్శిటీ పి. జి. సెంటర్, గుంటూరు. ది 2-12-71

......గ్రంథమున ప్రతిపుటయందును శివభక్తిభావనాస్నిగ్ధమును, సాహిత్యకళాసురభిళమును, అగు మీ హృదయము పరమరమణీయ మగు ప్రమథపథమునుబట్టి పోయినది. పరమునకు గుండెలోన గుడికట్టితిరి. ఆ గుడికి ప్రాకారము మీ గ్రంథము. అందలి వివిధ విషయవిన్యాస మొక చక్కని సోపానసరణి.



### శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు
### ఉపన్యాసకులు జవహర్‌భారతి, కావలి. ది. 4-12-71

..... శ్రీ శివలీలామృతము కన్నుల కద్దుకొంటిని. ఐశ్వర్యభోగములలో ఓలలాడు వారికి ఈశ్వరచింతనమే అరిది. అట్టియెడ స్వయము పరమేశ్వరధ్యానమున నిమగ్నులగుటయేగాక నాస్తికములో మునిగితేలుచున్న నేటి జనావళికి గూడ తరణోపాయము చూపుట మీవంటి సత్పురుషులకు సహజము. మీగ్రంథము ప్రాతఃస్మరణీయముగా నున్నది. ఈశ్వర విశ్వాసము కలవారికి అడుగు దృఢముగ బలముగ పడునుగదా।



### శ్రీ పిలకా గణపతిశాస్త్రిగారు
### మద్రాసు - ది. 14-12-71.

......దీనిలో భక్తిసోపానము, పార్వతీపరిణయము, మహేశ్వరావతారములు, దక్షారామభీమేశ్వరుడు ఆదిగాగల ఘట్టాలు కొన్ని నన్ను మరిం [illegible] శివలీలామృతమే!......

"కవి, కథకరత్న" నర్సాపురం
శ్రీ దీక్షితదాసుగారు ది. 2-12-71

......మీ సరళహృదయమునకు ప్రతినిధిగా నడిచిన మీకావ్యము మాదలె శులకు శిరోధార్యము. ఆస్తికత్వ మడుగంటు వర్తమానకాలమున, మానవహృదయములో భగవద్విశ్వాసమును పాదుకొలిపి సంస్కరింపదగు మీకృషి ప్రశంసనీయము.

మ. కవితానల్ప మనోజ్ఞ శిల్పరచనోత్కంఠతుల్, రసానందవై
భవ మాత్మానుభవప్రభావమున సంభావించు పుంభావవా
ణ్యవతారుల్ నవనవ్యవాఙ్మయ వసంతాసూన కావ్యప్రసూ
నవితానశ్రియులౌ మహోదయుల కే నర్పింతుఁ బుష్పాంజలిన్.

—•—

"మధురకవి"

శ్రీ మూలా పేరన్నశాస్త్రిగారు

బిలాస్‌పూర్

మ. భవదీయంబగు పాండితీగరిమకున్ ప్రజ్ఞావిశేషంబుకున్
గవులుం, బండితులున్, విమర్శకులు, భక్తవ్రాతముల్ మెచ్చున
ట్లవలీలన్ బహుకావ్యనీరధుల నొయ్యం జిల్కి యర్పించవే
శివలీలామృతకావ్యమున్ విబుధసంసేవ్యార్హమౌరీతిగన్.

—

శ్రీమాన్ ఉత్పల వేంకటరంగాచార్యులుగారు.

నెం. 134 అమ్మన్‌కోయిల్ వీధి. మద్రాసు. ది. 31-1-72.

......మూల్యములగు పెక్కు గ్రంథములనుండి సారమును సంగ్రహించి అమూల్యము లగు గ్రంథముల గూర్చి సులభగ్రాహ్యముగ రచించినారు. ఎన్నో గ్రంథములను జదివిన నిట్టి విషయములు బోధపడవు. పండిత పామరులకు ఆస్తికత్వము విజ్ఞానమును గూర్ప సమర్థము లయియున్న వీ గ్రంథములు. పారమార్థికము అక్షరజ్ఞులకు తప్పక కలిగింప గలవు.

## శ్రీ మానూరు శ్రీనివాస హనుమంతరావుగారు ఎం. ఏ.
ఆంధ్రభాషోపన్యాసకులు యస్. యస్. యన్ కళాశాల
నర్సరావుపేట — ది. 2 - 12 - 71.

......ఈ గ్రంథము "భక్తి"తో ప్రారంభింపబడి "ముక్తి"తో పరిసమాప్తమగుట అత్యంత ముదావహము. ఏ మానవుడైనను భక్తినిగల్గి తత్సాధనమునకై భగవదారాధన నెట్లు చేయవలెనో, తెలిసికొని, భగవద్గుణముల నాకర్ణించి, మననము చేసికొని భగవదారాధనతత్పరుడైనచో ముక్తిని గాంచుట సులభోపాయ మనెడు సత్యమును సులభసాధ్యముగ ప్రపంచించినారు.......

ఇందలి శైలి అతి మధురమై సరళగ్రాంధికమున శరత్కాల ప్రవాహమువలె నుండి పఠితల మనస్సుల నాకట్టుకొనును. ఇట్టి సులభ గ్రాంధిక శైలిని ఇటీవలికాలములో వ్రాసినవారు కానరా రనినచో అత్యుక్తి కానేరదు. శైవవిజ్ఞానసర్వస్వము (Encyclopaedia) అనదగిన గ్రంథమును వెలయించి ముముక్షువుల కందించిన శ్రీ సూర్యనారాయణ మూర్తిగారిని అభినందించుచున్నాను.

## శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మగారు
రాజమంద్రి-2 — 25 - 2 - 72.

......శ్రీ శివలీలామృత పరమార్థ ప్రసంగములు - అన్వర్థనామధేయములు మఱియు నట్టి రూపధేయములు. ఇవి రెండును మీ పురాకృతభాగధేయ వ్యంజకములు.......

అందు భారతీయమగు నాంతరరూపము సుప్రదర్శితము. ఇట్టి గ్రంథము లమూల్యములు రచించి ముద్రించి యుదారముగా నితరుల కందఁజేయు మీ సుకృతము వారి నథమర్ణుల నొనరించుట గుణమో కాదో సహృదయులగు దోషజ్ఞులకే యీ భారమును వదలుదును.

"భాషాభూషణ" తిరుత్తణి

శ్రీ బూదూరు రామానుజులురెడ్డి గారు 4-12-71

......మీరు సాగించిన మీ గ్రంథరచనావిధానము మహనీయమై నిర్దుష్టమై సర్వజనసుబోధమై ఒప్పారుచున్నది....అమృతభాండమువంటిదైన మీ ఈ ఉత్తమగ్రంథమును గంభీరముగ సర్వాంగసుందరముగ అచ్చొత్తించి అమూల్యముగ ప్రచారమునకు తెచ్చిన మహోద్యమము, మీ ఔదార్యము పారమార్థికప్రవృత్తితోకూడిన మీ సేవానిరతి మీ కీర్తికి పతాకయై భాసించగలదు........

శ్రీ బులుసు బుచ్చిరాజుగారు

ముమ్మిడివరం ది. 14-4-72

తమ అమూల్యము లయిన గ్రంథరాజములు సాంగముగ పఠించితిని. మరల మరల చదువ నేదో యద్వితీయశక్తి ప్రోత్సహించుచున్నది.

మ. శివలీలామృత పానసేచన మనచ్చిత్తాంతరోద్రిక్తసం
భవితానేక మహాఘరోగవిషభావధ్వంసమై మృత్యుజ
న్మవిదారంబయి మోక్షరాజ్యపద సంధానంబునై యొప్పెడిన్
శివసంకీర్తన మత్తచిత్తవిభవా! శ్రీ సూర్యనారాయణా !

ఉ. తీయని తెన్గుమాటలను తేనెల నుట్టిపడంగ వేదవి
ద్యాయుతబోధనంబు క్రమ మారసి మీరు రచించినారు ని
త్యాయత యోగనిష్ఠవశితాత్ములు గాన; భవత్కృతీశు దా
ప్యాయముతోడ మిమ్ముల నపారకృపాంబుధి దేల్చి ప్రోచెడిన్.

## ఆంధ్రప్రభ వీక్లీ ఉగాది ప్రత్యేకసంచిక
## ది. 22 - 3 - 72.

.........ఈ "శివలీలామృతం" శివసంబంధమైన ఒక విజ్ఞానసర్వస్వమని చెప్పవచ్చును. భక్తిసోపానంతో ప్రారంభమైన ఇందలి విషయపరంపర ముక్తి అనే 41వ విషయంతో ముగింపుకు వస్తున్నది. శివలీలల్లో లింగోద్భవం మొదలుకొని మహేశ్వరుని అవతారాలన్నీ వివరింపబడ్డాయి. విభూతి, రుద్రాక్షల మహత్త్వం సప్రమాణంగా నిర్వచింపబడింది. ద్వాదశజ్యోతిర్లింగాల వివరణం ఇందులో ఉన్నది. ఆంధ్రదేశంలోని కోటిపల్లి, దక్షారామాల మాహాత్మ్యాలు కూడా చేర్చబడినవి. అనుస్యూతంగా వస్తూఉన్న కొన్ని ఆచారాలకు చాలామందికి కారణం తెలియదు. వాటి ప్రయోజనం సహేతుకంగా ఇందులో చూపబడింది, చెప్పినవిషయా లన్నింటికీ పద్మపురాణ, శివపురాణ, కాశీఖండ, భీమఖండ, స్కందపురాణ, భవిష్యపురాణాదులనుండి శ్లోకాలు పద్యాలు ప్రమాణంగా చూపబడినవి. శివతత్త్వాన్ని సమగ్రంగా తెలుసుకొన గోరిన వారికి ఈ గ్రంథం అవశ్యంగా పఠింపదగియున్నది..........

## ఆంధ్రపత్రిక వీక్లీ - 10 - 3 - 72.

.........పరమశివుని గురించిన పెక్కు విషయాలను తెలియజేసే గ్రంథం ఇందులో భక్తిసోపానంతో ప్రారంభమై ముక్తి చివరగాగల 41 విషయాలు చక్కని గ్రాంధికవచనంలో పాఠకుల హృదయాలను ఆకర్షించేటట్లు వివరించబడినవి.......

స్త్రీ పురుషులు నడుచుకోవలసిన పద్ధతులు వివరించబడినవి. ఆస్తికులయిన స్త్రీపురుషు లందరు పఠించవలసిన గ్రంధం యిది. ఇందులో రచయిత యొక్క బహుగ్రంథపరిశీలన, ఆస్తికాభినివేశం వ్యక్తమవుతున్నవి.

ప్రముఖులైన విద్వాంసుల మెప్పుపొంది శృంగేరిశారదాపీఠాధిపతుల ఆశీస్సులను పొందిన యీగ్రంథం నేడు వెలువడుతున్న ఉత్తమగ్రంథాల్లో ఉత్తమస్థానాన్ని పొందదగియున్నది.

# ముఖ్యమగు సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౭ | 21 | రంభము. | రంభమున |
| ౯ | 19 | జూసించు | జూపించు |
| ౧౧ | 14 | దావికి | దానికి |
| [illegible] | 21 | ములి | ములు |
| [illegible] | 13 | నని | నవి. |
| ౩౧ | 13 | త్మ్రత్రము | త్మ్యము |
| 76 | 10 | దాహాయని | దాహామని |
| 77 | 8 | దవి | దని |
| 87 | 9 | రూపహిం | రూపంహి |
| 92 | 7 | నొసంగె | వొసంగె |
| 97 | 12 | కుషము | కుష్టము |
| 103 | 5 | నక్ష్కాష | నక్ష్కాఖ |
| 108 | 3 | క్నపా | కృపా |
| 119 | 8 | నల్లుంద్ర | నల్లుర |
| 125 | 17 | బండు | బండ్లు |
| 146 | 3 | యత్యము | యత్నము |
| 159 | 19 | వేతలు | వెతలు |
| 160 | 10 | ఆస్థి | ఆస్థి |
| 166 | 14 | బెల్లాందు | బెండ్లాడు |
| 167 | 18 | నృష్టిం | సృష్టి |
| 174 | 16 | గుబేరురు | గుబేరు |
| 178 | 1 | బంగారు | బంగరు |
| 183 | 2 | నష | నష్ట |
| 189 | 15 | కంఖర్ప | కందర్ప |
| 189 | 17 | శంఖి | శంఖ |
| 192 | 1 | బిజ్ఞ | బిడ్డ |
| 217 | 11 | వత్తవి | వతివి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 223 | 19 | సఖ | వఖ |
| 224 | 3 | ్రనిద | నిద్ర |
| 227 | 11 | వారి | నారి |
| 232 | 16 | ప్రతివత | పతివ్రత |
| 246 | 11 | యాతనిని | యాతని |
| 266 | 23 | వ్నిత్యం | న్నిత్యం |
| 283 | 8 | ఈశ్వర | ఈశ్వ |
| 286 | 8 | బఠించి | బఠించిన |
| 294 | 19 | ఆహూకి | ఆహంకి |
| 301 | 15 | నై శ్వర్యము | నై శ్వర్య |
| 302 | 10 | బద్ధ | బిద్ధ |
| 304 | 12 | ప్రతిష్టిత | ప్రతిష్ఠిత |
| .. | 21 | వాళ్రి | మాళ్రి |
| 308 | 16 | దాధ | భాధ |
| 316 | 6 | భ్రిష | భ్రిష్ట |
| .. | 16 | భూతాఖి | భూతాభి |
| 317 | 13 | వను | డను |
| 319 | 17 | బ్రాహ్మ | బ్రహ్మ |
| 321 | 19 | గడ | గంబడ |
| 333 | 8 | విశ, | విశ్వ |
| .. | 9 | కున్వ | కున, |
| 343 | 5 | విస్తా | విష్ఠా |
| 347 | 3 | బ్రితిషా | బ్రితిష్ఠా |
| .. | 22 | విమజామి | విమజ్జామి |
| 367 | 18 | వే | సీ |
| 374 | 19 | జాన | జ్ఞాన |
| .. | 19 | శివావ | శివాను |

వ, స, వ, ప, ల, అరసున్నలు. కామాలు అక్కడక్కడ తేడాగా పడినవి. యధాన్వయముగ సవరించుకో గోరుదును.

శ్లో॥ శివ శివేతి శివేతి శివేతి వా
భవ భవేతి భవేతి భవేతి వా
హర హరేతి హరేతి హరేతి వా
భజమన శ్శివ మేవనిరన్తరమ్॥

శ్లో॥ సంసార సర్ప దష్టానాం
జంతూనా మవివేకినామ్
చంద్రశేఖరపాదాబ్జ
స్మరణం పరమౌషధమ్॥

శ్లో॥ మహాదేవ మహాదేవ
దేవ దేవ జగత్పతే
భవా నేవ భవా నేవ
భవా నేవ గతిర్మమ॥

ప్రతులకు:
శ్రీభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తి
మేనేజింగు పార్ట్నర్
వేంకటేశ్వర ఆయుర్వేద నిలయము.
చింతలూరు కి. ౦-తూర్పుగోదావరి జిల్లా.